# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౦. సంచిక ౪.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯౩౩

ఆంధ్రపత్రిక

# శ్రీముఖ సంవత్సరాది సంచిక

సంవత్సరాది దినమున వెలువడినది

విన్నపము

సంచిక కావలసిన చందాదారులు ముందుగా 1-6-0 (ఒకరూపాయ ఆఱు అణాలు) మణిఆర్డరుద్వారా పంపినను లేక పోస్టుకార్డుద్వారా తమ చందా నెంబరుతో సహా సంచికను పంపమని వ్రాసినను సంచిక పంపబడును. కొలదిప్రతులే ముద్రించబడియున్నవి. కావలసినవారు వెంటనే వ్రాసి తెప్పించుకొన ప్రార్థితులు. ఇందు 8 త్రివర్ణచిత్రములును, పెక్కులు ఏకవర్ణ, వ్యంగ్య, ప్రకృతి, శిల్పచిత్రములును గలవు. ఇవిగాక ఆంధ్ర, ఆంధ్రేతర ప్రముఖులయు, ప్రజోపయోగసంస్థలయు చిత్రములెన్నియో కలవు. అనేకములైన వ్యాసములు పద్యములు, కథలు మొదలగునవిగలవు. వ్యయప్రయాసములకు లోనై ప్రచురించిన యీ సంచిక నాంధ్రమహాజనులెల్లరు నాదరించి స్వీకరింప ప్రార్థితులు.

ఇతరులకు రు. 2-0-0.

N. B. మాయేజెంట్లు గల స్థలములకు సమీపమునందున్నవారు మాయేజెంట్ల యొద్దనుండి పుచ్చుకొనిన వారికిని తపాలాఖర్చు మిగులును. చందాదారులకు ప్రతి 1 కి రు 1—0—0 కు యితరులకు రు 2. లకు యిచ్చుటకు తగుయేర్పాటు చేయబడియున్నది.

సంచిక కావలసినవారు తక్షణమే యీదిగువ ఫారమునందు వివరముగ పేరును, పూర్తివిలాసమును వ్రాసి, సదరు ఫారమును చింపి, మాకు పంప ప్రార్థితులు. కొలది ప్రతులుమాత్రమే నున్నందున తక్షణమే ఆర్డరును పంపి తెప్పించుకొన కోరెదము.

అయ్యా, నేను మీదిన పత్రిక, లేక వారపత్రిక లేక భారతి చందాదారుడను

మీ 1933 సం॥ రం ఉగాది సంచికను యీదిగువ విలాసమునకు రు 1-6-0 కు వి. పి. గా తక్షణమే పంపకోరెదను.

పేరు ............................................

పూర్తివిలాసము ............................................

ఆర్డరు పంపువారి సంతకము............................................

## వాప్రైన్ యనెడి చిన్న డాక్టరు




దీని లేపనమువలన గజ్జి, కురుపులు, విష చర్మవ్యాధులు మొదలగునవి మాయమగును మరియు తేలు కుట్టిన చోట ఈ మందును చరిమినయెడల అతి శీఘ్రములో బాధ నివారణమగును. గాయమతగిలి నెత్తురుకారుచుండినచోటచరిమిన వెంటనే దానిని రానీయక ఆపును. ఈమందు మీవద్ద ఒక సీసా వుంచుకొనిన వైద్యుడక్కరలేదు. ఈ ఔషధ మెచ్చటను దొరకును. ¼ఔ. సీసా 0-4-0. ½ఔ. 0-8-0.

లస్టర్ దంతమంజనము:—దీనిని ప్రతిదినము ఉపయోగించుచువచ్చినయెడల. దంతచికిత్స అనావశ్యకము. పెక్కువెలగల టూత్ పేస్టుల గుణములెల్లను దీని యందుకలవు. పొట్లము 1-కి 0-1-0. మాదిరికి వ్రాయుడు.

లస్టర్ మ్యానుఫ్యాక్చరింగ్ కంపెనీ,

చిక్కమాగలూరు.

## అపక్వశాకాహారాద్వైతసిద్ధాంతము

బ్రహ్మచారులకు, సన్యాసులకు, విద్యార్థులకు, ప్రయాణీకులకు, ఆచారవంతులకు పరాయిసహాయ మక్కరలేక క్లుప్తము, నీతిపవిత్రమైన తృప్తి, శ్రమలేని ఆనందజీవనముచేయగలుగు ఆరోగ్యమార్గమును తెలుపును. దీనివెల పోస్టేజిగాక రు. 2. వలయువారు గ్రంథకర్తయగు బొల్లాప్రగడ సుందర గోపాలరావుగారు, ప్రకృతి చికిత్సకులు, రాజమహేంద్రవరము అని వ్రాయవలెను.

---

## బసవపురాణము

గ్రంథకర్త: పాల్కురికి సోమనాథకవి

వెల 2-8-0

పరిష్కర్త: వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

మేనేజరు:—

ఆంధ్రగ్రంథమాల,

నెం. 7, తంబుశెట్టి వీథి, జి. టి. మద్రాసు.

---

## నీవు దుర్బలుడవై బుద్ధిమాంద్యమున కృశించుచున్నచో

అతి దుర్బలత్వము, బుద్ధిమాంద్యము, అమిత కాయకష్టముతో కృశించిపోవుచున్న యీ దినములలో "జీవామృత"సేవనము స్త్రీ పురుషులు, పిన్న పెద్దలను తారతమ్యములేక అందరికిని ముఖ్యమైనది. "జీవామృతము" రక్తము నభివృద్ధిపరచును. శరీరదార్ఢ్యము గలిగించును. నరములకు మెదడునకు మంచి బలము నిచ్చును. హృదయకోశమును కాపాడును. శరీరమున కంతకును ఆయురారోగ్య మొసగును.,

నేటి నుండి **జీవామృతమును** మొదలు పెట్టుము.

(ఆరోగ్యమును సమకూర్చునది)

అన్ని మందుల దుకాణములలోను రు. 3-4-0 లకు 1-12-0 లకు 2 సైజులుగా దొరకును.

ఉచితము:— జీవామృతమువల్ల పొందగలిగిన లాభములగురించి విపులముగా దెలుపు "ఆరోగ్య స్వర్గము" అను పుస్తకము ఉచితముగా పంపబడును.

కవుపను నేడే వ్రాయుడు:—**ఆయుర్వేదాశ్రమము,**

అయ్యా, పోస్టుబాక్సు నెం. 287 రు. మదరాసు.

దయచేసి "ఆరోగ్య స్వర్గము" అను పుస్తకమును ఉచితముగా పంపవేడెదను.

పేరు..........................................................................

విలాసము......................................................................


విషయసూచిక

# చిత్రములు

త్రివర్ణ చిత్రములు—కాపుపడతి; అశ్వత్థామ ప్రతిజ్ఞ.

సాధారణ చిత్రములు—కాకినాడలో భాగము; ప్రతిబింబములు; వేలూరుకోట; పైకారానదిపై వేలువంతెన; పక్షితీర్థము; పాండురంగమందిరము, పండరిపురము; వేలూరు కోటలోని దేవాలయము; మదరాసు లలితకళాసంఘప్రదర్శనచిత్రములు ౫; మృతసంజీవని; నగారోహణము; హిండనుబర్గు-బెర్లినులో; బెర్లిను యువతుల ఐచ్ఛికసేవ; అవలోకితేశ్వరుడు, జిహాలు; స్త్రీలపరుగాట; 'మూడూ గంగన్నా!'; 'ఏకాంతమందిరము'—వేలూరు కొండ పైన; సర్ యమ్. కాంప్‌బెల్‌కు బ్రహ్మరథము; మరి కొంచెం కావాలి; వ్యంగ్యచిత్రము; ఇతర చిత్రములును.



చెన్నపట్టణము, ఏప్రెల్ ౧౯౩౩

సంపుటము ౧౦ శ్రీముఖ సంవత్సరము, చైత్రమాసము సంఖ్య ౮.

## శ్రీ ము ఖా ది

రాయప్రోలు సుబ్బారావుగారు

ఋతువున కొక్క-రూపు సవరించి, యహర్నిశలన్ తెరల్ సమం
చితముగ లేచి వ్రాలగ, రచించెడి నేయవిముక్తరేఖ న
ద్భుతమగు నీగతిభ్రమణ ధూర్వహరాశికి, నాయనంత చి
ద్వ్రతతి స్మరింతు శ్రీముఖపరాయణబుద్ధి నుగాదిప్రొద్దులన్.

చిన్ని తెలిచుక్కలద్దిన వన్నెపాగ-లెగయ సిగల, సుగంధసమృద్ధి నఖిల
దిశలు తలదిమ్ముకొన నేతెంచె నింబ-వృంతసుమతోరణములతో శ్రీముఖంబు.

నవకముఁ బుక్కిలించెను వనస్పతులెల్లెడఁ, బుల్కరించె బ
ల్లవకులరాగరంజన మెలర్పగ గొమ్మలు, కన్నెతీగె లు
త్సవరతి నవ్వినట్లు వనధామములన్ గుసుమించె గుల్కుచున్
కవిసె గిలార్చుచున్ వయసుకావరమే ప్రకృతిన్ సమస్తమున్.

ప్రసవించిన యెలతీవెల-పసిపాపల పొత్తు లాఱ బఱచిన పగిదిన్
మిసమిసల చిగురుటాకులు-పసుపారెడు నెఱుపు మెఱయ వటవృక్షములన్.

పదినెల లాయె బందె బడి వాకిలి మూసి రసాలవాటికన్
మెదలకయున్న కోయిలసమీరుని చక్కిలిగింత గుంఫనల్
కదలగ మేలుగాంచి కలకంఠముతో నవనీతగోస్తనీ
మృదుమధురంబుగా గలవరించు మధూదయపర్యుషస్సులన్.

వసుధ ఫలించుచున్నయది, వానలు వంగుచునున్న వైన నే
కొన వినబోయినన్ ప్రజలఘోష యె, యీఫికలార్థికవ్యథల్
కసిమసగెన్ ప్రపంచ మఖిలంబు గతాబ్దమునందు, కస్తియం
దసురుసురైన మర్త్యవలయంబు సుఖించునె శాంతి శ్రీముఖీ!

ప్రభుముఖరేఖయందు భగవత్కళ జూచినపౌరులున్, ప్రజా
శుభకులమందు వత్సలరుచుల్ చవిచూచిన రాజులున్, భయ
క్షుభితమనస్కులై యుభయశోభనమూలములన్ లవింతు రీ
రభసము మాన్చి పెంచెదె పరస్పరరాగము నింక శ్రీముఖీ!

---

## శ్రీముఖ సంవత్సరాది

కర్లపాలెపు లక్ష్మీనరసింహారావు గారు

వలయు నను సస్యసంపద గలుగు సుతుల
కీ ధనాభావకాటక బాధ లేల?
దయను శ్రీముఖ నిత్య సందర్శనంబు
వఱలఁ జేయుము, శ్రీముఖ వత్సరంబ!

---

# మునిమాణిక్యం నరసింహారావుగారి 'కాంతంకథలు'

ఏ. వి. సీతారామయ్యగారు, యం. ఏ.

ధర్మోపదేశం కావ్యప్రయోజన మయినా అంతకంటె ముఖ్యమయిన ప్రయోజనం పాఠకునికి రసానుభూతి యివ్వడమేనని లాక్షణికులుగూడా ఒప్పుకుంటున్నారు. వివిధరుచులే వివిధంగా భోగ్యాలో ఆవిధంగానే వివిధరసానుభవాలుగూడా ఆనందదాయకాలే, స్మరణలో. మన నిత్యానుభవాల్ని రసభూయిష్ఠాలుగా యెంచక వాటిని గుర్తించక, జ్ఞప్తికితెచ్చుకోక వాటి విషయం మరచిపోయినపుడే "మనజీవితం దుఃఖభాజనమయినది" అనేసిద్ధాంతం శరణ్యమవుతుంది. అసలు ఆనందం ప్రతిరసంలోకూడా వుంటుంది, అనుభవించేవాడికి. అందాకా యెందుకు? ఎందరు భావకవులు ఎన్నివిధాల విచారం వెలిబుచ్చలేదు? అది చదువుతూ యెందరు హాయిగా ఆనందించటంలేదు? అందువలన విచారంలోకూడా ఆనందమే ఉంది. ప్రతిరసంలో సత్య ముంటుంది. సత్యమే సౌందర్యమని మహాకవి వాక్యం. అనుభవం కష్టమయినప్పటికీ దానిస్మరణ సుఖదాయకమే. అందువలననే ఏఅనుభవంలోనయినా 'సత్యము సౌందర్యము' వుండటంవలన ఆ అనుభవం యొక్క స్మరణ తప్పకుండా ఆనందదాయకంగా వుంటుంది. ప్రతిదినంమనకి జరిగే అనుభవాలుగూడా సంతోషపరుస్తవి మనల్ని,జ్ఞాపకానికి తెచ్చుకుంటే. ఎటువంటి అనుభవమయినా సరే!

నేను కాశీలో చదువుకుంటున్నరోజుల్లో నేనూ, మరోస్నేహితుడూ ఒకనాడు చౌకులో వున్న ఒకసోడాషాపులో సోడా తాగుతున్నాం. ఇంతలో హిందూ మహమ్మదీయ కలహాలకు సంబంధించిన గంద్రగోళం ఒకటి బయలుదేరింది. ప్రజలంతా నానావిధాలా పరుగెత్తుతున్నారు. చేతిలోని గ్లాసు లట్లానే కిందపడేశి రోడ్డుమీద వున్న ఒకగుర్రపుబండిమీదికి దుమికాం, మేం. బండివాడు హిందువుడే. గుర్రాన్ని గాలపువదిలాడు. మహమ్మదీయులు నివసించే బజారులోనుంచే పోవాలి బండి. చిన్నచిన్న గుంపులుగా మహమ్మదీయులు అప్పుడే సన్నద్ధు లవుతున్నారు. వాయువేగంతో పోతుంది బండి. అదృష్టవశాన్న గుర్రం మంచిది. ఆవిధంగా దైవానుగ్రహంవలన ఆగుంపులలోనుంచి బయలుపడి దగ్గరనేవున్న ఠాణా చేరాం. అప్పుడు ప్రాణాలు కుదుటపడ్డాయి. ఒక్కమారు జరిగిందంతా జ్ఞప్తికి తెచ్చుకునేప్పటికి భయానికి, విచారానికిబదులుగా ఆనందం కలిగింది. ఎప్పుడు జ్ఞాపకానికి వచ్చినా ఆనందంగానే వుంటుంది.

ఆవిధంగానే పూర్వానుభవం ఏదైనాసరే జ్ఞప్తికి వచ్చినపుడు ఆనందంగా వుంటుంది. ఆకాసేపు ఆ లోకంలో వుంటాం. జరిగినదంతా మన కళ్లముందు మళ్లీ జరుగుతున్నట్టే వుంటుంది. ఇటువంటి పూర్వానుభవాల్ని జ్ఞప్తికితెచ్చి-ఎప్పుడుగావాలంటే అప్పుడు-మనకు అపారమయిన ఆనందాన్ని యివ్వగల కావ్యశాఖ ఆధునిక ఆంధ్రవాఙ్మయంలోని చిన్నకథ. 'చిన్నకథ' ఆంధ్రభాషలోనేగాక అన్నిభాషలలో,అన్నిదేశాల్లోగూడా ప్రాముఖ్యానికి వచ్చింది. దానిగొప్ప అందరూ గుర్తించారు. జీవితాన్ని సంతోషప్రదమయినదిగా చేయగల మహత్తరమయిన ఒకఆయుధమని అందరూ గమనించడంవల్లనే 'చిన్నకథలు వ్రాసేవారు' ఇంత అధికసంఖ్యాకు లయారు. బాగా వ్రాయగలవారికి యింత గౌరవమూ గలుగుతూంది. ఇంగ్లండులోని 'స్ట్రాండు మేగజిను' వంటిపత్రికలలో ఎంతెంత విద్యాధికులు చిన్నకథలు వ్రాయుచున్నారో, వారికి ఎంతగౌరవం గలుగుతుందో, అందువలన ఆచిన్నకథలు ఎన్నివేలమందికి ఆనందం కలిగిస్తున్నయ్యో చూస్తే తెలుస్తుంది, చిన్నకథల ప్రతిభ. ఆవిధంగానే ఆంధ్రభాషలోగూడా చిన్నకథ మంచిప్రాముఖ్యానికి వచ్చింది. విద్యాధికు లనేకులు వ్రాయడం మొదలెట్టారు. అందులో ఒకరు ముని

మాణిక్యం నరసింహారావుగారు; 'కాంతంకథలు' వ్రాసి నవారు.

## వస్తువు

వీరికథలకూ, తక్కినప్రసిద్ధకథకుల కథలకూ గొప్ప భేదం అసలు వస్తువులోనే వుంది. వీరి కథావస్తువు నిత్య సాంసారికజీవనంలోనించే తీసుకొంటారు. రామాయణ మహాభారతాది గ్రంథాల్లోని పురాణగాథలుగాని, ప్రాచీన చరిత్రాత్మక విషయములుగాని, ఆదర్శప్రబోధకములైన కల్పితములుగాని వీరి కథలకు వస్తువుగా నియమించబడ లేదు. కథచదివే సమయంలో మన 'ఊహ' కు ఎక్కువ అవకాశం యివ్వలేదు. సీతారాముల అన్యోన్యానురాగం ఎంత చమత్కారంగా వర్ణించినా కాంతంవెంకట్రావుల పరస్పరప్రేమయంత స్పష్టంగా కనబడదు. వారివిషయంలో "అంత అన్యోన్యంగావుండేవారు గామాలు, ఆహా!" అనిపిస్తుంది, కవియొక్క వర్ణన వల్ల నయితేనేం, కథావస్తువునందలి భక్తివల్ల నయితేనేం. కాని కాంతంవెంకట్రావుల అన్యోన్యానురాగం మన కళ్లముందు జరుగుతుంటుంది. వెంకట్రావు కాంతంమీద కోపంచేత హోటలుకు వెళ్లి అయ్యరు చేత నాలుగుమెతుకులు వేయించుకొని అర్ధాకలితో కడుపుమాడుతూ ఇంటికివచ్చి భర్తరాకకు యెదురుచూస్తూ వున్న కాంతాన్ని జూచి జాలిపడ్తాడు. ఇదంతా మన ముందు జరుగుతుంది. మనం ఏమీ ఊహించుకొనే అవసరం లేదు. ప్రతినిత్యం ఎంతమంది యిళ్లల్లో జరుగుతుంటయ్యో యిటువంటి పరిస్థితులు? కథచదివే కాలంలో ఎంతమంది వెంకట్రావులుగా మారడం లేదు? ఎంతమంది తమకథే వ్రాశాడేమోనని ఒకరి మొఖా లొకరు చూసుకోడం లేదు?

## సందర్భాలు

నరసింహారావుగారి కథలలోని సందర్భాలు మనం సాధారణంగా మన నిత్యజీవనంలో చూస్తూండేవి. మనకేం కొత్తగా వుండదు, ఏసందర్భంలోవున్నా గాని. కాని ఆమామూలు సందర్భాలు రసవంతంగా చిత్రించడంలోనే వుంది నరసింహారావుగారిగొప్ప. కొత్తకోటు తొడుక్కునే సమయంలో పన్నెండు గంటలు టాంగ్ టాంగ్ న కొట్టారు. ఇది విజయసూచకంకాబోలుమరి, గంగాధరంగారికి! ఆయన ఆవిధంగా కొత్తకోటుతో దారిన పోతూంటే స్కూలుపిల్లలు అక్కడక్కడ గుంపులుగుంపులుగా చేరి గుసగుసలు మొదలెడ్తారు. కొంద రాయన్ని తేరిపార చూస్తారు. ఆడవాళ్లంతా ఆయనభార్యను Congratulate చేస్తారు. కోర్టుకు సెలవ యిస్తారు. ఇంకోరోజు వుండాల్సొచ్చిందని పార్టీలు విసుక్కుంటారు. విద్యార్థులు Three Cheers కొట్తారు. దొరస్వామి అయ్యరు దిగ్భ్రాంతు డౌతాడు. ప్రతివాడూ ఆయన్ని చిరునవ్వుతో చూస్తాడు. మనుష్యులన్న మాటేవిటి? పువ్వులే నవ్వుతయి. ఇదంతా యెందుకు? ఆయన కొత్తకోటు తొడగడంవలన. ఆకొత్తకోటు తొడిగినసందర్భం ఎంత ఆనందం యిచ్చిందో చూడండి ప్రపంచానికి! చక్రవర్తిగారు పుట్టినరోజుపండక్కి కూడా అంతహడావిడి జరగదు. నరసింహారావుగారి కథలలో ఇటువంటి సందర్భాలు అనేకం. నల్లకోటు ఇంకొగదిలో పెట్టడంవలన, తక్కినవాటితో దీన్నీవుంచడంవలన దీన్ని అవమానించినట్లవుతుంది — గంగాధరంగారు కోటుని కోల్పోతారు. కొత్తగా కొన్నబూడ్సులు తొడుక్కొని మీటింగుకు వెళ్లి తక్కినవాటితో వాటిని వుంచడానికి యిష్టపడక వేరే ఒకచోట వాటిని విడిచి మీటింగయిన తర్వాత వెళ్లి చూసుకుంటే తన కొత్త బూడ్సులు కానక 'ఇక యీసంవత్సరానికి కాలిజోడు కొనకూడదు' అని భయంకరమైన శపథాన్ని తీసుకొన్న పెద్దమనిషిని నేనెరుగుదును. కొత్తకోటు రావడం అనేది ప్రపంచకాన్ని యెట్లా కదిలిస్తుందో, అది పోవడం అనేదికూడా ప్రపంచకాన్ని అంతవిచారాంబుధిలో పడవేస్తుంది.

తేనీళ్లు తాగకుండా చేయడానికి కాంతం వేసిన టక్కు చూడండి! వేడితేనీళ్లు మంచంప్రక్కనే వుంచి భర్తలేవగానే— 'బతికానురాబాబూ' అనుకొని,— కాళ్లు కాలేట్టుచేసి,— "అబ్బా! చూసి దిగవద్దూ? ఆ పాడు టీకప్పు అక్కడపెట్టి పోయినాను. ఆపాడు తేనీళ్లు తాగవద్దంటే వినరుగా" — అంటుంది. అని మానేనేట్లు

చేస్తుంది. సుబ్బితో తాను సరదాగా వుండడంలో తప్పు లేదనీ, దానికి కాంతం విచారపడడం అర్థరహితమయినదనీ వెంకట్రావ్ వన్నప్పుడు అది అర్థరహితమయిందో, అర్థసహితమయినదో ఎంతచక్కనిసందర్భం సృష్టించి వ్యక్తపరుస్తుందో చూడండి, కాంతం, వెంకట్రావుకి. సుబ్బికి మగవేషంవేసి ఆమెతో సరసాలాడుతూంటే వెంకట్రావు చూచి కోపంతో మండిపడి చివరకు కొట్టపోయి బీరువాను కొట్టాడు. తాను సుబ్బితో సరసాలాడొచ్చు! కాంతం ఇంకొరితో ఆడకూడదు! కీనీడలను చూసి దడిసి యింట్లో యెంత గంద్రగోళం చేస్తారో చూడండి. సప్తాహం మొదలెట్టగానే దాని ఫలితాలు చూడండి స్కూలుపిల్లలు నాగా చెప్తారు, హోటల్లలో 'ఏమురో జాలు హోటలుకు రా' మని. యజ్ఞశాల కళకళలాడ్తోంది. ఆడవాళ్ల బంతులుకి విద్యార్థులు ప్రత్యేకంగా వడ్డిస్తారు. 'మిలిన్సు డబ్బా మీద బొమ్మల' లాంటివాళ్లకి కనిపెట్టి వడ్డిస్తారు కూడాను. అంతా కోలాహలంగా ఉంటుంది. ఆసందర్భంలో వున్న సత్యమే దానికి అంతసౌందర్యం, మాధుర్యం ఇస్తుంది. "Truth is Beauty" ("సత్యమే సౌందర్యం") అన్నాడు కవీశ్వరుడు.

"పొరుగూరు వెడతాడని నాన్న తియ్యనిపెరుగు తెచ్చాడు. అమ్మ చక్కిరాలు చేసిపెట్టింది. రాముడి చేత దొడ్లో వేపపుల్లలు కోయించి పెట్టింది" ఎంతస్వభావసిద్ధం! "నే నదే ఆఖరుసారి మాఅమ్మప్రేమ అనుభవించడం" అంటాడు. అనంగానే మన మనస్సు చివుక్కుమంటుంది. గగుర్పాటు కలుగుతుంది. ముచ్చెమటలు పోస్తుంది. కళ్లవెంబడి నీరు తిరుగుతుంది. "బి. ఏ. ప్యాసుచేసి సంపాదించి మమ్మల్ని సుఖపెట్టు నాయనా అన్నది. "దౌర్భాగ్యుణ్ణి నాకా అవకాశం కలుగలేదు." అంటాడు. మళ్లీ కళ్లవెంబడి నీరు తిరుగుతుంది. మనం సందర్భంలో ఆనిమిషంగా మునిగిపోతాం. జరిగేదంతా హృదయంలోనుంచి దూసుకుపోతుంది. పక్కనజరిగేది ఏమో తెలియదు మనకి. స్వభావసిద్ధాలయిన సందర్భాల్ని సృష్టించి మాధుర్యంతో వాటిని నింపడంలో నరసింహారావు అసామాన్యమయిన ప్రజ్ఞగలవాడు.

## పాత్రలు

నరసింహారావుగారి పాత్రలుకూడా వారు చిత్రించు రంగములవలెనే నిత్యసాంసారిక జీవనమునుండి సృష్టింపబడినవి. మనం రోజూ ఎక్కడో ఒక్కడ తారసిల్లుతూనేవుంటాం. వీరిపాత్రలలో మనం నిత్యం చూచేటువంటి పాత్రలే అయినప్పటికీ వాటిలోవున్న ఒకవింత మాధుర్యాన్నిబట్టే మనం అంతగా ఆకర్షింపబడతాం. వారి పాత్రలకి అంటి వున్న మాధుర్యమే వాటి కంతవ్యక్తిత్వాన్ని యిస్తున్నది. గురజాడ అప్పారాయమహానుభావుని పాత్రలలోని మాధుర్యమే-వ్యక్తిత్వమే-వీరిపాత్రలలోను వ్యాపించియున్నై. గిరీశం, రామప్పంతులు, మధురవాణి, అగ్నిహోత్రావధానులువంటి ప్రఖ్యాత పురుషుల్ని ఏవిధంగా ప్రతిక్షణమూ చూస్తుంటామో నరసింహారావుగారి వెంకట్రావూ, కాంతం, చంద్రశేఖరం వగైరాలనుకూడా నిత్యం అనుక్షణం చూస్తూంటాం. ఏగుణమైతే అప్పారాయని మహాకావ్యం 'కన్యాశుల్కం' ఎన్నిమార్లు చదివినా మరలమరల చదివిస్తుందో, ఆగుణమే నరసింహారావుగారి 'కాంతం కథల' ను కూడా చదివిస్తుంది, విసుగులేకుండా.

నల్లపాటి గంగాధరంగారు ముసలివస్తువులమీద ప్రీతిగల ఆర్థికశాస్త్రవేత్త. ఆయనుండేది ముసలియిల్లు. కోటు ముసలికోటు. పెండ్లాము ముసలిపెండ్లాము. అంతేగాక 'యిటువంటిప్రేమ నీకేలాభము' అని చెప్పగలరసికుడు. 'అయ్యా మీ రీకోటును తొలగించి మరో కోటు కుట్టించుకోవల్సింది. దానికింద అయ్యే ఖర్చులు మాప్లీడరుగుమాస్తాల సంఘం భరించుకొంటుంది' అని ప్లీడరుగుమాస్తాల డిప్యుటేషనువారు విజ్ఞప్తిచేసుకుంటే దానికి ఆయన నవ్వి 'ఆకోటు అంటే యేమనుకొన్నారేమిటి? అర్జునునికి గాండీవం ఎల్లాగో, కృష్ణునికి సుదర్శనం ఎల్లాగో నాకు ఈకోటు అటువంటిది. దొరలు సహితం 'మ్యారేజిగిప్టు' అని వుంగరంఅటువంటిది ఎల్లప్పుడూ వుంచుకొంటారు, ఇది నావివాహంలో అరణంగా యిచ్చిన వస్తువు' అని నవ్వుతూ జవాబిచ్చిన హాస్యరసపుముద్ద. ఒకప్లీడరు గుమాస్తా 'పంతులుగారికి-

టీకావాలేమో కనుక్కోండోయి' అన్నప్పుడు దొరస్వామి అయ్యరు "పంతులుగారికి టీకంటె మంచినీళ్లే యెక్కువయిష్టం" అంటాడు. అప్పుడు వాళ్ల రోగం కుదిరేట్టు అరణాపెట్టి అరకప్పు తేనీరు అరగంటసేపు అటుయిటూ చూస్తూ కొంచెం కొంచెంగా త్రాగి అయ్యరుకు పరాభవం కలుగచేసిన సమయస్ఫూర్తి గల ప్రజ్ఞావంతుడు. పాతకోట్లతో తన కొత్తకోటును వుంచటానికి ఇష్టపడని వస్తుగుణవిచక్షణచతురుడు. కోటు పోగానే అతని అసలు గుణం అమాయకత్వం బయటపడుతుంది. వంకెన కోటు పోగానే గుండెలు దడదడ కొట్టుకుంటయి, పాపం, ఆయనకి. కెవ్వున కేకవేస్తాడు. పీనల్ కోడు సెక్షనుకూడా ఆలోచిస్తాడు, క్రిమినల్‌గా చర్యజరపడానికి. వర్షం చూసి కోటు తొడుక్కున్నా పోయిందేమిట్రా అని సందేహం గలుగుతుంది. అగపడ్డవాళ్ళల్లా అడుగుతాడు తనకోటు, పిచ్చివాడిమాదిరి బెజవాడరోడ్లమీద తిరుగుతూ. సాధారణంగా అమాయకులవద్ద ఉండే వేదాంతం ఆయనదగ్గరా వుంది. కోటు పోవడంచేత గంగాధరంగారికి ప్రపంచం అంతా దుఃఖమయంగా ఉంటుంది. గుళ్లోకి వెళ్తాడు. దేముడు ఉన్నాడా లేడా అనే అసలు సమస్యే పట్టుకుంటుంది. జీవితంఅంతా దుఃఖభూయిష్ఠం అయిపోతుంది. తరువాత బ్రతికిన యిరువదేండ్ల కాలంలో ఒక్కమారయినా నవ్వినదాఖలా లేమీ లేవు.

కథల్లో అసలు ముఖ్యపాత్రధారి వెంకట్రావు. వెంకట్రావు బోళావాడు. కల్లాకపటం యెరగడు. లోనొకటి, పైనొకటి పెట్టుకొని ప్రవర్తించే కుటిలుడు గాడు. లోనున్నవిషయం దాచి మరోవిధంగా నటించ గల నేర్పరి గాడు. భార్య యెదుటనేవున్నా సుబ్బమ్మను చూచి నిలువున నిలబడ్తాడు. నోరువిప్పి పలుకరించలేక పోతాడు, పల్లెటూరి గబ్బిళాయిలాగా. భార్యమీద అనురాగంలో తేలిపోయేవాడు. భార్య సుఖంగాఉంటే తాను సుఖంగా వున్నట్టు; ఆవిడ కష్టం తనకష్టంగా వుండేది. ఆదర్శప్రాయమయిన దంపతులు కాంతం వెంకట్రావులు. సుబ్బమ్మతో తాను సరదాగా ఉన్నందు వలన భార్యకు గలిగిన సంతాపానికి వెంటనే సంజాయిషీ యిచ్చి వేదాంతం బోధిస్తాడు. కాని తనదాకా వచ్చేటప్పటికి యుద్ధంచేసేందుకు సిద్ధపడతాడు! ఆమె కెంత కోపంవచ్చినా, తనను ఎంత తేలికగా చూచినా అదంతా ఆమెయొక్క అమాయకత్వంవల్లనేనని గుర్తించి ఆదరించేవాడు. అంతేకాని యుద్ధానికి దిగేవాడు కాదు, ప్రతీదానికీ. కాంతం తనని వెక్కిరించి తాను స్వయంగా బజారు వెళ్లి టోపీపడివచ్చినపుడు ఆమెను ఆదరంగా బోధించి మంచిసరుకులు మళ్లీ తెప్పిస్తాడు గాని 'ఛా, తప్పుకుముండ! డబ్బుతగలేశావ్' అంటూ రంగానికి దూకేవాడు కాదు. కోపంవచ్చి అన్నం తినకుండా హోటలుకు పోయినా మళ్లీవచ్చి కాంతంవిచారం చూసి జాలిపడి ఆమెతోకూడా ఒక్కమారే వడ్డనచేయించి భోజనంచేసి ఆమెను సంతృప్తిపరచేవాడు. ఆమెకు తన మీద ఉన్న నిజమయినప్రేమ గుర్తించాడు. అందుకనే ఆమె టీ మాన్పించటానికి వేడినీళ్లు కాళ్లమీద పడేట్టు చేసినా సరసంగా గ్రహించి ఆమెమురుసలు చూచి 'దారులు గొట్టేరకం మీద' అని వేళాకోళా లాడ్తాడు. అంతేకాని 'ఏం ఎగతాళికి మటుకు హద్దులేదా' అంటూ బయలుదేరడు.

హేమచంద్రుడు అప్పులు తీర్ప నక్కరలేని వేదాంతం బోధించగల వేదాంతి. సర్వసంగపరిత్యాగి, అప్పులు తీర్చవలసివస్తే. ఎవరివద్దనుండయినా పుచ్చుకొనేపుడు 'నేనూ, వాడు' అనేభేదం లేని జ్ఞాని. 'తాను తానని తన్నకలాడ్తది యీ ద్రేహం' అని సమాధాన పరచుకునేవాడు. అప్పులెక్కువయి అందరూ అన్ని రకాలా అంటూంటే 'పలుకుదుందురు పలువురు పలువిధాల, వారిమాటలు గాలికి పారిపోవు' అని మహాకవి వాక్యం స్మరిస్తాడు.

ఈతనువు శాశ్వతమా
చిత్తాస్వాతులు రెండూ సంధింప ముత్తేపు
చిప్పాలో పడ్డాది చినుకొక్కటి
ముత్యమై నీళ్లలో మునిగిపోయేనాడు
చిప్పతో యేమైన చెప్పిపోయిందా.

'ఎప్పుడు రాలిపోతుందో యీతనువు?' అని ప్రపంచంమీద విరక్తిచెందినా త్రికాలాల్లో తేనీరు తాగకుండా తప్పదు.

తార్కికుడు కూడా అతను. దృఢమయిన కాయం ఉంటేనేగాని నిర్మలమయిన మనస్సుండదు. నిర్మలమయిన మనస్సు, పరిశుద్ధాత్మ ముక్తికి సాధనాలు. అయితే దృఢకాయాన్ని పెంచాలంటే ధాటీయయిన భోజన మవసరం.

అంతమాత్రంచేత హేమచంద్రుడు భోజన ప్రియుడా? ఆమాట యెట్లు అనగలము? భోజనమును భోజనముకొరకే ప్రేమించడు. అది ముక్తిసాధనక్రియగా ప్రేమిస్తాడు. అందుకనే ఆ బ్రాహ్మణుడు విస్తరివద్దకు వచ్చి 'ఇంకా కొంచెం బంగాళాదుంపలకూర వడ్డించ నాండి?' అంటే 'వడ్డించుకో' అంటాడు. 'వడ్డించుకో' అంటంలోనే అతనికి భోజనంలోనుండే విరక్తిభావం తేటపడ్తుంది.

'వడ్డించుకో! నాకొరకు కాదుసుమా! నీకొరకే! నీముక్తిసాధనకొరకు, నీఅంతరాత్మకొరకు ఇలా వడ్డించుకో' అనేభావం ఆమాటలలో ధ్వనిస్తుంది. 'నీకు వేస్తే నాకు ముక్తి ఎల్లా వస్తుందయ్యా' అంటే సమాధాన మిది: 'నేను తిని పరిశుద్ధాత్మతో ముక్తిపొందుతాను. నా మోక్షప్రాప్తికి నీవు కారణభూతుడవయినావు గాబట్టి నీకు పుణ్యం వస్తుంది. కాబట్టి యింకా కొంచెం వడ్డించుకో'.

తిండిలోనేకాదు, ప్రతివిషయంలోనూ హేమసుందరానిది వేదాంతమార్గమే. కాఫీహోటలుకు స్నేహితులతో వెళ్లి అంతా తిన్నతర్వాత హేమచంద్రుడు చెల్లించనంటాడు డబ్బు. 'డబ్బులేకుండా ఎల్లావచ్చావురా కాఫీహోటలుకి?' అని అడిగితే 'ఓరివెర్రివాడా! Ethical గా ఆలోచిస్తే తినేది ఎవరు? తినిపించేది ఎవరు? అంతా ఒకటేకాదా'

"తిననేర్చువాడ నేనట
తినిపించెడువాడు రామభద్రుండట!"

నేను, నీవు అనే రెండువ్యక్తులు ఏడ్చినవా? నాలో వెలుగుతున్నటువంటి, అకళంకమయినటువంటి, దేదీప్యమానమయిన జ్యోతి అతనిలోపల వెలగడం లేదా! సూర్యుడు అన్నిఘటాలలోను వెలుగుతూ ఇన్నిసూర్యులుగా మననేత్రద్వయానికి కనిపించినట్లు ప్రతిమానవుడు 'ఇది నాది' అనేటువంటి అజ్ఞానాంధకారంలో మునిగి ద్వయితంలోకి దిగుతున్నాడోయి' అని లెక్చరుకొడ్తాడు.

లోకంఅంతా అప్పులవాళ్లే. మరొకరివద్ద అప్పు తెచ్చి యింకొకఅప్పు తీరుస్తాడు. 'దేశంలో సొమ్ము దేశంలోనే వుంటుంది, చేతులు మారినాగాని' అనేసూత్రాన్ని నమ్మిన ఆర్థికశాస్త్రవేత్త. మాటనమ్మకంమీద కొన్ని తాకట్టుఅప్పులు, తనఖాఅప్పులు, చేబదుళ్లు, స్నేహితుల అప్పులు, సాయంత్రంఅప్పులు- ఇల్లా అన్నీ అప్పులే అయినా దిగులులేదు. మహాజ్ఞానికి ఆభేదం లేదు. ఇంకొరయితే ఏమయేవాళ్లో?

చివరకు లాభంలేదని కొత్తఎత్తు ఎత్తుతాడు, అప్పులు తీరటానికి. తిట్లు తినకుండా అప్పులవాళ్ల చేతి వారిచేతిమీదుగానే అప్పులు రద్దుచేయించుకుంటాడు. యుక్తిపరుడు.

## స్త్రీపాత్రలు : కాంతం

స్త్రీపాత్రలను సృష్టించడంలో నరసింహారావుగారితో సమానులు గుడిపాటి వెంకటాచలంగారు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. కాని వారి పాత్రలతత్త్వం మరోరకం. వారినిగురించి మరోమారు ముచ్చటిస్తా. అందులో కాంతం ఆదర్శప్రాయమయిన భార్య. వెంకట్రావుకి భార్యమీద యెంతప్రేమ వున్నదో వెంకట్రావుమీద కాంతానికి అంత అనురాగం ఉన్నది. ఆయన తాగే 'టీ' విషయమై విసుగయినప్పటికీ కాంతం టక్కరి. టక్కరేమిటి బహుటక్కరి. కాని ఆమాత్రం టక్కరితనమే లేకపోతే మనిషి అంతచలాకీగా వుండదు. అంతచలాకీగా ఉండకపోతే మనం ఆమెవిషయం అసలు చెప్పుకోవల్సిన అవసరమే వుండేదికాదు. వెంకట్రావుకు గాభరాగావున్నా ఆనందదాయకంగానే వుండేది, ఆమెటక్కరితనం, చివరకి. లేకపోతే అనేకమార్లు అవమానం భరిస్తాడా మరి ఆమెచేతుల్లో! జుట్టు మంచానికి కట్టివెయ్యడం, తాంబూలంలో చింతగింజలు పెట్టడం, లేకపోతే సగంకొరికిన వక్కలుంచడం- మొదలయినవన్నీ యెట్లా భరిస్తాడో? అసలు పెళ్లిలోనే

చూపిందిగా! గంధం మెడక్రింద పూస్తున్నట్లే పూసి చెంప మీద లెంపకాయకొట్టింది. 'కొడతావా ఏమిటి?' అని వెంకట్రావు ఎత్తిపొడవటానికి అవకాశం ఇచ్చింది. గప్‌చిప్‌గా వేడివేడినీళ్లు మంచంకిందపెట్టి ఆయనలేవగానే కాళ్లు కాలేట్టుచేసి "అబ్బా! చూచి దిగవద్దూ! ఆపాదు టీకప్పు అక్కడపెట్టి పోయినాను. చూడక వేడివేడినీళ్లు కాలిమీద పోసుకున్నారు ఆపాదు తేనీళ్లు తాగవద్దంటే మానరుగా! ఒకసంవత్సరం టీ మానెయ్యండి" అంటుంది.

ఆమెకు భర్తమీదవున్న అనురాగం అపర్మ ప్రాయం. ఇంకొరితో పంచుకునేందుకు ఏమాత్రం వీలు లేనిది ఆమెప్రేమ. సుబ్బమ్మ చిటికెనవ్రేలు భర్తచేతికి తగలటం చూస్తుంది, తాంబూలాలు వేసుకొనే టప్పుడు. వెంటనే కాంతంహృదయసీమను ఈర్ష్యాకోపాలు కారు చిచ్చులాగ కమ్ముకుంటయి. చప్పున లేచి తనగదిలోకి పోతుంది. గదిలో పరుపుమీద పడి వెక్కివెక్కి యేడు స్తుంది. హృదయంలో కోపానలం ప్రజ్వరిల్లుతుంది వళ్లు గాలికి రావాకులాగు నిలువునా కంపించిపోతుంది. 'సుబ్బమ్మవైపు చూచినంతమాత్రాన తప్పేమిటి' అంటాడు భర్త. దానికి ఆమె జవాబుగా మంచి అనుభవం యిస్తుంది భర్తకి తాను మొగవేషం వేసుకొని అక్కడకు తాను రోజూ కట్టుకునే వూదాచీర కట్టి మాట్లాడుతుంటుంది. వెంకట్రావు భార్య పరపురుషుడితో మాట్లాడుతుం దను కొని మండిపడి గంద్రగోళంచేసి చివరకి విషయం తెల్సిం తర్వాత సిగ్గుపడ్తాడు.

భర్త యెంత అమాయకుడో కాంతంగూడ అంత అమాయకురాలే కాకపోతే కిరసనాయిలు అణాన్నరకు వస్తుందనుకుంటుందీ? కిరసనాయిలు కొనితెస్తుంది, చవకగా. భర్తకన్న చవకగా తేవా లాయెమరి. నిప్పుపెట్టే లూ చవకే. అన్నీ భ్రష్టాకారపుసరుకులని తెలుస్తుంది. విచారపడ్తుంది. భర్త వూరడించి అవి అవతలపారేసి మంచివి తెప్పిస్తాడు. వినపడవనుకుంటుంది గామాలు 'వెంకట్రావూ! వెంకట్రావూ!' అని పిలుస్తుంది వైరిబాగు లది. దాని కేమని వూరుకుంటే భర్తతలగుడ్డ చూచి పకపకా నవ్వడమా! పాములవాడి పాగామాదిరి వుంటే తన కెందుకూ? అరవ్వాడి తలగుడ్డమాదిరివుంటే తనకెందుకూ? ఎట్లావుంటేమటుకు మనిషియెదురుపడి నవ్వడమేనా? గడుసుదయితే ఆవిధంగా ప్రవర్తిస్తుందీ? అందాకా యెందుకు? భర్త 'ఇదుగో పరిషత్పత్రిక వచ్చింది. ఇందులో మంచివిషయా లున్నాయి. చదువు' అని చేతి కిస్తే తీసికొని భర్త అటుపోగానే చారురాచ్చిప్పమీద మూతపెట్టుందీ! భర్త వచ్చిచూచి విచారపడ్తుంటే నవ్వుతుందీ! అప్పుడు ఎమిటే అనటం! అప్పటికీ భర్త ఓపికపట్టి పత్రికలోని మంచివిషయాలు ఆమెబుర్ర కెక్కించాలని మురుగేశంపిళ్లెగారి వ్యాసంతీసి "కంబడీ లూలామాలంపుసవ్వడి నెరింగి యామంకుని బింకపు బొంకులకు గొంకక నింకెరగడ్డి" అని చదువుతూంటే "చాలు చాలు, ఆపెయ్యండి. ఇటువంటి అరవపాటలు నాకూ వచ్చు" అంటుంది.

కాని సాధారణంగా యిటువంటి అమాయకులవద్ద నుండే పల్లెటూరిగడుసుదనం ఆమెవద్దకూడా వుంది. 'మీరు మాయింట్లో భోంచేస్తారనట్లే" అనేరకం గడుసుదనం. పరీక్షపంతులు వస్తాడనే ఖబురు తెలిసి తీవ్రంగా ఆలోచిస్తున్న భర్తతో వంట ఏంచెయ్యాలో అడగడానికి వచ్చి "బెండకాయకూర చేయకుండా పులుసు చేసేదా? పులుసు చేసి బెండకాయ కూర మానేసేదా? లేక రెండు మానేసి కందిపచ్చడి జీలకర్రవేసి నూరేదా?" అనేపెద్ద Equation పెట్టుంది ఆయనముందు. కాంతం దగ్గుతో బాధపడడం చూసి సహించలేక భర్త దుంప రాష్ట్రిం ముక్క యిచ్చి "బుగ్గనపెట్టుకో" అనిచెప్తే బుగ్గన ఆనిచ్చుకుని చేతులో పెట్టుకొని పడుకుంటుంది. "ఇదేమిటి, నీతెలివి తెల్లవారా" అని భర్త అడిగినప్పుడు "బుగ్గన వుంచుకోమంటే బుగ్గనే వుంచాను, నోట్లోవేసుకోలేదుగా?" ఇంకేమి మాట్లాడడం! స్నేహితు డొచ్చినపుడు భోజనంముందు భర్త అతడ్ని గాభరాచేసేందుకు తమగోంగూరపచ్చడి ప్రాశస్త్యం వుగ్గడిస్తూ అది గుంటూరుదికాందే కూడా అవునని వర్ణిస్తుంటే వంటయింట్లో నుంచి సన్నంగా "మనం గుంటూరుగోంగూర యెప్పుడు తెప్పించాం" అంటుంది! అడిపరకే బంగాళాదుంపలు బజారులోనే లేవని, తాజాకూరలు అసలు లేవని చెప్పటం

కొంచెం కోతలని సందేహిస్తున్న అతనిస్నేహితుడు "కోస్తున్నావు నాయనా?"అని విరగబడి నవ్వుతాడు గదా! ఇంతఅమాయకపుది, బోళాది, పల్లెటూరిగడుసుదీ యెక్కడయినా కనబడ్తుందీ!

తక్కిన స్త్రీపాత్రలు కాంతం వదినెవగైరాలు ప్రకృతిస్వభావసిద్ధంగా వుంటారు. వాళ్లనిమనం యెక్కడో కలుసుకుని చూచినట్లే వుంటుంది. స్త్రీపాత్రలు వీరిసొమ్ము.

### సంస్కరణాభిలాష

నరసింహారావుగారి కథలన్నిటిలోను వారికి జీవితమందలి వివిధశాఖలలో మిక్కుటమయిన సంస్కరణాభిలాషవున్నట్లు వ్యక్తమవుతూంటుంది. ప్రస్తుతం సంఘమందున్న దురాచారాలు నశించాలి. మంచికి మార్పు పొందాలి. స్త్రీలను - అందులో ముఖ్యంగా భార్యను మన ఆస్తిపాస్తులలోని ఒకవస్తువుగా పరిగణించే మగవారి తత్త్వం పూర్తిగా నశించాలి.గృహకృత్యాలలో తనతో సమానమయిన హక్కులివ్వాలి, భార్యకు, భర్త. రెండెద్దులు కలిసి లాగుతేనేగాని బండి సరిగా నడవదు. అంతే భార్యాభర్తలతో గూడానని గుర్తించాలి. ఏపని చేసినా ఒకరికొకరు సహాయం చేసుకుంటూ ఒకరినొకరు సలహా అడుగుతూ, 'అన్యోన్యంగా సంసారం గడపాలి. కాంతానికి 'టీ' విషయమై విసుగు. ఉపాధ్యాయవృత్తిలోనుండి కొద్దివేతనంతో ఎట్లో సంసారం గడుపుతున్నాడు, భర్త. ఇటువంటి సమయంలో కాంతానికి సొమ్ములు చేయించాలి. ఒకరోజు జమాఖర్చు ముందు వేసుకూర్చుంటారు. పైనుంచి కిందికి పట్టీ చూస్తారు. కొన్నిటిలో ఘర్షణగూడా జరుగుతుంది. సబ్బుబిళ్లలు మానేయమంటాడు, భర్త. 'టీ' మానేయమంటుంది, భార్య. ఆవిధంగా భర్త భార్యతో యింటిఖర్చులను గూర్చి చర్చిస్తాడుగాని "ఛట్ పో, నీసలహాయేమిటి యింటిఖర్చులోగూడా" అని కసరికొట్టే భర్త నామకభయంకరసార్వభౌముడు కాడు.

భర్త సుబ్బమ్మతో ఆవిధంగా సరదాలాడొచ్చు. సుబ్బమ్మ చుట్టియిచ్చిన తమలపాకులు పుచ్చుకోవచ్చు. కాంతాన్ని చూచీమాడకుండా వూరుకోవచ్చు. కాంతం మాత్రం పరాయిమొగాడితో మాట్లాడరాదు! మాట్లాడుతుండగా చూస్తే దేహం కంపించిపోతుంది పాపం. 'రాస్కెల్' అని కొట్టబోయి బీరువామీద పడ్తాడు. అంతగంద్రగోళం చేస్తాడు. తాను మనఃపూర్తిగా ప్రేమిస్తున్న భార్య పరపురుషుడితో మాట్లాడుతున్నదనేగా యింతకోపం. తాను మనఃపూర్తిగా ప్రేమిస్తున్న భర్త పరాయిఆడదానితో మాట్లాడుతుంటే, సరదాలాడుతుంటే, ఆమె చుట్టియిచ్చిన తమలపాకులు తింటూ భార్యవూసే లేకుండా, తదేకదీక్షతో ఆకొత్తపిల్లవంకే చూస్తుంటే భార్యకు కోపం రాకూడదట! ఏమి న్యాయబుద్ధి! మిక్కుటమయిన ప్రేమవలననే, అంత ఈర్ష్య, అంతకోపం కలుగుతవని గ్రహించుకోనక్కర్లేదూ, భర్త, స్వానుభవంమీదనయినా?

సంఘసంస్కరణం-అందులో స్త్రీస్వాతంత్ర్యం కావాలనిమాత్రమేగాక భాషాసంస్కరణంగూడా సూచించారు,నరసింహారావుగారు,తమకథల్లో. గ్రాంథికభాషా? గ్రామ్యభాషా? అనే మహత్తరమయిన సమస్యను సుప్రసిద్ధపండితులయిన గిడుగురామమూర్తిపంతులు వంటివారు చర్చించి తేల్చినసమస్యను వీరు ఎంత తేలికగా, ఎంతహృదయానికి అతికిపోయేట్టుగా చర్చించారో చూడండి: 'పేరుప్రతిష్ఠలు రావాలంటే వెంటనే చావవోయి' అన్నయింగ్లీషుకవివాక్యాన్ని స్మరించుకొని వెంకట్రావు ఒకనాడు భార్యను పిలుస్తాడు, కడసారి మాటలు కొన్ని చెప్పి సెలవుతీసుకుందామని. ఆమె వచ్చింతర్వాత మూడుముక్కలలో చెప్పేదా మనుకుంటాడు. అయితే గ్రామ్యభాషలో మాట్లాడుదామా? గ్రాంథికభాషలో మాట్లాడుదామా? అని తర్కించుకుంటాడు. 'ఛీ! ఇదివరకంతా గ్రామ్యంలో వ్రాసి, మాట్లాడి కావల్సినంత పాపం చేశాను. చచ్చిపోయేటప్పుడయినా కొంచం గ్రాంథికంలో అందా'మనుకుని "కాంతం, చేరువకు రమ్ము. నా కంత్యకాల మాసన్నమయినది." అంటాడు. "సన్నంగావటం యేమిటి" అంటుంది కాంతం. "కాంతం,మనసౌఖ్యం ఎన్నాళ్లు? వెలుగువెనుకనే చీకటి. పున్నమచంద్రుడెన్నాళ్లు? అంతా బుద్బుదప్రాయము

గదా!" కాంతానికి అర్థంకాదు. 'సాహితి'లో ఒక కథన్నా చదవమంటుంది,మన స్థిమితం గలగటానికి! "అది యునుంగాక నేజెప్పబోవునది అచలచిత్తవై అవధరింపుము." అంటాడు మళ్లీ. కాంతానికి ఇదంతా యేదో గోలగా వుంటుంది. గాభరాపడ్తుంది. "అయ్యబాబో! ఇదేమిటి యిట్లా మాట్లాడుతున్నారు? నరుసూ! ఒకేయి. ఇట్లారా. మీ బావ క్షేమైనా పైత్యంమాటలా ఏవిట్రా, వేగంరా!" అంటుంది. "ఇన్నిరోజులు నీతో సౌఖ్యము ననుభవించితిని. నా ఐహికసౌఖ్యములపై ఇష్టము తప్పినది" అంటాడు, మళ్లీ భర్త. కాంతానికి ఏమీ అర్థంగాక "ఇష్టం తప్పితే ఇష్టంవచ్చిందే చేయించుకోండి. నేను చేయనన్నానా? మీయిష్టం వచ్చింది చేయమనండి. చేయకపోతే అప్పుడనండి. ఇప్పటికి వూరుకోండి. నన్నేడిపించకండి!" అంటుంది. "పిచ్చిపిల్లా! నేజెప్పునది తెలిసికొనుము. నాకును, నీకును ఋణము తీరినది. ప్రేయసీ! ప్రేయసీ! నేను నీప్రియుడనే ప్రేయసీ! కడసారి ముద్దివ్వవే." అంటాడు. అనేప్పటికి కాంతం బావురు మంటుంది!!!

## హాస్యం

హాస్యంలో నాజూకురకం ఒకటి,కొద్దిగా మోటురకం ఒకటి. అంటే మొదటిరకం హాస్యం పెద్దప్రయత్నం చేయనక్కరలేకుండానే నవ్వుతెప్పించేది. మామూలుమాటలతోనే, మామూలుసందర్భాలతోనే, మామూలు వేషాలతోనే నవ్వొస్తుంది. ఆసందర్భాన్ని ఆనందించిన తర్వాత మనకు అంతా మామూలుగానే వుంటుంది. 'ఒస్ యింతేనా' అనిపిస్తుంది. మనం అనేకమార్లు చూచి అనుభవించిన సందర్భమే నని వ్యక్తమవుతుంది. కాని అది తగినసందర్భంలో యిమిడ్చేటప్పటికి యెక్కడలేని మజా వస్తుంది. 'వూడుస్తారా' అనేమాట మనం ఎంతమంది అరవాళ్ల నోట్లో వినివుండం? కాని భార్యమీద అల్గి ఆకలితో హోటలుకు పోయి నాలుగుమెతుకులు వేయించుకుని అర్థాకలితో ఇంటికివస్తున్న వెంకట్రావుతో అరవాయన 'వూడుస్తారా' అంటే 'యిప్పుడుకాదులే' అంటాడు. అదేఖిట్టో గుంటో, గొయ్యో వూడవాల్సి వస్తుందేమోనని! ఆకలితో అసలే మాడ్తుంటే డబ్బుదర్శించుకొనికూడా పైగా వూడవాలిట!! అదుగో అట్లాంటిది నరసింహరావుగారి హాస్యం.

రెండవరకం హాస్యం మొక్కపాటి నరసింహాశాస్త్రిగారు-'బారిష్టరు పార్వతీశం' కథలు, భమిడిపాటి కామేశ్వరరావుగారు మొదలయినవారి హాస్యం. చార్లిచాప్లిన్, హెరాల్డ్ లాయిడ్ యిద్దరూ గూడా హాస్యనటులే. కాని చార్లిచాప్లిన్ హాస్యం అతినాజూకు. ఎక్కడవింత ఏమిలేని ఆమామూలు దుస్తులతో వస్తూవస్తూ ఒక్కవింతచూపు పెడ్తాడు. ఆచూపు మనం అతని ఫిలుములనేకములలో చూచివుంటాం. అయినా నవ్వొస్తుంది. హెరాల్డులాయిడు విషయం అట్లాగాదు. అతడు తన కాళ్లకి చాలాపొడవైన కృత్రిమపుకాళ్లను కట్టుకొని వాటిపైన లాగూ తొడుక్కొని అమితమయిన పొడుగాటి కాళ్లతో వచ్చికాని నవ్వించలేడు. లేకపోతే ఏ చెడిపోయిన పైపు మిషనులోనో చెయ్యి ఇరికించుకుని బాధపడిగాని నవ్వించలేడు. అదీకాకపోతే ఆత్మహత్య చేసుకోవాలని ఏ మోకాళ్ళలోతునీళ్ళలోనో దుముకాలి! ఆ విధంగానే హెరాల్డులాయిడు, చార్లీచాప్లిన్ల హాస్యంలో వున్నభేదమే మొక్కపాటి, భమిడిపాటి, మునిమాణిక్యంవార్ల హాస్యంలో కూడా వుంది. మొక్కపాటి భమిడిపాటివార్ల హాస్యం Boisterous humour. మునిమాణిక్యంవారిది Delicate humour. మొక్కపాటివారి 'బారిష్టరు పార్వతీశం' రైలుపెట్టెలోని పంపు నొక్కడం చేతగాక బేసిన్మీదకు ఎక్కి విరగపడి, తలకాయ పంపుకేసికొట్టుకుని అప్పుడు పంపు నొక్కబడడంవలన వచ్చినజలపాతంవలన వొళ్లుతడుపుకొనిగాని నవ్వించలేడు. మునిమాణిక్యంవారి అరవ్వాడు ఎప్పుడు పొగాకునములడంచేత నల్లబడ్డ పళ్లు బయటకు పెట్టి ఒక్కచిరునవ్వుతో మనల్ని నవ్విస్తాడు!! అదీ వారి హాస్యంలోని భేదం.

అందువల్ల వారి హాస్యం అతిసుకుమారమయినది. మోటయినదిగాదన్నమాట. వారి పాత్రలు, పాత్రల చర్యలు, చర్యలకు సంబంధించిన సందర్భాలు, సందర్భాలలో నుపయోగింపబడిన భావాలు, భావాలకు దగిన

భాష అంతా హాస్యరసపూరితం. వారి హాస్యరసంకూడా మన నిత్యసాంసారిక జీవనంలోనుంచి తీసుకొన్నదే. 'అన్నం వేయబడుతుందిట' అరవ్వాడిహోటల్లో ఏదో పథ్యపు మెతుకులు వేసినట్లు, గొడ్లకు మేతవేసినట్లు. చక్కని సందర్భాల్ని సృష్టించి హాస్యరసం వెదజల్లుతారు. స్నేహితులముందు భార్య ఆవిధంగా "మనం గుంటూరునుంచి గోంగూర యెప్పుడు తెప్పించాం" అన్నప్పుడు స్నేహితులు 'కోస్తున్నావు నాయనా?' అని విరగపడి నవ్వుతారు. అవును ఎవరికి నవ్వురాదూ? నాటకంలోని విదూషకుడిమాదిరి అవుతాడు వెంకట్రావు. అయ్యరుచేతిగిన్నెలో ఏముందో తెలిసికోటం కష్టం. ఏమీ లేదు అనేందుకుమాత్రం వీలులేదుట! ఎంచేతనంటే "Full many a gem of the purest ray serene, the dark unfathomed caves of ocean bear" !!! డబ్బుఅంతా యిచ్చింతర్వాత వాడు పొగాకు నమలటంచేత నల్ల బడ్డ పళ్లు బయటపెట్టి 'పూదుస్తారా' అంటాడు. 'ఇప్పుడుగాదులే రేపొచ్చి' అంటాడు వెంకట్రావు, 'అదేమిటో గుంటో గొయ్యో' అనుకొని. ఆరోజునే తలంటి పోసుకోడం మూలాన తల రేగి దుబ్బుగా వుంటుంది పసిదానికి. దానినీడ గోడమీద చూచి దొంగనుకొని భార్యాభర్తలిద్దరు పడ్డ గంద్రగోళం చూస్తే యెవరికి కడుపు చెక్కలుగాదు? "రేపటికి బియ్యం లేవు" అనే గోపాలం 'సప్తాహం' మిషతో పెళ్లానికి నగలు, రెండుమూడు వందల రొఖ్ఖం, రెండు సంవత్సరాలకి సరిపోయే గ్రాసం సంపాయించడం యెన్నడయిన మరచిపోగలమా? "ప్రతిమానవుడు 'యిది నాది' అనే అజ్ఞానాంధకారంలోబడి కొట్టుకొపోతాడు. హేమసుందరం మాత్రం జ్ఞాని. అందుకనే కాఫీహోటలుకు స్నేహితులతో వస్తే అతనేమీ డబ్బుయివ్వడు. ఎందువల్లంటే 'తనూ వారూ' అనే భేదం లేదు, అతనికి. అందువలన యెవరిస్తేనేం, వారినే యివ్వమంటాడు. తినేదెవరు? తినిపించేదెవరు? అంతావకటిగాదా?"

భాషలోగూడా హాస్యరసం పొంగుతూంటుంది. అరవ్వాడి భాషలోని హాస్యం కడు నిపుణతతో చిత్రించారు. "నల్లనూనె" అక్కరలేదు కాంతానికి. "నల్లనూనె" అంటే "రొంబమంచిదీదా" అని తెలిస్తేగా. "పూడుస్తావే" మంటాడు నూనెవాడు, ఆమె పోతుంటే. "పూడవట వేమిటి నీబుర్గి" అంటుంది, ఆమె. గ్రాంథిక భాషాపదజాలప్రయోగమంతా హాస్యరసపూరితమే. చిక్కటి చేవతెలుగు ముందు గ్రాంథికభాష చివికినడప్పు మాదిరి మోగుతుంది. పెచ్చుజేయాలంటే నాలుగు గ్రామ్య పదాలు వెయ్యాల్సిందే.

గోపాలం భక్తి అనుమానిస్తుంది ఒకఆవిడ. "అల్లా అనకు వదినా! కర్మవిమోచనమయితే ఎంతసేపు కావాలె? అహల్య ఎన్నాళ్లనుంచో బండరాయియై పడుండి ఆమహానుభావుని పాదకమలం తాకటంతోటే లేచి కూర్చున్నది కాదూ?" అంటుంది యింకో ఆవిడ. గోపాలాన్ని "వేదాంతి" అనేగాకుండా "మంచికర్మిష్ఠి" అని గూడా అనుకుంటారుట. "అప్పులతో తలమునిగి తాటిప్రమాణాలవుతున్న నీవు సప్తాహం యెట్లాచేస్తావయ్యా?" అని అడిగితే "రామదాసుఅప్పులు ఎవరు తీర్చారు? మనదేముంది? చేసేవాణ్ణినేనా?" అని "పలికెడిది భాగవతమట" పద్యం, దానివెంటనే "అంతా రామమయం" అనే కీర్తన విసురుతాడు. ఈరకం వేదాంతం ట్రిక్కులు గ్రహించాడు.

"ఏమిరా సంబరం, డబ్బులేకుండా యెల్లా కాఫీ హోటలుకు వచ్చావురా అంటే, "ఓరి వెర్రివాడా! Ethical గా ఆలోచిస్తే తినేది యెవరు? తినిపించేవాడెవడు? అంతా వకటిగాదా?"

"తిననేర్చువాడ నేనట
తినిపించువాడు రామభద్రుండట...

నేను నీవు అనే రెండువ్యక్తులు ఏడిచినవా? నేనెవరు? వాడెవడు? నాలో వెలుగుతున్న ఆ అకళంకమయిన, దేదీప్యమానమయిన జ్యోతి అతనిలో వెలగడం లేదా?" అంటూ లెక్చరు ఆరంభిస్తాడు.

### భాష

ముఖ్యంగా కథలు చదివి ఆనందించేప్పుడు భాష విషయం మనం పట్టుదల చూపకూడదు. రసానుభూతి

కలుగుతుందా, లేదా అనే విషయమే మనం చూసుకోవాల్సింది. "వీరి వ్రాతలందు కృష్ణాగుంటూరుమండలముల లేటతెలుగు ప్రవహించుచుండును. అన్నిటికంటె స్త్రీపాత్రలనోటినుండి చిక్కని తీయని తెలుగుజాతీయములు వినసొంపులై యుండును" అని భావరాజు వెంకట కృష్ణారావుగారే వ్రాశారు. ఇంతకన్న యెక్కువ వ్రాయబూనడం అనవసరం, సాహసం.

## నరసింహారావు కథకుడు

తెలుగులో చిన్నకథలు వ్రాయు ప్రముఖులలో నరసింహారావుగారొకరు. వీరి కిట్టి ఉన్నతస్థానమిచ్చినది వారి వస్తుప్రదర్శనం, వస్తునిర్మాణం, భావకల్పన, శిల్పము, భాషాసంపద మొదలయిన గుణాలే. వారిపాత్రలు, రంగాలు మొదలైనవి నిత్యజీవనంనుంచి తీసికోడం వారిలో నొక గొప్ప. ఈవిషయంలో వీరికి సమానులు గుడిపాటి వెంకటాచలంగారు. కాని నరసింహారావుగారి సంస్కరణ స్త్రీస్వాతంత్ర్యాదులలో వెంకటాచలంగారు Extremist. వారి కథలను గురించి మరోవ్యాసంలో ముచ్చటిస్తానని మనవి. ఆంధ్రకథకులలో నరసింహారావుగారి గొప్పనుగురించి చెప్పడానికి పైన ఉదాహరించిన విషయాలు చాలనుకుంటా. అయినా, భావరాజు కృష్ణారావుగారి చక్కనిమాటలతో ఈనావ్యాసంముగిస్తా. "ఆంధ్రకథావాఙ్మయమునందునరసింహారావుగారికథలుమంచిస్థానమాక్రమించగలవు. వీరికథావస్తువునం దెట్టియింపుగలదో కథవ్రాయుటయందుగూడ నట్టియింపే గలదు. చదువుచుండినకొలది తన్మయత్వము నొందించు భావసంపదలు, కథావైచిత్ర్యము, చమత్కారపుమాటలు, చవులూరించుచు, పాఠకుని పరవశునిచేసి ముందున కీడ్చుకొనిపోవుచుండును. వీరికథలీకారణమున ఆంధ్రజాతికి నూతనసందేశ మొసగగలవు; విమర్శకునిమన్నన లందగలవు. ఇన్నిమాటలేల? ఒకసారి చదివిన వీరి కథలను మరియొకసారి చదువవలయుననియే అభిలాష-కాదు కౌతుకము కలుగుచుండును."

---

## నిధి

పాటిబండ మాధవశర్మగారు

౧

ఎఱిఁగియెఱిఁగియు నెత్తిపై కెత్తుకొన్న
భార మిది యెట్లు నిర్వహింపఁబడు దేవ!
ఇది మహానిధి వెదకినయదియుఁ గాదు
దైవికమ్ముగ కాళులఁ దవిలి వచ్చె!

౨

లోతు తెలియని దీనికై లోభపడ్డ
దగ్ధయత్నమ్ములైన యాత్మ లివియోటు?
ప్రేమమూర్తులు దాల్చి పరిభ్రమించు
నుఱక మృత్స్నవిశేషమ్ము లుమిసికొనుచు.

౩

కంటకమ్ములు మృత్తిక గండశిలలు
తగులునే కాని యెంతగా త్రవ్వుకొన్న
ఈనిధానమ్ము జాడయే నెఱుకపడదు;

౪

ఇంతబడలిన యీజీవి యెన్నఁడైన
కాంచునో యీనిధానమ్ము; కాక యిచటి
ప్రేత సంఘమ్ములం దొక్క ప్రేతమయి న
శించి పోలేక యిట్లు ఘోషించవలెనో!

'మధుకణములు' నుండి.

---

# 'వకుళమాలా' పరిశీలనం

(శ్రీ వాణీవిలాసము) ఉభయభాషాప్రవీణ, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు

"A Poet is born and not made."

'వకుళమాల' అని ఒక ఆధునికకృతికి చెందిన పేరు. దీనికి నిజమైన అర్థం పొగడదండ. దీనిని కూర్చికూర్చి 'సహదేవ సూర్యప్రకాశరావు' అనేవారు అచ్చమాంబ' మెడలో అభినవంగా అలంకరించినారు.

అయితే "ఆమె లోకమ్ములో లేదు" లెండి.

ఈ గ్రంథమును మనకు పరిచితంచేసినవారు శ్రీ చింతా దీక్షితులుగారు. "పరిచయము" చదివితిని. పుస్తక ప్రధానభాగం చదివితిని. పువ్వులన్నీ కదిపి చూచితిని. వాసనాలేశంగూడ లేదు. పరిచయ వాక్యాలు సమన్వయించబోయినాను. కుదరలేదు. విచారించగా అవి "మిత్రునిమాట త్రోసివేయలేక"—సందేహించి వ్రాసినట్లు కనిపించినవి. దీక్షితులుగారివంటి సహృదయుని కలం లోంచి నిజాన్ని జారనిచ్చింది కాదు, మొహమాటం.

సాధారణంగా ఆధునికకవిత్వాన్ని తిట్టేవా రందఱుగూడ ఇలాంటిపుస్తకాలు చూసే తిడతారని నా అభిప్రాయం.

మాస్తే ఇనుం— మెటిస్తే బంగారం అనుకునే ముగ్ధహృదయాలకు వీని తాత్త్వికాంశం తెలుపుదామనే ఉద్దేశంతో నే నీవిమర్శకు మొదలుపెట్టినాను. నన్ను సమంగా అర్థంచేసుకోగలిగినవారికి నా మాటలలోని యథార్థం బోధపడుతుంది. మిగిలిన వారు —అలగనీ— అలరనీ— ఒక్కజోహారు.

ఉమాకాంతంగారు "నేటికాలపుకవిత్వం" లో అన్ని విషయాలూ చర్చిస్తూ ఇప్పటి పుస్తకాలపేర్లను గూడ 'నామాధికరణం' అనే పేరుతో విమర్శించినారు. ఆయనమాటలలోని వెగటుదనం—దబాయింపు వదలి పెడితే కొంతవఱకు యథార్థం లేకపోలేదు. పెట్టినపేరు అన్వర్థం అయిఉండాలని ఆయనవాదం. చాలామట్టుకి ప్రస్తుతపుస్తకాలపేర్లు సార్థకంగా లేవు. ద్రావిడప్రాణాయామం చేసిమాస్తే ఏదో లీలగా కనిపిస్తుంది.

తమరచనలకి అందమయిన పేర్లుపెట్టడం సంస్కృత వాఙ్మయంలో ఉన్నది. దిఙ్నాగుని నాటకంపేరు 'కుందమాల'. అయితే చాలభాగం కుందమాల మీద ఆధారపడి ఉన్నది, నాటకం.

వ్యాఖ్యానాలకి చిత్రమైన పేర్లున్నవి. ప్రతాపరుద్రీయమునకు కుమారస్వామి సోమపీథి వ్రాసిన వ్యాఖ్యానంపేరు 'రత్నాపణం.' ఉత్తరరామచరిత్రకు వ్రాసిన ఒకవ్యాఖ్యానంపేరు 'కళ,' కాని కావ్యాలకి ఇట్లాంటివి లేవు.

'వకుళమాల' అనేపేరు అందంగానే ఉన్నది. కాని గ్రంథానికి— పేరుకి సంబంధం లేదు. వీరి పూర్వగ్రంథం— 'మునిమాపు'. దీనికి పుస్తకానికి అన్వయం మృగ్యం.

ఈయనకు మేలుబంతి శ్రీకృష్ణశాస్త్రి. ఆయన మొదటి గ్రంథం 'కృష్ణపక్షము'. రెండవది—'ప్రవాసం—ఉర్వశి'. ఈపేర్లు చాలా అర్థవంతములు. అంధతమసావృతమైన బహుళపక్షంవలె దుఃఖబహుళ కావ్యావృతంగనక కృష్ణపక్షం అనేపేరు తగిఉన్నది. చాలవఱకు ఆత్మపరం గనకనూ కృష్ణపక్షం అనవచ్చు. రెండవ గ్రంథం పేరు సర్వథా అర్థవంతమని ఆ గ్రంథం చదివిన అందఱికీ తెలుస్తుంది. అందమైనపేర్లు వెదకి అమర్చే ఆరాటం ఇక తగ్గించి అర్థంకూడా చూడాలంటాను'సూర్యప్రకాశరావుగారిని.

కవిబ్రహ్మకి నిజమో, అబద్ధమో మనఖర్మంచాలక ఓ కల వచ్చింది. ఆపాడురోజు మొదలు ఎడతెఱిపిలేకుండా కలమెత్తి కందపద్యాన్ని పిలవగలిగిన, ప్రతికవిశేఖరుడికీ

కలలు రాకతప్పినది కాదు. అందులోనూ కూచిమంచి తిమ్మరాజుగారికి కుక్కుటేశ్వరస్వామి రోజూ కనిపించి వ్రాయబోతున్న ప్రతిప్రబంధాన్ని తన కిమ్మని దేవిరించని ఘడియ లేదు.

కృష్ణశాస్త్రి పాపం నిజంగా బాధపడి వ్రాస్తాడో — లేక భావించి వ్రాస్తాడో, ఆ విషాదకవిత్వం ఆయనకు చెల్లినది. 'కృష్ణపక్షం'లో కంటె 'ప్రవాసం—ఊర్వశి'లోని 'శాస్త్రిని' చూస్తే "అపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయమ్" అనుకుంటాను.

వేదుల శాస్త్రిగారు గూడ కొంతవరకు విషాదకవిత్వమే వ్రాస్తారు. అందులోనూ హృదయం సుఖిస్తుంది. వీరిరువురి గీతాల్లో ప్రత్యేకత గోచరిస్తుంది.

ఇంక యువకవులలో విషాదకవిత్వపు వెఱ్ఱి రేగినది. లేనిపోని కలత లేవో రేపుకొని అర్థంలేని అయోమయం మొదలుపెట్టినారు; నేటి కవిసోదరులు. రాను రాను వీరంపటిని చూస్తే జాలి అనేది పోయి ఆంధ్రవాఙ్మయానికి అమాంతంగా ఇంత అవస్థ వచ్చినందుకు ఆశ్చర్యపడవలసివస్తున్నది. తెలుగుబ్రతుకు కల అయిపోయిందనే శోచించమా, అర్థంలేని అయోమయదుఃఖంలో అణిగిపోతున్నదనే అలమటించమా, అరయండి పెద్దలు!

విషాదకవిత్వపు శాఖకు చెందినదే 'వకుళమాల' గూడ. కృష్ణశాస్త్రిగారిని వెంబడించినవారిలో ప్రకాశరావుగారు ప్రథములు. కృష్ణశాస్త్రిగారిలో ఉండే ఆ వేదన, అభిప్రాయాభివ్యంజకపదసామగ్రి, ఉపజ్ఞ, అద్భుతప్రతిభ వీరు స్పృశింపలేకపోయినారు. అలవడుచు కొన్న దేమిటంటే—ఆయనలో ఉండే విసంధులు, గణయతిభంగాలు, అన్వయకారకృత్యాలూను.

"పరిచయ"కారులు "వకుళమాలలో స్వాదుత్వమున్నదని నా అభిప్రాయము" అంటారు.

స్వోపజ్ఞాప్రతిభాసమున్మేషంవల్ల కవిహృదయంలోనుంచి కావ్యం వికసిస్తుంది.

ఆచార్యమమ్మటుడు "నియతికృత నియమరహితాం హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం, నవరస రుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవేః..." అన్నాడు. "యథాస్మై రోచతే విశ్వం తథేదంపరివర్తతే" అని ఆనందవర్ధనుడు కవి అనంతప్రజ్ఞకు ఈ విశాలవిశ్వం ఒదిగిపోతుం దన్నాడు.

"నా హృదయమందు విశ్వవీణాగళమ్మ
ఘోరఘోరన నీనాదు మ్రోతవెట్టు,
మూడులోకాలసుఖ మెక్కుడుడి నిమిడ్చి
* * * * *
విసరలేనో కాలాంతమే వెనుకబ్రాక"

అని నిజమైనకవి ఆవిష్కృతు డౌతాడు. కవియై పుడితే ఈతత్త్వం ప్రకాశించకమానదు.

ఆధునికాంధ్ర సారస్వతంలో, కృష్ణశాస్త్రి, నాయని, రాయప్రోలు, విశ్వనాథ ఆదిగా అరుదుగా ఉన్నారు, కవులు. కాకిబంగారం మెఱుపుతో కూర్చిన పద్యసంపుటమును కావ్యం అనమంటే అనలేం.

వకుళమాలలో ప్రధానంగా వర్ణింపబడినది కరుణవిప్రలంభము.

కవులు విప్రలంభంఅంటే కరగిపోతారు. కాళిదాసు విప్రలంభసమాశ్లిష్టకథలనే తీసికొని ఆరుకావ్యములుగా విరచించినాడు. తత్రాపి, మేఘదూత కేవలవిప్రలంభచిత్రణం కొఱకు ప్రత్యేకింపబడినది. భవభూతి విప్రలంభరసాంబుధిలో మునిగి తేలి ఇంత లోతున్నదని కణేహత్య చెప్పినాడు. కృష్ణశాస్త్రి 'ప్రవాసం—ఊర్వశి' లో విప్రలంభం కూలముద్రుజమై ప్రవహించినది. వీరంటిలోను ఉపజ్ఞ—ప్రతిభ వెల్లివిరిసినది.

వకుళమాలలో విప్రలంభం నీరసంగాను, చేదస్తంగాను వర్ణితమైనది.

ఇంత గ్రంథములోనూ ఉజ్జ్వలమైన పద్యాలు రెండుమూడైనా ఉన్నవా లేవా అంటే, లేవనే నాఅభిప్రాయం. ఏమంటారా—

"కవిత్వం దుర్లభం లోకే శక్తి స్తత్ర సుదుర్లభా" అన్నా డొకసహృదయుడు. ఆశక్తినే నేను ప్రతిభ అంటున్నాను. ఈప్రతిభ ప్రతి Versifier లోనూ

ఉండదు. ప్రతిభ ఉపజ్ఞాజన్యం. ఆ ఉపజ్ఞ పరమేశ్వర కరుణాసమాసాదితం కావలెను. ఈ గ్రంథంలో ఉపజ్ఞ, ప్రతిభ లేనేలేవు. ఉన్న వారి ఉదాహరణములు చూడండి.—

"హృదయే వససీతిమత్ప్రియం యదవోచ స్తదవైమి కైతవమ్, ఉపచారపదం నచేదిదం త్వ మనంగః కథ మక్షతా రతిః. అహమేత్య పతంగ వర్త్మనా పున రంకాశ్రయణీ భవామి తే," — కాళిదాసు.

"అంతర్లీనస్య దుఃఖాగ్నే రద్యోద్దామం జ్వలిష్యతః,
ఉత్పీడఇవ ధూమస్య" మోహః ప్రాగావృణోతి మామ్.
— భవభూతి

"ఎవ్వడే నీగళమ్మునం దిరవుకొనగ
నేను విసరిన ప్రేమప్రసూనమాల
నడుమ నీవు మూడగ బట్టి నలిపివైచి
నీకనులయందు నెత్తురుల్ నింపినాడు."
— నాయని

"ఏను మరణించుచున్నాను, ఇటు నశించు
నాకొఱకు చెమ్మగిలునయనమ్ము లేదు
పసిడివేకువ పెండ్లిండ్ల బడిన యెవరు
కరగనేర్తురు జరటాంధకారమృతికి."
—కృష్ణశాస్త్రి

ఉదాహృతపద్యము లన్నిటిలోని విప్రలంభతత్త్వం గమనించండి. పదవిన్యాసమునందు, భావావిష్కరణమందు ఒకొక్కకవిలో ఒకొక్కమెఱుపున్నది. ఇంక వకుళమాలలో సమానభావం గలిగిన పద్యం చూడండి—

"ఏల మరణించిపోను న న్నేల నిపుడు
చుక్కలే చిరుమెఱుపులే సొగయబోని
కటికకాటుకచీకటి కవయ దేమి
మీదపడ దీముహూర్తాన మిన్ను విఱిగి."

ఈ పద్యంలో Expression కుంటుపడినది. లేవడితనం పొడకడుతుంది. చూడండి. మొట్టమొదట ప్రక్రమభంగం కనబడుతున్నది.

"ఏల మరణించిపోను, ఏల కటికకాటుకచీకటి కవియదు, (ఏమి కూడా ఎందుకో) మీదపడ దీ ముహూర్తాన మిన్ను విరిగి"— దీని ముందుగూడా 'ఏల' ఉంటే ప్రక్రమం పాడుకాకపోను. అందం మందగించకపోను.

"దళతి హృదయం శోకోద్వేగా ద్విధాతు నభిద్యతే
* * * * *
ప్రహరతి ముహు ర్మర్మచ్ఛేదీ నకృన్తతి జీవితమ్."
అని ప్రక్రమం పాటిస్తాడు నిజమైన కవి.

అనర్థకము—

"చుక్కలే చిరుమెఱుపులే సొగయబోని"

చుక్కలేని, మెఱుపులేని అందగించని, లేదా పొడసూపని అనే అర్థం ఇక్కడ కావలెను.

"సొగయు = చొక్కు—మూర్ఛిల్లు."
— శబ్దరత్నాకరము.

కనుక ఇక్కడ ఈమాట అనర్థకము. ప్రధానంగా విప్రలంభ కావ్యంలో కనిపించవలసిన హృదయాన్ని ఊపే ఆవేదనపరిణతి ఇందులో లేదు.

క్రమముగా వికసించవలసిన భావస్ఫూర్తి యీ పద్యమున కలతపడ్డది. 'నే నేల మరణించిపోను? కటిక... చీకటి కవియదేమి? మిన్ను విరిగి మీదపడదేమి?' అని పద్యార్థం.

ఉద్బుద్ధమైన భావం పైపైని ఆవిష్టమవుతుంది కనుక—

'కటికచీకటి నన్నావరింపదేమి? మిన్ను విరిగి మీదపడదేమి? మరణించిపోనేమి?' అంటే భావోన్మీలనం క్రమవిన్యస్తమవుతుంది. ఐనా 'మరణించిపోనేమి' అనే మాట నీరసమైనది. 'మిన్ను విరిగి మీద పడదేమి?' అనేమాటతో భావావిష్కరణం వ్యంగ్యంగా మనస్సునకు నాటుకొంటుంది. "కాటుకచీకటి" అనే మాట చప్పగా ఉన్నది. 'కారుచీకటి' అని గణం సర్దుకుంటే బాగుండును. నిజమైన కవులను చూడండి.

"ఏను రుజన్నైతి జరన్నైతి మృత్యున్నైతి"

" అంధే తమసి విధురో మజ్జతీవాంతరాత్మా
విష్వ జ్యోత్స్నహః స్థగయతి................"

ప్రధానంగా ఈ పుస్తకంలో అర్థవ్యక్తి లేదు' అర్థవ్యక్తి లేకపోతే అయోమయం అనవలసివస్తుంది.

పండితరాయలు 'రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యమ్' అన్నాడు. ఉద్బుద్ధమైన భావం శబ్దముల ద్వారా ఆవిష్కృతమవుతుంది. ఆశబ్దములు అర్థప్రతిపాదకములు కావలెనుగాని అయోమయంగా ఉండరాదు. ఒక పాశ్చాత్యలాక్షణికుడు 'Poetry to be the best words in right order' అన్నమాటలోని తత్త్వం గమనించండి.

" కేటానువిద్ధరత్నాది సాధారణ్యేన కావ్యతా,
దుష్టేష్వపి మతా యత్రరసాద్యనుగమస్స్ఫుటః."

అని ఒక కావ్యతత్త్వజ్ఞుడంటాడు.

నకుళమాలలోని అర్థవ్యక్తిని చిత్తగించండి—

"ఈ కిశోరతారాహృది సోకుచుండు"

కిశోర=యౌవనావస్థగలిగిన— ఇది హృదయమునకు విశేషణము. మిగిలిన, 'తారా' ఇక్కడ ఏవిధముగాను అతకదు.

దీనికి నిజమైన అర్థం: బృహస్పతిభార్య, వాలిభార్య, నక్షత్రము, కనుగ్రుడ్డు. వీనిలో ఏది పైస్థలంలో సమర్థార్థమును ఇవ్వగలుగుతుంది? ఇది అచ్చమాంబగారికి అంకిత మిచ్చే ఆదిమపద్యం. కలయ ద్రిప్పు స్వప్నస్నపితరహస్తీరములను రహస్థ్సలములు తడిసినవా? దేని చేత? కలలో తడియడానికి కారణం ఏమిటి? (పూలకన్నెవలపు) ఇట్లా తడిసిపోయిన, కలల రహస్యతీరములలో లేక తీరములను కలయద్రిప్పడానికి కలిగిన ఆంతరకారణం ఏమిటి?

ఏమో, అంతా అయోమయం.

" నూత్నచైతన్యసుషిమామనోజ్ఞశోభ"

'చల్లనిశోభ' అనిగాని 'చల్లదనపుశోభ' అనిగాని దీనికి అర్థము. శోభకు చల్లదనం, వెచ్చదనం అనే భౌతికగుణా లేవీ ఉండవు. లేక చల్లదనానికి మనోజ్ఞశోభ ఏమిటో తెలియదు. 'నందనానందకుంద మరందలవము' అను ప్రాసకే ఆనందమా? అర్థపుష్టి అక్కర లేదూ?

ఇట్లా ఉదాహరించ దలచుకుంటే వకుళమాలంతా ఇక్కడ వ్రాయడమే అవుతుంది. ఇది దిఙ్మాత్రోదాహృతిగా గ్రహించండి:

కొన్ని పద్యములను చూడండి:—

" చెక్కిళుల పసందుల కళాసించి పోయి
సొలసిపోయిన ఇసిరింత చూపుకొసల
కొనలుదేరిన కడసారి మినుకుతలపు
ప్రొద్దుపొడుపుల నేపుల పొడుచునేమొ."

(దీని భావమేమి తిరుమలేశ?)

" పొసగ ముత్తె పుసరుల్ పోహళించిన లీల
తమలోన దొరయుశబ్దముల గూర్చి"

అంటాడు కవితాతత్త్వజ్ఞుడు.

ఈ మారుమూలపదాలబిగింపులో అర్థవ్యక్తి కునికినది.

'ఎపుడు నాలోని ప్రేమ నశించు నపుడె
నేను పావురాకంఠాల నిలిచి కలసి
పొంగిపడు, గుబాళింపుల పొగలు కవిత
నీరసిలి రాలిపడి మరణించిపోవు.'

'మరణించిపోవు' అనేక్రియకు కర్త కవిత. 'నేను' మొండిగా వ్రేలుచున్నది. అన్వయశుద్ధి శూన్యమయినది.

ఈ క్రింది పద్యమునకు సమన్వయం అగమ్యంగా ఉంది. —

" ఆలవాలలతాంబికదృగంచలచంచలచంచరీకపీ
ఠాలవమాధురుల్ విరియజల్లిన గొజ్జగిసెజ్జలందు ని
ద్రాలసతన్ కనుల్ మొగుడ ఆరనితీరని శోకవేదనల్
వ్రేలెను మాలలై గగనవీథిని రాగమయూఖపాళులై."

ఏఐదారు పద్యాలకో తప్పితే ఈపుస్తకంలో అన్వయం సరిగా ఉండదు.

దీక్షితులుగా రన్న కొంచెము స్వాదుత్వమైన ఎక్కడ ఉంటుందో?

"అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్" ఔచిత్యానికి అగ్రస్థానం ఉన్నదన్నాడు తత్త్వదర్శి.

ఇక ఇందులోని ఔచిత్యం :

"శాల్మలీసూనహాసమంజరుల"

కవులు నవ్వును ధవళంగా వర్ణిస్తారు. ఇందులో 'బూరుగుపువ్వులనవ్వు'.

"ఎవరు సహియింపనోపుదు రీయనంత
సాగరార్ద్రమహోజ్జ్వల జ్వాలమాల"

తడిసినమంటలు ఎవరు సహియింపనోపుదురు ? ఆహా ఎవరుసహియింపనోపుదురు ?

"అంత నేమాయె అంబికాహాసవల్లి
కామసృణవాసనాస్నానకలన నవక
మంది సురభీకరిలె."

ఏఅంబిక ? కేవలం అంబిక అంటే అమ్మకామా? అర్థసందర్భం అనౌచిత్య స్ఫోరక మవుతుంది.

వకుళమాలలోని కొన్ని మాటలకు తగిన అర్థమే దుర్లభ మవుతున్నది.

"వయసు సొగసిన నీయెదపమునందు". సొగయడ మంటే అందగించడం కాదు; మూర్ఛిల్లుట. ఇక్కడది అనర్థము. ఈసొగయు వాడినప్పుడల్లా అనర్థకమే అయింది.

'కమగొనల సౌభాగ్య భాగ్యసుభగాంక,'

సుభగళబ్దపు వృద్ధి రూపము సౌభాగ్యము. ఇక్కడ రెండును ప్రయుక్తములయినవి, నిరర్థకంగా.

'శ్రీకరోదయాంతలతాంతాలు'.

'తరుణాంశుకరము.'

'పలాశమసృణతరుణ తుహినారుణము'

ఇట్లాంటి అనర్థపదాలతో బిగుసుగున్నది కావ్యం. అసంధర్భములు - పునరుక్తులు కొన్ని చూడండి.

'అనంతకల్పాంతము.'

'అంతమేలేని కటికశోకాంతము'

'ఇవమినమంచుజల్లు'

'జడమాయె అచలమాయె'

'చివురివురొత్తు'

'హృదయాన భావాన'

మమ్మటాచార్యుడు "అనన్యపరతంత్రాం" అన్నాడు.

వకుళమాలలోని పారతంత్ర్యం చూడండి, పదములలో—

'ఆసకొసలజారిపడినస్వప్నాల' —వకుళ.

'చికురంపునీలికొనలజారిపడిన స్వప్నమ్మ'
—ఊర్వశి.

'సాంధ్యమల్లీ మనోజ్ఞ'—వకుళ.

'ఆమెనవసాంధ్యసమయమల్లీ మనోజ్ఞ......'
—ఊర్వశి.

'ఈనవాగమాబ్దమ్ముతో ఇరులు విరిసి'—వకుళ.

'ఈనవాబ్దాగమమ్ముతో ఈకిశోర'— ఊర్వశి.

'పూవులు రేకు లూడిపడిపోయిన ఈ మునిమాపు చాయలన్' —వకుళ.

'పూవులు రేకు లూడిపడిపోయె హృదంతర...'
—వేదుల.

భావములలో—

'నాగది నలకరించుకొన్నాను నేనె
ఏనె వెన్నెలవెల్ల వేయించినాను.'
—వకుళ.

'నామరణశయ్య పరచుకొన్నాను నేనె'
'నేనె నాకు వీడ్కోలుపు విన్పించినాను.'
—ప్రవాసము.

'బ్రదుకుబ్రదుకెల్ల నొక్కస్వప్నముగ మార్చు'
—వకుళ.

'బ్రతుకుబ్రతుకెల్లకరగు బాష్పములు గాగ'
—ఊర్వశి.

ఇందలి 'అభిసారిక' అనే పద్యాలు కృష్ణపక్షపు అన్వేషణమునకు ఛాయ.

'పథమునంబోవు వనిత, ఎవ్వతవు నీవు'

—వకుళ.

'వనితా ఎవ్వతవు నీవవిటసేవనిలోన్.'

—కృష్ణపక్షం.

'ఎన్నటికినేని నీదాననే నిజమ్ము'

— వకుళ.

'ఆనాటి కీనాటి కేను నీదాననే.'

— ఊర్వశి.

'ఈపిలుపు లేకడలనుండి ఇపు్ప పిలుతు రెవరు'

— వకుళ.

'ఎవరోహో, ఈనిశీథినెగసి నీడవోలె నిలిచి పిలుతు రెవరో ?'

— ప్రవాసము.

దీక్షితులుగారు "సమకాలికుల కావ్యములలో ఇది తేల్చడము కష్టము." అని వ్రాసినారు. కాని సమకాలికులు సమకాలికుల కావ్యములను పరిశీలించి ప్రచురణాదికమును బట్టి తేల్చగలరు. పరిచయములో 'శబ్దజాలము మార్దవముగా ఉన్నది' అని ఉన్నది. ఆమార్దవము ఈ పదాలలో గమనించండి.—

'పుయిలోడి', 'కుంచించు', 'సురభీకరిలె', 'తమోతమస్సాంద్రము', 'అల్లుచెచ్చ టెచ్చటికో', 'స్త్రోపుళులు', 'పులపాడుచు', 'ఇసిరింత', 'కళాసించు,' 'నిబిరీసము.' ధాతుత్వవివక్షయందు నామపదాలకి ఇంచుగాగమం చేయవచ్చునని లాక్షణికుల అభ్యనుజ్ఞ. అట్లాగే పూర్వులు, ఆధునికులు వాడినారు. అదే పనిగా వాడితే దానిని వెట్టిఅంటారు. ఆ ఇంచుగాగమపు వెట్టి చూడండి.

'ఇగురించు', 'ప్రయాణించు', 'హిమానించు', 'సురభీకరించు,' (ఇది చాలాభీకరముగా ఉన్నది.) 'వాసించు,' 'విహారించు,' 'పిసాళించు,' 'పక్ష్మళించు', నిస్వనించు', 'కాంతించు', ఇందులో కొన్ని పదాలు "దొంతరదొంతరగా" "త్రుళ్లిత్రుళ్లి" పడి "సొగసి" పోతాయి.

"తనుకమబ్బుల త్రుళ్లింత దొంతరింప"
మబ్బుదొంతర త్రుళ్లింత మాటుమణగి
నిడుపనిట్టూర్పు దొంతర
లేతవలపు దొంతరల త్రుళ్లింత
సోగ ఱెకుల నరవిచ్చిసొగసిపోయి
వయసుసొగసిన
చుక్కలే చిరుమెఱపు లేసొగయబోని
వలపులివమె
ఇవమినమంచు జల్లు
సంజచాయలనివమి

ఈ పుస్తకములో లాక్షణికదోషములు చిత్తజల్లుగ ఉన్నవి. అయితే మహాకవులలోగూడ చ్యుతసంస్కృతులు లేక పోలేదు. వారి కవితావేశంలో అది నిరంకుశత్వం.

మచ్చునకు ఇందలిలాక్షణిక దోషములు —
'ఆలతాంబిక చిరునవ్వి నంత'

విశిష్టమయిననవ్వు ఇక్కడ విశేష్యము. ధాతువని భ్రాంతి. 'చిత్రపథించెను' అన్నట్టుంది.

'ముగుదకుముద'

కలువ అనడానికి అకారాన్తనపుంసకలింగం వివక్షించాలి. అప్పుడు కుముదము అనకతప్పదు.

'ఇవమినమంచుజల్లు'

ఇవము నామవాచకము; ధాతువు కాదు. 'రహర్నిదేశములు'—తప్పు రహోనిదేశములు. "ఈనిశాంతప్రశాంతమందు." ప్రశాంతమనగా ధర్మవాచకము. ఇక్కడ ఉండవలసినది ధర్మివాచకము. 'ముగ్ధకోయిల': ఇది "శుద్ధ తప్పు". కోకిలఅంటే సరిపోతుంది. కాని లేతహస్తవిన్యాసము. 'కటికిశోకాంతము' అనితరువాత ఉన్నాయిగా,

ఛందోభ్రష్టములు.

# మదరాసు లలితకళాసంఘము - ౪౨-వ చిత్రకళాప్రదర్శనము

౧౯౩౩.



శ్రీరామ పట్టాభిషేకము (శిల్పప్రతిమలు)

శిల్పి : యమ్. వి. నారాయణరావుగారు.

(యస్. వి. రామస్వామి మొదలియారుగారికొఱకు తయారుచేసినది.)



రూపచిత్రము (రంగు సుద్దలతో చిత్రించినది)
యస్. వి. యస్. రామారావుగారు. రూ. 50 బహుమానము.



రూపచిత్రము (రంగు సుద్దలతో చిత్రించినది)
మాధవపెద్ది గోపాలకృష్ణ గోఖలేగారు ([illegible])



బిచ్చగాడు (ప్లాస్టరుతో చేసిన శిల్పప్రతిమ)
యస్. వి. నారాయణరావు రూ. 50 బహుమానము.



బాల (ప్లాస్టరుతో చేసిన శిల్పప్రతిమ)
వి. డి. గోవిందరాజుగారు రూ. 20 బహుమానము.

ముందొక మాట. కృష్ణశాస్త్రిగారు ఎక్కడో యతిభంగాలు, గణభంగాలు చేసినారు. ఆచేతలో అర్థం ఉన్నది. ఇంక ఇందులో ఛందోభ్రష్టాలకి కారణం కనిపించదు–

"గానమేగాని రాగాంకకల్యాణమేని"

తేటగీతములో రెండే ఇంద్రగణా లుంటవి. కాని ఇందులో మూడు.

'నేడు కార్తీక మాసాంతదినము'

ఇందులో యతిభంగమయినది.

"మ్రోవగరాని రాగవుల్."

పు, ఫు, బు, భు, లకు ముతో యతివేస్తే పోలిక అంటారు. దీని నేమనాలి?

ఇప్పటికి స్థాలీపులాకంగా పుస్తకం అంతా స్పృశించడ మయింది.

"నాటినుండి చెందినపరిణామము" దీక్షితులు గారికి ఈ కావ్యమున ఎలా గోచరమగుచున్నదో తెలియదు. "క్రొత్తరకపు కవితాసామగ్రి, క్రొత్తరకపు శబ్దజాలము, క్రొత్తక్రొత్త భావములు, అనుభవములూ కూర్చి మృదువుగా, మధురముగా కవిత్వము చెప్పగల ప్రజ్ఞ వీరికి" ఉన్నదో లేదో సహృదయులు పరికించ గలరు. తత్త్వం స్పృశించి ఏ "మహానుభావులు సమీక్షా దృష్టితో తలపంకించినా సంతోషమే."

---

## విభ్రాంతి

పిలకా గణపతిగారు

బాల యీచాయనే పఱతెంచె గాబోలు!
కసవుపసిరితివాసిపై ముత్తెముల జల్లి
జాబిల్లి కర్పూరరజము లెల్లెడ జిమ్మె!
పాలవెన్నెల గ్రుమ్మరించు నచ్చరచాన
రజతపాత్రిక వంచి రిచ్చవడి యట్టె జూచు
గొజ్జియలమందవలె తెలిమబ్బుతునుక లవె
కొండపై శయనించి యుండి యామెను జూచు
వటయువకు డడుగుసవ్వడి హృదయమున [మ్రోగ
కనుమూసెనో యేమొ! నిశ్చలత వహియించె.

కొమ్మ మృదుచేలమ్ముకొస విసరెనో యేమొ
మల్లికాసుమము లిట మత్తిల్లి పడియుండె!
ప్రేమ యాకర్షింప బరువిడెనో! ప్రియునికై
కజ్జలవినీలసహకారవిటపిచ్ఛాయ,
మృదుచంద్రికాకుందమాలికలు పడి మెరయు!
చలదృగంచలములతో బెదరుహృదయమ్ముతో
అడుగు లవె తడబడగ నలుగడల జూచెనో
క్రీగంటిక్రొమ్మెఱుపుకణము మిణుగురుబురువు
తళుకు మని తామసినె పులకింపగాజేయు!
తరువీథి తరుణి తొందరగ బోవగ బోలు.

---

# అప్పకవీయము : యతిప్రాసలు

దువ్వూరి సూర్యనారాయణమూర్తిగారు

(తరువాయి)

ఇఁక ప్రాసలవిషయము విచారింతము. ప్రాసమన ప్రపూర్వకమగు "ఆస ఉపవేశనే" అనెడి ధాతువు ననుసరించి ప్రకృష్టముగా వర్ణముల నాయా నియమిత స్థానములనుంచుట యని తేలుచున్నది. ఇయ్యది రెండువిధములుగా విభజింపఁబడినది. అందొకటి ఛందఃప్రాసము, రెండవది యలంకారప్రాసము. ఛందఃప్రాసమనునది రెండు తెరంగులు. వృత్తాదుల సమానద్వితీయ హల్ సముదాయమగనున్నది. రెండవది ప్రాసయతి యని చెప్పఁబడుచున్నది. పైప్రాసమే యతిస్థానమున నిలుపఁబడెను గాన నిద్దాని కీనామధేయము యుక్తము. ఉపాధిభేదమువలన నియ్యది యనేకవిధములుగా మారినది. ప్రకృతమున నప్పకవి యీప్రాసముల పదునేడింటిని చెప్పియున్నాఁడు. అందు కొన్నిటియందుఁ గల నాభేదాభిప్రాయముల నుగ్గడింతును.

౧. సంయుతాక్షరప్రాసము —

ద్విత్రిహల్ సముదాయము ప్రాసస్థలముల నుండిన తదభేదహల్ ప్రాసమే నిలుపవలెనని దీనియభిప్రాయము.

ఉదా:—"గర్గుఁ డర్చించుదైవము భర్గుఁడనఁగ
పక్ష్మలేక్షణకా నతినూక్ష్మమనఁగ."

పైపద్యమం దధోరేఖాంకిత స్థలములలో నద్దానిని స్పష్టపరచినాఁడు. ఈవిషయము తన ప్రాసరూపప్రతిపాదనమునందే స్పష్టమైయుండ మరల ప్రత్యేకముగా నిద్దానికి లక్షణము కల్పించుట యనవసరము. ప్రాసనిర్వచనమేమన "ద్వితీయో వర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు కించ ప్రాస స్సర్వేషు చైకఏవ స్యాత్" అనెడి చింతామణి సూత్రము ననుసరించి యీతఁడును

"ప్రాసముల కెల్ల తుల్యాక్షరంబులైన
చాలు స్వరభేదమైన దోషంబులేదు."

అని సామాన్యలక్షణము చెప్పియున్నాఁడు. ఇట్లు చెప్పినప్పుడే తద్వ్యతిరేకములయి విశేషము లున్న వానినే చెప్పిన బాగుండునుగాని పైలక్షణముచే స్పష్టముగా ప్రాసస్థలమున నెన్నిహల్లులుండునో యవన్నియు తప్పక పాదచతుష్టము ప్రాసస్థానముల నిలువవలెనని తెలియుచుండ మరియొకలక్షణలక్ష్యకల్పన మనవసరము. ఇట్లు చెప్పుట సంఖ్యాబాహుళ్యార్థము గాక పాఠకుల కేమి యుపయోగ మున్నది?

౨. సంయుతాసంయుతాక్షరప్రాసము—

దీనికి:

"రలలు తమక్రింద జడ్డలై క్రాలుఁ వ్రాలు
ప్రాసవర్ణంబులై వానిఁ బాసియైనఁ
గూడియైనను పెరయుడుగులను నిలుచు"

అని లక్షణమును జెప్పి దీనికి

"పాఁడి ద్రచ్చఁగనిమ్ము నాతండ్రి కృష్ణ
వేఁడుకొనియెద నందాఁకఁ బండ్లు దినుము
దుండగపుచేష్టలను కోడిగాండ్రగూడి
మెండుగా వచ్చె నీకు నైదేండ్లు కృష్ణ"

అని లక్ష్య మిచ్చియున్నాఁడు. ఇయ్యది యప్పకవిస్వీయమే కాని ప్రామాణిక ప్రయోగము కాదు. పై పద్యమున మూఁడునాలుగుపాదములలో లక్షణము సమన్వయించుచున్నది. మొదటిరెండుపాదముల సమన్వయించుటలేదు. సరిగదా, తాఁజెప్పిన ప్రాసలలో నెద్దానిలో నంతర్భావ మందునో తెలియుట లేదు. తాను ఖండాఖండములకే ప్రాసను చెప్పెనుగాని పూర్ణఖండములకు ప్రాస చెప్పలేదు. మరియు ప్రాసపూర్వాక్షర నియమమున నీతఁ డొనరించిన నియమమునఁగూడ నీవిషయము లేనేలేదు. చూడుఁడు—

"క్రింద జడ్డలును బిరుంద బిందువులును
నూది ప్రాసములకు నుండెనేని
హ్రస్వ మొకటి నిడుద యక్కరం బొక్కటి
వానిమొదల నిలుపవచ్చున్..."

అని ప్రాసస్థానమున బిందుపూర్వాక్షరముగాని జడ్డక్కరముగాని పరముగా నున్నపుడే యాద్యక్షరములు హ్రస్వదీర్ఘములున్నను బాధకము గాదని చెప్పెను గాని వైరీతిఁ జెప్పియుండలేదే? సంయోగము పరమందుండుట మీఁది హ్రస్వమునకు గురుత్వము వచ్చునుగాన నాద్యక్షరగురుత్వమునకు భంగము లేదందురేమో? అప్పుడు బిందు వేమియగును? దీనికి సమాధానము లేకున్నది. కొందరిద్దానిని సమర్థింప భాష ప్రాచీనశాసనములలోఁ జూచిన నేటి సిద్ధసాధ్యార్ధానుస్వారపదములు పూర్ణబిందుకములే యనియు నాగుర్తు తెలుపుటకే యిప్పుడుకూడ నర్ధానుస్వారమున్నదనియుఁ గాన,

"పాండి............తండ్రి...
వేండి............బండ్లు..."

అని యున్నట్లనుకొని యప్పకవి యుదాహరించెననియుఁ జెప్పుదురు. అప్పుడు "దీర్ఘాచ్ఛే త్ఖండ ఏవ సజ్ఞేయః" అనెడి చింతామణిసూత్రమును మరచెనా? ఈ సమాధానము సుసంగతము కాదు. శాసనములనాఁటిభాష లిపిలోను, పదములలోనుగూడ పెక్కుమార్పుల నంది యుండ ఈయొక్క నియమమును గ్రహించుటలోఁగల స్వాతంత్ర్యమేల? తానిచ్చిన ప్రయోగము ప్రాచీనమైన శాసనములలోనిదా? కాదు. ప్రయోగము లీయలేదు గాన నియ్యది స్వతంత్రమనక తీరదు. ఈవిషయమున రంగరాట్ ఛందమునఁగూడ నుభయప్రాస మను నామమున లక్ష్యమీయఁబడినది.

"పాఁడి............వాండ్రిల...
వాండ్ర............తండ్రి...
పండు............ఇండ్లు...
కృష్ణుండు............పండ్లు..."

అని యుదాహరింపఁబడినది. వైలక్ష్యము నందు మొదటిపాదమునఁగూడ నిట్టియాక్షేపణ గలుగుచున్నది. కాని అయ్యది లక్ష్యము గాదు. పవలకభేదయతి నిలుపఁబడెను. ఇఁక రెండవపాదమునఁగూడ ప్రాసయతిగాని సంయుతాసంయుతము గాదు. మూఁడునాలుగు పాదములే దీని కుదాహరణములు. కాని యీతనిపక్షమున రేఫశ్లిష్టమున కుదాహరణ మీఁబడలే దనవలెను. లేనిచో అప్పకవీయమందలి చిక్కు ఇచ్చటఁ గూడ వచ్చును. ఇట్టి యభిప్రాయభేదమే నాకు దీనియందుఁ గలదు.

౩. రేఫయుతప్రాసము.—

దీనికి లక్షణము:-

"సుడులు తెలుఁగునందుఁ బొడమ వాకైవడి
వ్రాలు కొమ్ము క్రారవడులు గాన
రేఫయుతసమాఖ్య కృతులఁ బ్రాసములగు
సారిది తమకుఁ దాము సుడులఁ బాసి"

అని చెప్పియున్నాఁడు. ఈప్రాసను కల్పించి తాను తెలిపలుకఁబడునను విశేషాంశముతప్ప మరే క్రొత్తవిషయమును నప్పకవి చెప్పియుండలేదు. ఇయ్యది గూడ ప్రాసనియమముచే గతార్థము కాఁగలదు. ఇందు "సుడులఁబాసి" యనుపదమున కర్థము స్పష్టముగా తెలియుటలేదు.

౪. వికల్పప్రాసము.—

ఈవికల్పప్రాసవిషయమై యతులలోనే చాలవఱకు వికల్పములన్నియు ననవసరములని చెప్పఁబడినవి. రూపద్వయప్రసిద్ధియందు నీప్రాసమును జెప్పుటంతయు నావశ్యకము కానేరదు. ఇట్టే యనునాసికప్రాసముగూడ గ్రహించునది. మఱియు వీనికి ప్రామాణ్యప్రయోగములైనను మృగ్యములే. తనప్రాస సంఖ్యాబాహుళ్యమే ప్రధానముగాన చెప్పవలసి వచ్చినది.

౫. ప్రాసవైరము.—

సాధుశకటరేఫములు రెండును అన్యోన్యము ప్రాసతౌల్యము నందరాదని దీనికి లక్షణము. ఈయతియందే దీనివిషయమై నాయభిప్రాయభేదమును, పెద్దల ప్రయోగములునుగూడ నున్నవని చెప్పుట. ప్రకృతమున విరమణమే యుక్తము. విస్తరభీతి లక్ష్యములనీయ నైతిని.

౬. ఋప్రాసము—

యణాదేశముచే ఋ రకారరూపము నందును గాన నారేఫమునకును ఋకారమునకును ప్రాస వేయ వచ్చునని చెప్పియున్నాఁడు. కాని ప్రయోగ మొక్కటియు నిచ్చియుండలేదు. ఉండిన తప్పక యిచ్చియే యుండును. భారతారణ్య పర్వమునందు మాత్రము కలదని యొకపద్య మీయఁబడినది. "నైకముదాహరణం యోగారంభం జనయతి" అనెడి న్యాయానుసార మూరకొన్నచో నీబాధయే లేకపోయెడిని. కొంద ఱీలక్ష్యము నగల "ఋషి" యనునది "రుసి"యని ప్రాచీన ప్రతులలోనున్నదనియు చెప్పిరి. నిఘంటుకర్తలుగూడ ఋషి శబ్దభవము "రుసి" అని వ్రాసియేయున్నారు. భారతకర్త యెచ్చటనో యొకమూల నతనికై ప్రత్యేకముగా వాడినాడనుటగూడ భావ్యము కాదు. అతనిదృష్టిపథమున రెండు మూఁడుచోటులనైన వాడుచో నద్దానికి లక్షణము కల్పించినను సమంజసము గాని యిట్లీతఁడు చెప్పుట యనావశ్యకమే యనఁదగును.

౭. లఘుయకారప్రాసము—

"ప్రకృతిభావంబుఁ జెందిన ప్రాణములకు
మొదలియంతస్థములు ప్రాసములకు నిలుచు"

అని లక్షణమును చెప్పియున్నాఁడు. దీనిసార్థక్యముగూడ నంతగాఁ గనుపింపదు. సంధివశంబున యకారములోనికి మారినను శబ్దనిష్ఠములైన యకారములైనను ప్రాసస్థానమును జేరుసరికి యద్రూపహల్ సముదాయమున్నదో అయ్యది తప్పక తత్తత్స్థలముల నిలుపవలెనని చెప్పినయప్పకవి యీవిభాగము విశేషమనుచు మరల చేయనేల? ప్రాసనియమమునుబట్టియే గతార్థమగును. ఇట్టిదే సంధిగతప్రాసమొకటి చెప్పియున్నాఁడు. చూడుఁడు—

"సంధిఁ గూడిన వ్రాలు ప్రాసంబులైన
నవియె సంధిగతాఖ్యల నలరుచుండు."

ఈయతి విషయమున "గసడదవాస్స్యుః ప్రథమా మాత్రాత్ త్వాత్మస్మదో ర్న్వైవైతే" అనెడి సూత్రము వలననే గసడదవాదేశము వచ్చుచుండ నిట్టిస్థలముల ప్రాస నియమముచే గతార్థమగుచుండ మరల నిట్టిసంధివచ్చిన వ్రాలతో సిద్ధములు చెల్లుననుట యనవసరము. మఱియు నిద్దానిక్రింద నిచ్చిన యుదాహరణ పద్యముల విశేషము లరయుదము. మొదటిది శల్యపర్వమునందున్నదని

"కవచదోనలును గాండీవము
నవల నిడంబునపు ముందరరదము డిగ మే
ను విడప డిగెయెద శుభకర
మవు నివ్విధము......"

ఈపద్యమును జూపియున్నాఁడు. ఇచ్చట "ఏను + పిదప = ఏనువిదప" అని సంధియగుట చింతామణి సూత్రమునకు విరుద్ధము. 'తాను' 'నేను' పదములపై పరుషములకు గసడదవలు రావలెనుగాన. ఈమతము నీయప్పకవి యంగీకరించినట్టి పంచమాశ్వాసమందలి—

"తాను నేననుపదములలోని ద్రుతము
లడఁగుచో మీఁదఁ బరుషంబు లసురదమన
సరళలిపులగు తద్ద్రుతాక్షరము లర్ధ
బిందులగుఁ దాఁజనంగ నేఁ బిలిచితనఁగ."

ఈపద్యముచే "వాత్మాస్మదో ర్ద్రుతస్య స్యాల్లుక్" అనెడి సూత్రార్థకథనము నస్పష్టమగుచున్నది. అట్టితఱి పైయతిసందర్భమున "ఏనువిదప" అని తన ప్రాసకనుగుణముగా నిచ్చుట సంభవింపదు. "ఏను" అనునది ద్రుతప్రకృతికముగాన దానిపైనున్న పరుషములకు గసడదవ లేట్లు వచ్చును? రెండవలక్ష్యము కళాపూర్ణోదయమునం దీయఁబడినది. ఇందు వకారప్రాసము నిలిపి యొకపాదమున "అహోవుట్టింపదె" అని మాపియున్నాఁడు. ఇచ్చట వకారము చింతామణిరీతిని స్పష్టముగా సిద్ధింపనందున "కాకా సంబోధనే చాపి హ్యావ్యయే కర్మధారయే" ఇత్యాది భూషణాదుల ప్రకారముగా నవ్యయముపైఁగూడ వాదేశము రావచ్చునని గ్రహింపవలెను. మఱియు లకారప్రాసమునకు 'కాకుత్థవిజయము' నందుఁ గల

"మారుండద్భుత...............క
స్మారీ....................రే

ఖాలిప్సన్............ఇం
పారన్..............."

ఈపద్యము నుదాహరించియున్నాఁడు. మఱియు ఎంచలి 'లిప్సన్' అనునది "రభ్ రాభస్యే" అనెడిధాతువు నుండి నిష్పన్నమయినదిగాన దీనికి లక్ష్యమగునని చెప్పి యున్నాఁడు. రభధాతువునుండి పుట్టినదనుటకన్న లభ ధాతునిష్పన్నమే యన్న నయ్యది రలప్రాస మగునని యేమో తా నట్లుచెప్పుట. లేనిచో రభధాతువునుండి లభ పుట్టుటయేల? పాణినీయరీతి "సనిమీమాఘురభలభ శకపతపదామచఇత్" ఇత్యాదులవలన లభధాతువుగూడ నున్నదని తేలుచున్నదిగదా? ఇట్లనుకొన్న నీపద్య మీతనిప్రాసనియమములకు లొంగదు. అట్టితఱి నిద్దానిని లక్ష్యముగా నంగీకరింపక "రేఖారిప్సన్" అనియేయు న్నదనుకొన్న నేచిక్కునుగూడ నుండచేరదు.

౭. అభేసప్రాసము—

ఈప్రాసవిషయముఁ గూర్చి యిచ్చట చెప్పవల సినపని లేదు. దీని చాలవఱకు విషయము యతివిషయ ముననే చెప్పఁబడినది. స్వచ్ఛములైన 'డలళ' లకు ప్రయోగములఁ జూపువఱకును నీప్రాసకల్పన మనవస రము. కవిజనాశ్రయకర్తగూడ రూపాంతరము లున్న పదములే సిద్ధములతోఁ జెల్లునని చెప్పెఁగాని యితరమైన వానివిషయ మేమియుఁ జెప్పియుండలేదు. "తాళము- తాలము; చోడుఁడు-చోళుఁడు; వ్యాలము-వ్యాళము, వ్యాడము" అని స్పష్టముగా పైవిషయమునే యాతఁడు మనమున నిడికొనెనని చెప్పవచ్చును. ప్రకృతమున నప్ప కవియిచ్చిన యుదాహరణస్థపదము లన్నియు ద్వైరూ ప్యము గలవియే. శబ్దరత్నాకరాది గ్రంథములవలన, నస్వాభావికములవలె నున్నను రూపద్వయాశ్రయణము తేలును. కాన నీప్రాస మంతప్రాముఖ్యము కలది కానే రదు.

ఇఁక శబ్దాలంకారప్రాసము లనేకములఁ గలవు. సులభాక్షరమును ప్రాసగాఁ జెప్పిన నయ్యది సుకర ప్రాసమనియు, కఠినములగు నక్షరములుగాని రెండు మూడు హల్లులుగల వర్ణములకు ప్రాసగాని కుప్పరి ప్రాసమనియు, ప్రాసాక్షరము మొదలు రెండువర్ణములు పాదచతుష్టయమందును నిలుప నయ్యది ద్విప్రాస మనియు, ఇట్లే త్రిచతుర్వర్ణముల ప్రాసస్థలముల నిలిపిన నయ్యవి త్రిప్రాసచతుఃప్రాసలనియు, పాదాంత్యాక్షర మజ్ఝల్సాజాత్యము కలిగి హ్రస్వదీర్ఘము లున్నతదక్షి న్నములుగానే నిలిపిన నయ్యది యంత్యప్రాసమనియు చెప్పఁబడినవి. మఱియు నీప్రాసలలోనే కొన్నిటిని అలంకారకర్తలు చెప్పియున్నారు. శబ్దాలంకారప్రాసల నన్నిటిని జెప్పుచు నీక్రిందిమూఁటిని యప్పకవి చెప్పక పోవుటకు కత మేమో? తెలియదు. అయ్యవి మూఁడు విధములు:

i. ఛేకానుప్రాసము:—

ఛేకములనఁగా గృహచరములగు పక్షిమృగాదులని సర్వస్వకారాదులు, "ఛేకాః—విదగ్ధాః తదుపలాలితో ప్రాసః ఛేకానుప్రాసః" అనియు నర్థము చెప్పియు న్నారు. దీనిలక్షణ మేమన:—

"భవే దవ్యవధానేన
ద్వయోర్వ్యంజనయుగ్మయోః,
ఆవృత్తి ర్యత్ర స బుధైః
ఛేకానుప్రాస ఇష్యతే"—ప్రతాపరుద్రీయము.

ఎచ్చట ఇతరపదములతోఁగాని, వర్ణములతోఁ గాని వ్యవధానములేని వ్యంజనముల జంటలయొక్క జంట పునరుక్తమగునో, నద్బ్చ ఛేకమని యర్థము.

ఉదా:—"మహీం మహీంనవిభవే ధత్తే క్షేమంకరే కరే,
రాజన్యజన్యవిజయీ రాజా రాజద్గుణోదయః"

ఇచ్చట మహీంమహీం, కరేకరే, ఇత్యాదిజంటలు అవ్యవధానముగ నుండెనుగాన నిచ్చట ఛేకానుప్రాసమని భావము. నరసభూపాలీయమున నిట్లే చెప్పఁబడినది.

ii. వృత్త్యనుప్రాసము:—ప్రతాపరుద్రీయమున—
"ఏకద్విప్రభృతీనాంతు
వ్యంజనానాం యదా భవేత్,
పునరుక్తి రసౌ నామ
వృత్త్యనుప్రాస ఇష్యతే."

వృత్తులనఁగా వైదర్భీగౌడీయాదులు. అట్టిపట్టుల నుపయోగింపవలసిది గాన నిద్దాని కిట్టినామము గలిగినది. అనఁగా నొకటిగాని, రెండుగాని, మూఁడుగాని, వ్యంజనముల పునరుక్తియే వృత్త్యనుప్రాసమునకు లక్షణము. ఈయావృత్తికి పైదానివలె నవ్యవహిత మనవసరము. ఛేకమున "ద్వయోః" అనుటవలన సంఖ్యానియమమున్నది. ఇం దట్టిది లేదు. దీనికి విద్యానాథుఁడు ఏకాక్షరావృత్తిగల లక్ష్యము నొక్కదానినే యిచ్చియున్నాఁడు. "ఏవ మితరే ద్రష్టవ్యాః" అనియైనను ననియుండలేదు. వ్యాఖ్యానకర్తమాత్రము "ఏవ మన్యే భేదాః సూర్యశతకాదౌ ద్రష్టవ్యాః" అని చెప్పియున్నాఁడు. ఇందేమియు ననుపపత్తిలేదుగాని దీని ననుసరించిన నరసభూపాలీయములో మాత్రము పైదానికి లక్షణము వేరుగా చెప్పఁబడినది.

"ఒక్కవర్ణంబు కడదాఁక నుద్ధరింపఁ
బరగు జృంభణ వృత్త్యను ప్రాస మయ్యె."

అని యేకవ్యంజనావృత్తికే పైపే రంకించినాఁడు. ఇయ్యది అతని స్వతంత్రమో? ప్రతాపరుద్రీయలక్ష్యపద్యమే కారణమో? తెలియదు. ఉభయత్రకుకార ప్రత్యావృత్తలక్ష్యపద్యమే ఈయఁబడినని. కాని చాలవిషయములలో నాతఁడు స్వతంత్రించుటయు కూడఁ గలదు. అప్పకవీయమందు దీనికి అనుప్రాసమని పేరుపెట్టి లక్షణము చెప్పకయే లక్ష్యమేకాక్షరావృత్తి నియమముగా నీయఁబడినది. అనంతుఁడుగూడ నప్పకవినే యనుకరించినాఁడు.

iii. లాటానుప్రాసము:—

లాటదేశీయులగు జనులచే నాదరింపఁబడునదిగాన నిద్దానికీనామము వచ్చినది. ఎట్లన—

"శబ్దార్థయోః పౌనరుక్త్యం
యత్ర తాత్పర్యభేదవత్,
స కావ్యతాత్పర్యవిదాం
లాటానుప్రాస ఇష్యతే."

అనఁగా నెచ్చట శబ్దార్థములకు స్వరూపభేదము లేకయే కేవలతాత్పర్యభేదముతో నావృత్తిఁ జెందునో అచ్చట లాటానుప్రాసమని తాత్పర్యము. తాత్పర్యభేదనియమము పునరుక్తిదోష నివారణార్థము. దీనికి లక్ష్యము:

"గుణాగుణా స్త్రైగణ్యం తే యే రుద్రనృప మ శ్రితాః,
నీత ర్కీతిరసా తస్య లక్ష్మీ ర్లక్ష్మీశ్చ కథ్యతే."

ఇచ్చట "గుణాగుణాః" అనెడి స్థలములలో శబ్దార్థపౌనరుక్త్యమును, ఉత్కర్షయుక్తమైనవని రెండవగుణశబ్దమునకు తాత్పర్యభేదమును స్పష్టములు.

ఇట్లు వృత్త్యప్రాసము లనియు, ప్రాసయతులనియు శబ్దాలంకారప్రాసలనియు మూఁడువిధముల ప్రాసలు తత్తన్మతమున నాయభిప్రాయములు వివరించితిని. కాని లక్షణకర్తలలోఁ గల తప్పు లెన్నుటకు కాదని మనవి చేయుచున్నాను.

---

## ౬. నివేదన—

చావలి బంగారమ్మగారు

ఇది యేమి యని నాథు డిట్లై నను లేప
త్రుళ్లిపడి నే నతని కళ్ల జూచితిని:
పణతి, నా బాహువులు పతికంఠసీమ
బంధించియుండుట బహువింత దోచె.
అతని జూడఁగ సిగ్గు అధికమై తోచె
కథను జెప్పఁగ నాకు కదలదే పెదవి

అదను చిక్కెనదంచు హాస్యమాడగను
వదనంబులో నేను వంచింపబడితి.
నేను గాంచిన వెల్ల నాలోన గలసె
చూచుచుండిన దెల్ల శూన్యమనిపించె
నానాథులో నేను లీనమైనాను
ఆత డొక్కడె నిజం బఖిలంబు కల్ల.

# సంస్కృత నాటకము

అమరవాది హనుమచ్ఛాస్త్రిగారు, యమ్. ఏ.

32

(తరువాయి)

## నాటకముయొక్క లౌకికోత్పత్తివాదము

నాటకోత్పత్తికిఁ గారణము మతేతరముగాని మతముగాదనువారలు కొందఱు గలరు. ౧ గీర్వాణనాటక మదియును పామరజనప్రచారములో నున్న నాట్యక్రీడావిశేషము (Popular mime) వలననే ఉత్పన్నమయినదని వీరల ఆశయము. వీరిఅభిప్రాయమున, గ్రంథికులు, లేక పాఠకు లొనర్చు సంస్కృతకావ్యపాఠములతోపాటు, అక్కాలమున జానపదులలో నొకవిధమయిన యభినయవిశేషము (Mime) ఉండినటు లున్నది. వీరిమతముప్రకార మిట్టిదొకటి యుండుట అంగీకరించినను నీతద్విషయము సవిశేషము తెలిసికొనుట కాధారములు చిక్కుటలేదు. నాటకములో సంస్కృతప్రాకృత భాషలు రెండును బ్రయోగింపఁబడుటయు, నటీసూత్రధారుల ప్రవేశమును నాటకలౌకికోత్పత్తికి నిదానములని వీరిప్రతిపాదనము. కాని యిది నిరాకరణీయమే యగును. ఇదివఱకుఁ జెప్పఁబడినటులు నాటకమునకు శ్రీకృష్ణమతమునకు సంబంధ మండియుండుటచేతనే నాటకములోని ప్రాకృతప్రయోగ మొనఁగూడినది. కావున దీని నాధారముచేసికొని లౌకికోత్పత్తిని నిర్ణయింపఁజూచుట కానిపని. ఇటులనే నటీసూత్రధారుల విషయముకూడను. భరతుని నాట్యశాస్త్ర మాలోచించినను, భాసునినాటకములు పరిశీలించినను, నాటకారంభమున జరుగవలసిన కలాపమునెల్ల శీఘ్రగతి ముగింపఁజేయుకొఱకయియే యీనటీసూత్రధార పాత్రము లుద్దేశింపఁబడి కల్పింపఁబడినవని స్పష్టపడుచున్నది.

నాటకోత్పత్తి శ్రీకృష్ణమతము నాశ్రయించినదని తలంచుటచేతఁ గొందఱు ౨ వంగదేశములోఁ గానవగుచున్న 'యాత్ర,' 'లీల' అనఁబడు ఉత్సవములు. దీనికి మూలభూతములైనవని తలంచుచున్నారు. కాని సూక్ష్మముగ నాలోచించినచో నివి గీర్వాణనాటక వికృతిభూతములే యని తెల్లముకాక మానదు.

పాంచాలిక, పుత్తలిక, దుహితృక ఇత్యాదిపదముల నాధారముచేసికొని మూక (చర్మ) ప్రదర్శనమే నాటకరచనయొక్క ప్రకృతియని ప్రతిపాదింపఁబడుచున్నది. సూత్రధారుఁడు సూత్రముల ధరించువాఁడనియు, స్థాపకుఁడు బొమ్మల నేర్పఱచువాఁడనియు, నిట్లగుటచే మొదట బొమ్మలాటయే ఉత్పన్నమయి క్రమేణ నాటకస్వరూపము సిద్ధించియుండవలయుననియు పైప్రతిపాదకుల నిర్ణయము. బృహత్కథయందు, 'అసురమాయ' యొక్క కూతురు కొన్నిమాటలాడు బొమ్మలతో నాడుకొనుచుండెడిదని కనఁబడుచున్నది. ఇట్లే రాజశేఖరుఁడు తన బాలరామాయణమునందు మాట్లాడు బొమ్మ నొకదానిని సీతగాఁ గల్పించి రావణుని మోసపోఁజేసినాఁడు. కాఁబట్టి యివియన్నియు నాటకము తోలుబొమ్మలాటవలనఁ బుట్టినదనుట కాధారములని తోఁచుచున్నదిగదా?

ఈవాద మంతసహేతుకముగా లేదని ఆధునికతరవిమర్శకులు ఖండించుచున్నారు. సూత్రధారుఁడు నిజముగ సూత్రముల ధరించి బొమ్మల నాడించువాఁడె యగుచో నిఁక స్థాపకుని ప్రమేయ మేమున్నది? ఆలోచించినచో సూత్రధారశబ్దము రంగస్థలనిర్మాణాది కార్యము లొనరించుటకు సమర్థుఁడగువానియందే రూఢముకాని వేఱుకాదు. కాఁబట్టి యీసూత్రధారపదమొక్కటిపట్టుకొని పైవాద మొనర్చుట సాహసికము.

౧ Professors Hillebrandt and Konow & Pischel.

౨ Dr. Belvalkar ముఖ్యుఁడు.

ఈ తోలుబొమ్మలాట నాటకముయొక్క వికృతియే యని సిద్ధాంతము.

ఇటులనే ఛాయానాటకములు గీర్వాణనాటకోత్పత్తికి హేతుభూతములని కొందొక పక్షము గలదు. ఇట్లనుటకు విక్రమోర్వశీయములోని 'ఛాయోర్వశి,' ఉత్తరచరిత్రములోని 'ఛాయాసీత' మున్నగునవియే కారణము. కాని యిదియు సయుక్తికము గాదు. ఏలన, గీర్వాణదృశ్యవాఙ్మయభాగమునఁ ద్రయోదశశతాబ్దము (13th Century A. D.) వఱకును ఛాయానాటకము రచింపఁబడినట్లు తోఁపదు. ఈశతాబ్దిలోనే మొదటి ఛాయానాటకమగు దూతాంగదము రచింపఁబడినది. దీనింబట్టి చూచినచో ఛాయానాటకము వికృతియేగాని ప్రకృతిగాదని తెలియుచున్నది.

౧ ఈరీతిగనే బౌద్ధస్తూపములలోను, బౌద్ధమతగ్రంథములలోను ప్రయుక్తములైన 'రూప,' 'రూపదక్ఖ,' 'లూపదక్ఖ' మున్నగు ప్రాకృతపదములఁ జూచి నాటకమునకుముందు తాదృశరచన యొకటి యేదియో కలదని నిర్ణయింపఁజూచిరిగాని, నిరాలంబమని ఆధునికులద్దాని నాదరించుటలేదు.

## నాటకము: గ్రీకుసంబంధము

గీర్వాణనాటకోత్పత్తికిని గ్రీకుసారస్వతపరిచయమునకు నెట్టిసంబంధ మున్నదో యిఁక విచారించుకొందము. తొలుతనే తెల్పినటులు కొందఱు విమర్శకాగ్రేసరులు ౨ గ్రీకునాటకసంపర్కమే గీర్వాణనాటకోత్పత్తికిఁ గారణమని సాధింపఁజూచుచున్నారు. వా రట్లనుటకు గ్రీకుదేశసంబంధము మన కేదోకొంత యున్నట్టు గోచరించుటయే హేతువు.

ఆదిని గ్రీకుదేశీయులగు నలెగ్జాండరు, నాతని సైనికులును భారతదేశమునకు వచ్చి బాక్ట్రియా, పంజాబు, గుజరాతు మున్నగుభాగముల నాక్రమించి, తమసంబంధమట నెలకొల్పిరి. తదాది ఆగ్రీకుసంబంధము పెరుఁగఁజొచ్చి మినాండరుకాలమున, అనఁగా క్రీ. పూ. ప్రథమశతాబ్దమున నుచ్చస్థితి నందినది. ఇదేసమయమున మనగీర్వాణనాటకోత్పత్తి జరుగుటగూడ తటస్థించినది. దీనంజేసి యవనదేశ సారస్వత ప్రభావము భారతనాటకోత్పత్తిలోఁ బాలుగొనినదనుట కవకాశము ప్రాప్తించినది. క్రీ. పూ. ౩౦౦-౨౬౦ సం. కాలమున మిగులప్రసిద్ధికెక్కిన 'నూతన ఏట్టిక్ కామెడి' (New Attic Comedy) అను గ్రీకునాటకమే గీర్వాణనాటకమునకు మూలమనియు, అలెగ్జాండ్రియాదేశమునకు భారతదేశమునకు నుజ్జయనీద్వారా వర్తకవ్యాపారము సాగుచుండెననియుఁ, దన్మూలమున గ్రీకునాటకలక్షణము మన దేశమునకు సంక్రమించెననియు పైవిమర్శకులు వ్రాయుచున్నారు.

మొదట గ్రీకునాటకమునకును గీర్వాణనాటకమునకును సంబంధము తోఁపించు సామాన్యధర్మములఁ బరికింతము. అవి యివి—[3]

౧. నాటకము నంకములుగ విభజించుట.

౨. రెండు నాటకములందు ననేకముగ నంకసంఖ్య ఒకేతీరుగ నుండుట.

3. అంకాంతమున నెల్లపాత్రల నిష్క్రమణము.

౪. రంగస్థల ప్రసాధనమందిరాదివిషయమునఁ గల సాజాత్యము.

౫. పాత్రముఖతః నూతనపాత్రప్రవేశము సూచించుట.

౬. పాత్రాదుల ప్రవేశనిష్క్రమణములు, జనాంతికాపవారితములు మున్నగు లక్షణములందు ఉభయనాటకములకు సామ్యము.

ఇవియు నింకనిట్టివియుఁ గొన్ని సమానము లయినంతమాత్రాన రెండుదేశములనాటకములకొకసంబంధము

౧ C. Asoka by Vincent Smith.

౨ వీబరు వీరిలోఁ బ్రముఖుఁడు. అతని భారతీయవాఙ్మయచరిత్రము లోని ౨౦౦-వ పేజి చూడుఁడు.

3 Cf. Greek Drama, by Lionel D. Barnett, M. A.

నిర్ణయింపఁబూనుట సాహసము. ఒకే కాలమందు రెండుభిన్న దేశనాటకములం దీమాదిరి లక్షణములు పుట్టవచ్చును. ఇట్టిదెల్లఁ గాకతాళీయముగ సంభవించుచుండును అప్రయత్నోపపన్నములగు నిట్టివానిని బురస్కరించుకొని గ్రీకుగీర్వాణనాటకములకు సంపర్కము నిశ్చయించుట మిగుల అన్యాయ్యము.

ఇఁక యవనికాపదవిషయ మాలోచింతము. జవనికయని దీనికిఁ బ్రాకృతరూపము. రంగస్థలముమీఁద నుండు 'తెర' యనునర్థమున నిది ప్రయోగింపఁబడుచున్నది. ఈ తెరను పర్షియాదేశమునుండి భారతదేశమునకు గ్రీకునౌకలమీఁదఁ గొనిరాఁబడు నొకవిధమగు శణవస్త్రము (canvas) మాదిరిదగు 'చిత్రవస్త్రము' (Tapestry)తోఁ దయారుచేయుచున్నారు. దీనినే పటి (అపటి) యని వ్యవహరించుచున్నారు. ౧ ఈతెర గుడ్డను గ్రీకుల ఓడలమీఁదఁ దెచ్చుటంబట్టియే దీనికి 'యవనిక' అని భారతీయుల వ్యవహారము. కానిచో దీనికిని, 'యవన' శబ్దమునకు వేఱుసంబంధములేదు ఈయవనశబ్దము గ్రీకుదేశీయవాచి యగు అయోనియన్ (Ionian) అను పదమునుండి పరిణమించినదని భాషాశాస్త్రజ్ఞుల నమ్మకము. ఇట్లగుటఁ దొలుదొల్త నీయవనపదము గ్రీకులఁ దెలుపుటకే ఉపయోగింపఁబడినను, రానురాను ఆ గ్రీకులకు సజాతులగు సిరియా (Syria), బాక్ట్రియా (Bactria) మున్నగు దేశవాసులపరముగఁగూడఁ బ్రయోగింపఁబడు చున్నది.

కావున నీయవనికాశబ్దమాత్ర మాధారము చేసికొని గ్రీకు సంపర్కము నిశ్చయింపరాదు. భారతీయనాటకములోని నేపథ్యము (తెర) అనుదానికి సరిసమానమయినది గ్రీకునాటకమున లేనేలేదని కీత్తు పలుకుచున్నాఁడు. ౨

ఇటులనే 'యవనీ' విషయముగూడను. ఈ గ్రీకుదేశపు స్త్రీలను బ్రతీహారిణులుగా నేర్పాటుచేయు నాచారము గ్రీకులవద్దనుండి పుణికిపుచ్చుకొనినారు భారతీయులనువాదము నిరాలంబము. ఏలన గ్రీకులలో నిట్టి ఆచారము కానరాదు. గ్రీకుయువతు లతిసౌందర్యవతు లగుటంజేసి భారతదేశపు రాజకుమారులు వారి సౌందర్యమునకు ముగ్ధులై వారిని బరిగ్రహించియుందురనియు, ధనముకొఱకు నౌకావ్యాపారము నేయుచున్న వర్తకులు గ్రీకుసుందరుల సంపాదించి తెచ్చియిచ్చి, తగినంతలాభము నందసాగియుందురనియు కీత్తుమహాశయుఁడు చేసిన ఊహ సమంజసముగా నున్నది.

ఇఁక నాటకేతివృత్తవిషయమున నుభయదేశ నాటకములకుఁ గల సాదృశ్యము పరామర్శింతము. గీర్వాణ నాటక భేదములలో నొకటియగు 'నాటిక' గ్రీకు దృశ్యవాఙ్మయమునందునైతము గాన్పించుచున్నది. గీర్వాణనాటకమందువలనే అందుఁగూడ, శృంగారమే ప్రధానముగాఁగల యితివృత్తము వర్ణింపఁబడియున్నది. మనమాళవికాగ్నిమిత్రము, రత్నావళి మున్నగు నాటకములతోఁ దుల్యమయినది గ్రీకుదేశీయుల "నూతనకామెడీ" (New comedy).

ఇటులనే అభిజ్ఞానచిహ్నము నొకదానిని గల్పించి, దానిమూలమున నాయికానాయకులకుఁ బునస్సమాగమప్రాప్తి కల్పించుట గ్రీకునాటక సంప్రదాయములలోఁగూడ నొకటియైయున్నట్టు తెలియుచున్నది. కాళిదాసుని శాకుంతలములోని అంగుళీయకము, విక్రమోర్వశీయములోని సంగమమణి, రత్నావళిలోని రత్నహారము మున్నగునవి మొట్టమొదట నష్టములై, అనంతరము పునర్లబ్ధములయి, భార్యాభర్తలకు సమాగమము కల్గించుచున్నవి. ఈరీతిగనే మాళవికాగ్నిమిత్రములోని రాణి యంగుళీయకము మాళవికకారాగారవిముక్తికిని, విక్రమోర్వశీయములోని ఆయుర్బాణము తండ్రికొడుకుల సమావేశమునకును, ముద్రారాక్షసములోని రాక్షసాంగుళీయకము రాక్షసామాత్యుని నిగ్రహమునకును

౧. సామాన్యముగాఁ బటకుటీరమును బ్రయోగము గాంచుచున్నాముగదా. ఇట పటము (వస్త్రవిశేషము)తో నిర్మింపఁబడిన కుటీరమేయని యర్థమనుట మనమందఱ మెఱిఁగినదేకదా.

౨. కీత్తుకృత గీర్వాణనాటకము. pp. ౬౧, ౬౨.

గారణము లగుచున్నవి. వీనియన్నిటికి సరిపోవు కథావృత్తాంతములు గ్రీకునాటకములోను గలవు, చూడుఁడు. మాళవిక చోరహస్తంగత యగుటయు, రత్నావళి సాగరమధ్యమునందుండి సురక్షితయగుటయు- ఇత్యాది విషయములకు సదృశముగా గ్రీకు "రూడెన్సు" (Rudens) నాటకములోని నాయికను దొంగ లెత్తుకొనిపోవుటయు, నెచ్చటనో ఆమెను విక్రయించుటయుఁ, దుట్టతుదకుఁ జిన్ననాఁటి ఆభరణములచే నాయమ మరల గుర్తింపఁబడుటయు వర్ణింపఁబడియున్నది.

ఇదంతయుఁ దిలకించినచో గ్రీకుగీర్వాణసాదృశ్యమునకుఁ గారణ మొకటి యుండవలయునని తోఁచక మానదు. కాని యీ పైవర్ణింపఁబడిన కథాంశములెల్లను, నాటకోత్పత్తి అయిన యెంతకాలమునకో గాని, గీర్వాణ నాటకమునందు స్థాన మాక్రమింపలేదు. వింతయేమన గ్రీకుసంపర్కము నిశ్చయించుటకు వలయురీతిని నాటకోత్పత్తికాలమున, అనఁగా క్రీ. పూ. ప్రథమశతాబ్దమునవో, క్రీ. త. ప్రథమశతాబ్దిలోనో రచితములయిన నాటకములలో నిట్టి సాదృశ్యధర్మము లేవియుఁ గానరావు. కాళిదాసునాటకములందును, గాళిదాసున కనంతర గ్రంథములందును మాత్రము గానవచ్చుచున్నవి.

ఇదిగాక యిట్టిమాదిరికథాంశ మన్యదేశమునుండియే రానక్కరలేదు. భారతీయైతిహాసికములగు భారత రామాయణములందే కానవచ్చుచున్నది. 'నాటిక' లోని కథకు సమానముగ ద్రౌపదీకీచకకథ భారతములో నున్నది. ప్రచ్ఛన్నవేషధారిణియయి ద్రౌపది సుధేష్ణవద్దనుండుటయుఁ, దర్వాత సుధేష్ణ ఆయమను గుర్తించి, నొచ్చుకొని తనతో సమానమయినరీతిగ గౌరవించుట యీతదాత్మకమగు కథాంశము మాళవికాదికథలకు మాతృక యేల కాఁగూడదు? ప్రత్యభిజ్ఞానార్థ మొకచిహ్నముఁ గల్పించుట రామాయణములోని సుగ్రీవవృత్తాంతముననే యున్నది. సీత తనచీరచెఱఁగున నగల ముడివైచి ఋశ్యమూకపర్వతముపైఁ బడవైచుట ప్రత్యభిజ్ఞానార్థము కాదా! సీతాన్వేషణమునిమిత్తమై పోఁబోవు హనుమంతునిచేతికి రాముఁడు తన ఉంగరమిచ్చుట- తిరిగి వచ్చునప్పుడు సీత తనశిఖామణి నొసంగుట-లో నర్థమిదికాదా? కనుక నిట్టిది గ్రీకునుండియే మనకు రానవసరము లేదు. ఇట్టివన్నియుఁ దాత్కాలికసాంఘిక స్థితింబట్టి పరిణమించిన కార్యవిశేషములు. కావుననే భిన్నదేశములందు సైత మిట్టి వకాకలముఁ దటస్థించినవి. ఇదిగాంచియే భరతనాట్యశాస్త్రమునందు చిత్రరచన రేఖారచనలకుఁ బ్రయోజనము గల్పింపఁబడినది.

ఒక విమర్శకుఁడు మృచ్ఛకటికనామకరణమునకు బీజమును గ్రీకుసారస్వతమునం దన్వేషించుచున్నాఁడు. మృచ్ఛకటికమను పేరునకు సమానముగ చిన్నపెట్టె (Cistellaria), చిన్నకుండ (Aularia) అను పేళ్లుగల రెండునాటకముల నుదాహరించుచున్నాఁడు. కాని యియ్యదియుఁ గాకతాళీయమే. మృచ్ఛకటికము భాసుని 'దరిద్రచారుదత్త' నాటకము నాధారముగాఁగొని వ్రాయఁబడినది*. ఇందులో శృంగారాత్మకమగు కథయేగాక, రాజకీయవృత్తాంతము గూడ జతపఱుపఁబడినది. అక్కాలమునందలి పరిస్థితుల ననుసరించి కవి సాంఘికరాజకీయవిశేషముల నిందుఁ జేర్చినాఁడు. దరిద్రచారుదత్తకును దీనికిని భేదము చూపించుటకై మృచ్ఛకటికమను పేరుఁ బెట్టినాఁడు. పైఁబేర్కొన్న గ్రీకునాటకములు కేవలము శృంగారప్రాయములుగాని, అందు రాజకీయవిషయ మేమియుఁ గానరాదు.

గ్రీకునాటకలాక్షణికుఁడగు "ఆరిస్టాటల్" (Aristotle)ను గీర్వాణనాటకలాక్షణికుఁడగు భరతుఁడును ఉభయులుగూడ "ఒక అంకములో నొకనాఁటి కథకంటె నధికమగు కథ ప్రతిపాదింపరాదు" అని యనుశాసించినారు. కాని భారతనాటకరచనలో నీనియమ మెక్కువగఁ బరిపాలింపఁబడక పోవుటచే దీనివలన గ్రీకుసంబంధము నిరూపించుటకుఁ జాలదు.

---

* ఇప్పు డిది వివాదగ్రస్తమయినది. ఆధునికులు మృచ్ఛకటికమునకు వికృతియేగాని 'దరిద్రచారుదత్త' ప్రకృతి గాదనుచున్నారు. ఈవిషయమై వ్యాస మొకటి ప్రకటింపఁదలఁచుచున్నాను.

నాటకములోని పాత్రపోషణ మాధారము చేసుకొని గ్రీకునాటకసంపర్కమును సాధింప నెంచుచున్నారు, కొందఱు విమర్శకులు. విటవిదూషక శకారులను పరిపోయిన పాత్రలె గ్రీకునాటకమున నున్నట్లు వీరు చూపుచున్నారు. ఇది విచారింతము. విటుని సమానుఁడుగా నెంచఁబడుచున్న ఆ గ్రీకుపాత్రవిశేషమందు విటునియందున్న రసికత, హాస్యప్రసంగ సమర్థత మున్నగు ప్రధానలక్షణములు గానరావు. విదూషకుని గ్రీకు నాటకములోని 'బానిస'తోఁ బోల్చుటకంటె అయుక్తము వేరు లేదు. *విదూషకుఁ డెల్లపుడును ప్రాకృతమే మాట్లాడుటయు, జన్మతః బ్రాహ్మణుఁడై యుంటయు నాతనిపాత్రము మతసంబంధోత్పన్నమని చెప్పకయ చెప్పుచున్నది. గ్రీకుబానిసను గీర్వాణబ్రాహ్మణ విదూషకునిగ మార్చుట భారతదేశమునం దెన్నఁడును సంభవింపని పని. ఇఁక శకారునివిషయము: ఈ శకారుఁడు గ్రీకువాఙ్మయమునుండి సంక్రమించినాఁడని తప్పనిసరిగ నంగీకరింపఁజేయునంతటి నిదర్శన మేమియు లేదు. అక్కాలమున భారతసైన్యములయందు ధనైకపరులగు 'భృతకసైనికులు' (Mercenary soldiers) పెక్కుమంది గలరు. ఇట్టివీరిలో నెవ్వరోయొకరు శకారపాత్ర సృష్టికిఁ దగిన స్వరూపలక్షణాదులఁ గలిగియుండవచ్చును. అప్పటి సాంఘిక పరిస్థితుల గమనించినచో, అనేకమంది శకారు లప్పుడు ప్రత్యక్షమైయుండవచ్చునని తోఁచుచున్నది.

నాటకములోని పాత్రలసంఖ్యావిషయమాలోచించినచో రెండునాటకములకుఁ గలభేదము గోచరించుచున్నది. ప్రాచీనతమనాటకకర్తగా నెంచఁబడు భాసుని నాటకములలోమాత్రమే కాక, మృచ్ఛకటికములోఁగూడ సంఖ్యాబాహుళ్యము గానవచ్చుచున్నది. మృచ్ఛకటికమున ౨౯ మందియు, కాళిదాసుని శాకుంతలమున 30 మందియు, ముద్రారాక్షసమున ౨౪ మందియుఁ గానవచ్చుచున్నారు.

ఇట్లు విచారించుటవలనఁ దేలిన విషయము గ్రీకు నాటకమునకు గీర్వాణనాటకోత్పత్తికి నేమియు సంబంధము లేదని. కాని నాటకోత్పత్తికిఁ గారణము గాకపోయినను, నాటకరచనాభివృద్ధికిఁ గారణము కాకపోలేదు. భారతదేశమునకేతెంచిన గ్రీకు లిచట కొంతకాలము నివసించినపుడు నాటకశాలల నిర్మించి, తమ నాటక ప్రదర్శన నైపుణ్యమును దేశీయులకుఁ జూపిరి. అటుపిమ్మట భారతీయులు ప్రోత్సాహము గాంచి నాటకరచన కెక్కువ కడంగిరనుట సత్యదూరము కాదు.

## నాటకము: శకులు

గ్రీకుల సంపర్కము గీర్వాణనాటకోత్పత్తికి హేతుభూతమయినదన్నవిధముననే, శకులు, క్షత్రపులు మున్నగువారల సంబంధము నాటకోత్పత్తిని గల్గించినదనియును గొందఱు ప్రతిపాదించుచున్నారు. వీరి నాఁటివఱకు కేవలము శిష్టజనవ్యవహారభాషగా నున్న సంస్కృత మీశకుల ప్రాభవము ప్రాపించినతోడనే గ్రాంథికభాషగా నొనర్పఁబడినది. కనుకనే క్రీ. శ. ౧౫౦-వ సంవత్సరమున రచింపఁబడిన 'గిర్నారు' శాసనములు సంస్కృతములో లిఖింపఁబడియున్నవి.

నాటకోత్పత్తికి శకులసంబంధము తెలుపుటకొఱకె శకారపాత్రము గీర్వాణ నాటకములోఁ గల్పింపఁబడినదని పైవిమర్శకుల అభిప్రాయము. ఇదిగాక శకసంబంధము నాట్యశాస్త్రములోని కొన్నిపారిభాషిక పదములవలన గ్రహింపవచ్చునని చెప్పఁబడుచున్నది. రుద్రదామప్రభువు తన పెద్దలగూర్చి పలుకునప్పుడు 'స్వామి', 'సుగృహీతనామ' ఇత్యాదిపదముల నుపయోగించియున్నాఁడు. ఈస్వామిశబ్దము "నహపాణ" యనువంశావళియందుఁ గానుపించుచున్నది. ఇటులనే క్రీ. శ. ౨౦౫-వ సంవత్సరముప్రాంతమువాఁడగు రుద్రసేనుఁడు పూర్వులగుఱించి ప్రస్తావించుచు 'భద్రముఖ' అని ప్రయోగించియున్నాఁడు. ఇదిగాక భరతశాస్త్ర

---

* "వామనోదంతురః కుబ్జో ద్విజన్మా వికృతాననః,
ఖలతిః పింగళాక్షః సవిధేయో విదూషకః"

—నాట్యశాస్త్రము.

ములోఁ గాన్పించు "రాష్ట్రియ" పదము రుద్రదామునిచేఁ జంద్రగుప్తచక్రవర్తియొక్క సేనాపతులలో నొకఁడగు పుష్యగుప్తునికి వాడఁబడియున్నది. ఈ 'రాష్ట్రియ' పదము మృచ్ఛకటికములోను, శాకుంతలములోను రాజస్యాలకార్థమునఁ బ్రయోగింపఁబడినది. అమరసింహుఁడుగూడ నిదేయర్థమును జెప్పినాఁడు. దీనికిఁ దోడుగ మాళవేశ్వరులయిన పశ్చిమక్షత్రపుల ముఖ్యపట్టణమగు ఉజ్జయనీనగరము చుట్టుప్రక్కల నాటకముయొక్క ప్రధాన ప్రాకృత భాషలగు 'శౌరసేని', 'మాగధి', 'మహారాష్ట్రి'లు ప్రచారములో నుండియుండుటం బట్టి నాటకమునకు జన్మస్థాన మదియేయని నిరూపింపఁబడుచున్నది.

'లెవీ' పండితుఁ డొనర్చిన యీవాదమంతయు మృచ్ఛకటికముయొక్క ప్రాక్కాలికతానిర్ణయము మీఁద నాధారపడియున్నది. ఇటీవల మృచ్ఛకటికముకంటె ప్రాక్తనములగు నశ్వఘోష నాటకములు, భాస నాటకములు బయటకు వచ్చుటచే నాతని వాదమంతయు విడిపోవుచున్నది. పై నాటకములలో నెటఁగాని మహారాష్ట్రి కానరామిని బ్రాయికముగా సంభాషణ భాష శౌరసేనికావుటం జేసియు, క్రీ.శ. ప్రథమశతాబ్దమువఱకును శకక్షత్రపులు మథురానగరమునఁ బాలకులగుటం బట్టియు నాటకోత్పత్తిస్థానము మథురయేకాని ఉజ్జయని కాదనియు, నీనాటకము ప్రథమశతకమధ్యకాలమున నారంభ మయియుండవచ్చుననియు మఱియొక విమర్శకుని ప్రతివాదము. ౧

ఈరెండు వాదములును నిరాధారములే. అశ్వఘోషుని నాటకములు లభించుటయే యిందులకు దార్కాణము. కనిష్కునాస్థానములో నున్న వాఁడగు నశ్వఘోషుఁడు బౌద్ధుఁడయ్యును బ్రాకృతము వదలి సంస్కృతమునసే నాటకరచన యొనర్చుట చూడ, నాటకోత్పత్తి అంతకుమున్నే సంభవించినటుల స్పష్టమగుచున్నది. కనిష్కునికాలమునుగూర్చి జాగ్రత్తగ విచారించినచో నా రాజు క్రీస్తుశకమునకుఁ బూర్వశతాబ్దముననో, పరశతాబ్దముననో ఉండినట్లు తెలియుచున్నది. దీనిని బట్టి చూచినచో రుద్రదామునికంటె నూఱు సంవత్సరములకుఁ బూర్వమే కనిష్కుఁడు జీవించినటులు నిర్ధారిత మగుచున్నది. ఇట్లగుటచే గీర్వాణనాటకోత్పత్తికి రుద్రదామాదిక్షత్రపప్రభువులు కారకులై వర్తిల్లిరనుట సహేతుకము కాఁజాలదు. ఇఁక భరతుఁడు ప్రయోగించిన పారిభాషికశబ్దములవిమయ మాలోచింపఁ దగియున్నది. రుద్రదాముని శాసనములోనున్న రాష్ట్రియ శబ్దమునకు రాజస్యాలుఁడే అర్థమని నిష్కర్షించుటకు వలనుగాకున్నది. ౨ 'స్వామిన్' అని రాజును సంబోధించు నాచారముగూడ నర్వాచీననాటకలక్షణ గ్రంథములగు దశరూపకసాహిత్యదర్పణాదులలో నిర్వచింపఁబడినను, 3 ఇంతమాత్రనే ఇయ్యది భారతీయనాట్యశాస్త్రమునుండి గ్రహింపఁబడినదని నిర్ణయించుట సుసాధము. ఇట్లే 'సుగృహీతనామ', 'భద్రముఖ' శబ్దములుగూడ ఆకాలపువ్యవహారమున నేయర్థమున వాడఁబడినవో అదేయర్థమున భరతుఁడుగూడ చెప్పినాఁడనుట ప్రామాదికము. కావున నీశబ్దములు తాత్కాలిక రాజపురుష వ్యవహారభాషనుండి కైకొనఁబడినవనుట సమయుక్తికముగఁ దోఁచుట లేదు.

ఈ పైఁదెల్పిన రెండువాదములు ప్రతిపాదింపఁబడుటకు ముఖ్యకారణము నాటకము మొట్టమొదట బ్రాకృతోత్పన్నమయి, అనంతరము సంస్కృతమునం దుద్భవిల్లిన దనునభిప్రాయమే. ఇయ్యది సత్యదూరము, నిరాకరణీయము నగు నాలోచన. మహాభాష్యమువలనఁ బ్రాకృతకావ్యరచనగూర్చి యేమియుఁ దెలియుట లేదు. కాని సంస్కృతకావ్యరచన గుఱించి తెలియుచున్నది. ఇది గాక, నాటక మొకవంక వైదిక క్రియాసంబంధమువలనను, మఱియొకవంక గ్రంథికు లొనర్చు కావ్యపారాయణవలనను (Epic recitals) ఉత్పన్నమయినదని

౧. Konow's Indian Drama

౨. కీత్తుసంస్కృతనాటకము P. ౭౧

3. "రాజాస్వామీతి దేవేతి భృత్యైర్భట్టేతిచాధమైః" సాహిత్యదర్పణము. ౬-పరి-౪౨౪. "దేవస్వామీతినృపతిః భృత్యైః.............." దశరూపకము II-౧౦3.

యిదివఱకే నిరూపింపఁబడినది. పతంజలికాలమున సంస్కృతకావ్య పాఠకులను గ్రంథికు లున్నారని తెలియుచున్నది. కాని ప్రాకృతవిషయమున నట్టిదేదియుఁ బొడఁగట్టదు. కాఁబట్టి నాటకము తొల్త సంస్కృతమునందే ఉత్పన్నమయ్యెనుగాని ప్రాకృతమునందుఁగాదని ముక్తకంఠముగఁ జెప్పవచ్చును. పైప్రతిపాదనములు రెండును దుర్బలము లయిపోయినవి. ఇట్లు గీర్వాణనాటకోత్పత్తి విషయమున శకులు చేసిన దేమియులేదని తేలుచున్నను క్షత్రపరాజ్యపాలనవలన గీర్వాణనాటకమునకుఁ గొంతఉపకృతి జరుగకపోలేదు. గ్రీకుపరిచయము నాటకాభివృద్ధి కెట్లు తోడ్పడినదో అంతకంటె నెక్కువగ క్షత్రపరాజన్యుల గీర్వాణభాషాపోషణము నాటకపురోవృద్ధికిఁ జేయూఁత నొసంగినది.

## సా రాం శ ము

ఇప్పటికిఁ దేలినవిషయ మేమి? ఇంతటివిచారణమూలమున లభించిన ఫలిత మేమి? ఈ ప్రశ్నకు సమాధానము రెండుమాటలే. భారతీయనాటకము స్వతంత్రముగా నుత్పన్నమయినది గాని అన్యదేశసంబంధముచేఁగా లేదు. ఈ నాటకోత్పత్తికి మతవిషయక క్రియాకలాపము, అకాలమునఁ బ్రచారములో నుండియున్న 'కావ్యపాఠములు' అనునీరెండును గారణములు. ఉత్సవాదులయందుఁ బ్రవర్తిల్లుచుండిన యేతాదృశనాటకప్రదర్శనములు మతవిషయకమయినవియు, మతేతరవస్తుప్రతిపాదకములు నైనవియుఁగా నున్నవి. ఇట్టి ప్రదర్శనములు జరుగుసందర్భములు - అశ్వమేధపితృమేధాదులు. నాటకేతివృత్తమంతయు అప్పు డనేకపాటలు, పదములరూపముగాఁ బామరజన ప్రచారములో నున్న గాథావిశేషములుగాని, లేక భారతాద్యైతిహాసికభాగములుగాని అయియున్నది. ఈ గాథలను, ఐతిహాసికములను జనులయెదుట గ్రంథికులు (కథకులు) పఠించుట వైదికయుగమునుండియే అనుస్యూతముగ వచ్చుచున్నది. నాటకములోని పాత్రలయొక్క ఉచ్చైర్నీచతలఁ బట్టి సంస్కృతభాషయో, అప్పటివ్యావహారికప్రాకృతమో ఉపయోగింపఁబడుచుండెడిది.



నిత్యశంకితునకు తుదకు నిదురపట్టినది



పాత్రలు:

శర్మ (౩౨)
కమల (౨౫)
చిట్టి (౪)
నరసింహం (౨౧)

౧౯-౩౧. కాకినాడ. గాంధీనగరం. రాత్రి.

[ఓ ఇంటి గదిలో మంచంవేసి ఉంది. మంచంకేసి స్టూలు పైని మందు సీసా, వెండి గిన్నె ఉన్నవి. గుమ్మంలోంచి రోడ్డూ, రోడ్డు నానుకుని పహరా కనిపిస్తూన్నయి. గుమ్మంకేసి ఓపడకకుర్చీ. గోడకి ఓ ఫోటో, ఓ కాలెండరూ ఉన్నవి.

చిట్టి మంచంపైని పడుకున్నాడు. మంచం ఆనుకొని చాపవేసుకుని కూచుంది కమల. వీధికేసి చూస్తూంది ఏకదృష్టితో. గుమ్మంలోంచి నరసింహం ప్రవేశిస్తూన్నాడు.]

నరసింహం

ఎలా ఉంది అక్కయ్యా చిట్టికి?

కమల

(మంచంకేసి చూస్తూ) అల్లానే పడుకున్నాడురా, నాన్న, పొద్దుటినుంచీ.

నరసింహం

(మంచంపైని కూచుని) ఎంత చిక్కిపోయేడు! ఇలా ఉండేవాడా ఎప్పుడేనా? శల్యం అయిపోయేడుకాదూ?

కమల

కాస్త ఆహారమేనా వెళితేనా? బొత్తిగా పాలు తాగడంకూడా మానివేశాడురా, నాన్న. ఎప్పుడూ మందే. ఎంతమందని! (చిట్టిపైని చెయివేస్తూ) చిట్టినాన్నకి ఎప్పుడు నయమవుతుందో!

(నరసింహం చిట్టి ముంగుర్లని సవరిస్తూంటాడు.)

కమల

(చిట్టికేసి చూస్తూ) మొన్నని, జ్వరం తగ్గిందికాదూ? నాకేసి ఊక్షే చూస్తూ 'అమ్మా, మన పాపాయి ఎక్కడికెళ్లిందే' అన్నాడు. 'దేవుడు తీసికెళ్లిపోయేడు నాన్నా' అన్నాన్రా. (తల వంచుకుని చిట్టికాళ్లనిరాస్తూ) 'అమ్మా, దేవుడికి ఇల్లెక్కడా?' అన్నాడు పిచ్చినాన్న. 'ఆకాశంలో ఉంటాడు నాన్నా' అన్నాన్రా. 'మన పాపాయి దగ్గరికి ఎప్పుడు వెళదామే' అన్నాడు మళ్లీ. 'పడుకో నాన్నా మాట్లాడక' అన్నాను ఏడుస్తూ. (గద్గదికతో) 'దేవుడిదగ్గరికి నేనూ వెళతానే' అన్నాడు.

నరసింహం

(కమల చెయిపట్టుకుని) ఏవిటక్కయ్యా!

కమల

మళ్లీ తిరుగుతాడ్రా లేచి, నాన్న, వలుగుల్లో?

నరసింహం

ఏం తిరక్క? మందిస్తూన్నాంగాదూ? నయంగా కేం జేస్తుంది?

(కమల కన్నీరు కారుస్తూంది.)

నరసింహం

(మృదువుగా) ఇలా ఏడుస్తారమ్మా?

(కమల కళ్లని తుడుచుకుంటూంది కొంగుతో.)

నరసింహం

(కాసేపుండి) అక్కయ్యా, అన్నం తిన లేదూ?

(కమల వీధికేసి చూస్తూంది)

నరసింహం

చూశేవా, ౧౦ ఘంటలు దాటుతూంది. ఇలా ఎన్నాళ్లనీ?

(చలనం లేదు కమల్లో)

నరసింహం

ఈరోజూ రాలేదు కాదూ బావ? (నిట్టూర్పు విడుస్తూ) ఎంత మారిపోయేడూ!

(కమల చిట్టి బట్టల్ని సవరిస్తూంది)

నరసింహం

అక్కయ్యా, బావే కాదూ ఆ ఫోటో?

క మ ల

ఆ.

నరసింహం

(గోడకేసి వెళ్లి ఫోటో తీసుకొస్తూ) ఏమే౯ా పోలిక ఉందీ?

(కమల చేతికి ఫోటో అందిస్తాడు. ఫోటో తీసుకుని తదేకదృష్టితో చూస్తూంటుంది.)

నరసింహం

ఎక్కడ తీశారు ఫోటోనీ?

క మ ల

చెన్నపట్నంలో తీయించుకున్నారు.

నరసింహం

ఆరోజుల్లో అనుకున్నామూ, ఇలా అవుతాడనీ? ఎలా ఉండేవాడు! దసరాకి ఇంటికి వస్తూంటే......

(కమల ఫోటోని మంచంపైని ఉంచి వీధికేసి చూస్తూంది)

నరసింహం

(ఫోటో తీసుకుని చూస్తూ) చెల్లి ఉంది కాదూ, బావవచ్చినప్పుడూ?

క మ ల

ఆ.

నరసింహం

లలితా, నేనూ, ప్రాణం తినేశేవాళ్లమి. ఒక్కమాటయినా అనేవాడు కాదు, పాపం.

(కమల నిట్టూర్పు విడుస్తుంది.)

నరసింహం

వాళ్లుమట్టుకు అనుకున్నారూ? బావే కాదూ ఉద్ధరిస్తాడని వాళ్లు అనుకుంట పాపం. ఇంతమార్పు ఎలావచ్చిందో! ఒక్కక్షణమేనా ఉండేవాడా నిన్నొదిలిపెట్టి? బుధవారం కాదూ బావవెళత?

(కమల తలవంచుకుంది.)

నరసింహం

అక్కయ్యా!

(తల ఎత్తి దీనంగా చూస్తూంది, కమల, నరసింహంకేసి.)

నరసింహం

ఎప్పుడూ బావతో అనలేదూ నువ్వు ఘట్టిగా?

(కమల మాటాడదు.)

నరసింహం

ఇంత అమాయకురాలివైతే ఎలా గమ్మా?...ఇల్లు గుల్ల చేస్తున్నాడా? నీసొమ్ము లన్నీ తగలేశాడా?

(కమల చెరగు సవరించుకుంటూంది.)

నరసింహం

(కష్టంతో) అదీ లేకుండా చేశాడూ? ఎన్ని పెడుతున్నాడు దాని మొహాన్ని!

క మ ల

(మెల్లిగా) మనకేం తెలుసు నాన్నా?

నరసింహం

అంతా అనుకోడంలేదూ? రహస్యంగా ఉంచాడాఏం? ఆశ్చర్యపోతూన్నారు అందరూ. ఎన్నాళ్లనీ?

(కమల రెప్ప వాల్చకుండా చూస్తూంది. ముఖం నిర్జీవం అయింది.)

నరసింహం

సంసారం అక్కర్లేదూ? మనలోకమే లేకుండా పోతూంది మరీనూ. జ్వరం వచ్చిన పిల్లాణ్ణి తొంగిచూస్తూన్నాడూ? (గద్గదికతో) దిక్కులేనివాళ్లని చేసిపోయారు మనల్ని.

(నరసింహం స్వరం క్షీణిస్తూంది. కన్నీరు తిరుగుతూన్నాయి.)

క మ ల

నాన్నా!

నరసింహం

(దృఢపరచుకుని) ఏదో తేలాలి. ఎన్నాళ్లు ఊరుకుంటారు?

క మ ల

(నరసింహంచెయిపట్టుకుని) తమ్ముడూ!

(నరసింహం కమలకేసి చూస్తూన్నాడు నిర్మలంగా.)

క మ ల

(కంపిస్తూ) బావని అడగవుకాదూ? (నరసింహం రెండుచేతుల్నీ పట్టుకుని)నాతోడేం నువ్వు బావ నడిగితే.

(నరసింహం కమలచేతులపైన తల వాలుస్తున్నాడు. భావోద్రేకంచేత ఎగిసిపోతూంది కమలరొమ్ము. నరసింహంతలని చేత్తో దువ్వుతూంది కమల.)

నరసింహం

(కాస్సేపుండి) అక్కయ్యా, చిట్టికి ఎప్పుడిచ్చావు మందు?

కమల

మొన్నని ఇచ్చారా కృష్ణమూర్తిగారు ......(మెల్లిగా) ప్రొద్దుటితో అయిపోయింది.

నరసింహం

(ఉలికిపడుతూ) మళ్లీ తీసుకురాలేదూ? (లేస్తూ) అక్కయ్యా, డాక్టరుగార్ని ఓమారు చూడమన్నా?

కమల

౧౧-ఘంటలు దాటుతూంది కాదురా?

నరసింహం

ఇప్పుడే వస్తాను కాదూ? (మృదువుగా) అన్నం తినవు అక్కయ్యా.

(కమల దీనంగా చూస్తూంది. నరసింహం కాసేపు నుంచుని వెళ్లిపోతాడు. నరసింహంకేసి చూస్తూంది కనుమేరవరకూ. తర్వాత చిట్టికేసి చూస్తూంది. శ్వాస దీర్ఘంగా వస్తూంది చిట్టికి. కాళ్లు కదుపుతూన్నాడు. చేతులు విరుస్తూ 'అమ్మా, అమ్మా' అంటున్నాడు. కమల ఉలికిపడుతూంది.)

కమల

(ఉద్రేకంతో) నా చిట్టినాన్నలు లేచారా? నాకన్నతండ్రులు? ఏం నాన్నా?

(చిట్టి కళ్లు తెరచి కమలకేసి చూస్తూన్నాడు.)

చిట్టి

(హీనస్వరంతో) అమ్మా, అమ్మా, మంచీళ్లియ్యవ్?

కమల

(గ్లాసు పుచ్చుకుని) నాన్నా, కాస్త పాలు తాగవూ?

(చిట్టి గ్లాసుని చేత్తో తోస్తూన్నాడు.)

కమల

నాతండ్రివి కాదూ. తాగాలి నాన్నా. చూడూ ఈ కాస్తే.

(చిట్టి మెల్లిగా తాగుతూన్నాడు పాలని మందల్లే.)

కమల

నాన్నేం నీకు మంచి సూటూ, మాంచి బూడ్సులూ—

చిట్టి

మంచి స్టాకింగ్సూ.

కమల

ఊఁ. మంచి స్టాకింగ్సూ, అన్నీ తెస్తారు నాన్నా.

చిట్టి

ఎప్పుడూ?

కమల

ఇప్పుడే. నువ్వు మంచినాన్నల్లే పాలూ, మందూ తాగుతావుకాదూ?

చిట్టి

ఆ. పాలూ, మందూ తాగితే-జ్వరం-త్వరగా-నయమవుతుంది.

కమల

(చిట్టిచేతుల్ని ముద్దు పెట్టుకుంటూ) అవును, నాన్నా.

(చిట్టి కమల చేతుల్ని రాస్తూ పడుకున్నాడు. కమల జో కొడుతూంది. చిట్టి మొహాన్ని దీపం వెలుతుర్లో చూస్తూంది.)

కమల

(అస్పష్టంగా) ఎంత చిక్కిపోయేడు నాన్న!

(కమల వీధికేసి చూస్తూ కూచుంది. కాళ్లచప్పుడు వినపడుతూంది. మెల్లిగా లేచి గుమ్మంకేసి వెళుతూంది. శర్మ వస్తూన్నాడు. కమల లోపలికెళ్లి కాళ్లుకడుక్కోటానికి నీళ్లు తెచ్చి పెడుతుంది. కాళ్లు కడుక్కుని లోపలికొచ్చి పడకకుర్చీపైని కోటు పడవేస్తాడు.)

కమల

(మెల్లిగా) స్నానం చెయ్యరూ? నీళ్లు కాచి ఉంచేను.

శర్మ

(చొక్కా తీస్తూ) వడ్డించెయ్యి.

(కమల లోపలికెళ్లి కంచమూ, కూజాతో నీళ్లూ ఉంచుతూంది. సెమ్మెలో వత్తిని వెలిగించి చిట్టిదగ్గరనే ఉంచి, లైటు తీసికెళ్లిపోయి కంచం దగ్గర ఉంచుతూంది. శర్మ పచారు చేస్తూన్నాడు.)

కమల

(అన్నం పెడుతూ) వడ్డిస్తూన్నాను రారూ?

శర్మ

ఆ. (కూచుని అన్నం కలుపుతూ) చిట్టికి ఎలా ఉందీ?

కమల

(నెయ్యి వేస్తూ) ఇందాకే పట్టేసు కాశిని పాలు. ఇప్పుడే పడుకున్నాడు నాన్న.

(శర్మ అన్నం తింటూన్నాడు. దీపంకేసి చూస్తూంది కమల. చిట్టి కళ్లు తెరచి గుమ్మంకేసి చూస్తాడు. 'అమ్మా,' 'అమ్మా' అంటూన్నాడు తర్వాత.)

శర్మ

చిట్టి పిలుస్తూన్నాడు చూడు.

కమల

ఓయ్! వస్తున్నా న్నాన్నా.

(కమల చిట్టిదగ్గిరకు వెళుతుంది.)

కమల

(చిట్టిచెయి చూస్తూ) ఏం నాన్నా?

చిట్టి

అమ్మా, నువ్వేం జేస్తున్నావ్?

కమల

ఎందుకూ?

చిట్టి

నువ్వు నాదగ్గిరే కూచో. (కమలచెయి పట్టుకుని) ఎక్కడికీ వెళ్లకు.

కమల

(మెల్లిగా చెయి వదిలించుకుంటూ) నాన్నకి అన్నం పెట్టి వస్తానేం. తండ్రివి కావూ? పడుకో.

చిట్టి

(ఉత్సాహంతో) నాన్నేడీ? నాన్నా, నాన్నా. అమ్మా, నా స్టాకింగ్సూ—

కమల

పట్టుకొస్తారు పడుకో నాన్నా. (లక్క-గుర్రం ఇస్తూ) ఈ గుర్రం చూడూ. ఎంత బావుందో!

చిట్టి

(తీసుకుని) కాళ్లూ, నోరూ—

(కమల మెల్లిగా శర్మదగ్గిర కెళుతూంది.)

కమల

చారు వేసుకోరూ?

శర్మ

జ్వరం కాస్తూందా?

కమల

(మజ్జిగ వేస్తూ) ఆ.

(శర్మ చిట్టికేసి చూస్తూ తింటూన్నాడు. కమల తమలపాకులకి సున్నం రాస్తూంది. చిట్టి గుర్రాన్ని పడవేసి దీపంకేసి చూస్తూన్నాడు.)

చిట్టి

అమ్మా, అమ్మా.

(శర్మ చెయి కడుక్కుంటూన్నాడు)

కమల

పడుకో నాన్నా. వస్తూన్నాను కాదూ?

(కమల శర్మకి తమలపాకులు అందిస్తూంది. చొక్కా వేసుకుని అందుకుంటాడు శర్మ. పడకకుర్చీపైని కోటును తీసుకుంటూ అబ్బాయికేసి ఒక్కమారు చూస్తాడు. తర్వాత వీధికేసి చూస్తూన్నాడు ప్రతిమల్లే.)

చిట్టి

(శర్మను చూస్తూ) నాన్నా, నాన్నా.

కమల

(దీనంగా) అబ్బాయి పిలుస్తున్నాడండీ.

(శర్మ మెల్లిగా మంచంకేసి వెళుతూన్నాడు. కమల లైటుని చిట్టి దగ్గిరగా పెడుతూంది.)

చిట్టి

నాన్నా.

శర్మ

(చిట్టి చెయి చూస్తూ) జ్వరం కాస్తూంది మళ్లీ.

కమల

(చిట్టితలని చేత్తో తాకుతూ) మా నాన్నే.

చిట్టి

(శర్మచెయి పట్టుకుని) నాన్నా, నాన్నా.

శర్మ

ఏం నాన్నా?

చిట్టి

(కళ్లు మూసుకుంటూ) నాన్నా, నాన్నా.

(శర్మ కమల కేసి చూస్తూన్నాడు. కన్నీరు తిరుగుతూన్నాయి కమల కళ్లల్లో. తల వాలుస్తూన్నాడు శర్మ.)

కమల

(శర్మమోకాళ్లపైని చేతులు వేసి దీనంగా చూస్తూ) వెళ్లిపోరు కారూ?

(శర్మ తలఎత్తి నిశ్చలంగా చూస్తూన్నాడు కమలకేసి)

కమల

నాన్నని వదిలిపెట్టి ?—

(ఉద్రేకం చాత శర్మ నడుముని ఘట్టిగా పట్టుకుని ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తూంది. ఎగిసిపోతూన్నాయి పక్కలు అలలల్లే.)

శర్మ

(కమల చెక్కిళ్లని ఒత్తుతూ) చూడూ, అన్నం తినవూ వెళ్లి ?

(కమల చెక్కిళ్లపైని కన్నీరు ధారలు కడుతూన్నయి. ముఖం ఎర్ర బారింది.)

కమల

(దీనంగా శర్మకేసి చూస్తూ) తినాలని లేదండీ. వికారపెడుతూంది.

శర్మ

(కమలముఖాన్ని మెల్లిగా ఎత్తుతూ) ఎల్లాగమరీ? ఎంత చిక్కిపొయ్యావో చూడూ!

(కమల శర్మకేసి నిర్మలంగా చూస్తూంది.)

శర్మ

ఇదుగో. నాన్న దగ్గిర ఉంటాను కాదూ. వెళ్లు మరీ.

కమల

నిజంగానే తినాల్ని లేదండీ. మీతోడు.

(ఇద్దరూ చిట్టికేసి చూస్తూన్నారు. పెదవుల్ని కదుపుతూన్నాడు చిట్టి.)

శర్మ

మందిచ్చావూ ?

కమల

అబ్బాయి వెళ్లేడు మందుకోసం. డాక్టరు గార్ని కూడా తీసుకువస్తా నన్నాడు.

శర్మ

ఇంకా రాలేదేం నరసింహం ?

(దీపం క్షీణిస్తూంది. చిట్టి కాళ్లూ, చేతులూ వంకరలు పోతున్నాయి. పళ్లు కొరుకుతున్నాడు.)

కమల

(చిట్టిచేతులు పట్టుకుని గద్గదికతో) అలా అంటున్నాడేం ?

శర్మ

(వీధికేసి చూస్తూ) ఏడీ నరసింహం ?

(కమల వెర్రిదానల్లే చిట్టిని పట్టుకుని ఏడుస్తూంది. నిలువునే నిలిచింది చిట్టిచూపు. గుమ్మంలోంచి వస్తూన్నాడు నరసింహం. గబగబా వెళ్లింది నరసింహంకేసి కమల.)

నరసింహం

(ఆతురతతో) ఎలా ఉన్నాడు చిట్టి ?

కమల

(నిర్జీవంగా) ఏరీ డాక్టరారు ?

నరసింహం

(అస్పష్టంగా) పిఠాపురం వెళ్లారుట. ప్రొద్దుటిదాకా రారన్నారు. ఎలా ఉంది అక్కయ్యా, చిట్టికి ?

(వాళ్లకేసి వస్తూన్నాడు శర్మ. అర్థవిహీనంగా చూస్తున్నాడు. పెదవులు కంపిస్తూన్నయి.)

రవిజుని పేరు నాపిటికి రక్తపుగుండెలలోన పౌరుష
చ్ఛవుల నలంకరించినది స్వాతిశయంబునఁ బొంగిపోవు నా
కవనము, తెల్గుజోదులముఖంబున గీతిక లాలపించి పె
ల్లవమతిచేఁ గృశించు కవులాస్తతనూభవు నూఱడించుతన్.

*           *           *           *           *

నీపేరెత్తిన నామనఃకుహర మంధీభూతమై క్షుబ్ధమై
వాపోవున్ దనువెల్లఁ గంచుకితమై వ్యాలోలమై పొల్చుఁ గ
ర్ణా! పౌరందరుఁ డేయుబాణముల యన్యాయ్యస్వనుల్ నాచెవిన్
రాపాడున్ గఠినంబులై మన విచిత్రస్నేహ మూహించితే!

రవిజా! భారతసంహితన్ జదువ నారంభించి, నీతోడ నా
హవమున్ జొచ్చిన నామనం బవలిదృశ్యంబున్ సమీక్షించి యో
రువలే దీవు గతించినన్ దగినవీరుం డెవ్వఁ డుండున్ గథా
సవ మంతన్ జవి లేనిదై పొడమి, యుత్సాహంబుఁ బోకార్చెడిన్.

దెసలం బుక్కిటఁ బట్టుకొండొకమహాతేజస్సమూహంబు, నీ
లసమానాకృతినుండి లేచి రవి నాలంబించుచో, వైరిమా
నసము ల్నీకు నమస్కరించినవి, కర్ణా! వీరచూడామణీ!
అసువు ల్వోయిన నేమి? నీయశము బ్రహ్మాండంబు నోలార్చెడిన్.

ఒక్కొకబాణఘాతమున కుట్టుట లూఁగిన పార్థు తేరిపై
టెక్కెమునందుఁ గొందలపడెన్ గపిరాజు దినేశపుత్ర! నీ
చిక్కనిబాహుసారము రచింపకపోవఁడు సూర్యశిష్యుఁడై
నిక్కము వల్కువాఁ డతఁ డనింద్యచరిత్రుఁడు, సత్కవీంద్రుఁడున్.

# తాను వలచినది రంభ

కొడవటిగంటి కృష్ణమూర్తిగారు

రాత్రి ఎనిమిదిగంట లయింది. గోపాలెం నరసింహారావుగారు మందస్మితవదనంతో దీపం పెద్దది చేసి, సులోచనాలు ధరించి అప్పుడే జ్యోతిష్కుడు సమర్పించుకున్న తన కుమారుడిజాతకం చదవ నారంభించాడు.

భాస్కరరావుకు మాంచిదివ్యమైన సంబంధాలు రెండు అందుబాటులో ఉన్నాయి. అందులో ఒకటి బంగారంమీదుగా నడిచివస్తున్నది. కట్నం నాలుగు వేలు, పదెకరాల ఆస్తి, మంచి యిల్లు పిల్లతో వస్తున్నది. రెండోది ఆస్తే చెప్పకండి. పిల్ల రత్నమే కాని తడిలేని పెళ్లి తద్దినముతో సమానం!

కట్నం సిగ్గోసిరి! అన్నిటికన్న గట్టిచిక్కొకటి వచ్చిపడ్డది. వారంరోజులక్రితం ఎవడో బైరాగివెధవ భాస్కరుడి చెయ్యి చూచి వద్దంటున్నకొద్దీ, 'నువ్వు మంచి ధనంగలచోట పెళ్లాడబోతువు! ఆడితివా ఆపద కద్దు!' అంటూ పాడుకొచ్చాడు దురాత్ముడు.

ఆదెబ్బతో నరసింహారావుగారికి అడలెత్తి ఆ క్షణమే కుర్రవాడి జన్మనక్షత్రం జ్యోతిష్కుడిచేతిలో పెట్టి జాతకం తయారుచెయ్యమన్నాడు. అదిప్పుడే వచ్చింది. జ్యోతిష్కుడు డబ్బు మూటగట్టుకుంటూ "మా దివ్యమైన జాతకం" అని చెప్పి మరీ వెళ్లాడు.

నరసింహారావుగారు జాతకంకాగితాలు తిప్పటం మొదలుపెట్టాడు. మొదట కొన్ని పేజీలు సంస్కృతం కాకుండా, తెలుగుకాకుండా అర్థంకాకుండా ఉన్నాయి. అవన్నీ వదిలివేశాడు నరసింహారావుగారు. "ఆయురారోగ్యములు!" అని వచ్చింది. నరసింహారావుగారు ఆకలిగా ఉన్నవాడు అన్నం తిన్నట్టు చదవటం మొదలు పెట్టాడు. ఏమీ ప్రమాదం లేదు. కావలసినంత ఆయువున్నది—డెబ్భైఅయిదు సంవత్సరాలు. భాస్కరానికి పసితనంలో గడచినగండం కాక ఇంకొక్కటి ఉన్నది గండం. కాని అది యాభైఒకటో సంవత్సరము. భేష్! మా బాగా రాశాడు జాతకం.

"ఉద్యోగలక్షణం, ధనార్జన"—అదీబాగానే ఉన్నది. అబ్బాయి ఐ. సి. యస్. వరకూ చదువుతాడని ప్రమాణాలు చూపిస్తున్నాడు దైవజ్ఞుడు.

"సంతానకళత్రాలు!" అదీ కావలిసింది.—

"ఈ జాతకునికి ద్వికళత్ర యోగము. వివాహమయిన సంవత్సరములోపుగా కళత్రమునకు మారకము. తిరిగి ఇరవైఅయిదు దినములలోపల వివాహము..." హరి భగవంతుడా!

ధనాశగలవారికి అంతరాత్మ లుంటే, నరసింహారావుగారి కున్నదా అంతరాత్మ. డబ్బుమీద ఆయనకు ప్రేమే కాని చూస్తూచూస్తూ అంత ధనం లాక్కుని పిల్లగొంతు కొయ్యటం ఆయన కిష్టంలేదు. నరసింహారావుగారు దీర్ఘాలోచనలో మునిగిపోయినాడు.

జాతకాల్లో ఏదో ఉన్నదని పెళ్లిళ్లు మానేసుకుంటారా?...ఇటువంటి చిక్కులూ ద్వికళత్ర యోగాలూ జాతకులు అల్లరిచిల్లరగా తిరిగితే సోతవంటాయి! జాతకా లెప్పుడూ నిజం అవుతాయా?... అంతా గొంతుమీదికొస్తే పిల్లకే గాని పిల్లవాడికి కాదుగదా! ...సావిత్రి కేమయింది? మనం సంబంధం వెతుక్కుంటూరావటం లేదుకద!

"చూస్తుచూస్తూ ఉన్న సంబంధాలు చెయ్యలేను. ఎకరాలతో వస్తున్నపిల్లకు పెళ్లితొందరలేదు. అదృష్టం ఉంటే భాస్కరుడికి ఆపిల్లే రావచ్చును. ఉన్న రెండుసంబంధాలూ వదిలేసి- ఈసారి వచ్చే సంబంధం చేస్తాను. కట్నంకోసరం పోట్లాడను. లాంఛనాలకోసరం సణగను!—"

"నరసింహం అన్నగా రున్నారా?"

నరసింహారావు గారు కొట్టినట్టు ఉలిక్కిపడి "ఎవరండి బాబూ?" అన్నాడు.

"చిత్తం! నేను చంద్రశేఖరాన్ని లెండి!— "రండి బావగారూ!" (ఎవరితోనో.)

నరసింహారావుగారు కుర్చీమీదినించి లేచాడు, వచ్చినవా రెవరో ఇంకా తెలియకుండా. ఇంతలో పెద్దమనుష్యు లిద్దరు లోపలికొచ్చారు. అప్పుడు నరసింహారావుగారు చంద్రశేఖరాన్ని గుర్తించారు. చంద్రశేఖరంగారు నల్లనిశరీరం, నెరిసిన గడ్డం, నెరవనిమీసం, మధ్యాన్నం తాలూకు గంధం అక్షింతలూ, పైన చొక్కా లేకుండా ఉత్తరీయం, ముఖాన మయలమారిమల్లయ్యానవ్వూ వగైరాలతో సహా మాగ వేషం వేసుకున్న బలేరాముడి మోస్తరుగా ఉన్నాడు. ఆయనతో వచ్చిన పెద్దమనిషికూడా ఆశాఖకు చెందినట్టే ఉన్నాడు చూపులకు.

"రండి! కూర్చోండి! పనిమీద వచ్చారు!" అన్నాడు నరసింహారావు బలవంతంగా నవ్వుతూ.

"చిత్తం! చిత్తం! వీరు మా బావగారు! మా తోబుట్టువు పెనిమిటి—చెల్లెలి భర్త!"

"ఆలాగేం!"

"అవధాన్ల గోపీనాథంగారు! గోపయ్యని అంటూంటారు."

"అహా!" అన్నాడు నరసింహారావాశ్చర్యంతో.

ఇద్దరూ చెరొకకుర్చీ అలంకరించారు. గోపయ్యమాత్రం ఎన్నడూ కుర్చీలో కూర్చుని ఎరగనిజీవి కావటంచేత ఊపిరి బిగబట్టి నిప్పులమీద కూర్చున్నట్టు కూర్చున్నాడు.

"అబ్బాయి ఏడీ?" అన్నాడు చంద్రశేఖరం, కొంతసేపు ముగ్గురూ మౌనంగా కూర్చున్న తరువాత, అబ్బాయి ఆప్రాంతాలే ఉండాలన్నట్టు చుట్టూ చూస్తూ.

"భాస్కరరావు ఊళ్లో లేడు!" అన్నాడు నరసింహారావు కొంచెం గంభీరంగా.

చంద్రశేఖరం నిష్కారణంగా గొంతు తగ్గించి, "అబ్బాయికి వివాహంచేసే ప్రయత్నం ఏమన్నా...?" అన్నాడు తలకాయి ఆడిస్తూ.



అబ్బాయికి వివాహంచేసే ప్రయత్నం ఏమన్నా?

"అదే ఆలోచిస్తున్నాను!" అన్నాడు నరసింహారావు చిరునవ్వు నవ్వుతూ.

"ఏదైనా నిశ్చయం అయిందా?"

"ఏవో వస్తున్నయి కాని బొత్తిగా పరాయి సంబంధాలు. ఏదైనా కాస్త మనలో మనకు కావలిసింది వస్తే చేద్దామనే అనుకుంటున్నాను."

"బావగారు కుమార్తెకు సంబంధాలు విచారిస్తున్నాడు. పిల్లా, ఇప్పుడు కాస్త చిక్కి ఉన్నది, మొన్ననే మశూచికం పడి లేవటంచేత. లేకపోతే చాల అందంగా ఉంటుంది. వారికి సాలుకి రెండుమూడువేలు వచ్చే భూవసతి ఉన్నది. నలుగురితో తీసిపోకుండా కట్నలాంఛనాదులు జరుపుతారు. అయ్యా! వారివంశంలో ఉద్యోగసద్యోగాదులు కలవారు లేకపోయినా చాల పరువూ ప్రతిష్ఠా గల సాంప్రదాయం. గోత్రసూత్రాలు కూడా సరిగానే ఉంటున్నవి!"

నరసింహారావు ఆలోచించినట్టు నటిస్తూ "సరే చూదాం!" అన్నాడు.

"చూచారు బాబూ! ఆలోచించటానికేమీ లేదు. మీకు నిజంగా మనలోనే సంబంధం కావాలంటే ఇంతకన్న మంచిది దొరకదు. ఆలస్యంకూడా అవసరంలేదు. నాలుగైదురోజుల్లోనే ముహూర్తం ఉన్నది. భావగారు అంతా సిద్ధంగానే ఉన్నారు. ఇక మీవిషయం అంటారా, ఒక్కరోజు ప్రయత్నం చాల్ను."

నరసింహారావు నవ్వాడు. ఈ పీడ వదలటానికి ఎంత మంచి అవకాశం ఇచ్చాడు భగవంతుడు!

"ఇంకా మావాళ్లను కనుక్కోవలిసిన అవసరాలు ఉన్నాయి. కాబట్టి మీరు రేపు ఉదయం వస్తే ఏదో తేల్చుకుందాం!"

"చిత్తం! చిత్తం! అసలు రేపుదయమే వచ్చేవాళ్లం కాని ఈరాత్రి దివ్యంగా ఉందని చెప్పాడు శాస్త్రుల్లుగారు. సరేలే నిమ్మని తమ దర్శనం చేశాం!"

"మంచిది! రేపుదయం దయచెయ్యండి!"

ఇద్దరూ లేచారు. గోపయ్య చాటంతముఖంతో "వస్తాం! శలవు!" అన్నాడు మొదటిసారి నోరు విప్పి.

"మంచిది! ఉంటాను!"

ఇద్దర్నీ బయటికి సాగనంపి నరసింహారావు వచ్చి కూర్చుని జాతకం తిరగవెయ్యటం మొదలు పెట్టాడు.

*　　*　　*

మర్నాడు భాస్కరరావు దిగాడు. ఇంకా మూడు రోజుల్లో ఉన్నదని తెలుసుకున్నాడు తనవివాహం.

"నిన్న ఉదయమే నిశ్చయించాము!" అన్నాడు నరసింహారావు.

"ఎందువల్ల?"

"తొందర అయింది."

"నేను లేకుండానే? పిల్లను చూడకుండానే?" అన్నాడు భాస్కరరావు ఆశ్చర్యంతో.

"పిల్లను చూడ్డమా? నేను చూడలేదు! మనలోమాట! ఇది పిల్లను చూచి చేసుకోతగ్గ సంబంధము కాదు. పిల్లను చూస్తే బహుశా చేసుకో బుద్ధిపుట్టదు."

"నేను డబ్బును పెళ్లిచేసుకోను. తరువాత మీ యిష్టం. ఎక్కడికైనా లేచిపోతాను!" అన్నాడు భాస్కరరావు కోపంతో.

నరసింహారావు తొణకలేదు.

"ఎక్కడికీ పారిపోవు. కట్నాని కాశపడి ఈ సంబంధము చెయ్యలేదు. ఎందుకు చేశానో నీకే తెలుస్తుంది...నన్నేమీ నువ్వడగక్కర్లేదు. నీకే తెలుస్తుంది."

౨

భాస్కరరావు పెళ్లిపీటల మీద తన భార్యను చూచుకున్నాడు. వెంటనే కళ్లు మూసుకున్నాడు.



"......భాస్కరరావుకు పైత్యవికారం వచ్చినట్టయింది."

అతని ముఖం పాలిపోయింది. అప్పటికే తన మామగారిని ఇతరబంధువులను చూచి అసహ్యించుకోటమయిందతనికి. కాని ఈభార్య అందరితలా తన్నింది. ఆమె ముఖం కాయనలుపు. స్ఫోటకం మచ్చలు. జబ్బుపడ్డట్టు ముఖమంతా పీక్కుపోయింది. నెత్తిన వెంట్రుకలు దాదాపు ఏమీ లేవు. ఇతరవిషయాలు వర్ణించటానికేమున్నది! ఆ రంభ అతనివంక సిగ్గుపడుతూ ఒక్కసారి చూచి తల వంచుకునే సరికి భాస్కర్రావుకు పైత్యవికారం వచ్చినట్టయింది.

పీటలమీదనించి లేవగానే భాస్కర్రావు తండ్రి దగ్గిరికి వెళ్లాడు.

నరసింహారావు ఒకగదిలో కట్నం లెక్కపెట్టుకుంటూ వంటరిగా కూర్చున్నాడు. ఒంటరిగా ఉండటం వల్ల ఆయన మానం ఎక్కువ సురక్షితం కాలేదు. భాస్కర్రావు కఠినంగా "ఈసంబంధం చేసినందుకు మీ మేలు బతికిఉన్నన్నాళ్లు మరవను!" అన్నాడు.

నరసింహారావు తొందరపడలేదు. డబ్బుతో పనిగలవాడికి ఆగ్రహంమీద కట్టుబాటు జాస్తి.

"నీ కేమైనా కృతజ్ఞత ఉంటే నిజంగా మరవవు. నీ కాసంగతి ఇప్పుడు తెలియదు. కొంచెము ఓర్పు తెచ్చుకో. శాంతంకన్న లాభకరమైనది లేదు. నా జీవితంలో నే నాసంగతి ఒక లక్షసార్లు నిరూపించాను. తొందరపడటంవల్ల నష్టంతప్ప ఏమీ రాదు. శాంతం! శాంతం! శాంతం!"—భాస్కర్రావు లేచిపోయినాడు.

ఈసంభాషణ వింటూ ఇద్దరు పెద్దమనుష్యులు పక్కగదిలో నవ్వుకున్నారు!

## 3

ఆరోజునుంచీ తండ్రీకొడుకుల్లు మాట్లాడుకో లేదు, ఉత్తరాలద్వారా తప్ప. ఆ ఉత్తరాలైనా చాలా వాడిగా ఉండేవి. సంవత్సరం గతించింది. భాస్కర్రావు భార్య కల్యాణి మరణవార్త రాలేదు. ఈలోపల గోపయ్య వియ్యంకుడితో మాట్లాడాలని రెండుమూడుసార్లు ప్రయత్నం చేశాడు. కాని నరసింహారావు అయన్ను బయటికి తరిమివేశాడు.

గోపయ్యతరఫున చంద్రశేఖరం జోతిష్కుణ్ణి సమీపించి "అయ్యా, తమరు నరసింహారావుగారబ్బాయి జాతకం చూస్తున్నారా?" అన్నాడు.

"అవును!"

"ఒక్క సహాయం చెయ్యగలరా?"

"ఏమిటి?"

"ఈ కుర్రవాడికి ద్వికళత్రయోగ మున్నట్టు రచించగలరా?"

"ఎందుకు?"

"ఊరికేనే!"

"రచియించలేను.!"

"ఒక్క వందరూపాయలిస్తేకూడా?"

"అది వేరేమాట!"

"అయితే సరే!"

అదీ జరిగిన గోల.

కాని ఈసంగతి జ్యోతిష్కుడు ఇంకోవిధంగా అందరితో చెప్పాడు. గోపయ్య రాయమన్నది ద్వికళత్రయోగమనే. కాని గోపయ్య జ్యోతిష్కుడికివ్వవలిసిన ఫీజు ఎగగొట్టాడు. గోపయ్య ఉద్దేశ్యం జ్యోతిష్కుడూహించాడు. బహుశా తన కుమార్తెను అంటగట్టాలని చూస్తున్నాడు నరసింహారావు కొడుక్కు. అట్లా అయితే ఆపని కాకుండా చెయ్యటమెంతసేపు? జ్యోతిష్కుడు జాతకం తిరిగి రాశాడు. ఈసారి వివాహమైన సంవత్సరానికి మారకం కూడా వచ్చింది జాతకంలోకి. ఆసంగతి నలుగురితోనూ అన్నాడు. కాని ఆయన ఊహించినట్టు వివాహ మాగలేదు. ఈవదంతి గోపయ్యదగ్గిరికి పోవటానికి రెండురోజులు చాలలేదు. ఈలోపల వివాహ మయిపోయింది. వివాహం అయిననెలరోజులకు గోపయ్య మండిపడుతూ జ్యోతిష్కుడిదగ్గరకు వచ్చి "జాతకంలో పెళ్లి అయిన సంవత్సరానికి భార్య చస్తుందని రాశావుట!" అన్నాడు.

జ్యోతిష్కుడు నవ్వి "అది తమ ఉపయోగార్థం రాశాను. ఆమాటంటే ఇంకో సంబంధము రాదుగా?"

గోపయ్య సంతోషంతో నవ్వటం మొదలు పెట్టాడు.

"కాని ఆపిల్లవాడికి నిజంగా ద్వికళత్ర యోగం సిద్ధం!"

"నన్నాడిస్తున్నా వేమిటి?"

"నమ్మకపోతే ఏం చెయ్యను? భార్యకు మారకం తప్పదు. దానిఫలితంగా ద్వితీయవివాహం తప్పదు."

గోపయ్య నివ్వెరబోయినాడు.

"మారకం ఎప్పు డున్నది?"

"ఇంకా అయిదుసంవత్సరాలకు. నేను సంవత్స రానికనే రాశాను...ఇదిగో, ఆపత్తు అంటే ఏమిటో తెలుసునా? భర్తచేతుల్లో పిల్లకు మరణం. అలాంటి విషయాలు విప్పిరాయం!"

"నేను నమ్మను!" అన్నాడు గోపయ్య పూర్తిగా నమ్ముతూ.

"నేను నమ్మమనలేదు."

"నిజమంటూవా యిది?"

"లేకపోతే నా తాటాకుపుస్తకాలు చలిమంటేసు కుంటాను."

"ఆరి అభాజనుడా!"

జ్యోతిష్కుడొక టాలోచించాడు. వివాహం ఎట్లాగో అయిపోయింది. కాపరం ధ్వంసంచేస్తే అదే చాలు. గోపయ్య కుమార్తె చచ్చిపోతుందని భయంచేత నరసింహారావుతో ఏదో పోట్లాట పెట్టుకుందామని రెండుమూడుసార్లు చూచాడు కాని ఆయన గోపయ్యను గెంటేశాడు మాట్లాడకుండానే.

రాగాపోగా మిగిలినది భాస్కరరావుకూ తండ్రికీ వైరం. కల్యాణికి బతికినన్నాళ్లూ మనోవేదన.

* * * * *

భాస్కరరావు జీవితంలో అతని వివాహం చాల మార్పు కలిగించింది. కొద్దికాలంవరకూ అతను మన స్సులో మథనపడ్డాడు. ఎంతదారుణం! పెద్దవాళ్లు ఎవ రిని అంటగడితే వారిని భార్యలుగా భర్తలుగా స్వీక రించాలీ? స్వీకరించకపోతే పాపమా? ఇంకా విధంటే ఏమిటి? చిన్నవాళ్లకు పెద్దవాళ్లే విధి.

ఈధోరణిలో భాస్కరరావు అప్పుడప్పుడు కాలేజీలో ఉపన్యాసా లిచ్చేవాడు అప్పుడప్పుడు పత్రిక లకు వ్యాసాలు పంపేవాడు. అతని ఉపాధ్యాయులు కొందరతన్ని చాల మెచ్చుకున్నారు. వారిలో మార్కండేయులుగారొకరు. భాస్కరరావుకు మార్కండేయులుగారప్పుడప్పుడు బ్రహ్మసమాజమతాన్ని గురించి చెబుతూండేవాడు. భాస్కరరావు చాలశ్రద్ధతో వింటూండే వాడు.

తరచుగా భాస్కరరావు మార్కండేయులుగా రింటికి వెళ్లి కాఫీ గాని టీ గాని పుచ్చుకుంటూండటం ఉంటూండేది. దాని కారణం చాలవరకు మార్కండేయులుగారి కుమార్తె లక్ష్మి. ఆమెకూ పదహారేళ్ల ప్రాయం ఉంటుంది. కొద్దికాలంలో కాలేజీలో చేర టానికి సిద్ధంగా ఉన్నది.

భాస్కరరావు ఈసమయంలో ప్రేమకోసరం తపించటం మొదలుపెట్టాడు. అంతా ప్రేమలో ఉన్నది! ప్రేమే లోకం. అది లేకపోతే జీవితం వ్యర్థం.

కాని అతనికి ఎవరిమీద ప్రేమ ఉన్నదో తెలీ యదు. మొదట తనక్లాసులో చదువుతూన్న క్రిష్టియను పిల్లను ప్రేమించానను కున్నాడు. ఒకరోజున ఆమె ఇంకొక క్రిష్టియను యువకుడితో కొంచెము అతిగా సరసాలాడుతూండగా అతను పొరపాటున చూడ్డం తటస్థించింది. అంతటితో అతనిప్రేమ కాస్త పోయింది. తరువాత తనగదికి కొద్దిదూరంలో ఉన్న సానిపిల్లను గాఢంగా ప్రేమించానను కున్నాడు. కాని ఆమెను గురించి చాలమంది చిత్రవిచిత్రంగా మాట్లాడ్డం విన్నపు డతనిప్రేమ స్థిరంగా ఉండలేకపోయింది. కాని ఇంతకూ అతనికి ప్రేమతత్వం తెలియలేదు.

బాగా ఆలోచిస్తే ప్రేమ దేనివల్ల కలుగుతుంది? అవతలమనిషిఅందంవల్ల ఏర్పడుతుంది. ఆ స్ఫోటకం

మచ్చలుగల పిల్లను ఏవిధంగానైనా ప్రేమించగలడా? పట్టిది. కనక అందం ముఖ్యం. ఆమాటని ఒక్క అందం చాలునా ప్రేమకంటే, చాలదే! చాలితే ఆ క్రిష్టియను పిల్లను, ఈ సానిపిల్లను ప్రేమించేవాడే. కాబట్టి అవతల మనిషి అందంగా ఉండడమేకాక తన్ను తిరిగి ప్రేమించాలి!

అయితే మరి అందరికీ ప్రేమించటం చేతకాదన్నమాట! అందరూ ఏవిధంగా అందంగా ఉంటారు?

భాస్కరరావు కేమీ తోచలేదు. కాని ప్రేమాన్వేషణ మానలేదు. ఇంకా ప్రేమిస్తూ ఉండాలి అనుకున్నాడు. ఇట్లా ప్రేమించగా ప్రేమించగా అది ఒకచోట ఆగుతుంది. అదీ అసలు ప్రేమ అని అతని కెందుకో తట్టింది. ఇంతలో లక్ష్మి దొరికింది! ఈసారి నిజమైన ప్రేమ అనుకున్నాడు. ఆమె అతన్ని చూచినప్పుడల్లా చాలసంతోషంగా ఉండేది.

అతనికి వివాహం అయిందని ఎవరికీ తెలియదు. అందరితో తనకు వివాహం కాలేదంటూండేవాడు. యజ్ఞోపవీతాలు సొంతంగా లాగేయ్యటంవల్ల నిజం కనుక్కోటాని కవకాశం లేకపోయింది. అందరితోనూ తాను బ్రాహ్మసమాజకుడనని చెప్పేవాడు. వారి మీటింగులకు పోయేవాడు.

## ౨

భాస్కరరావు బి. ఎ. రెండవతరగతిలో ప్యాసయినట్లు తెలిసింది. ఆకాలేజీలో ఆసంవత్సరం ట్యూటరు కావలసివచ్చాడు. ఎమ్. ఎ. కు పోదామనుకుంటూ లక్ష్మిని ఏవిధంగా వదిలిపెట్టడమా అనుకుంటున్న భాస్కరరావు మార్కండేయులుగారి సహాయంతో ఆ ఉద్యోగం సంపాదించాడు.

జులైలో కాలేజీ తెరిచారు. తనతోపాటు చదివిన సుబ్బారావు బి. ఎ. తప్పాడు. ఇద్దరూ కలిసి మంచి విశాలమైన గదులు పదిరూపాయలు అద్దె పెట్టి తీసుకున్నారు. ఎక్కువకాలం భాస్కరరావుకు మార్కండేయులుగారింట్లోనే గడుస్తూ ఉండేది.

లక్ష్మి కిప్పుడు పద్దెనిమిది సంవత్సరాలు. ఇంటర్మీడియెట్ చదువుతున్నది. ఆమె చూడటానికి సన్నగా పొడుగ్గా సుకుమారంగా ఉండేది. దాన్నే నాజూకు అనేవాడు భాస్కరరావు. ఆమెజుట్టు ఉంగరాలు తిరిగేది. ఆమె శరీరచ్ఛాయ బాగా తెల్లగా ఉండేది. ఆమె ఎప్పుడూ కళ్లు చెదిరిపోయే రంగుల చీరెలు ధరిస్తుండేంది; బాగా ఖరీదు కలవి.

కాలేజీ తెరచి పదిరోజు లయింది. ఒకరోజు మధ్యాహ్నం భాస్కరరావు కాలేజీనించి త్వరగా తిరిగి వచ్చాడు. సుబ్బారావు చదువుతూన్న పుస్తకం పక్కన పెట్టి "ఏమిట్రా అప్పుడే వచ్చావు?" అన్నాడు.

"చాలా చలిగా ఉంది! జ్వరం తగిలినట్టుంది!" అన్నాడు భాస్కరరావు కుర్చీలో కూర్చుని. సుబ్బారావతని చెయ్యిపట్టుకు చూచి "కాలిపోతున్నది" అన్నాడు.

భాస్కరరావు కళ్లు మూసుకున్నాడు. సుబ్బారావు పక్క తయారుచేశాడు వెంటనే. భాస్కరరావు కాలిబూట్లు విప్పేసి దానిమీద పడ్డాడు. ఇక అతనికి వళ్లు తెలియదు.

సుబ్బారావు డాక్టరుకోసం పరుగెత్తాడు. ఆయన వచ్చి చూచి 'జ్వరంగా ఉన్నది. మందిచ్చి చూదా' మన్నాడు. సుబ్బారావు మందు తెచ్చాడు.

రెండుమూడురోజులు గడిచినా జ్వరం ఏమాత్రమూ తగ్గలేదు. నాలుగోరోజుని డాక్టరు సన్నిపాతజ్వర మన్నాడు. సుబ్బారావు తన పినతల్లిభర్త కొక అర్జంటుతంతి ఇచ్చాడు, వెంటనే రమ్మనీ భాస్కరరావుకు చాల ఎక్కువ జబ్బుగా ఉన్నదనీ. ఒంటరిగా పాపం సుబ్బారావు చాల శ్రమ పడుతూన్నాడు. ప్రతి పనీ అతనే చెయ్యటం చాల కష్టంగా ఉన్నది.

నాలుగురోజులకుపినతల్లి భర్తా,కుమార్తె వచ్చారు. అక్కడే ఆమెను వదలి తండ్రి వెళ్లిపోయినాడు జాగ్రత్త అని చెప్పి.

నానాటికీ భాస్కరరావుస్థితి విషమించటం మొదలుపెట్టింది. మూడురోజులు రాత్రీ పగలూ లేకుండా

సుబ్బారావూ చెల్లెలూ భాస్కరరావుమీద ఆశ వదులు కునికూర్చున్నారు. డాక్టరేమీ చెప్పలేదు. ఆమూడు రోజుల్లో ముప్పయి ఇంజక్షను లిచ్చాడు.

అక్కడినించీ జాడ్యం తిరుగుముఖ మయింది. తిరిగి ఇరవైరోజులకు భాస్కర్రావు మనుష్యలోకంలో పడ్డాడు. రోజుకు రెండుమూడు గంటలు కళ్లు తెరచి చూస్తుండటం మొదలుపెట్టాడు. సుబ్బారావును మొదటి సారి చూస్తూనే గుర్తుపట్టాడు. తన కడ్డమైన చాకిరీ చేస్తున్న పిల్లను గుర్తు పట్టలేకపోయినా ఆముఖాన్ని చూచినప్పు డతనికి చాల సంతోషంగా ఉండేది.

పదిరోజులు గడిచింది. మత్తుగా కళ్లు మూసుకుని పడుకోటం మానేశాడు. ఎక్కువభాగం సుబ్బారావింట్లో ఉండేవాడు కాడు. ఆపిల్లే ఇల్లంతా తిరుగుతుండేది. ఆమెను చూస్తుంటే అతనికి తృప్తిగా ఉండేది. ఏనిద్రనుంచో లేవగానే ఆమె కనిపించకపోతే ఎట్లా వచ్చిందో అట్లాగే పోయిం దేమోనని అతను చాలా దిగులుపడేవాడు. ఉదయం సాయంత్రం అతనికి హార్లిక్సు కలిపి ఇస్తూండేది. చిన్నచిన్నపను లొకలకు చేసేది.

తన కీమాత్రం భార్యఅయినా లభించకూడదూ? స్ఫోటకంమచ్చలున్న పిల్ల తలపుకు రాగానే అతనిశరీరం జలదరించింది. అన్నట్టు లక్ష్మి ఏమయింది? ఇన్నాళ్లూ ఆమె నేవిధంగా మరిచిపోయినాడు? తన ప్రాణంతో సమానమైన లక్ష్మి—

అబద్ధం ఆడితే అంతరాత్మ అంగీకరించదు. లక్ష్మి తనప్రాణంతో సమానం కాదని అంతరాత్మ పెద్ద గోల చెయ్యటం మొదలుపెట్టింది. తన జబ్బులో ఒక సారి అయినా వచ్చిఉంటుందా? తప్పక వచ్చిఉంటుంది! ఒకవేళ రాకపోయినా, ఆమెకు తెలిసిఉండదు. తెలియకపోతేవిచారించిఉండదా? తనఉద్యోగంఏమయింది?...

"సుబ్బారావ్, నాఉద్యోగ మేమయింది?"

"నేనే నీతరఫున శలవుపెట్టాను.ఏమీగోలపడకు."

"లక్ష్మి వచ్చిందా?"

"ఎప్పుడు?"

"ఎప్పుడైనా?"

"రాలేదు!"

భాస్కర్రావు తుదిప్రయత్నం చేశాడు లక్ష్మిని పూర్వస్థానంలో నిలపటానికి.

"చూడు సుబ్బులూ, లక్ష్మికి తెలుసునా నాజబ్బు సంగతి?"

"నేను తెలియజేశాను."

భాస్కర్రావు నిట్టూర్పు విడిచాడు దీనంగా.

ఇంతలో ఈపిల్ల హార్లిక్సు తయారుచెయ్యటం మొదలుపెట్టింది. లక్ష్మి తన కీవిధంగా హార్లిక్సు తయారుచేస్తుందా? ఉత్తది!

ఏమీ సందేహం లేదు! ఈపిల్లను చూస్తే ఒకవిధమైన ఆనందం కలుగుతుంది. ఆమె ఎవరో, పేరేమిటో ఏమీ తెలియదు తనకు. ఆమె పరాయిదికదా అనుకున్నప్పుడల్లా అతనికి కష్టంగా ఉండేది. సుబ్బారావును ఆమెగురించి అడగటం ఇష్టంలేక పోయింది. ఆమెమీద అతనికి స్నేహభావం గలిగింది. స్నేహానికి కొత్త,పాత లేదు. మన కత్యంతప్రియుడైనస్నేహితుడు కొంతకాలంకింద మనకు పరాయివా డనుకోటానికి ఎంతో కష్టంగా ఉంటుంది.

ఆమె సుబ్బారావుచెల్లెలా?— ఆమె అతన్ని అన్న అని పిలుస్తుంది! అతనికి చెల్లెళ్లుగాని, అప్పలు గాని లేనట్లు భాస్కర్రావుకు నమ్మకంగా తెలుసును.

భాస్కర్రావు కేమీ తోచక ఏదో వెర్రి ఆలోచన వస్తూండేది. ఈమెను లక్ష్మిని పోల్చిచూడ్డం మొదలుపెట్టా డొకరోజుదయం. ఈమె చామనచాయ శరీరం కలది. లక్ష్మి తెల్లగా ఉంటుంది. ఈమె జుట్టు లక్ష్మి జుట్టు మాదిరిగా తిరగదు. అయినా మొత్తంమీద లక్ష్మి కింత తలకట్టు లేదు. ఉన్నతలకట్టింతఅందంగానూ ఉండదు. లక్ష్మిని కొత్తగా చూచినప్పుడు భాస్కర్రావు తనజన్మలో తిరగని జుట్టు మెచ్చుకుంటా డనుకోలేదు. ఇప్పుడు చూస్తే ఈమెజుట్టు నమ్మకంగా లక్ష్మిజుట్టు కన్న బాగున్నది. ఈమె బొద్దుగా ఉంటుంది. లక్ష్మి నాజూకుగా ఉంటుంది. కాని ఆమెశరీరంలో ఈమె

కున్నంతయౌవనం దారుఢ్యం లేదు. అందుకని ఈమె మోటగ ఉన్నట్టూ లేదు. ఇద్దరికళ్లూ పెద్దవే కాని లక్ష్మి కళ్లల్లో నల్లగుడ్డు చిన్నది కావటంచేత పైనా కిందా తెల్లగుడ్డు కనిపిస్తుంది. ఈమె కళ్లల్లో ఎంతజీవం ఉన్నది! ఈమెకు పదిహేనేళ్లకంటె ఎక్కువ ఉండవు. లక్ష్మి పద్దెనిమిదేళ్ల దయినా స్వల్పంగా రోగిష్ఠిగా ఉంటుంది. ఏమయినా లక్ష్మిని మరిచిపోవటంచాల తప్పుగా తోచింది. ఆమెను తలచుకుంటూ ఈమెను చూస్తూ ఆమెను మరిచిపోవటమా?

"కొంచెం పంచదారకూడ వెయ్యనా హార్లిక్సులో?" అన్న దీమె.

"మీయిష్టం!" అన్నాడు భాస్కరరావు పరధ్యానంగా. అంటూనే ఆమెవంక చూచాడు నవ్వుతూ. ఆమె ముక్కుమీద వేలుపెట్టింది, అతనివంక చూచి నవ్వుతూ.

భాస్కరరావు నిర్ఘాంతపోయినాడు అర్థంకాక.

బయట అడుగులచప్పుడు వినిపించింది. సుబ్బారావు ఇంకొకమనిషితో లోపలి కొచ్చాడు. ఆరెండో మనిషివంక చాలసేపు చూచాడు భాస్కరరావు. ఆయన్ను కలలో ఎక్కడో చూచిన ట్టున్నది. కాని ఏమీ జ్ఞాపకం లేదు. ఆయన తన్ను సమీపించాడు. అతను ఆశ్చర్యపడ్డాడు.

"ఎట్లా ఉన్నది?" అన్నాడాయన కఠినంగా.

భాస్కరరావు నిర్లక్ష్యంగా తల ఊపాడు. ఎవరైతే ఏం తనతో అంతనిర్లక్ష్యంగా మాట్లాడినతర్వాత?

ఆపెద్దమనిషి లోపలి కెళ్లాడు. ఆపిల్లకూ ఆయనకూ ఏదోఘర్షణ జరిగింది లోపల. అతని కర్థం కాలేదు. చివరకు ముఖం మటమటలాడుతూ అతను వెళ్లిపోయినాడు.

"భాస్కరరావ్!"

"ఏమిటి?"

"ఎవరాయన?"

"మాపెత్తల్లి భర్త!"

"ఎక్కడో చూచిన ట్టున్నది." భాస్కరరావు పక్కకు తిరిగి పడుకున్నాడు. ఆరోజల్లా ఆపిల్ల అతని వంక సరిగా చూడలేదు. ఏదో పరధ్యానంగా ఉన్నది పాపం! దీని కంతా ఆ ఉదయం వచ్చిన దుర్మార్గుడే కారణం అయిఉండాలి.

సాయంత్రం నాలుగు గంటలయింది. బయట కారు వచ్చి ఆగినచప్పు డయింది. ఇంకొక నిమిషంలో లక్ష్మి లోపలికి వచ్చింది. ఆమెను చూడగానే అతనిలో ఒకవిధమైన భయం బయలుదేరు తూండేది. ఆమెను చాల గౌరవం చెయ్యాలి. దానిలో ఎక్కడ పొరబాటు వస్తుందో, ఆమె ఏమనుకుంటుందో అనేభయం. ఈపిల్ల దగ్గర ఆభయం లేదు చక్కగా!

"ఆకుర్చీమీద కూర్చో!" అన్నా డతను అనుమానిస్తూ.

ఇంతలో లోపల్నించి ఆపిల్ల ప్రవేశించింది. లక్ష్మి ఆవైపు చూచి పక్కగా చూచి తిరిగి ఆమెను చూచి, భాస్కరరావును చూచి, చివరకు ఆమెమీద దృష్టి నిలిపింది. ఆపిల్ల మెల్లగా లక్ష్మిని సమీపించి నవ్వుతూ భుజంమీద చెయ్యి వేసి "మరచిపోయినావు లక్ష్మీ?" అన్నది.

లక్ష్మి ఒక్కగంతుతో లేచింది. "ఎన్నిరోజులైందే కల్యాణీ నిన్ను చూచి! ఎక్కడుంటున్నావు? ఇక్కడెందుకుంటున్నావు?" అన్న దామె కల్యాణిచెయ్యి పట్టుకుని.

భాస్కరరావు సహాయం లేకుండానే మంచం మీద కూర్చుని కొంతసేపు ఇద్దర్నీ తేరిపార చూచి నవ్వటం మొదలుపెట్టాడు. లక్ష్మి కొంతసేపు అర్థం కాకుండా అతనివంక చూచి, "మీరిద్దరూ బంధువులా?" అన్నది.

"కొద్దిగా! అది నాభార్య!" అన్నాడు భాస్కరరావు తాపీగా.

"మీరు పెళ్లికాలే దన్నారే?" అన్నది లక్ష్మి ఆశ్చర్యంతో.



'మీరు పెళ్లికాలేదన్నారే' అన్నది లక్ష్మి ఆశ్చర్యంతో.

"అప్పటికి కాలేదు. సామస్యనే అయింది."

"జబ్బులోనా?" లక్ష్మికేమి అర్థంకాలేదు.

"మనుష్యులు చేసేవివాహాలకు జబ్బు, ఆరోగ్యం, మంచి, చెడ్డ ఉంటయ్యి కాని భగవంతుడు చేసే పెళ్లికివన్నీ లేవు. నేను మూడు సంవత్సరాలనించీ నాఅంతట నేను వివాహం చేసుకుందామని ప్రయత్నం చేస్తున్నాను. భగవంతుడు నేను నట్లు తెలియకుండా ఉన్న సమయంలో పెళ్లిచేశాడు. మన శరీరవాంఛలు ఎప్పుడూ ఉండేవే. వాటికి మనం ఎక్కువస్థానం ఇవ్వక్కర్లేదు. నీఅంతట నువ్వే వివాహం చేసుకుందామని ప్రయత్నం చెయ్యకు. మనకావలసినమనిషి మనదాక వస్తాడు. వచ్చేవరకూ ఆగివుండటం ఉత్తమం."

లక్ష్మి మాట్లాడలేదు. భాస్కరరావు తిరిగి పడుకున్నాడు. కల్యాణి వంచినతల ఎత్తి "పోతున్నావా లక్ష్మీ" అన్నది. లక్ష్మి వెనక్కు తిరిగి చూడకుండా తల ఊపి వెళ్లిపోయింది.

కల్యాణి మెల్లగా భర్తను సమీపించి అతని రొమ్ముమీద చెయ్యి వేసి, "లక్ష్మికి కోపం తెప్పించారు" అన్నది.

భాస్కరరావుఆమెవంకచూచి "అట్లాగా? నాతప్పు లేదు" అన్నాడు.

"లక్ష్మి చాల మంచిది. ఒకప్పుడు మేమిద్దరం మంచిస్నేహితులం!"

"నిన్ను గుర్తుపట్టలేదేం మరి? ఇంతకుముందు వచ్చింది మీతండ్రా?"

"ఆ!"

"ఏమంటాడు? నా కర్థంకాలేదు!"

"నన్ను రమ్మంటాడు."

"ఎక్కడికి?"

"ఇంటికి!"

"దేనికి?"

కల్యాణి నవ్వి మాట్లాడలేదు.

"ఎందుకు?"

"ఆ! పిచ్చి!"

"ఎందుకు?"

"మీరు నన్ను చంపుతారని భయం అయనకు!"

"ఏం?"

"మీజాతకంలో ఉందిట!"

"నీ వెట్లా వచ్చావు?"

"నేను పోట్లాడి వచ్చాను. మాసుబ్బారావు టెలిగ్రాము ఇచ్చాడు."

"మీయింటికి పోతావా?"

"పోను!"

"నేను నిన్ను చంపితే?"

"చంపండి!"

"నవ్వులు కాదు!"

"అవును!"

భాస్కరరావు నవ్వాడు.

"ఒక్కటి చెబుతారూ కోప్పడకుండా?"

"ఏమిటది?"

"ఇన్నాళ్లూ నాముఖం ఎందుకు చూడలేదు మీరు?......పోనివ్వండి మీ కిష్టం లేకపోతే! అన్నీ కుంటిప్రశ్న లేస్తుంటాను. నానోరూరుకోదు" అన్నది, కల్యాణి, తొందరగా భర్తముఖంమీద దైన్యం కనిపెట్టి.

"ఇక నిన్ను వదలిపెట్టి ఉండను."

"థాంక్స్."

"అబ్బో!"

---

## శైలి

విద్వాన్, కవితిలక కంచనపల్లి కనకమ్మగారు

అన్నింటిలో మంచి యరయుచుండెడివి
కొన్నిమతంబులు క్రొత్తగాఁ బుట్టె
ఇష్టమైనట్టుల నిల నాచరింప
దుష్టుల కవి గొప్ప దోహదాలయ్యె
మంచిమ యొక్కరిది మంచిదికన్న
నెంచిమఱొక్కరి దేకంబుచేసి
మంచివిగ్రహమంచు మహినెవ్వఁడేఁ ద
లంచి పూజించు నాలంపటుండగుచు
మంచివన్నియు నేరి మహి నొక్కచోట
నుంచుట నెఱుఁగఁడే యూహింపనజుఁడు
సమరసంబగు సృష్టిచందంబుఁగనక
విమలాత్ము హరి గను విజ్ఞతలేమి
విషయంబులందున వేడుక హెచ్చ
ఋషివలెఁ గాన్పింప నీమతం బరయు
తహతహపడకు మితరము మోహించి
సహజధర్మమునందు శాంతివహించి
సాధుగోష్ఠిని నిల్పి సత్సేవసల్పి
బోధమూర్తివి బుధభూరిభూషణము
కమ్ము జీవుఁడ పరగాథ లవేల
నమ్ము మాగమగురునాథభూసురుల
సర్వాత్మ నాయాత్మ సర్వేశ్వరునకు
నిర్వంచకమ్ముగా నెఱనమ్మియుమ్ము.

---

మృతసంజీవని G. S. A.



నగారోహణము, బీచి హేడ్, ఇంగ్లాండు G. S. A.



హింసనుబర్గు - బెర్లినులో E. N. P.



బెర్లిను యువతుల ఐచ్ఛికసేవ E. N. P.

( ఈ సమితివారు నిరుద్యోగులకు అన్నము వండిపెట్టుటకును, బట్టలు కుట్టిపెట్టుటకును ఏర్పాట్లు చేసికొన్నారు. )

# తిరుపతికొండ మెట్టు

అడివి బాపిరాజుగారు

శ్రీ తిరుమల మహాపుణ్యక్షేత్రంలో గాలి గోపురానికి పోయే మొదటిమెట్ల వరసలో సగము దాటినపైన ఏకాకి, కుంటి బిచ్చగాడు, పున్నెడు-నివాసం. ఏబిచ్చగాళ్ల ఋషికులానికి చెందకుండా పున్నెడు ఆశ్రమం ఏర్పరుచుకున్నాడు. రెండుకాళ్లూ మొండే. కాని వాడికున్న బలం విపరీతం. వాడు చేసే దొమ్మరి విద్యల సాహసం ఏ ఇసాకో గ్రాండు



"వేలాడుతూ చక్రంలా గిరగిర తిరుగుతాడు."

రషియను సర్కసు జట్టులో వుండే పరమ సాహసికిన్నీ లేదు. చేతులతో మెట్లెక్కుతాడు. కోతిలా కొమ్మనుంచి కొమ్మకు ఎగిరి ఛంగున పోతాడు. వేలాడుతూ చక్రంలా గిర గిర తిరుగుతాడు. దేహమంతా వాలఖిల్య మునిలా పైకెత్తి వేళ్లమీద తలక్రిందులా నిలబడి నడుస్తాడు. మెట్టుమీదనుంచి పైమెట్టుకి బంతిలా ఎగురుతాడు. ఒంటిచేతిమీద నిలుస్తూ, చేతుల్లోంచి దేహమంతా దూరుస్తూ చూపించే విచిత్రపు ఆసనాలా, మొగ్గలా ముందర హఠయోగి విరూపానందస్వామి యోగవిద్య గాని, జపానుమాంత్రికుడు మసుకాకో కనబరచే "ఫీట్లు" గాని, స్వారువోట్టుల ఎలక్ట్రిక్ దీపంముందర పడకగదిదీపంబుడ్డిలా తెలతెలపోవలసినదే!

యాత్రికులతండాల మేఘాలు పున్నెడు ముందర ఆగి, ఆతని అద్భుతచర్యల చూసి విస్తుపోయి దమ్మిడీలు, కానులు, అణాలు వర్షం కురిపిస్తే, రాత్రి తొమ్మిది అయ్యేటప్పటికి అయిదూ, ఆరు రూపాయల చిల్లర చెరువులు కట్టుంది. ఏ బ్రహ్మోత్సవమో అయితే పది పదిహేను రూపాయలు పోగుచేసా డన్నమాటే. తిరుపతికొండల ఎక్కుదిగుడుల ఏడు మైళ్లలో ఉన్న మూడువందల ఏబదియారు బిచ్చగాళ్లలో పున్నెడుకు వచ్చే రాబడి ఇంక

ఎవరికీలేదు. వికలాంగులు ఉన్నారు. ముక్కు నోరు అంతా ఏకరంధ్ర మైనవారు, కుష్టురోగులు, మాంత్రికులు, సన్యాసులు, ముళ్ల మీద హంసతూలికాతల్పంమీదలా పండుకొనే యోగీశ్వరులు, గుడ్డివారు, కోకిలకంఠంతో పాడే గాయకులు, ఆడవాళ్లు, మగవాళ్లు, బిడ్డలు; భయం కలుగచేసేవి, కళాసౌందర్యం వెల్లివిరియజేసేవి విగ్రహాలను ముందుంచుకొని పూజారిపని చేసేవారు—ఎన్నిరకాలున్నారో తిరుమలేశ్వరుని కొలువుచేసే అయ్యంగార్లు, అయ్యరులు, అయ్యలు, రెడ్లు, మొదలియారులు, సెట్లతోపాటు, కోతులతోపాటు, ఈ బిచ్చకుల బృందాలు!

ఆ విచిత్రప్రపంచంలో ఉన్న బిచ్చగాళ్లంతా పున్నెణ్ణి చూసి అసహ్యించుకునేవారు. పున్నెడు ముష్టివాళ్లందరకూ విరోధి అయిపోయినాడు. వాడి సంపాదన వాళ్ల కడుపు మండజేసింది. వారికి ఉడుకుబోతుతనం కాశ్మీర దేశాన్ని సహారా ఎడారి చేయగలశక్తితో విజృంభించింది. ధర్మప్రవాహాలు వాడిదగ్గిర ఆనకట్టకట్టబడి నిర్జలవాహినులు కొండంతా ప్రవహిస్తున్నవి. పున్నెణ్ణి త్వరగా కొండమీదనుంచి జపానువారు చీనాను తరిమినట్లుగా నెట్టివేయవలెనని బిచ్చగాళ్ల సంఘంలో సంచలనం కలిగింది. వారిలో ఏకబురున్నూ తీగలేనివార్తలా నిమిషంలో ఆకొండలోయల మోకాళ్లపర్వతం చుక్కలపర్వతం ఏడుమైళ్లూ వ్యాపిస్తుంది. పున్నెణ్ణి, శ్రీ వేంకటేశ్వర సన్నిహిత భక్తబృందంలోంచి రెండువేల మైళ్లన్నా విసిరివేసేటందుకు ఒక మాఘ శుద్ధ ఏకాదశినాడు బిచ్చకుల ఆశ్రమాలన్నీ తీర్మానించుకున్నవి.

ఆతీర్మానం ప్రకారము బిచ్చగాళ్లకు అన్నము, సాంబారు అమ్మేవాళ్లు అమ్మడం మానివేసినారు. నీరు తెచ్చేవాళ్లు నీరు తేవడం మానివేశారు. సరుకులు ఏడుమైళ్ల దారిపొడుగునా విక్రయించేవాళ్లు విక్రయించడం మానివేశారు. పున్నెడు మొదట వేళాకోళ మనుకున్నాడు. క్రిందఆశ్రమంలో పున్నె దిగుడు బావిలోనుంచి నీళ్లు పై ఆశ్రమాలవాళ్లకి విడి బిచ్చగాళ్లకి అమ్మేనీళ్లమనిషి పున్నెణ్ణి వెక్కిరిస్తూ



"......పున్నెణ్ణి వెక్కిరిస్తూ......"

రించి, "నీళ్లు నీళ్లు" అని పున్నెడు గోలపెట్టున్నా నడుమూ కటిభారం ఆడించుకుంటూ వెళ్లి పోయింది. పున్నెడికి కళ్లు పచ్చబడ్డాయి.

చెట్టునీడనే కూలబడి తల మొండికాళ్ల మీద ఆన్చి వున్నాడు. ఆలోచనలో మునిగి పోయాడు. తనజీవిత మంతా ఒక్కసారిగా ఫిల్ము తిరిగినట్లు పొడచూపింది.

పున్నెడు అనంతపురం జిల్లాలోని ఒక గ్రామములో నివసించే అభిమానవంతులైన ఒక రెడ్డికులంలో ఉద్భవించాడు. ఆవూరి రెడ్డి వారికి పక్కగ్రామం రెడ్డివారికి ఒకగ్రామం తగాదా వచ్చి కురుపాండవయుద్ధ మైపోయింది. అప్పుడు పున్నెడి పేరు పుణ్యాంరెడ్డి. పుణ్యాంరెడ్డి తండ్రిన్నీ, ముగ్గురు అన్నదమ్ములు, వీరస్వర్గం అలంకరించారు. పుణ్యాంరెడ్డి కాళ్లు రెండూ విరిగినాయి. ఆస్పత్రిలో రెండుకాళ్లూ ఛేదించి మొండిజగ్గణ్ణి చేసినారు. కుటుంబం యావత్తు నశించిన వెనుక వ్యాజ్యాలలో ఆస్తీ మాయ మైంది. కతిపయ ప్రయాణాలు చేసి రెండేళ్లకు వెంకటాచల సోపానపంక్తి రెండవ శేషాచల పతిలా అవతరించినాడు పుణ్యాంరెడ్డి. ఇంక రెండేళ్లలో పున్నెడయ్యాడు రెడ్డి.

పూర్వచరిత్ర లన్నీ మాయమై పున్నెడు కళ్ల రెండుచుక్కలు రాలినవి. అతనిగొంతుక ఎండినది. ఆకలితో మాడినాడు. కొండమీద దుకాణాలకు సరుకు అందుబాటుచేసే వర్తకులు వచ్చినప్పుడు పున్నెడు కొంతడబ్బు వారికి ఇచ్చి సాయంత్రానికి వంటసామగ్రి తెప్పించుకున్నాడు. డోలీలవాళ్లకు ఒకఅర్ధణా చేతిలోవేసి కుండెడునీళ్లు తెప్పించుకున్నాడు. ఆ సరుకుతో ఆనీటితో మూడురోజులుగడపినాడు.

నాలుగోరోజు తెల్లవారగట్ల మూడింటికి లేచి ముష్టికి తయ్యారైనాడు. తెల్లవారేవరకూ ఒకరూపాయిన్నర మూడుదమ్మిడీలు ప్రోగయి నవి. ఇంతలో మామూలుగా కొండమీద దుకాణాలకు సరఫరాదారుడు కందసామి వంట సామగ్రి తెచ్చియిచ్చే సమయ మైందని కొండ పైకి దిగువకు చూసి ఆప్రక్కనే నాలుగుబారల దూరంలో తాను నిద్రపోవుటకు ఏర్పరచు కొన్న పొదకడకు పోయి ఒకపెద్దరాయి తీసి చూసినాడు: ఆతనికళ్లు తిరిగి, "అమ్మయో" అని వెనక్కు వాలిపోయినాడు. ఆరాతిక్రింద పున్నెడు దాచుకున్న అయిదువందల డెబ్బది అయిదు రూపాయల మూట మాయమై పోయింది. పున్నెడుప్రాణం మరిగిపోయింది. రాతిమీదనుంచి క్రిందకు కూలబడిపోయి నాడు. కొంతసేపటికి అతనిమొగము జేవురిం చింది. ఈపని చేసినది మామూలుగా బిచ్చ గాళ్లతో వర్తకంచేసే కుప్పుస్వామిపని అని అనుమానము తట్టినది. వ్రటువలు తిరిగి, కండ లు కట్టి, హనుమంతుని హస్తాలవంటి బలమైన ఆతనిచేతులు భయంకరంగా వంకరలు తిరిగి నవి. ఆసమయంలో ఆతనిచేతుల కందిన ప్రాణి కబంధుని వాత బడినట్లే.

ఆరోజు దొరికిన డబ్బు నిచ్చి వంటసామగ్రి కొనుక్కున్నాడు పున్నెడు. ధనంతోపాటు


"కాని చల్లనిచేయి అతనిచేతిని పట్టి వెనక్కు లాగివేసింది."

ఆతనిబలమూ నశించింది, జీవితేచ్ఛా పోయినది. ప్రపంచంలో యుద్ధక్రమం గా సంసారయాత్ర చేసే ఆశ అడుగంటింది. తన విద్యలు చూపించి ముష్టి ఎత్తుట మానివేసినాడు. డబ్బు లేకపోతే తిండీ తిప్పలుపోయినవి. అయిదు రోజులయ్యేసరికి పున్నెడు అస్థిపంజర మై పోయి నాడు. పున్నెడు దుర దృష్టము వెంకటాచలా న్ని రాళ్లలా ఆశ్రయించి యున్న వర్తకులు మొద లైన యావన్మందికీ తెలిసి పోయింది.

శేషాచల బిచ్చకుల లోకానికంతా సంతోషమైనది. వదులుతాడురా పిశాచి అనుకున్నారు. అందరికీ ఇక కొంచెమో గొప్పో దొరుకుతుంది. ఇదివరకు పున్నెడున్నంత కాలము అదృష్టదేవత అతన్నే ఆవహించింది. ఇంకటినుంచి కొండమెట్లదారి ఏడుమెట్లు క్రిందికి పైకీ ఆమె తిరుగుతూ ఉంటుంది. మళ్లీ మంచిదినాలు వచ్చినవి—అనుకున్నారు.

నీరసించిపోయిన పున్నెడు ఆరోదినం రాత్రి స్పృహతెచ్చుకొని కొండమీదనుంచి పక్కనున్న లోయలోనికి ఉరికి వెంకటేశపాద సన్నిధి చేరుదామనుకున్నాడు. చేతులతో పాకి నూరడుగుల దూరంలో ఉన్న ఎత్తుబండల మీదికి పోయినాడు. గోవిందా! వెంకట రమణా, గోవిందా—అని ఉరకబోయినాడు.— కాని చల్లనిచేయి ఆతనిచేతిని పట్టి వెనక్కు లాగివేసింది

కళ్లు మూసుకున్న పున్నెడు శ్రీవెంక టేశ్వరుడు ప్రత్యక్షమైనాడనుకున్నాడు. ఆతని దేహము పులకరించింది. చల్లనిగాలులు ప్రస రించినట్లయింది. వెన్నెలలు పిండి ఆరగా కాచి నట్లయింది. ఆతడు కళ్లు తెరిచేటప్పటికి ఎట్ట ఎదుట ఆచుట్టుపక్కల బిచ్చగాళ్ల ఆశ్రమా లికి నీళ్లు బోసే బోయపిల్ల కనబడినది. ఆమె తీరైన నల్లనిమొగమంతా నక్షత్రాలవెలుగుల కాంతిలో కళ్లనీళ్లు మెరుస్తు కనిపించింది. ఆమె వెక్కివెక్కి ఏడుస్తూ "పున్నెడు, నాను

బహుపాపిని! నిండా దోసం చేసినా. ఆరుమాసాల క్రిందు రోగంవచ్చి దుడ్డులేక నబ్బరపడి నప్పుడు పత్తురూపాయి రహస్యంగా పంపిన నీ చల్లనిగుండె నాను తెలుచుకున్నా! చచ్చిన శుక్లపర్వతం కుష్టుముసాలిదానికి నువ్వు చేసిన చాకిరిదా నాబడంబు తిప్పినది. ఓసామి నీవు దేవుండు! నీకు వీండ్లు పిశాచిలు, నిండా ద్రోగం తలపోసినారే! నానుకూడా సరిదా అంటిని! ఓయ్! ఓయ్! నాను నరరక్కిసి! నాకు పదు నాలో కుంపిని నరకం!" అని పొంకమా వక్షం ఉబికిపోగా అతిదీనంగా పొర్లి పొర్లి వచ్చే ఏడుపును ఆపకుండా ఏడ్చింది.

పున్నెడు నిర్ఘాంతపోయినాడు. బోయపిల్ల మంగిని బలమైన చేతులతో దగ్గిరకు లాక్కున్నాడు.

"పిల్లా, నాకు కల్గిన యీసెబ్బరకు నాను దా దుఃఖం పొందేది లేదు. నిండా ఇంతకు మించి కష్టాలు తీరినై ఈపాణికి; కాని అతి మెత్తని నీకుదా ఏడ ఈగెట్టిమణసు అని విచారింసినా! మొన్న నీకళ్లు మేఘ్ఘాల రాత్రిలా ఉంసినైదా. ఇంగ పెంపంచికంలో మంచీ, పున్నెం లేదని తోసినదే. ఏల ఈపాణి బతికేది! అంతదా!"

"ఓసామి, నన్ను చెమించు! నాను రక్కసినిదా సెప్పంటినే! నీసామ్మొా దుడ్డు ఏక దాచేది నాకుదా తెలుసునే! వాండ్లమాయలో చేరి వాండ్లచెప్పినా! ఆపాపి కుష్ఠసామిదా తీసిందు అయ్యో."

పున్నెడు మొగం నవ్వింది. ఆతనిహృదయం వెన్నెల్లు కాసింది.

"పోయెలే! ఈపాణికి ఈచేతులిచ్చిన వెంకటసామి చల్లగా, పదిఅయిదునూర్లు సంపాదించలేనా! నువ్వు నా దగ్గిరుండేది. అంతదా!" అని ఆమెను తనచేతుల్లోకి తీసుకుని తల ముద్దుపెట్టుకొన్నాడు. మంగి తాను తెచ్చిన మంచినీళ్లు, కూడు, పున్నెడుకి నెమ్మదిగా తినిపెంచింది.

చుక్కలు నవ్వినవి. తమవైపు తిరిగి మోకారించిన ఆ నూతన స్త్రీపురుషుల తలపై నేసలు చల్లినవి మంచుబిందువులు. శ్రీవెంకటపతి తాను సలిపిన పెండ్లిళ్లకన్న ఇది మించిన దనుకున్నాడా!

---

# పెనుగొండ లక్ష్మి

పుట్టపర్తి నారాయణాచార్యులుగారు
(కవితాపోషక సమితి, తిరుపతి)

గండపెండేరంబు ఘలుఘల్లు మనుతానములతోడ దేశాక్షి బలుకునాడు
సులతాను లెల్ల తలలు వంచి గల్కితురాయీల సిను బూజసేయునాడు
ఆదివరాహధ్వజాంతరంబుల నీడ నీకీర్తి బరు నీసడించునాడు
గుహాలలోపల దూరికొన్న యాగజపతి తలపైని నీకత్తి గులుకునాడు

నీదు కన్నుల వెలిచూపు నీడలోన - చీమయును హాయిగా నిద్ర జెందునాడు
గలుగు నాంధ్రుల భావసాకల్య గరిమ - బూడిదను బడి నీతోడ బోయె తల్లి.

తలలన్ వాలిచి దీర్ఘకాలముగ నిద్రల్పోవు నీకోటగో
డలలో దాగిలిమూత లాడుకొనుచుండన్ ఘోరఘూకాలు గ
బ్బిలము ల్విచ్చలు గొల్వుదీర్చగను దేవీ యూర కిట్లుంటయున్
గలదే యాంధ్రుల రక్తనాళముల జిల్కన్ రాదె తేజంబులన్.

సెలవులలోన మొల్కనవు చిందగ ఖానులు పాద మంట ము
ద్దులు గొన కృష్ణరాయడు మదోద్ధతి గూర్చొనినట్టి ఈమహా
తలమున నంధకారములు దార్కొని దయ్యము లీను గంగలో
గలసెను సర్వమంటనుచు గట్టిగ నార్చెడు సౌధగర్భముల్.

ఉలిచేరాలకు చక్కిలింత లిడి నాయుః ప్రాణము ల్పోయు శి
ల్పుల మాధుర్యకళాప్రపంచము లయంబుం జెందె, బాతాళమున్
గలసెన్ బూర్వగవిత్వవాసనలు, నుగ్గైపోయె నాంధ్రావనీ
తలమెల్లన్ ఇక లేవు నాంధ్రులకు రక్తంబందు మాహాత్మ్యముల్.

జననీ, యేటికి వెగ్గలంబగు మనస్తాపంబుతో వల్లకా
టను సంచారము జేయ బుత్రులను జూడన్లేవు రాపాడుమ
న్నన సారూప్యము జెందె దేహములు నీనోరార నెన్నాళ్ళు బి
ల్చిన నీపర్వతకందరాలె జలమై చీకాకుతో నార్చెడిన్.

బాష్పకణ శీకరముల సంభరితములయి - వేడి నిట్టూర్పు గాడ్పులు వీవదొడగ
అఖిల మానవభావ పర్యంకమందు - కాలమును గూర్చి నీకన్నుగవను మోడ్పు.

తెలుగు రాయని బల్కుపొలతికి దానిమ్మ రసములో నుగ్గుపాల్గలిపి పోసి
ముసలియయ్యను మీసమును దువ్వ మారామనృపతి గుండెలకును నీరు జల్లి
తిరుమలరాయ పృథ్వీశు లేనవ్వువెన్నెలలోన గరువంపు మొలక వోసి
రామభూషణ కవిరాజు గోకిలచేత బలికించు హిందోళ గలియబలికి
ముక్కుతిమ్మన సృష్టించు ముద్దుగృష్ణు - గూకటులలోన నెఱకొండగోగు జెక్కి
అలసి సొలసిన మాయింటి యాడుబిడ్డ - ఘనగిరి నివాసినీ నమస్కార మిదిగో.

---

## 3

మొదలు తుదయును లేక మొనసి చీకట్లు
నిను గప్పి సంద్రమా నను బోలె నిపుడు
పొంగి పై కుబుకుచు పొర్లుచు వచ్చి
దుఃఖంపు కెరటాలు తూలుచునుండ
నిట్టూర్పుగాలుల నిగుడ జేయుచును
నను బోలె నేడ్చుచున్నావొకో నీవు—
చూడ జుట్టము లేక స్రుక్కుచు నుండి
మ్రొక్క దైవము లేక మొరయుచు నిలిచి
కనువారు వినువారు కనుపడకుండ
ననుబోలె నొంటి నున్నావె యీవేళ
ఇదియె మే లిదియె మే లిదే మేలు సుమ్ము
మనసారగా నేడ్చి తనివొంద నగును;
నిన్ను నేనును, నన్ను నీవు నోదార్చి
కొనుచు, కాలము ద్రోసికొనుచు నుందాము.

## ౪

గాలి మెండయ్యె మేఘాలు నిండయ్యె
వాన తొండాలతో పై బడుచుండె
నీకు శక్యము కాదు నాకడ నిలువ
నీవు నాలో చొచ్చి నిలువవచ్చెదవొ,
నేను నీలో చొచ్చి నిలువవచ్చెదనొ?
—వద్దు నీవు నాలోన
కలయగా వద్దు—
నీవు నాయెదలోన నిలువగా లేవు—
కన్నీళ్లరూపాన కరగి, యుప్పొంగి
పాటుతో—పోటుతో—పైకి వస్తావు.

వ్యర్థమే యది సుమ్ము—
నేను నీలో చొచ్చి నిలువ గల్గెదను
నీ కసాధ్యము నన్ను పైకి ద్రోయంగ
నేను నీలో చొచ్చి నిలువ నిద్దరము
దివ్యస్వరూపాల తేజరిల్లెదము
ప్రళయ మయ్యది యౌను ప్రళయమే—
ప్రళయాన యోగనిద్రను దేలియాడి
నీయందు నిల్చి నారాయణునట్లు
నేను నీలో నిల్వ—నీకును నాకు
నన్యోన్యవైభవం బమరును జుమ్ము!

*   *   *   *

దరిదాపు గనరాదు—తడ వేల నింక
ఇదిగో—నీలో జొత్తు నేను—

*   *   *   *

*   *   నను గొమ్ము

*   *   *   *

*   *   *   *




## దూలగొండి

అవసరాల రామారావుగారు

అనగా అనగా ఒకూరు. ఆవూళ్లో ఓ బ్రాహ్మడు. ఆయ నోనాడు పొరుగూరికి పోతూండినాడు. దారిలో ఓ చెరువును చూచాడు. స్నానంచేశాడా చెరువులో. దాని గట్టుమీద ఓతొలసిమొక్క వుంటే దానికి ప్రదక్షిణంచేశి ఓదళం గిల్లి చెవులో పెట్టకొని తనదారిని బయలుదేరాడు.

ఆదారినే ఓసాయేబుగారు పోతూ పండ్లుతోముకోడానికి ఆచెరువుదగ్గరఆగి ఆబ్రాహ్మడు చేశిందంత చూచాడు. 'అరే, బొమ్మణ్, వెర్రివాడు హుండాడ్; హిడ్కి హ్వాయీదేమ్డా, మొహ్వాదేమ్డూ. హీడి దేమ్డూ మాకీ హేమీ శేస్తాడ్' అంటూ తొలశిమొక్కను పెరికి నలిపి దూరంగా పారేశి బ్రాహ్మడు పోతూన్న దారినే పోయాడు. బ్రాహ్మడికి కోపంవచ్చింది. కాని ఏంచేస్తాడు?

ఓకొంచెందూరం నడిచాడు బ్రాహ్మడు. అక్కడ దూలగొండిమొక్కొకటి కనుపడింది. దానికి ప్రదక్షిణంచేసి, సాష్టాంగపడి, ఓరెమ్మ గిల్లుకొని తల్లో పెట్టుకొని బయలుదేరాడాయన.

ఈమూరు సాయేబుకు మరీ మండిపోయింది. 'అరే ఈబొమ్మన్కి బుద్ధీ లేదు, గిద్ధీలేదు. ఈడ్కి బాగాబుద్ధీ బోల్తాను' అని దూలగొండిమొక్క నూడబెరికి బాగా రెండు చేతులతో నలిపి తనకాలికి బాగ రుద్దిపారేశాడు. అంతే బలేదురద పుట్టుంది. చెడగీరాడు. కాలు వాచింది. మంట పుట్టింది. విపరీతంగా బాధ కలిగింది. "అరే అల్లా, అల్లా, బొమ్మన్కి దేమ్డూ హెంతా శేశాడు, హెంతా శేశాడు" అంటూ గోలెత్తాడు.

సాయేబుకు తగిన శాస్తయిందని బ్రాహ్మడు పొంగిపోయినాడు.

కథ కంచికీ, మనం ఇంటికీ.

# నల్లమందు

కప్పిలి జానకిరామారావుపట్నాయకులుగారు

అనగనగ ఒకరాజు. ఆరాజుదగ్గర ఎప్పుడూ ఒకకోతి ఉండేది ఆయనకు వేటంటే భలేపిచ్చి. ఒకనాడాయన కోతిని తీసికొని గుర్రంమీద ఎక్కి వేటకు బోయినాడు. ఎంత సేపు తిరిగినా ఏమీ చిక్కలేదు. కొంత సేపటికి ఒకజింకపిల్ల ఎగురుతూ ఆదారిన వచ్చింది. రాజు దాన్నితుపాకితో కాల్చినాడు గాని అది తప్పించుకొనిపోయింది. రాజు దాన్నితరుము కొని పోయినాడు. అది పరుగెత్తి పోయి పోయి ఒకచెరువుదగ్గర పొదలలోకి పోయి మాయమైంది. ఆచెరువులో తూగుతూన్న ఒకకొంగఉంటే రాజు దాన్నిచంపి, తీసుకొని యింటికి బయలుదేరినాడు.

ఇంతలో చీకటిపడింది. చీకటికితోడు జోరువాన పట్టుకుంది. రాజు మంచివేగంతో పోతూ ఒకగోతులోపడ్డాడు. ఆగోతులో పెద్ద కొండచిలువొకటి ఉండి ఆయన్ను, గుర్రాన్ని ఆయనకోతిని, చచ్చినకొంగను మింగేసింది. కాని యింతలో వానసీళ్లచేత గుంట నిండింది. ఆగుంటలోనే చచ్చింది ఆపాముకూడాను.

కొన్నాళ్లకు క్రమంగా గుంట పూడి పోయి అక్కడ ఒకచెట్టు మొలిచింది. ఆచెట్టు కాయలనుంచే నల్లమందు పుట్టింది. కాబట్టి నల్లమందులో ఆగుంటలోచచ్చినవాటి అన్ని గుణా లేర్పడినవి. రాజువల్ల రాజసం, కోతి వల్ల కోతిచేష్టలు, గుర్రంవల్ల మంచిబలం, కొంగవల్ల కునుకు పాటు, పామువల్ల విషం. ఇన్ని తిన్నవాళ్లకు ఉంటాయి. తుపాకిమందు మాదిరిగా అది నల్లగా ఉంటుంది.

---

# చిన్నపిల్లవాని కోర్కెలు

రావు వెంకట్రావుగారు

తిమ్మరుసు మంత్రికొడుకు అప్పరుసు. తండ్రి యనంతరము అప్పరుసు మంత్రిగా కృష్ణదేవరా యలవద్ద కొలువుండెను. ఒకసారి అతడు ఆస్థానమునకు చాల ఆలస్యముగా వెళ్లుట మొదలిడెను. ఇట్లు చాలరోజులు గడచిన తరువాత ఒకనాడు రాయలవారు మంత్రితో "అప్పాజీ, మీరీమధ్య చాల ఆలస్యముగా ఆస్థానమునకు వచ్చుచున్నారు. కారణమేమి?" అనిరి. అందులకు అప్పరుసు ఇట్లనియె: "అయ్యా, నేనేమని మనవి జేయగలను. మాచంటిపిల్ల వాడు చాల పట్టుదల కలవాడు. వాడిది మొండిపట్టు. వాడికోర్కె తీర్చుట చాలకష్ట ముగ నున్నది. వానిని ఏదోవిధముగ నూర కుండబెట్టివచ్చుటచే నాలస్య మగుచున్నది. దేవరవారు మన్నింతురుగాక."

అంత రాయలు మంత్రివైపు చూచి నవ్వుచు, "అప్పాజీ! మీరు చెప్పినమాటలు వినగ నాకాశ్చర్యము కలుగుచున్నది. నారాజ్యమునకు మీరు ముఖ్యమంత్రులయ్యు మీరు పిల్లవానికోరిక తీర్చలేకపోవుటయేమి" అనిరి. అంతమంత్రి "అయ్యా, ఆతడు అందరి పిల్లలవంటివాడుకాడు. నేను సత్యమునే చెప్పచున్నాను" అనెను. అంత రాయలవారు "అట్లయిన పిల్లవాని నిచ్చటి కొకసారి తీసుకుని రండు. పరీక్షించెదను. మీమాటలు నేను నమ్మజాలను" అనిరి. 'చిత్తము' అని మంత్రి సెలవుతీసుకుని వెళ్లెను.

మరునాడు అప్పర్సు పిల్లవానిని ఆస్థానమునకు తీసుకువెళ్లి రాయలవారివద్ద నిలువబెట్టెను. రాయలునవ్వుచు పిల్లవానినితొడపై గూర్చుండబెట్టుకొని "అబ్బాయీ, నీకేమి కావలెను" అని ప్రశ్నించెను. ఆతడు "నాకు ఒకఏనుగుపిల్ల కావలె"నని అడిగెను. "ఈమాత్రమునకేమి భాగ్యము" అనుచు వెంటనే రాయలు భటుల కాజ్ఞాపింప వారు ఏనుగుపిల్లను తెచ్చి బాలునిముందు బెట్టిరి. "ఇంక ఏమికావలెను" అని అడిగిరి. ఆబాలుడు "నాకు ఒకజారీచెంబు కావలె"ననెను. వెంటనే చెంబు సిద్ధమయ్యెను. వెంటనేపిల్లవాడు రాయలతో 'ఆయేనుగుపిల్లను ఈజారీలోపెట్టుము' అనెను. రాయలు తెల్లబోయెను. పిల్లవాడు ఏడువ మొదలుపెట్టెను. సభలో అందరు నవ్విరి. పిల్లవానియేడుపు వృద్ధిఅయ్యెను. రాయలు అప్పర్సువైపుతిరిగి 'అప్పాజీ, నేనోడితిని' అనెను. కథ కంచికి వెళ్లింది. మనము మనయింటికి వచ్చాము. బోడిఆవు మీది, పాడిఆవు మాది.

---

## సౌందర్య చైతన్యము

కొమర్రాజు వినాయకరావుగారు

క్రొంకు రవిర క్తకాంతుల గొప్పదనము
మెరుగు మునిమాపు పసిమిలో మెత్తదనము
చుక్క కనురెప్ప వాల్పుల చులుకుదనము
చవితి నెలవంకలో నున్న చక్కదనము
చారుతరమైన వేకువ చల్లదనము
తరుణభానుని నవదినోదంత కాంతి—
అస్మదాత్మైక రుచిర దృగంచలముల
గొల్పి మిరుమిట్లు, సౌందర్యగుణము రేపు!
చెప్పరాని యశాంతితో చిత్త మదరి
సుందరానంద చైతన్య సుఖము గాంచు!

---




# కుట్టుపని

కో. నరసింహాచారిగారు

## అలంకారపు అంచులు

## (Ornamen'al Borders)

కుట్టుపని యందఱకును మిగుల ఉపయుక్తమగు విద్య. ఇందు, కష్టమగుపనియంతయు దర్జీవానిచే చేయబడుచుండినను, వాని పనియంతయు సాధారణమయిన కుట్టుపనియే అయియున్నది. అలంకారపుపని యంతయు మనమే చేయ నేర్చియుండుట మంచిది. కుట్లలో అలంకారమునకు ఉపయోగపడునట్టివి అనేకవిధములు కలవు. వాటిలో ఒక్కొక్క విధమునుగుఱించియు ఇందు వరుసగా జెప్పబడును.

మిక్కిలి సులభమగు కుట్టును వేయుట చిత్రము ౧ యందు కలదు. దారముతోటి సూదిని బట్టకు అడుగు ప్రక్కనుండి a వద్ద వెలికి దీయవలెను. అప్పుడు దారపుకొన బట్టకు అడుగున మరుగుపడియుండును. పిమ్మట సూదిని b వద్ద గ్రుచ్చి, c వద్ద వెలికి దీసి d వద్ద గ్రుచ్చి, e వద్ద వెలికిదీసి f వద్ద గ్రుచ్చి, g వద్దను, h వద్ద గ్రుచ్చి i వద్దను వెలికి దీయుచు కుట్టుచు బోయినయెడల చిత్రము ౧ యందలి రీతిగ కుట్టు ఏర్పడును. ఈ సులభమగు కుట్టును వివిధములగు అలంకారపు అంచులు (Ornamental borders) కుట్టుటకు ఉపయోగించవచ్చును. చిత్రములు ౨-౭ వఱకు చూడుడు. బట్టయొక్క రంగునకు తగినట్లు దారపురంగు ఉండవలెను. ఈ అంచులను చిత్రము ౧ యందలి విధముగ నేరుగ కాక, చిత్రములు ౮-౧౨ వఱకు చూపబడియుండు రీతిని వేరువిధముగగూడ వేయవచ్చును. చిత్రములు ౮-౧౨ వఱకును చిత్రము ౨ నందు గల అంచు (border) ను కుట్టుట చూపబడియున్నది. చిత్రము ౮ యందు a వద్ద సూదిని వెలికి లాగి b వద్ద గ్రుచ్చి c వద్దను, చిత్రము ౯ యందు d వద్ద గ్రుచ్చి e వద్దను, చిత్రము ౧౦ యందు f వద్ద గ్రుచ్చి g వద్దను, చిత్రము ౧౧ నందు h వద్ద గ్రుచ్చి i వద్దను, చిత్రము ౧౨ నందు j వద్ద గ్రుచ్చి k వద్దను వెలికి లాగవలెను. g అనునది f c ల మధ్య నుండుట గమనించవలెను.

౭, ౧౩, ౧౪, ౧౫, ౧౬, ౧౭, ౧౮, ౧౯ చిత్రములందు కుట్లు నిలువుగను

అడ్డముగను వేయబడియున్నవి. చిత్రము ౧౭ నందలి అంచు (border) ను ఒకే రంగు దారముతో కుట్టుకీతి, చిత్రము ౧౯-౨౧ వఱకు చూపబడి యున్నది. చిత్రము ౧౯ యందు సూదిని a వద్ద వెలికి లాగి b వద్ద గ్రుచ్చి c వద్దను, చిత్రము ౨౦ యందు d వద్ద గ్రుచ్చి e వద్దను, చిత్రము ౨౧ లో f వద్ద గ్రుచ్చి g వద్దను, వెలికి లాగి ఈరీతి గనే కుట్టుచు పోయినయెడల చిత్రము ౧౭ నందలి అంచు ఏర్పడును.

ఇంతవఱకును చెప్పినట్టికుట్టుకంటె చిత్రములు ౨౨-౨౪ వఱకు గంకుట్టు వేఱురీతిదై గట్టిగ నుండును. చిత్రము ౨౨ నందు a వద్ద సూదిని దీసి b వద్ద గ్రుచ్చి, c వద్దను చిత్రము ౨3 నందు మరల a వద్ద గ్రుచ్చి d వద్దను లాగుచు ఇట్టులనే కుట్టుచు బోయిన, చిత్రము ౨౪ నందలివిధముగ కుట్టు ఏర్పడును. ఇది బట్టల అంచులను మడిచి గట్టిగా కుట్టుటకును ఉపయోగించును. ఈకుట్టునే కొంత దూర దూరముగ దారము కనబడునట్లు వేయు విధము చిత్రము ౨౫ నందు చూపియున్నది. ఇంక నితర విధములగుకుట్లు మునుముందు ప్రచురము కాగలవు.

---



కాకినాడలో నౌకభాగము

(ఉప్పళము వగైరాలు)

ఛాయాచిత్రకారుడు: బి. రామారావుగారు,

# శ్రీముఖము

"శ్రీముఖమా! ఏ క్షేమములు? —"

"శీఘ్రకేఁ జూడవా? —"

"యాంత్రమార్గానే శ్రీముఖమైతివా? —"

"కృతులు సెప్పవా —"

"చెంతలా? —"

"తొంటిపెద్దలే నేమముఁ బెట్టినారు —"

"మఱి నీ వెటుఁ దప్పెదు? —"

"కాలకంఠమున భాసములు తప్పునే? —"

"ప్రకృతిబాధమహాత్ములు స్వైరకరులు కారే?-"

బాలాంత్రపు వేంకటరావు



E. N. P.

అవలోకితేశ్వరుడు.

పెకింగులో చైనీసు లామా దేవాలయమునందలి స్వర్ణ మందిరమున.

# ఎన్నికల మజా

భమిడిపాటి కామేశ్వరరావుగారు

[౨౧-౧-33 తేదీని డాక్టర్ సర్ యస్. రాధాకృష్ణన్‌గారి అధ్యక్షత క్రింద రాజమండ్రీ ఆర్ట్సుకాలేజీలో పాత విద్యార్థుల సంఘం తరఫున జరిగిన సభలో ఇందులో చాలాభాగం చదవడం అయింది.]

## పాలకసంఘాల్లో ఎన్నికల మజా

కొందర్ని మరికొందరు పాలించడం అవసరం ఆదినించీ వస్తూనే ఉంది. ఎవరేనా కన్య పూర్వం "యావజ్జీవితం నన్ను పాలించవయ్యా" అని తనికి నచ్చిన నాథుణ్ణి స్వయంగా వరించేది. కొంతకాలంపాటు కన్య తరఫున కన్య తండ్రి బయల్దేరి కన్యకి నాథుణ్ణి వరించి పెడుతోచ్చాడు. ఇటీవల మళ్లీ కన్య తన వరుణ్ణి స్వయంగానే ఎన్నుకుంటూంది. అట్లాగే ఆదిని ప్రజలు తమర్ని కాస్తంత పాలించి పెట్టడానికి నాథుణ్ణి తమరే ఏరి తీసుకునేవారు. కాలక్రమాన్ని, ప్రజల్ని పాలించడానికి మాకుమాత్రమే దేవుడు హక్కిచ్చాడు, ఇంకోడు ఎవడేనా తనికీ అల్లాంటి హక్కుందని చెలరేగితే వాణ్ణి పాతెయ్యగలం, అని చెబుతూ కొందరు బలశాలులు బయల్దేరుతోచ్చారు. ఇటీవల మళ్లీ ప్రజలే తమ పాలకుల్ని ఎన్నుకోడం ప్రారంభించారు. పూర్వకాలపు వివాహ సంబంధమైన స్వయంవరం పోటీల్లో నెగ్గడానికి ఎవరికేనా ప్రజ్ఞ, బుద్ధి, బలం, ధనం, వగైరాలు అవసరంగా ఉండేవి. ఇప్పటి పరిపాలనతో సంబంధించిన ఎన్నికల పోటీల్లో నెగ్గడానికి ఎవరికేనా, సంగోరుధనం సంగోరు నక్కజిత్తులూ ఉండాలి. లేక ఒకవేళ ధనహీనుడైనా పరిపూర్ణమైన నక్కజిత్తు లుండి, ఇంకోడిచేత ధనం పెట్టుబడి పెట్టించినా చాలు, చక్కటి 'ఛాన్సు' ఉంటుంది. వెనకటి స్వయంవరాల్లో, పేరుపడ్డవారు, చాలావేషం వేసుకుని, శృంగార చేష్టలు చేస్తూ, సిగ్గుపడుతూ కూర్చునే వారనిన్నీ, అప్పుడు "బాల రావే, పోల నీభూ" లాంటి పాటలో కన్యయొక్క చెలికత్తె ఆయా మహానుభావుల గుణగణాదికం వర్ణించేదనిన్నీ, పూలదండకోసం అంతమంది అర్జులు చాచుకుని ఉన్నా, కన్య తనికి నచ్చిన వాడికే వేసేదనిన్నీ, తరువాత, అవసరంచొప్పున, వాడు, తక్కినవాళ్లని తన్నేవాడనిన్నీ, చదువుతాం. నేటి నవనాగరికతతో నిండిన ఎన్నికల్లో పేరు లేనివారైనా, చాలావేషం వేసుకుని, బీభత్సపు పనులు చేస్తూ, సిగ్గుపడుతూనేనా కూర్చోక, తమ ఆస్తి తినేసే తమ ఏజంట్లు తమకి అన్యాయం చేస్తారేమో అనే భీతిచొప్పున తమరే ఊరేగుతూ తమ ప్రభావాదికం వీళ్లేకొచ్చిందని చెప్పి వర్ణించుకుంటూ, తమరు నచ్చిన మీదట తమకి దక్కవలిసిన విజయ పుష్పమాలని తమరే అక్రమంగా ఊడలాగి, తెంపేసి తెచ్చుకొని, మెడకి చుట్టుకుని, అది సక్రమంగానే తమకి సంక్రమించినట్టు నటించుతూండడం, చూస్తున్నాం. మానవసేవ చేసి, ఆత్మార్పణంచేసి తరించడానికి మాకు ఎక్కడా జాగా కనిపించకపోడంచేతనే, మేం పాలక సంఘంలోకి జొరపడ్డాం అని చాలామంది పైకి ప్రకటించినా, చేతైతే అధికారం వీలైతే ధనం వద్దన్నా నమస్కారాలు వగైరా అతి స్వల్పకాలంలో సంపాదించచ్చుగదా అనే ఉద్దేశం చాలామందికి లోపల ఉండడంవల్లే సంఘసభ్యత్వాలకి అంతంతపోటీ బయల్దేరడం. పల్లెలకికూడా పాలకసంఘా లున్నాయి. అందుకని కుగ్రామ, గ్రామ, పట్టణ, తాలూకా, జిల్లా, రాష్ట్ర), దేశ—పాలక సంఘాలు ఏర్పడేటందుకుగాను ఎన్నికలు జరుగుతూంటాయి. ఎన్నికలు నాగరికత వెల్లడించే కోడిపందాలు. ఎన్నికల రోజుల్లో విస్తారంగా "కారు" కూతలు వినిపిస్తూంటాయి. ఎన్నికల్లో ద్రవ్యం అపవిత్రంగా ప్రవహిస్తూండడంవల్ల ద్రవ్యపదం ఏకకాలమందే వ్యర్థం సార్థకంకూడా అవుతుంది. ఉపాయాలు నాలుగే అనే మాట కేవలం తప్పనిన్నీ, శతకోటి దరిద్రాలు లేకుండానే ఇతర అవసరాల్ని బట్టి అనంతకోటి ఉపాయాలు మానవులకి తట్టుతా యనిన్నీ ఎన్నికల్లో రుజువు

దొరుకుతుంది. ఎన్నికలనిఘంటువులో అసత్యం, అధర్మం, అన్యాయం, ద్రోహం, క్రౌర్యం, దారుణం లాంటి మాటలు ఉండవు. ఒకడు, తాను ఏంజెయ్యడానికి వెడుతున్నాడో తెలియకుండానే పెట్టుబడి పెట్టవలసిన అగత్యం ఉండేది ఒక్క ఎన్నికల వ్యాపారంలోనే. ఒకడు పొడుపన్లు చేస్తూంటే, మనంకూడా—నెగ్గాలంటే—అంతకంటె పొడుపన్లు చెయ్యవలసి వొచ్చేది ఎన్నికల్లోనే. ఎంత పైపైకి ఎగరాలంటే, అంత లోపలలోపల గోతులు తవ్వవలి సొచ్చేది ఎన్నికల్లోనే. ముక్కుకి సూటిగా వెళ్లకూడనిది ఎన్నికల్లోనే. అర్హత అనే మాటేనా స్మరించవలసిన ఒక్కు లేకుండా చాలామంది జుట్లు నాచేతులోకి వస్తాయిగదా అని చివరకి నిందుసున్నారావైనా సరే మురియడానికి వీలుండేది ఎన్నికల్లోనే. ఎన్నికల్లో నెగ్గడమనేదే పరమావధి. “వాడెల్లా నెగ్గాడ్రా, వీడెల్లా జయించాడ్రా” అని ఆశ్చర్యపడే వాడు పూర్వకాలపు ఘటం. ఎన్నికల్లో నెగ్గిన వాడి ఊహా, వాడి పరివారంయొక్క ఊహాకూడా ఏమిటంటే, “ఇక చాలు. మనం కోటలో పాగావేశాం అన్నమాటే” అని. నెగ్గేసరికే ఎవరికేనా అన్నివిధాలా అస్తమయం అవుతోంది గనక, ఆ తరువాత చేసేపని కనిపించదు, కనిపించినా కరచరణాలు ఆడడానికి సత్తువ ఉండదు. ఎన్నికల్లో విజయం పొందిన వాళ్లకి సాధారణంగా స్థితి పాడైపోతుంది, అపజయం పొందిన వాళ్లకి స్థితితో పాటు మతికూడా పాడైపోతుంది.

ఒకచోట, ఆశ్రయింపులు, బెల్లింపులు, ప్రార్థనలు, తిట్లు, తిప్పలు, తిరుగుళ్లు, మారాముళ్లు, దగాలు, బెదిరింపులు, కొట్టుగోడాలు, అరెస్టులు, వారంట్లు, ఛార్జీలు, వగైరాలతో పాలకసంఘసభ్యుల ఎన్నికలు అనే “ఎలెక్షన్” జాతర జరిగింది. పాలకసంఘంలోకి, మొత్తం ౧౮గురు ఆసాములు గెల్చి పడ్డారు. వీరిలో చాలారకాల జనం ఉన్నారు. కాని, భీమయ్య నారయ్యలనే ఇద్దరు పెండేసిపప్పులు బయల్దేరి చెరోపార్టీ లేవదీశారు. ఎందుకూ? అధ్యక్షుణ్ణి ఎన్నుకోడానికి. ఇక ఎన్నికదినం మూడు రోజు లుందనగా, భీమయ్యపార్టీలో ౧౧-గురు, నారయ్యపార్టీలో ౭-గురు ఉన్నారు. విజయం భీమయ్యకి తప్ప దనుకున్నారు. అప్పుడే మహా, భీమయ్య గర్వించిపోయి, అతినమ్మకంతో, అధ్యక్షుడిపార్టు ఎట్లా అభినయించాలో “రిహార్సలు” వేసుగుంటూ, బ్యాండువాళ్లకీ తాషావాళ్లకీ బజానాలు పారేసి, టీ వగైరా పార్టీలకిఖంజాయించాడు. అయితే భీమయ్యపార్టీలో ఒక అతడు చిన్నతనంనించీ తాగుడుతో ఏక తీసుగుని, బాధపడేవాడున్నాడు. అతని పేరు తుమ్మయ్య. ఆబాధతో సాయంత్రపేళప్పుడుఅతడు మందు వేసుగోడానికి తాగుడాసుపత్రికి వెడుతూంటే, నారయ్యతాలూకుజనం ఆతణ్ణి పసికట్టి, అతడి అవస్థకి జాలిపడి, అతణ్ణి కారుమీాద ఎక్కించుగుని లేవదీసుకుపోయారు. ఒకపార్టీ పురుషుణ్ణి రెండోపార్టీవారు లేవదీసుకుపోవడం ఎలెక్షన్ నాటకంలో రాక్షసశృంగారం. లేవదీసుకుపోయి, అతనికున్న నూరు రూపాయిల బాకీ తీర్చడమే కాకుండా, అతణ్ణి సారాభ్యంగనం చెయించి, అతగానికి సీపానివాసం ఏర్పాటుచేశారు. దాంతో, అతనికి బాహ్యాంతరాల్లో ఆ అమృతస్పర్శ కలిగేసరికి అతడు ఆ అపస్మారకస్థితిలోనే నారయ్యమతస్థుడైపోయాడు. ఉపాధ్యక్షుడిస్తాం అని ఆశపెట్టి ఒక సోమయ్యనీ, మరో మరో ఆశపెట్టి ఒక కోనయ్యనీకూడా నారయ్యపక్షానికి తిప్పేశారు. మనసారా ఏపార్టీకీ చెందక ఊగీసలాడే అనామకులు, తూకానికి పనికొస్తారు గనక, వాళ్లరేటు క్షణానికి రూపాయి చొప్పున పెరిగిపోతుంది; ఆఊగీసలాడేవారు నామకులైతే అసలుకే ఉద్వాసన చెప్పేవారు కావచ్చు గనక, వాళ్లు ఉభయభ్రష్టు లవుతారు. అక్కడితో నారయ్యపార్టీ ౧౦ అయింది, భీమయ్యది ౮ అయింది. ఇక ఆమర్నాడు అధ్యక్షుడి ఎన్నిక. నారయ్య తన ౯ గురుజనాన్నీ ఖైదీలను పట్టినట్టు పట్టి ఓ మేడలో జేర్చాడు వాళ్లు అక్కడే పిండివంటల్తో దట్టంగా భోజనం కానిచ్చారు. రాత్రి ౧౦ గంటలవేళప్పుడు ఒకతను—తుమ్మయ్యే గావును—బాహ్యానికి వెడతా నన్నాడు. నారయ్య ముందు తనే దొడ్లోకెళ్లి, దానికి ఇతరదార్లు ఎవీ లేవని ముందు తణికీ చేసి చూసి, గోడమీాద ఓణ్ణి కాపలా కూచోబెట్టి, వాడు మళ్లీ అవతలకి పోతాడేమో అని వాణ్ణి గొలుసుతో తాళం

వేసి, అప్పుడు తుమ్మయ్యని పంపి, తను ఇవతల కాపలా ఉండి, అతడు వచ్చింతరవాత, వాళ్లిద్దర్నీ మళ్లీ మేడెక్కించాడు. అంతా పడుకున్నారుగాని, నారయ్యకి కునుకు లేదు. రాత్రి ౧౨ గంటలకి సోమయ్యకి ఓ టెల్లిగ్రాం ఉందంటూ ఒక భంట్రోతు వచ్చి తలుపు కొట్టాడు. కాని నారయ్య సంగతి ఊహించుగుని, తలుపు తియ్యకుండానే, 'సోమయ్య ఇక్కడ లేడు' అని కేకేశాడు. 'పోనీ మీరు పుచ్చుగోండి' అని భంట్రోతు కేకేశాడు. 'నేను నిద్దర్లో తున్నాను ప్రస్తుతం' అని నారయ్య అనేసి ఊరుకున్నాడు. నారయ్య పార్టీవా రంతాకుడా రామాయణాలు నెత్తిమీద పెట్టుగుని, ఒకరికి ఒకరు ద్రోహం చెయ్యకూడదనిన్నీ, కలిసి ఉండాలనిన్నీ ప్రమాణాలు చేసుకున్నారు. రామాయణాలు పెట్టుగున్న కారణం ఏమిటంటే, వారు పురాణాలు ఎంత పాటిస్తారో ప్రమాణాలుకుడా అంతే పాటించాలనే ఊహ ఉందని చెప్పడానికి. తెల్లారింది. వారు కాఫ్యాదులు అక్కడే పుచ్చుగుని, భోజనం అక్కడే చేశారు. మధ్యాహ్నం, ౧౨ గంటలకి కచేరీకి వీళ్లు వెళ్లాలి—ఒక మారుమూలదారంట, ౨ మైళ్లు వెళ్లాలి. పదకొండుగంటలకే రెండుకార్లు తెచ్చారు—నాలుగుపక్కలా గాలి చొరకుండా గంతలు కట్టి. కాని, ఈలోపల తెలిసిన సంగతిపట్టి బయల్దేరడానికి జంకారు. ఏమిటా సంగతీ? మధ్య దారిలో భీమయ్య పార్టీజనం కాసి, నారయ్య కార్లని కార్లల్లో జనాన్నీ మెత్తగా గుండకింద కొట్టేస్తారనిన్నీ, అధికారుల్లో బంధువు లుండడంవల్ల వాళ్లు నిర్భయంగా ఉన్నారనిన్నీ. మచ్చుచూద్దాం అని చెప్పి నారయ్యస్నేహితుడు ఒకాయన బయల్దేరి ముందుకార్లో వెళ్లాడు. వెళ్లేసరికి, భీమయ్యజనం కర్రా కంపా పుచ్చుగుని ఆకారు మీద పడ్డారు, మెంబర్ల కారేమో అనుకుని. డ్రైవరు తెలివిగలవా డవడంచేత కారుకి కించిత్ డామేజీతో దాటింది. ౧౧న్నరకి ఇంకో స్నేహితుడూ అల్లానే కారు మీద వస్తూంటే అతణ్ణీ బడితిబాజా చేస్తూ, "ఈదార్ని కారెల్లా వెడుతుందో చూస్తాంగా!" అన్నారట. అంతే అతడు వెనక్కి మళ్లిపోయి, ఒక గట్టి ఉద్యోగస్థుణ్ణి ఒక కారులో కూచోపెట్టి ఆదార్ని పంపించాడు. భీమయ్యజనం ఆకార్నీ ఉతిగారు. అతడు కారు దిగి, ఉద్యోగపుకర్రలూ పనిముట్లూ తిప్పేసరికి, భీమయ్యజనం చెల్లాచెదరైపోయారు. అప్పుడు ఆఉద్యోగి వెనక్కి వెళ్లి, దగ్గిరుండి, నారయ్య మెంబర్ల కార్లు బయలుదేరదీయించాడు. పాపం, మెంబర్లంతా అందులో కూచున్నారు, ఘోషాస్త్రీల లాగ, చిన్న చిన్న సందులు చేసుగుని ప్రపంచంలో జనాన్ని చూస్తూనూ! టైముకి ముందే కార్లు కచేరీలో ఆగాయి—జంతు లుండే సర్కస్ బళ్లు మైదానంమీద ఆగేరీతిగా! నారయ్య తన జనాన్ని దిక్కులు చూడనియ్యకుండా (చూడనిస్తే, ఏ మెంబరేనా అవతలపార్టీని ఎక్కడమోహించి ఏక్షణంలో లేచిపోతాడో అని) లోపలికి నడిపించుగువెళ్లి, కూచోమని, వోట్లు వెయింపించాడు. సోమయ్య మాత్రం, నారయ్య నెగ్గడం సంగతి రూఢికదా అనే సంతోషం పట్టజాలక, "నాఓటు నారయ్యదే!" అని పేరు చెప్పి కేకేశాడు. దాంతోటి అక్షరాస్యు డవడం వల్ల అతని ఓటు కందిపప్పు కాటోయినట్టై మూలబడిపోయింది. అయినా సరే, ఒక్క ఓటు ఎక్కువతో, నారయ్య అధ్యక్షపదవి లాగేశాడు. భీమయ్య ఆత్మహత్య చేసుగుందాం అని సంకల్పించుగోకపూర్వమే అతని జాతకం బాగుండచ్చునని ఎవరో జ్యోతిషం చెప్పగా ఆగిపోయాడు.

సోమయ్య ఓటు నపుంసకం కావడంచేత, అతను నారయ్యకి చేసిన సాయం లేకపోవడంచేత అతనికి ఉపాధ్యక్షపదవి దొరకలేదు. అతనికి మొహం జేవురించింది. బుట్టలో పడిపోయాడు గాని నారయ్య పార్టీ అంటే అతనికి ఇష్టం లేదు, అసలు వైరంకుడాను. ఇంతలో మరోటి జరిగింది. ఈసంఘం తరఫున ఉన్న ఒక బళ్లో ఒక మేష్టరీ ఖాళీ వచ్చింది. ధాన్యం చవకైం తరవాత మేష్టరీ ప్రియమైంది. సోమయ్య మేనమామ కొడుకొకడు పరీక్షలై, ట్రైనింగై, కడంవి అన్నీకుడా అయి, మేష్టరీపోస్టు నిరీక్షిస్తున్నాడు—లకుముకి పిట్ట చేపకోసం లాగ. అతగానికి ఆకాస్తపోస్టూ పారెయ్యవలిసిందని సోమయ్య నారయ్యని లోపాయికారీగా కోరాడు. శాస్త్రం చెప్పినట్టయింది. నారయ్యకీ మేనమామ లున్నారు. వాళ్లకి ఆమాంబాపతూ ఆరుగురు కొడుకు లున్నారు, మేష్టరీ చెయ్యడానికి తలపాగా

చుట్టుగుని సిద్ధంగా కూచున్నవాళ్లు. వాళ్లల్లో ఎవరికి, ఆపోస్టు, ఇస్తే, కడంవాళ్లకి ఏం కోపా లొస్తాయో అని ఎటూ పాలుపోకుండా ఇదవుతున్నానని నారయ్య సోమయ్యతో చెప్పుకున్నాడు. సోమయ్య, "సరేలే, కాస్కో" అని నారయ్యతో అని, అతణ్ణి విసర్జించి, ఆబట్టల్లోనే వెళ్లి భీమయ్యపార్టీలో జేరి, అతని కార్లో షికారు వెళ్లాడు. నిప్పులు గక్కుతూన్న భీమయ్య కళ్లకి కాస్త చల్లగాలి సోకింది. ఇక వ్యవహారం తిరగ దోడడానికి అతడు ఎత్తులు పన్నాడు. ఆసాయంత్రమే నారయ్య పక్షంలో మరొకడైన తుమ్మయ్య పనుండి కల్లుదుకాణానికి వెడుతున్నాడు. ఈ సంగతి భీమయ్యకి తెలిసి అతడు తన జట్టుతో వెళ్లి, కారు ఆపకుండానే అతణ్ణి కారులోకి ఈడ్చుగుని, చక్కాపోయాడు. అప్పట్లో అతనిఆనందం, ఠీవీ, ఆవేషూ మాత్రం పోల్చాలంటే, సాక్షాత్తూ ఆ రుక్మిణీదేవిని రథంమీద వస్తూనే తీసుగెళ్లిన శ్రీకృష్ణుడు జ్ఞాపకంవస్తాడు. ఆపళంగా తుమ్మయ్యకి పెద్ద బోయిలరు లాంటి పీపా కొనడం అయింది. దుకాణం దగ్గిర్నించి తన యింటికి ఒక పైపు పెట్టించవలిసిందని అతడు వరం కోరుకున్నాడు. సరేనని అతణ్ణి గ్రామాంతరం లాక్కుపోయి, భీమయ్య బంధువులింట, అతణ్ణి అజ్ఞాతవాసంలో ఉంచేశారు. ఇక్కడికి నారయ్య పక్షంలోంచి ఇద్దరు పరపక్షం అయిపోయారు. నారయ్య పార్టీలోనే మరో సభ్యుడికి ఋణాలవల్ల దివాలా స్థితి లాంటిది వచ్చి మతి పోయేటంతపని జరిగింది. దివాలా తీసినా పిచ్చెత్తినా సభ్యత్వం పోతుంది. సభ్యుడు కావడానికి ఎవరేనా బతికగలిగి మతి గలిగి ఉండద్దూ మరి! ఆసమయంలో, భీమయ్య వెళ్లి, ఆమెంబరుయొక్క ఋణదాతలచేత ఆ మెంబరికి ఉత్తరాలు రాయించాడు — ఏమనీ? "డబ్బేనా కక్కు! లేదా, భీమయ్య పక్షమే నా చేరు." అని. దాంతోటి ఆమెంబరు భీమయ్యలో కలిశాడు. మరొక మెంబర్కి "నువ్వు భీమయ్య పార్టీలో చేరకపోతే నీ కూతుర్ని వొదిలిపెడుతున్నా"నని అతని అల్లుడు చేత ఉత్తరం కొట్టించ్చారు. ఆమెంబరు "విడాకుల చట్టం వచ్చిపడుతోంది. ఇక అల్లుడంటే నాకు భయ మేమిటీ!" అనుకున్నాడు గావును, ఆబెదిరింపులికి జడవలేదు. తరవాత అతణ్ణి తన్నుతాం అని అతనికి శుభలేఖ రాశారు. అతగాడు కొయ్యాయి, ఎందునా బొందక తటస్థుడైపోయాడు. అక్కడితోటి భీమయ్యబలం ౧౧, నారయ్యది ౬ అయింది.

వెంటనే, భీమయ్య కత్తులూ కటార్లూ నూరి, అధ్యక్షుడైన నారయ్యమీద విశ్వాస రాహిత్య తీర్మానం పెట్టించి నెగ్గడానికి మీటింగు పెట్టించమని నారయ్యని కోరాడు. నారయ్య, మరో ఆరు ఎక్కువ చదివున్నవాడవడంచేత, అందుకు ఒప్పుగుని ఆ పదోనాడు సంఘ సమావేశం అన్నాడు. అధ్యక్షపదవిలో ఉండి నిరంకుశత్వం చెలాయించకుండా చెయ్యడానికి, విశ్వాస రాహిత్య తీర్మానం పుట్టింది. అక్కణ్ణించి, ఎవరు అధ్యక్షుడైనా, తక్కినవాళ్లకి అతనిమీద విశ్వాసం లేకపోవడం మామూలైంది. పరవిశ్వాసం మాటలా? ఆత్మవిశ్వాసం మాత్రం ఎంత కష్టం? ముందు ఆత్మ ఉండాలి, తరవాత విశ్వాసం ఉండాలి. ఆమీటింగులోకి భీమయ్య సపరివార సమేతంగా వెళ్లికూచున్నాడు విశ్వాసరాహిత్య తీర్మానానికి అనుకూలంగా ౧౧ గురు, ప్రతికూలంగా ౬ గురు అయారు. నారయ్యకి అధ్యక్షపదవి ఊడిపోడానికి ఆ తేడా చాలదుగాని తాత్కాలికంగా అతనికే అపజయం. ఆసంగతి సమావేశ చర్యాసంగ్రహ పుస్తకంలో రాయవలిసిందని నారయ్యగార్ని కోరారు. అతడు 'అనుకూలురు ౧౧ గురు, ప్రతికూలురు ౬ గురు, సంగతి పైవారికి తెలుపబడును' అనే రాశాడుగాని, 'సదరు తీర్మానం నెగ్గింది' అని మాత్రం అందులో రాయలేదు. భీమయ్యగారి పార్టీవారు, ఆ రాసింది పైకి చదివి వినిపించమన్నారు. నారయ్య అట్లాంటిది అవసరం లేదని చెబుతూ, నవ్వుతూ, చల్లగా, ఆ పుస్తకం దాచేసి, మెల్లిగా బైటికి దారితీశాడు. అతడు వెళ్లి సోమయ్యని కలుసుకుని, "రామాయణం నెత్తిమీద పెట్టుకుని ప్రమాణంచేసి, తిరిగిపోవచ్చా?" అని అడిగించాడు. అందుకు సోమయ్య, "మీరంతా నా చేతులోది రామాయణం అనుకున్నారు గావును, పాపం! అది అంతేసైజులో కుట్టించిన తెల్లకాగితాల బైండుబుక్కు! ఎక్కడో,

తెలియకుండా మాట్లాడతారేం?" అన్నాడు. నారయ్యా తనపార్టీసంఖ్య గురించి మరి మాడక మరోపుంత తొక్కాడు. భీమయ్యా ఆపుంతా కాశాడు. పదవి లాక్కోవాలని ఒకరూ, ఉంచుకోవాలని ఒకరూ రాక్షస చాణక్యుల్లాగ ఎత్తుపై ఎత్తులు వేస్తూనేఉంటారు. పాలకసంఘం పాలించవలిసిన మేరలో ఉన్న జనంసంగతి ఎవరికీ అక్కర్లేదు. జనం పంపినమీదట పాలక సంఘంలోకి వెళ్లి, వెంటనే ఆ జనాన్ని మరిచిపోడమే ఎన్నికల్లో మజా; ఒకవేళ జ్ఞాపకం ఉంచుకున్నా, ఆ జనుల్లో మొదటి జనుడు తనేగదా అనుకోడం మరీ మజా!!

---

# ప్రపంచ ప్రాచీనస్వరూపము*

శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు

పాడుపడిపోయిన ఇళ్లల్లో మనకి విరిగిపోయిన కుండలు కనబడుతాయి. వాటిరూపాన్నిబట్టి అవి కుండపెంకులనీ, వాటి మైత్రినిబట్టి అవన్నీ ఒకే కుండకు చెందిన పెంకులనీ మనము గ్రహించవచ్చును. ఈ ముక్కలన్నిటినీ చేర్చి కుండ ఆకారము తిరిగి కల్పించడానికి యత్నించినా యత్నించవచ్చు కూడా. భౌతికశాస్త్రజ్ఞుడి యత్నాలిలాంటివే. కొండకొమ్ములమీదా, చరియలమీదా, అడవులలోనూ, ఎండిపోయిన యేళ్లలోనూ తిరుగుతూ మృతజీవచిహ్నాలను యేరికూర్చి, వీటిని బట్టి ఆ జీవజంతువుల రూపాన్ని నిర్ణయించడానికి ప్రయత్నించే వింతమనిషి అతడు. వృక్షశాస్త్రజ్ఞుడోకవైపునా, జీవశాస్త్రజ్ఞుడోకవైపునా అతనికి సాయపడుతూంటారు. ఈవిపరీత శాస్త్రజ్ఞుడి ఊహాతరంగాలలో ఒక కెరటాన్ని మీపై ప్రసరింపజేయాలనే ఈ ప్రయత్నము.



1-వ చిత్రము

మృతజీవచిహ్నాలను వదిలిపెట్టండి. మన ప్రయత్నము ప్రాచీన జీవజంతువుల రూపములను సృష్టించడము కాదు. ప్రాచీనప్రపంచ

* జనవరి ౨౮-వ తేదీని విశాఖపట్టణ పురమందిరములో లక్నో విశ్వవిద్యాలయ వృక్షశాస్త్రాధ్యాపకులైన డాక్టర్ బీరబల్ సహానీగారు రొసంగిన ఉపన్యాసము నాధారముచేసుకుని వ్రాసినది.

స్వరూపమును నిర్ణయిద్దాము. ప్రపంచపటము చూడండి. విశాలదృష్టితో విభాగిస్తే ఆఫ్రికా, ఆసియా, ఐరోపాలు భూభాగములోకి వస్తాయి. మధ్యధరాసముద్రము, ఎర్రసముద్రము, అరేబియాసముద్రము మొదలైనవి ఈఖండాలను విడదీస్తున్నా "ఒకప్పుడీ భాగాలన్నీ కలిసి ఉండేవా?" అనే సందేహము కలిగిస్తాయి. ప్రస్తుత ప్రపంచస్వరూపము విచ్చిపోయిన కుండపెంకులాంటిది. మొదటి పటములోని అమెరికా ఆఫ్రికాతీరరేఖలను గమనించి చూడండి. గయానానుండి రియోడిజనీరో వరకు గల తీరరేఖగనీతీరముతో చేరిన కాంగోముఖద్వార తీరరేఖవలె నున్నది. రేఖా సామరస్యమే అయితే ఏమో ఎందువల్ల వచ్చిందో అనుకో వచ్చును. ఈ రెండుప్రదేశములకును భూగర్భములో నుండే పొరలు (Layers) ఒకే రీతిగా ఉన్నాయి. బ్రేజిల్‌లోను కాంగోసీమలోను కూడా ఎప్పుడూ వర్షము కురుస్తూనే ఉంటుంది. ఐరోపాలోని స్కాండినేవియా ద్వీపకల్పము యొక్క ముఖమునందు జట్లండు ద్వీపకల్పము (డెన్మార్కు)సరిగా పట్టేటట్లుంటుంది. స్కాండినేవియా అంతా పర్వతమయమే. దానిముఖము మాత్రము డెన్మార్కులాగే పల్లపు భూమే. న్యూజిలెండ్ ద్వీపాలు (IIవ పటము) రెండు విరిగిన కర్రముక్క-తాలూకు ముక్కలులాగ కనపడతాయి. రెండుద్వీపాలలోనూ పర్వతపంక్తి పశ్చిమానికే వెన్నెముకలాగున్నది. మూడో పటము చూడండి. అరేబియా పశ్చిమతీరము, ఆఫ్రికా తూర్పుతీరమూ ఒకలాగున్నవి. అబిస్సీనియా, అరేబియా తాలూకు ముక్కలాగున్నది. పరిస్థితులు రెండుదేశాలకీ సమానమే. పరిషియన్ గుడములో (I అను) గుర్తుంచిన భూభాగమునకు ప్రతిగా పర్షియాలో చిన్న సముద్రభాగముంది. రెండుదేశాలూ కూడా పంటలకు పేరుపొందినవి కావు. రెండుదేశాలలోనూ నదులేవీ లేవు. నాలుగో పటము చూడండి. జపాన్ దీవులన్నీ ఒకే భూభాగము. అన్నిటిలోనూ పర్వతశ్రేణులున్నాయి. కొరియాదేశపు పశ్చిమతీరానికి గల రెండు అగ్రములూ చీనాతీరానికిగల గుడములలో సరిపోతాయి. బీడుభూమి అయిన సగేలియన్ రష్యాతో కలుస్తుంది. ఈ సామరస్యవిచారణ సన్న్యాసి జందెముకీ సాతాని



2-వ చిత్రము

జుట్టుకీ ముడిపెట్టడము కాదు. విచ్చిపోయిన కుండపెంకుల కున్న సామరస్యమే ఇది. శాస్త్రజ్ఞుల పరిశోధనలవల్ల ఈ దేశములలో తీరరేఖ మాత్రమే కాక, భూగర్భమందుండే బంక మన్ను, ఇసుక, రేగడి మొదలైన పొరలూ, అక్కడ దొరికే మృతజీవచిహ్నాలూ ఒకేలాగున్నట్లు తేలింది.

వాగ్నర్ అనే భూగర్భశాస్త్రజ్ఞుడీ సామరస్యమును పురస్కరించుకుని, "ఖండ ప్రచలనవాద"మని ఒకవాదము నుద్ఘాటించాడు. దీనిప్రకారము భూఖండములు, మంచు కొండలు సముద్రములో జరిగినట్లు, జరుగుతాయి. భూగర్భము మొత్తముమీద రెండు రకాలుగా భాగించవచ్చునట. సిలికను, అల్యూమినియము అనే రెండు మూలద్రవ్యాలూ చేరి ఏర్పడినపొర పైది. సిలికను, మాగ్నిషియము (గ్యాసులైటుతీగ: దీపావళికి వెలిగించేది. దానిలోని మూలద్రవ్య మిదే) కలిసిన పీఠము అడుగుది. సిలికను అల్యూమినియములు చేరిన పైపొర, సిలికను మాగ్నిషియములు చేరి ఏర్పడిన అడుగుకంటే తేలిక. కాబట్టి నీటిమీద వెదుళ్లతో కట్టిన పెద్ద తెప్పలు తేలునట్లు పైపొర క్రిందిదానిమీద తేలి జరుగుతుందట. ఈ జరగడములో భూమికి నెరుకులు, బీటలు పడి అవి కాలక్రమాన్ని వెడల్పై సముద్రాలౌతవట. ఒక తాడుని రెండుకొసలూపట్టి బిగలాగుతా మనుకోండి. అప్పుడు అది తెగి మనచేతులు దూరమౌతాయి. మనము లాగినశక్తి త్రాటి నరముల శక్తికంటె ఎక్కువైనప్పుడది తెగిపోతుంది. తరవాత త్రాడుని తెంపినశక్తిని, మనము చేతిని ఆపుకుందామని తెచ్చేశక్తి ఎప్పు డతిక్రమిస్తే అప్పుడు చేతు లాగుతాయి. అలాగే జరుగుడు శక్తి ఎక్కువైతే బట్ట పిగిలినట్లు భూమిలో నెరుకులేర్పడి ఖండాలువేరై జరుగుతాయి. జరగ్గా జరగ్గా ప్రతిబంధకా లేర్పడితే జరుగు డాగిపోతుంది. వాగ్నర్ చెప్పేదేమంటే, పైని చెప్పిన దేశాలన్నీ ఒకేభూభాగముగా నుండి ఈజరుగుడువల్ల వేరైనవని. ఖండమంతా జరిగియుండడమువల్ల చీలిన రెండుతీరాలు మారవలసిన అవసరము లేదు. అందుచేతనే వీటి కాసామరస్యము కనపడుతున్నదని.

ఈ ఖండప్రచలనవాదానికి పెక్కు రభ్యంతరాలు చెప్తున్నారు. చిన్నదారాన్ని తెంపడానికే మన మెంతో గట్టిగా లాగవలెనే? ఖండములు తెంపడానికి, వాటికిగల పొరలలో చీలిక లేర్పరచడానికి ఎంత శక్తి కావలసియుంటుంది? అది ఎక్కడనుంచి వస్తున్నది? ఎవరు లాగుతున్నారు ఈఖండాలను? అని వారి ప్రశ్న. దీనికి జవాబు చెప్పడము సులభము కాదు కాని ఇది భూగర్భశాస్త్రజ్ఞుడి పనికాదు. పదార్థవిజ్ఞాన శాస్త్రజ్ఞుని పని. భూగర్భమందుగాని ఉపరిభాగమందుగాని ప్రవేశించగల శక్తులకూ, భూభాగములకు గల ఆంతర్య

* ఇసుకలో సిలికను, ప్రాణవాయువు ఉన్నాయి. బంకమన్నులో అల్యూమినియము, ప్రాణవాయువు కలసి ఉన్నాయి.

సంబంధము నతడు విచారించి ఖండములను విడదీయగల శక్తి ఎట్లుద్భవించిందో చూడవలెను. ప్రస్తుతము పదార్థవిజ్ఞానశాస్త్రము పై అభ్యంతరానికి జవాబియ్యగలిగినంత విశాలము కాకపోవచ్చును. అందువల్ల ఖండప్రచలన వాదాన్ని త్రోసివేయడానికి వీలు లేదు.

విపక్షు లీసంగతి గ్రహించి, ఏసాక్ష్యమును పురస్కరించుకుని వాగ్నర్ పై వాదము లేవనెత్తినాడో, ఆసాక్ష్యమునే మరోవిధముగా సమర్థించారు. ఇదే నేలవంతెనల వాదము




3-వ చిత్రము

(Theory of Land Bridges). ఆఫ్రికా అమెరికాలను ఒకప్పుడు కలిపే నేలవంతెన ఉండేదట. అది కాలక్రమాన్ని అట్లాంటిక్ మహాసముద్రములో మునిగిపోయిందట. ప్రస్తుతము ఆసముద్రములో ఉండే ద్వీపాలన్నీ ఆనేలవంతెన తాలూకు ముక్కలట. నేలలు కలిసి యుండిన కారణమువల్ల భూగర్భసామరస్యము మృతజీవచిహ్నసామరస్యము ఉన్నదట. ఇంతమట్టు కీవాదము బింకమే కాని అంత నేల ఒక్కసారి ఎలాగున మునిగింది? తీరరేఖకు సామరస్య మెలా గేర్పడింది? పోనీ ఆఫ్రికా అమెరికాలు వదలండి. మూడో పటములోని ఎర్రసముద్రతీరాలుచూడండి. ఎక్కడిప్రదేశము మునిగింది? నేలవంతెన ఉండినట్లయితే సముద్ర మేదీ దీన్ని ముంచడానికి? ప్రకృతి సత్యాలనే మూలాధారముగా చేసుకున్న గొప్ప వాదాలను ప్రథమమున ఎదుర్కొన్న పిల్లవాదా ల్లాంటిదే ఈనేలవంతెనల వాదము. సరే ఈ ఖండప్రచలనవాదానికి (Theory of Continental Drift) ఫల మేమిటి? చీలిన భూభాగాలు ఎడమౌతాయి. ఇది నిజమేనా? చీలిన భూమిని చినిగిన బట్టతో పోల్చితే చీలిక పోయినా సాగినభూమిని సాగినబట్టతో పోల్చవలసి యుంటుంది. ఈసాగడము నిజమయితే రెండుపట్టణాల కున్న దూరము కొంతకాలానికి ఎక్కువవాలి. దీని నిజమును నక్షత్రపరిశోధన శాలలలో పరీక్షించారు. ఒకనక్షత్రము ఒక నక్షత్రశాలకు సరిగా నడునెత్తిమీదికి వచ్చిన కాలము గుర్తించి, మళ్లీ ఆనక్షత్రమే మరొక నక్షత్రశాలమీదికి వచ్చిన కాలమును కూడ గుర్తించారు. ఈరెండు వేళలకీ గల తారతమ్యము హెచ్చౌతున్నట్లు కనబడింది. అంటే ఈ నక్షత్రశాలలకున్న దూరము హెచ్చౌ

తున్నదన్నమాట. ఈసాక్ష్యము వాగ్నర్ పండితుని వాదాన్ని బలపరుస్తున్నది.

కాబట్టి ఆఫ్రికా దక్షిణ అమెరికాలు ఒకప్పుడు కలిసియుండేవని నిర్ధారణౌతున్నది. హిందూదేశముకూడా అప్పుడు పొడుగుగా నుండి గుడ్‌హోప్ అగ్రమువరకూ వ్యాపించి, ఆఫ్రికాతో చేరి యుండేదట. అంటార్‌క్టిక్ అనే దక్షిణధ్రువప్రాంతము ఆఫ్రికా దక్షిణ భాగముతో కలిసియుండేదట. దక్షిణధ్రువము ఆఫ్రికాలోని కలహారీ ఎడారికి పైన ఉండేదట. కాలక్రమాన్ని అమెరికా చీలి పశ్చిమానికీ, ఆఫ్రికా, హిందూదేశము ఉత్తరానికీ జరిగి అంటార్‌క్టికును దక్షిణధ్రువమును విడిచినవట.

ఇక్కడ మరొకసారి అభ్యంతరము వస్తున్నది. ధ్రువము కలహారీ ప్రాంతమందుండి హిందూదేశము, ఆఫ్రికా కలిసియుండినట్లయితే—ధ్రువతలమునందు మంచుగడ్డ లుండి యుండవలెను కదా,—ఈ దేశాలలో ఏవి? అని పూర్వపక్షము. ధ్రువమునుండి ౨౦ అంశముల లాటిట్యూడ్ గీచితే ఏర్పడే వర్తులములో ఎల్లప్పుడూ మంచుగడ్డ ఉండాలి. ఒకప్పుడీమంచుగడ్డ ఉండినట్టయితే ప్రస్తుతము మంచుగడ్డ తాలూకు చిహ్నము లుండవలెను. దేశములన్నీ ముందుకి జరిగి కుంచుకొని పోవడమువల్ల ఈ మంచుచిహ్నాలు పూడిపోయి ఉంటాయి. ఎక్కడని త్రవ్వగలరు వీటికోసము, ఎంతమట్టుకు జరిగినవో దేశములు? అయినా ఒకటి రెండు ప్రదేశాలలో ఈ చిహ్నములు కూడా దొరికాయి. కటకపురివద్ద తాల్చిర్ అనే గ్రామముదగ్గర మంచుతాలూకు చిహ్నములు దొరికినవి. భూమధ్యరేఖకి ఎంతో ఉత్తరాన ఉన్న కటకమువద్దకు మంచెలా వచ్చింది? దీనినిబట్టి వాగ్నర్ వాదానికి సంపూర్ణవిజయము వచ్చినట్లే. ఒకప్పుడు కటకము ధ్రువమండలములోనిదే..

ప్రతీవాదమూ సామాన్యముగా మూడు పనులు చెయ్యవలసి ఉంటుంది. ఒకటి: ఇదివరకు కనబడుతున్న విషయాలను సమర్థించడము; రెండు: ఇప్పుడు బయలుదేరిన కొత్త సమస్యలను చిక్కు విప్పడము; మూడు: కొత్త సంగతులు ముందు సూచించడము. వాగ్నర్ వాదము వివిధదేశములలో దొరికిన పోలికలను సమర్థించడమువల్ల మొదటిపనిని నెరవేర్చింది. ఇక రెండోపని నెరవేర్చడానికి ఖండప్రచలనవాదమువల్ల బయలుదేరే ఉపవాదాలకి ప్రతిపత్తి, ఉదాహరణమూ చూపించవలసి యుంటుంది. హిందూస్థానము మెడగాస్కర్ ద్వీపసమీపమువరకూ వ్యాపించి యుండి, ప్రస్తుతము మాత్రము ఉత్తరానికి జరిగిపోయిందని వాగ్నర్ సిద్ధాంతముగదా. జరిగినది హిందూదేశమైతే భూమి ఉత్తరానికి—బట్టను జరిపితే ముడతలుపడేటట్లు—ముడతలుపడి ఎత్తవవద్దా? తప్పకుండా కావలెను. వాగ్నర్ వాదులు టిబెట్ పీఠభూమి ఏర్పడడానికీ హిమాలయపర్వతాలు ఎవరో పెట్టి

నట్లు మనదేశానికి ఉత్తరాన గోడలా గేర్పడడానికీ ఇదే కారణ మన్నారు. కొంచె మాలోచించితే ఈయూహా పరమసత్యమని బోధపడుతుంది. మహోన్నతమైన హిమాలయ పర్వతపంక్తి పుట్టుటకు కారణ మేమవగలదు? ఒకప్పు డక్కడ సముద్ర ముండేదట. ఈ సముద్రములోని జీవజంతువుల చిహ్నములు హిమాలయములదగ్గర దొరకవలెనుకదా? డాక్టర్ బీరబల్ సహానీగారు సముద్రమట్టానికి ౧౭౦౦౦ అడుగుల ఎత్తున ఉన్న హిమాలయ పర్వత ప్రదేశములలో సముద్రజంతువుల



4-వ చిత్రము

తాలూకు ఫాసిల్‌చిహ్నాలు కనుక్కున్నారట. దీనితో కావలిసిన సాక్ష్యము పూర్తి అయింది. పర్వతపంక్తులు పుట్టడానికి కారణము కనపడింది. సరే, ప్రపంచములోని తక్కిన పర్వతశ్రేణులలో రాకీపర్వతపంక్తి అమెరికాకు వెన్నెముకలాగు పశ్చిమానికుంది. ఇది కూడా వాగ్నర్‌వాదానికి అనుకూలమే. దక్షిణఅమెరికా జరగడమువల్ల, ఆఫ్రికా పశ్చిమతీరాన్ని పోలిన అమెరికా తూర్పుతీరము కాక, పశ్చిమతీరము "ముడతలు" పడి రాకీ పర్వతపంక్తి ఏర్పడింది. ఇక ఆల్ప్సుపర్వతపంక్తి మాటేమిటి? ఐదోపటములోని మధ్యధరాసముద్రము తీరరేఖలను చూడండి. జిబ్రాల్టర్ అగ్రము ఆఫ్రికాతో కలుస్తుంది. ఇటలీదాకా గల తీరము ఆల్జీరియా ఉత్తరతీరముతో సరిపోతే, ఏడ్రియాటిక్ లేనినాటి ఇటలీగ్రీసులు ట్రిపోలీసింధుశాఖలోకి సరిపోతాయి. ఆఫ్రికా ఉత్తరానికి జరగడమువల్ల ఆల్ప్సుపర్వతపంక్తి ఏర్పడి, యూరపు జరగడమువల్ల ఆ పంక్తి అంచున చీలిపోయిందని మా యూహా.

ఈ ఊహని పొడిగించితే ఎడారు లేర్పడడానికి కారణాలు తెలుస్తాయి. ప్రచలనములో గట్టిపొరలు గుట్టలు పర్వతాలూ అయితే పర్వతభూమి కాలేని ఇసుకపొరలు ఎడారులై ఉంటాయి. సహారా కుత్తరమున ఆల్ప్సుపర్వతము లేర్పడితే దానిని కలిసి దక్షిణానికున్న భూమి ఎడారియై యుంటుంది. హిందూదేశములోని థార్ ఎడారి, చీనాలోని గోబీయెడారి, అరేబియాఎడారులు పర్వతాల నానుకొన్నవే. ఎడారి, బంకమన్ను రేగడి మొదలైన పొరలులేని ఇసుకభూమి అవడమువల్ల ప్రచలనమువల్ల పర్వతభూమి కాలేకపోయినా ఎత్తు

మాత్ర మవుతుంది. గోబీ, అరేబియా, థార్ ఎడారులు చూడండి. పర్వతభూమికి తర్వాత ఎత్తైనభూమి ఎడారే. అందువల్ల పర్వతము మీాద కురిసినవర్ష మాయెడారులలో కాక, కొండలోయలలో బడి సింధునదిలాగ ఎడారి అంచుని ప్రవహిస్తుంది. చీనాలోని హోయాంగ్ హో నదికూడా ఇలాంటిదే. వర్షజలము ప్రవహించక పోవడముచేత ఎడారిలో మార్పు కలగదు.

పర్వతభూమికి తర్వాత ఎడారిభూమే ఎత్తైన దని పైన చెప్పినాము. పర్వతములు ప్రచలనమువల్ల పుట్టి, అందువల్లనే ఎడారి కూడా పుట్టిఉంటే, ప్రచలనము ఎడారివైపు నుండి పర్వతము వైపై యుండాలని గ్రహించవచ్చును. ఇది ప్రచలనవాదానికి రెండో ఉపవాదము. రాకీపర్వతశ్రేణి పుట్టుటకు అమెరికాఖండము పశ్చిమాని కెంతదూరమో చలించి ఉండాలి. ఆఫ్రికాలో పర్వతశ్రేణు లేవీ ఉత్తరమునుంచి దక్షిణానికి లేవు. హిందూస్థానముతోపాటు ఆఫ్రికా ఉత్తరమునకు జరిగినప్పుడు ఆల్ప్సుపర్వతశ్రేణి ఏర్పడి, సహారాకును, ఈపర్వతశ్రేణికి తగిన గట్టిచేరిక లేక సహారానుండి విడిపోయి యుంటుంది. ఆఫ్రికా కొంత దక్షిణమునకు చలించడమువల్ల ఎర్రసముద్రము, పరిషియన్ సముద్రము ఏర్పడి ఉంటాయి. స్కాండినేవియా ఉత్తరానికి జరగడమువల్ల దానిలో పర్వతపంక్తి ఏర్పడింది.

ఇక ఏవాదమైనా ముందు జరగబోయే విషయములను గురించి సూచించాలని చెప్పినాము. ఈవాదము నైలునది ప్రచలనమువల్ల ఏర్పడిన చీలికయని చెప్పుచున్నది. ఈచీలిక కాలక్రమాన్ని పెద్దదై ఈజిప్టుదేశాన్ని రెండు భాగములు చేసి వేరుచేస్తుందట. దీనిసత్యము ఒకవిధాన్ని బోధపడుతుంది. నైల్‌నదికి రెండు వైపులా పర్వతభూములు లేవు చలనము నడ్డడానికి. నైల్‌నది ఎర్రసముద్రములా కావాలంటే, అబిస్సీనియాదేశము కదలవలిసి యుంటుంది (మూడవపటము). ఈ కదలికకి ఎర్రసముద్రము కొనలు కలిసిపోయి అది చెరువు కావలిసి వస్తుంది. లేదా ఆఫ్రికా కదలి, జిబ్రాల్టర్ భూసంధి కావలసివస్తుంది. ఎటు చూచినా మనపాలకుల వర్తకస్థానములకే ముప్పు. ఆ దుర్దినములు రాకుండును గాక. నేల చీలుట మాటలా?

ఒక్కవాదము మాత్రము అడ్డుతగులుతున్నది ఈప్రచలనవాదానికి. నేలను చీల్చ గలిగిన యమేయశక్తి ఎట్లుద్భవించింది? నాకు తెలిసినంతవరకు ఈ యమేయ శక్తికి కారణము ఊహించుతాను. తజ్ఞులు దాని లోటుపాటులు విచారించండి. ద్రవపదార్థము శక్తి సంపర్కము గాని అసలే లేకపోతే గోళాకారము పొందుతుంది. ఆలివ్‌నూనె, నీరు ఇంచుమించు సమానసాంద్రత గలిగిన ద్రవాలు. అందులో నీటి కెక్కువసాంద్రత ఉంది. ఆలివ్‌నూనెని బొట్లుబొట్లుగా నీటిలో వదిలినట్లయితే ఆనూనెబొట్టు నీటి అడుగుకి దిగక, ఉపరిభాగమున తేలక, మధ్యన గోళాకార

ముతో ఆగుతుంది. ఈగోళాన్ని లంబరేఖనే అక్షముగా (axis) చేసి గిరగిర త్రిప్పవచ్చును తీగతో. అలాగు తిరుగుతూన్నప్పుడు గోళ మధ్యరేఖ కొంచెము ఉబికి, ధ్రువాలు (అక్షా ని కిరుకొనలు) నొక్కులు పడతాయి. మన భూగోళము ప్రస్తుత మీస్థితియందున్నది. ధ్రువాలదగ్గర నొక్కులున్నాయి, భూమధ్య రేఖ పై కుబికింది. భూమి ఒకప్పుడు గోళాకారముగానే ఉండి, దినభ్రమణమువల్ల (Diurnal rotation) ఈరూపుకి వచ్చిందని తీర్మానిస్తే, భూమి గోళాకారముగా నున్నప్పటి భూమధ్యరేఖ ఈరూపాన్ని ఉన్న భూమధ్యరేఖ అయేటప్పటికి భూమధ్యరేఖపొడుగునీ ఉన్న భూమి సాగియుండవలెను. ఈసాగడములో భూమి చీలియుండవచ్చును. చీలిన తర్వాత చలించడము మంచుకొండ నీటిమీద తేలినట్లే. కాబట్టి ఖండప్రచలనవాదము, వింతగా కనబడుతున్నా గ్రహగతులవలె పరమసత్యమే. నైలునది చీలిక యనుట కూడ సమంజసమే. ఈ ఖండప్రచలనమునకు, ఈనేల చీలుటకు, ఈ పర్వతశ్రేణీజననమునకు, ఉద్దేశ్య మేమో ఎవరి కెరుక.



5-వ చిత్రము

---

మనవి: ఇందులోని బొమ్మలు శ్రీయుత మద్దాలి సూర్యప్రకాశరావుగారు వ్రాసియిచ్చినందుకు చాలా కృతజ్ఞుడను.

శ్రీ. గో.

# మూడే సాధనములు

గా. హరిసర్వోత్తమరావుగారు, ఎమ్. ఏ.

మన దేశమునకు బునాది గ్రామ మందురు. గ్రామస్థులస్థితి దీనాతిదీనమందురు. పునర్నిర్మాణ మత్యవసర మందురు. ఆపని కానిది మనకు మోక్షము లేదందురు. ఎల్లరును నీగోష్ఠియందు పాల్గొనువారే. ఎల్లరును మన ప్రజాసమూహముయెడల దయగలవారే. కాని ఇప్పటి కింకను గ్రామజీవుల కేసంస్థలు అత్యావశ్యకములు ?, వానిని మన మెంతవరకు సాధించగలిగినాము?, ఎంతవరకు సాధింపవలసియున్నది? అని యాలోచించి ఆకార్యమును నడుపుటకు నడుములు బిగించినవారు చాల తక్కువ.

మన ప్రజలకు పట్టిన మొదటి దురవస్థ ఆత్మవిశ్వాస వినాశము. ఏ గ్రామమున నెవ్వరివద్దకు పోయినను నెవ్వరిని పల్కరించినను తా మీపని చేసికొందు మను గ్రామవాసు లుండరు. కలెక్టరుకు అర్జీ పెట్టుటా ? తహసిల్దారుకా ? ఇంజనీరుకా ? ఫారెస్టు అఫీసరుకా ? తాలూకాబోర్డు ప్రెసిడెంటుకా ? అను విమర్శయే గాని గ్రామస్థులు స్వతంత్రించి చేయుపని కలదని తలంచువారే లేరు. దీనికి కారణ మేమి? మరి దేమి యందము? గ్రామప్రజకు ఏవిధమైన యధికారమును ఇప్పటి ప్రభుత్వపద్ధతిలో లేకపోవుటయే. ప్రతివిషయమునను గ్రామవాసి యెవ్వనిమీదనో యొకనిమీద, గ్రామమునకు బయటివానిమీద, ఆధారపడవలసివచ్చుటయే. అధమపక్షము రెడ్డికరణములమీదను లాయేజంటులమీదను నాధారపడక గ్రామవాసికి దినము గడవనే గడవదు. కొద్దిలో కొద్ది మూడు తరములకు తక్కువ గాని కాలము మనరైతు పరిపూర్ణ నిస్సహాయస్థితిని అనుభవించినాడు. అతని తప్పేమాత్రమును లేదు. నేటిదిన మతనికి వోటు ప్రసాదించినను శాసనసభలకు ప్రతినిధులను ఎన్నుకొను స్వాతంత్ర్య మిచ్చినను జిల్లాబోర్డులకు తాలూకాబోర్డులకు ప్రతినిధుల నెన్నుకొను ప్రభుత్వపదవిని ప్రసాదించినను తా నెన్నుకొనునట్టి యాపెద్దలే తనకు పైయధికారు లని వీరి నాశ్రయించుకొని తాను బ్రదుకవలెనని భ్రమపడునట్టి స్థితియందున్నాడు. శాసనసభల సభ్యులలో కొందరి యిండ్లముందర ప్రజల గుంపులు అర్జీలు పట్టుకొని నిలవబడి ఎప్పుడు లేచి వత్తురా ఎప్పుడు వారి యనుగ్రహము కలుగునా యని యెదురు చూచుచుండుటను నేను చూచినాను. ఇట్టిస్థితినే కొందరు జిల్లాబోర్డుపెద్దలు, తాలూకాబోర్డు పెద్దలు ప్రోత్సహించుట లేకపోలేదు. తాము ప్రజలకు గౌరవమర్యాదలతో సేవచేయుటకు ప్రజలవద్దనుండి యధికారము పొందునట్టి కైంకర్యపరులమని విశదపరచు ప్రతినిధులు చాల తక్కువ. వకీలుగ నున్న వకీలుదర్జాయును, భూస్వామిగ నున్న భూస్వామిదర్జాయును, అప్పిచ్చు ధనవంతుడుగా నున్న మూలధనాధికారి దర్జాయును, తమతమశాసనసభ, జిల్లాబోర్డు, తాలూకాబోర్డు పదవులలో చెల్లించుకొను వారే యెక్కువ. నిజముగా ఈదర్జాలకు గౌరవపదవులు మెరుగుపెట్టి యిందులో తాము పొందునట్టి లాభములు పెరుగునను ఆశతోడ ఈపదవులను ప్రవేశించువారు నూటికి తొంబది తొమ్మండుగు రని సాహసించి వ్రాసినను నన్మిత్రసోదరులు నాపై కినియకుందురు గాక.

ఈస్థితి కేమి ప్రతీకారము ? గ్రామవాసిని గ్రామము గ్రామపువిషయములలో నైనను స్వతంత్రుని జేయుటే మార్గము. ప్రతిగ్రామములోను గ్రామపరిపాలనకు పంచాయతి యేర్పడి గ్రామాధికారమును గ్రామములోని ప్రతివోటరును పాల్గొని నడిపించునట్టి బాధ్యత యేర్పడవలెను. పూర్వము మనదేశములో ఈప్రధాన జీవకళ యుండినది కావుననే మనరైతు ప్రపంచప్రఖ్యాతి పొందుటకు కావలసిన స్వతంత్ర నిర్మాణకౌశలమును కనుపరచుచుండినాడు. పురుషకారము నాయది యను తేజస్సు మరల మనరైతులో మూర్తిమంతము కావలసియున్నచో సత్వరముగ పంచాయతుల నిర్మాణము గావించి ఆతని పరిణామమున కతని స్వయం సహాయమే యాధారమనుటను నిరూపించవలెను. ఈప్రాతిపదికమైన

సంస్కారము జరుగకపోయినయెడల మనదేశమున సత్వరాభివృద్ధి కలలోని మాటయే. ఆకారణముచేతనే ౧౯౩౦ వ సంవత్సరమున లోకలుబోర్డుల ఆక్టు సవరణయందున్నప్పుడు సెలెక్టు కమిటీలో వేయుజనాభాగల యొక్కొక్క గ్రామమునందును పంచాయతి నెలకొల్పితీరవలెనను తీర్మానమును కాంగ్రెసుపార్టీవారు తమ బలముచేత నెగ్గింపించిరి. చర్చలలో ఆపార్టీ పాల్గొనక దూరమగుటచేత ఈతీర్మానమునకు భంగము కలిగెను. పంచాయతికి గ్రామములోని సర్వవ్యవహారములును స్వాధీనమయి సాధారణ గ్రామవాసి సాధారణ పరిపాలక విషయము లంతటను తన పురుషకారము నుపయోగించు శక్తిమంతుడు కావలయునను ఉద్దేశముచేతనే ఆసవరణ శాసనములో క్రొత్త శెక్షనులు చేర్పించి ఇర్రిగేషను ఫారెస్టులు, అది ఇది యననేల, ప్రభుత్వములోని పెద్ద లంగీకరింతురేని అన్ని డిపార్టుమెంటుల కధికారములును పంచాయతికి సంక్రమింపజేయుటకు అవకాశము కల్పింపబడినది. ఈమార్గమున పరిపూర్ణ పరిశ్రమ అచిరకాలమున జరుగువట్లు పాటుపడు ప్రతినిధులను ప్రజలు ముందున కేర్పరచుకొనెదరా?, యనునదియే ప్రశ్న. నేడు హోదాలలో నుండునట్టి తాలూకాబోర్డు జిల్లాబోర్డు నాయకులు తమపదవుల ప్రాముఖ్యమునే యభిలషింపక తమకుగల యీ మూడేండ్లలో సర్వవిధములను నీనూతనపరిణామమును సాధింతురా, యనునదియే సమస్య. భారతప్రజల పక్షమున దీనాతిదీనుడనై వీరియెల్లరను మహానమ్రభావమున నీకార్యమును సాధింపుడని వేడుకొనుటకంటె నాబోంట్లకు వేరు మార్గము లేదు. వీరెల్లరును మాబోంట్ల మొర యాలకింతురుగాక యని నమ్మెద.

గ్రామపంచాయతిమాట తలపెట్టునట్టి బుద్ధిమంతు లొక్కొక్కరికిని గ్రామములలోని పార్టీల ప్రబల సంఘట్టనము కంటికి కట్టినట్లు సాక్షాత్కరింపక తీరదు. అనేకులు పెద్దలు ఈపార్టీల విషయవస్థయే పంచాయతుల నిర్మాణమునకు నిర్వహణమునకు నాటంకముగ జెప్పుదురు. కాని అది కొందరియందు భ్రమ. మరి యితరులలో పిచ్చి వదలిన పెండ్లియగు, పెండ్లియైన పిచ్చి కుదురు నను వితండవాదుల మార్గమున కీడ్చు తంత్రము. పార్టీల ప్రాబల్యము పంచాయతుల నడకకు కొంతనిరోధము కావచ్చును. కాని పంచాయతు లుపక్రమింపక పోవుట పార్టీలను పోగొట్టుటకు సాధకము గాదు. పంచాయతు లేర్పడిన నిప్పటిపార్టీలు నశించుననువాదము నాది. పంచాయతిప్రాబల్యము మిథ్యానాయకుల ప్రాబల్యమును నచిరకాలమున నడంచును. ప్రజలనాయకత్వమునకు సహజశక్తి కలవారు పైకి వత్తురు. ఇది ముందుకు పరిణామమార్గము. అయిన పార్టీల దుష్టస్వభావము నణచుటకు స్థాపితము గావలసినసంస్థ గ్రామజీవనపునరుద్ధరణ సాధనములలో రెండవది. అవశ్య మావిషయమును గ్రామనివాసులశ్రేయము నభిలషించు వా రందరును నాలోచింపదగినది. ప్రభుత్వపు డిపార్టుమెంటులు తత్తదధికారులు మనరైతును ఆత్మవిశ్వాసమూరుని చేసివైచినరీతిని బ్రిటిషు ప్రభుత్వము ఏర్పడినతరువాత నెలకొనిన కోర్టులు, న్యాయవిచారణ పద్ధతులు, మనరైతును నన్నృతవాదిని గావించ సోదరపరాఙ్ముఖుని జేసి పార్టీలపరవశమున పారవేసినది. ఈపద్ధతిని మార్చివేసి యిచ్చటను పంచాయతి అధికారమును ప్రవేశపెట్టిననేగాని పార్టీల గందరగోళము మాయముగాదు. న్యాయవిచారణకు పంచాయతి యనిన దేహము జల్దరించి భీతినందువా రందురు. అందుకు కారణమును కలదు. చేతులెత్తి సివిలు క్రిమినలు అధికారములను ఏనలుగు రైదుగురిచేతులలోనో పెట్టునట్టి యాచారమునకు గ్రామపంచాయతికోర్టని పేరు రావడముచేత పార్టీలు ప్రబలిన ఈదినములలో భీతి కలుగుట సహజమైనది. న్యాయవిచారణకు నేను సలహాచేయు పంచాయతి స్వరూప మిది కాదు. మనదేశమున ఎన్నికలలో వచ్చిన పంచాయతిదారులు ఇతరపరిపాలక కార్యములకు నియోజితు లగుచుండిరి. ఇరుపక్షముల వివాదకుల యంగీకారముతో నేర్పడని పెద్దలకు సామాన్యముగా న్యాయపరిపాలనాధికారము। మనప్రాచీనులు గాని మనయాచారములు గాని యిచ్చుచుండలేదు. గ్రామపెద్దలు, అనగా పరిపాలక పంచాయతిదారులు, వివాదపడినవారికి సమాధానము కుదుర్చ ప్రయత్నములు చేయుచుండిరి. సమాధానము కుదురని సందర్భములలోను వ్యవహారము చిక్కులతో కూడికొనినదై యుండిన సందర్భములలోను అప్పటి

కప్పుడు ఊరిలోని పెద్దమనుష్యులలోనుండి ఇరుపక్షముల వారును అంగీకరించి నిర్ణయించుకొను పంచాయతిదారు లేర్పడి వివాదములు తీర్చుచుండినారు. ఇట్టిపంచాయతి చేసిన తీర్మానమునందు విధివశమున లోపము కలిగి అప్పీలు పోవలసిన సందర్భములలో ఇదేరీతిని రెండవ పంచాయతి యేర్పడి తుదిపరిష్కారము చేయుచుండినది. ఇది మనదేశమున జరుగుచుండిన సామాన్యమగు న్యాయ విచారణ కార్యక్రమము. ప్రభుత్వమువారి న్యాయాధికారులు లేనే లేరని వారి అధికారము గ్రామములలో చెల్లుచుండలేదని దీని యర్థము గాదు. అట్టి యధికారులును నుండిరి. వారి యధికారమును చెల్లుబడి యగుచుండినది. కాని న్యాయవిచారణకు బునాది పరిపాలనయందువలెనే, ఈపంచాయతిపద్ధతి. అనగా హైకోర్టులు అధికారుల విశేషసాధనములు, పంచాయతి సాధారణసాధనము. అందువలన పైయధికారుల వద్దకు బోవు వ్యవహారములు మిక్కిలి పరిమితములు. ఊరిలోనే తెగిపోవు వ్యవహారములే చాలభాగము. నిజముగా రమారమిగ నన్నియును ఊరిలో తెగిపోవుచుండినవనిన చాలును. అందుకే సూర్యచంద్రాదులు సాక్షు లన్నను చాలియుండినది. గ్రామములో నొక్కరి వ్యవహార మొక్క రెరింగిన సంఘములోని పెద్దలు వివాదపరిష్కారము చేయునట్టి తరుణమున వారియందున్న సూర్యచంద్రాదులు అనగా న్యాయజ్యోతి చాలియుండదా? మరల నీ పూర్వయుగపు పద్ధతి సార మేమన, గ్రామసీమల న్యాయవిచారణకు ఆధారము చేసితీరవలెను. దీనికితగిన శాసననిర్మాణము జరిగితీరవలెను. జిల్లామునసబుకోర్టులు, సబ్ మేజిస్ట్రేటుకచేరీలు, పోలీసుస్టేషనులు, వకీళులు, అమీనాలు-వీరి యధికారము సహాయముల వ్యాప్తి, గ్రామసీమలయెడ చాలతక్కువచేయునట్టి మార్గము లాలోచించి ప్రజల సురక్షణకు గ్రామములోనే బునాదు లేర్పరచుట పార్టీల నణంచుటకు మార్గమగును గాని మరియొకమార్గము లేదు. దీనికి న్యాయవిచారణ పద్ధతి సంస్కార మత్యవసరము.

గ్రామపరిపాలన, న్యాయవిచారణలకు గ్రామవాసులను సాధ్యమైనంతవరకు స్వతంత్రులను జేయుట వారి యాత్మవిశ్వాస మభివృద్ధి యై వారు తాముసు మనుష్యులే యను పౌరుషమును జెందుటకు మూలకారణ మగును. ఇప్పటిలో విద్యావంతులైన గ్రామసీమల బిడ్డలపై నాయకు లనుకొనువారు గొప్పయపనిందలను మోపుచున్నారు. వారు గ్రామములలో నిమడరట. పట్టణవాసములకు పరువులిడుదురట. తమకాలమును ద్రవ్యమును నట వృథచేయుదురట! ఇందులో సత్యము లేదని యనను గాని గ్రామములలో వారు చేయగలపని యేమియో వ్రేలుపెట్టి చూపిన సంతసింపవచ్చును. పరంపరాగతమైన పని వ్యవసాయము కలదు, చేసికొనరాదా, యనుట యలవాటైపోయినది. రైతుబిడ్డలు భ్రష్టులయి తిరిగి చెడిపోవుటకంటె వ్యవసాయముచేసికొనుట మిక్కిలి లాభప్రదము. కాని వీరికి వ్యవసాయ మెవరు నేర్పినారు? యుక్తవయస్సు వచ్చువరకు హోటళ్లలో విడిచి ఏ, బీ, సీ, డీ లు నేర్పి తరువాత వ్యవసాయపు పని చేయుమనిన చేయుట సామాన్యముగా పొసగు పనియేనా? ఒకవేళ వ్యవసాయమున కనియే యీబిడ్డలు కంకణము కట్టికొని నిలచిరిపో వీరలలో నందరికిని వ్యవసాయమునకు కావలసిన భూమి గాని యితర సాధనసంపత్తిగాని యున్నదా? ఎవ్వరో బహు స్వల్పసంఖ్యాకులకు గాని లేదు. ఉండినను ఈవ్యవసాయదారుని తండ్రితాతలు దర్జాగా జరుపుకొనిన వారైననేతప్ప వీరును సామాన్యరైతుల ధోరణిలో పడిపోయి మరల చీటికి మాటికి చిన్నిచిన్ని విషయములలో నంతటను పొరుగూరి పుల్లాయల నాశ్రయించవలసినదే గదా! ఏదో కొంత యక్షరజ్ఞానము కుదిరిన పిదప నాలుగుముక్కలు ప్రపంచ విషయములు తెలిసిన వెనుక రసవిహీనమైన 'నా ప్రాలబ్ధపు' బ్రతుకున కెవ్వ డోర్చును? అందుచేతనే అక్షరజ్ఞుడైన గ్రామవాసి యేపట్టణ వాసమునో ఆశ్రయించుకొని ఏతాలూకాబోర్డు మెంబరీనో సంపాదించుకొని ఏసబ్ మేజిస్ట్రేటు సబ్ఇనస్పెక్టరు సబ్కలెక్టరు ఇత్యాదుల స్నేహమో కుదుర్చుకొని తానొకయధికారిగాతనప్రజలపై స్వారిచేసి గౌరవప్రతిష్ఠలతో కాలము గడపుకొన జూచుచున్నాడు. ఒక్కపర్యాయము గ్రామాధికారములు గ్రామమునకు చెంది గ్రామన్యాయవిచారణ గ్రామములో జరిగి గ్రామసేవ జేయుటకు గౌరవప్రతిష్ఠలతో గూడిన

మార్గము గ్రామములలో నున్నదని నిర్ణయమగునేని గ్రామముల నుండి విద్యావంతులగుచుండు యౌవనులు గ్రామములను వదలి రారనుట తథ్యము. అట్టివారి యొత్తిడి కలిగి వారి యధికారము సాగినప్పుడు గాని విద్యావిధానము గూడ ప్రజోపయోగమార్గములను బట్టదు.

ఇన్ని కోర్కెలు అమరినను మన గ్రామసీమల ప్రజలను ఆర్థికదుస్థితినుండి తొలగింపక పోయినయెడల ముందునకు మన ప్రవృద్ధిమార్గము సులభము గాదు. ఆర్థికాభివృద్ధి మనదేశమునందు కలుగునా యని ప్రశ్నించువారుండకపోరు. "ప్రపంచమే దుస్థితియందున్నది. మన దేశమునకు నిరాశయే శరణ్యము. వేరుగతి లేదు" అనునట్టివారే చాలమంది యైనారు. రైతు అప్పులలో మునిగినాడు. గ్రుక్క తిరుగుటలేదు. బయటపడుదారి కానరాదు. ఈకారణముచేత నిస్పృహ మిన్నుముట్టినది. అందులోను వ్యవసాయమే ఆధారముగాగల కొన్ని ఇతర దేశములలో విజయవంతమయిన "సహకార" ఆర్థికపద్ధతి మనదేశములో చాల విపరీత పరిణామమందినది. సహకార సంఘములలో అప్పులు తరములైనను వసూలగుటలేదు. కలవాడు మోసకారి. లేనివాడు లేనివాడే. జిల్లాబ్యాంకులు, రాష్ట్రపుబ్యాంకులు, అధికారులు ఈస్థితికి వగవనివారు లేరు. మనదేశపు 'టార్థికశ్రేయోభిలాషు లెవ్వరును నీస్థితికి వగవనివారు లేరు. తరిచి తరిచి యాలోచించుకొలదిని మన యార్థికదుస్థితిచే నిర్వీర్యుడు గాని దేశాభిమాని యుండడనుకొనినను నిర్విణ్ణుడు సాధించు కార్యము లేదు. కాబట్టి నిరాశ మనస్థితికి ప్రతీకారముగాదు. మన దుస్థితికి మూలకారణము లరసికొనవలెను. వానిని నిర్మూలించుటకు సాధనసంపత్తిని సమకూర్చవలయు. ముందున కంజవైచి దారి నడువవలయు.

మనదేశమున రైతు భూమి లేనివాడు గాడు. ప్రతిభలేనివాడు కాడు. సోమరిపోతు గాడు. దేశమున నభివృద్ధికి మూలబీజములగు సహజ సాధనసంపత్తి, పశుసంతతి, అడవులు, నీరు, ఖనిజములు, ఇత్యాదులును కొరవడలేదు. కాని అధికారివర్గ మనుకరించిన ఆర్థికనీతి, వారిననుకరించి ఆంగ్లవిద్యాప్రవీణులైన నాయకులనుసరించిన ఆర్థికభావ దైన్యము ఇప్పటి దురవస్థకు కారణములు.

మనరైతుకు ఆర్థికముగా శరణ్యము సహకారపద్ధతియే. సహకారసంఘమే, అతని స్వాతంత్ర్యమునకు బునాది కాదగినది. కాని "సహకారము" స్వతంత్రమానవుని సంస్థ. వికాసవంతునిచేతిలోని శక్తి. మనదేశమునందో నిన్న నేటిదనుక "సహకారము" అధికారివర్గపు చేతిలోని కీలుబొమ్మగా నుండినది. దీనివలన రైతునకు వీరు కలిగించిన వికాసమా వర్ణింపనే పనిలేదు. మరియొక విశేషము. "సహకారము" రైతునకు నప్పిచ్చు సాహుకారి గాదు. రైతులోని స్వయంశక్తిని విజృంభింపజేయు నుద్దీపకము. అతని జీవితసర్వస్వములోను ప్రవేశించి రక్తమునే శుద్ధిపరచు మహౌషధి. కాని మనదేశముననో "సహకారము" సాహుకారికంటె నెక్కువ బలవత్తరమయిన అప్పుల యంత్రము. కల యప్పునకింకొక యప్పును జేర్చి రక్తమును బీల్చి కలుషితముజేయు చిత్రమంత్రము. ఇదియంతయు "సహకారము" యొక్క దోషము గాదు. మన రైతుయొక్క దుర్మార్గజనితమును గాదు. "సహకారము" మంచిసాధనమే. మనరైతు మంచి గుణవంతుడే కాని వైద్యుడు రోగనిదానము కనిపెట్టలేనివాడై కడుపున పోయవలసిన మందును కంట బోసినాడు. అడవులు నరకుటకు వినియోగింపవలసిన గొడ్డలిని గొంతులు నరకుటకుపయోగించినట్లయినది. అందుచేత "సహకార" పద్ధతిని వినియోగపెట్టు పద్ధతులలో మార్పులు కావలెను. ఈ మార్పుల ననుసరించి కార్యసాధన చేయగల వ్యగ్రోత్సాహులైన పరిపాలకు లేర్పడవలయు. 'అయ్యయో, ఈ పాపిష్ఠి కోఆపరేటివు సొసైటీలకు డబ్బిచ్చి చెడితిమే' యనుకొను జిల్లాబ్యాంకుల యధికారులు గాని రాష్ట్రపు బ్యాంకుల యధికారులు గాని మేలుచేయలేరు. వారి కట్టి దృష్టిని కలిగించు పరిపాలకులును మేలుచేయలేరు. "సహకార" పద్ధతిలో దేశపురైతుకు గల సర్వస్వమును మనకు పూచీకలదు. కాబట్టి రైతుయొక్క శ్రేయస్సే నా శ్రేయస్సు అనుకొని ధైర్యముగా కార్యమునకు బూను కోఆపరేటివుసంస్థల డైరెక్టరులు కావలయును. వీరియందట్టి ధైర్యమును కలిగించుటకు కావలసిన సర్వప్రయత్న

ములను శాసనములమూలకముగాను "సహకార" పద్ధతికి ప్రవ్యోపపత్తి కలుగచేయుటమూలకముగాను రైతును వికాసవంతుని జేయుటమూలకముగాను రైతును నాశముచేయుచుండు సాహుకారి యప్పులబరువును తగ్గించుటమూలకముగాను పనిజేయు పరిపాలకులు గావలయు. ఇతర నాగరకరాష్ట్రములందువలె ఇచ్చటను "సహకారము"ను సర్వవ్యాప్తము గావించు ప్రయత్నము చేయగల ప్రతిభావంతుల నాయకత్వము ప్రభుత్వమున నమరవలయు. అమరగలదు.

విషయ మింకను పెంచనక్కరలేదు. పరిపాలనకు గ్రామపంచాయతి, న్యాయవిచారణకు గ్రామములోని పెద్దలైన మధ్యస్థుల విచారణ, ఆర్థికబలమునకు పునరుజ్జీవితమైన "సహకార" సంఘము, ఇవి మూడే మనకు తారకములయిన గ్రామసంస్థలు. వీని వ్యాప్తి ప్రవృద్ధులే నిజముగా మనరైతు యొక్క స్వాతంత్ర్యసుఖముల వ్యాప్తి ప్రవృద్ధులు. వీనిపై దృష్టి నెలకొల్పని ఇతర ప్రయత్నములు నేల విడిచిన సాములు, చీలు విత్తిన బీజములు, బూడిదెను బోసిన హవ్యములు, అడవిని గాచిన వెన్నెలలు.

---



ప్రతిబింబములు

ఛాయాచిత్రకారుడు: వి. యస్. గోపాల దేశికాచారిగారు.

# భారతదేశపు దిగుమతులు

| | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 | 1931-32 | ౧౯౩౧లో మొత్తము దిగుమతులలో నూటికి శాతం |
|---|---|---|---|---|---|---|
| | వేల రూపాయలు. | | | | | |
| ప్రత్తి, నూలు, బట్టలు | 719016 | 671516 | 629088 | 316457 | 261881 | 20.72 |
| మిల్లుయంత్రములు వగైరా | 159375 | 183604 | 182185 | 143478 | 109234 | 8.64 |
| లోహములు | 284168 | 269884 | 236191 | 159226 | 97765 | 7.74 |
| నూనెలు | 110868 | 115323 | 116865 | 109225 | 97226 | 7.69 |
| పంచదార | 149055 | 160895 | 157765 | 109647 | 61653 | 4.88 |
| బండ్లు | 76937 | 110060 | 108473 | 73053 | 44847 | 3.55 |
| పనిముట్లు & ఉపకరణములు | 44652 | 49171 | 53820 | 47747 | 36920 | 2.92 |
| మనేకీ దినుసులు | 64060 | 62124 | 56361 | 48779 | 34126 | 2.70 |
| పట్టు & పట్టు బట్టలు | 50578 | 50067 | 45843 | 29992 | 27356 | 2.16 |
| అద్దకం రంగులు | 26455 | 28331 | 24331 | 25900 | 26765 | 2.12 |
| ఇనుము | 52442 | 52328 | 50665 | 36028 | 26091 | 2.06 |
| రసాయనములు | 26495 | 24794 | 24874 | 26122 | 25697 | 2.03 |
| కాగితములు & అట్టలు | 30062 | 32995 | 37231 | 28674 | 25024 | 1.98 |
| త్రాగుడు పదార్థములు | 36699 | 35716 | 37663 | 33176 | 22686 | 1.79 |
| రబ్బరు | 27167 | 28613 | 33267 | 25824 | 22228 | 1.76 |
| సుగంధ ద్రవ్యములు | 25785 | 29403 | 32575 | 25494 | 20822 | 1.65 |
| ఓషధులు & మందులు | 19828 | 20213 | 22625 | 19394 | 19111 | 1.5 |
| వూలు & ఉన్ని బట్టలు | 53682 | 50187 | 42845 | 23111 | 16206 | 1.26 |
| రైల్వేప్లాంటు & రైలుబళ్లు | 47681 | — | — | — | — | —1 |
| పండ్లు, కూరగాయలు | 20194 | 16839 | 18287 | 14859 | 13447 | 1.07 |
| అద్దములు, గాజు సామానులు | 24841 | 23749 | 25193 | 16478 | 12197 | .93 |
| ధాన్యములు, గింజలు & పిండ్లు | 23070 | 107281 | 54205 | 28163 | 11761 | .95 |
| పొగాకు | 29132 | 27460 | 26971 | 15116 | 9434 | .70 |
| సబ్బులు | 16137 | 15810 | 16668 | 11198 | 8872 | .74 |
| రంగులు, తత్ సంబంధమైన పనిముట్లు | 15439 | 14420 | 14655 | 11209 | 8753 | .69 |
| గృహనిర్మాణమునకు యింజనీరింగునకు వుపయోగించు పరికరములు | 12880 | 12196 | 13444 | 10988 | 8378 | .66 |
| ఉడుపులు | 16445 | 18299 | 17124 | 11113 | 8378 | .65 |
| ఉప్పు | 17484 | 14682 | 13039 | 11497 | 8176 | .57 |
| ఆయుధములు, మందుగుండు సామానులు, మిలిటరీస్టోర్సు | 7065 | 7664 | 6544 | 5402 | 6848 | .54 |

| | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 | 1931-32 | సం॥లో మొత్తం దిగుమతులలో నూటికి పాళ్ళు |
|---|---|---|---|---|---|---|
| | వేల రూపాయలు. | | | | | |
| స్టేషనరీ | 9167 | 10159 | 10506 | 8125 | 6808 | .53 |
| బూట్లు, చెప్పులు | 6699 | 6812 | 8781 | 8805 | 6493 | .52 |
| టేకు కొయ్య | 8147 | 8346 | 10354 | 8982 | 6069 | .40 |
| కట్టుడు సరకులు | 12655 | 13407 | 10428 | 7298 | 5429 | .41 |
| పుస్తకములు | 6198 | 6628 | 7182 | 6091 | 5338 | .48 |
| తేయాకు పెట్టెలు | 7180 | 6747 | 8024 | 6353 | 5032 | .48 |
| మెషీనుల పెట్టెలు | 8730 | 8311 | 9021 | 6362 | 5011 | .40 |
| బొట్టుపెట్టె సామగ్రి | 6·35 | 6461 | 7268 | 5381 | 4780 | .38 |
| రత్నములు, ముత్యములు | 13445 | 11683 | 10965 | 5974 | 4500 | .36 |
| తేయాకు | 6900 | 7422 | 6390 | 4568 | 4357 | .35 |
| జీవించియున్న జంతువులు | 3848 | 3571 | 3242 | 2086 | 4206 | .33 |
| మట్టిపాత్రలు & పింగాణీసామాను | 8071 | 7309 | 7234 | 4816 | 3836 | .30 |
| ఆటవస్తువులు, బొమ్మలు | 6382 | 6669 | 6484 | 4905 | 3704 | .29 |
| ఎరువులు | 4703 | 7357 | 9865 | 6743 | 3605 | .29 |
| కాగితపు పరిశ్రమకు అవసరపుపనిముట్లు | 4028 | 4151 | 4495 | 4207 | 3599 | .29 |
| దారపు ఉండలు | 3899 | 3598 | 3988 | 4299 | 3191 | .25 |
| గొడుగులు, వాని పరికరములు | 6238 | 5719 | 4366 | 3109 | 3016 | .24 |
| జిగురులు వగైరా | 3933 | 3895 | 4196 | 3107 | 2425 | .19 |
| కొవ్వు | 2625 | 2463 | 3102 | 2723 | 2079 | .17 |
| చాకులు వగైరా | 3850 | 3637 | 4141 | 2605 | 2069 | .17 |
| కుర్చీలు, బల్లలు వగైరా | 3062 | 3698 | 3766 | 2773 | 2011 | .16 |
| నగలు (బంగారు, వెండి) | 1724 | 1562 | 2625 | 3934 | 1918 | .15 |
| ముడి గోగునార | 3709 | 3545 | 3338 | 2169 | 1775 | .14 |
| రాక్షసిబొగ్గు | 6249 | 3910 | 4555 | 3469 | 1428 | .11 |
| చేపలు | 3698 | 2576 | 2631 | 2386 | 1342 | .11 |
| జనపనార | 2411 | 2658 | 2420 | 1837 | 1278 | .10 |
| గడియారములు, వాచీలు, వాటి భాగములు | 2722 | 2761 | 2347 | 1686 | 1121 | .09 |
| నిప్పుపెట్టెలు | 3937 | 1722 | 1089 | 411 | 195 | .01 |
| ఇతర వస్తువులు | 150186 | 152661 | 143369 | 105886 | 96481 | 7.64 |
| దిగుమతుల మొత్తం విలువ | 2498364 ... | 2533060 ... | 2407969 ... | 1647937 ... | 1263714 ... | 100 |

చెన్నరాజధానియందు ౧౯౩౦-వ సంవత్సరము అక్టోబరు ప్రారంభము మొదలు
డిసెంబరు తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## ఆరోగ్యశాస్త్రము

శరీర ఆరోగ్య శాస్త్రము, ఫారము ౫—యమ్. సాంబ శివరావు.

## కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

అంబరీషచరిత్ర—యస్. కృష్ణమూర్తి.
ఇతిహాస కథామంజరి—జె. వి. రాధాకృష్ణయ్య.
పంచకావ్య కథానిధి—పి. సుబ్రహ్మణ్యశాస్త్రి.
పరిక్షిత్తు—పి. వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.
భరతుడు—వి. రంగస్వామి అయ్యంగారు.
భారతేతిహాసములు— జె. తులశమ్మ.
మహాపురాణసారము—యస్. పార్వతీశ్వరశాస్త్రి.
రాజచంద్రిక—యమ్. శంకరరావు.
రామాయణము—వి. సుబ్బారెడ్డి
వామనచరిత్ర—(ప్ర.) ఆర్యన్ బుక్ డిపో, రాజమహేంద్రవరము.
వినాయకచరిత్రము—యమ్. జగన్నాథరావు.
శ్రీరామ కథామంజరి—జి. ఇందుమతీదేవి.

## —కల్పితములు

కథాకుసుమాంజలి—ఏ. వెంకటశాస్త్రి; యమ్. సీతాపతిరావు; కె. వెంకటరావు.
పుణ్యస్త్రీలు, తరగతులు ౧, ౨, ౩, ౪, ౫—వి. జానకి పురుషోత్తం; పి. వెంకటసీతమ్మ.
ప్రపంచవినోద కథలు— బి. టి. నరసింహాచార్యులు.
బాణగద్యకావ్య కథలు, భా. ౧, ౨ —యస్. లక్ష్మీపతిశాస్త్రి.
వనజాక్షి—వి. సుందరరామయ్య.
శ్రీ కలభాషిణీ చరిత్రము—కె. నరసింహాచార్యులు.
సుకళాచరిత్రము—వి. వెంకటాద్రి శర్మ.

## —చారిత్రకములు

భారతమంత్రులు—యమ్. నాగలింగశాస్త్రి.
శ్రీ కబీరుదాసుచరిత్రము— పి. యస్. బాబు, నౌషర్వాంజి.
హిందూదేశ చరిత్రకథలు, భా. ౧.—డి. సీతారామరావు.

## కల్పము

వనభోజనవ్రతకల్పము—(ప్ర.)సి. లక్ష్మీనరసింహశాస్త్రి మచిలీపట్టణము.
శ్రీత్రినాథవ్రతకల్పము—జి. లక్ష్మీనరసింహశాస్త్రి.

## గణితశాస్త్రము

రేఖాగణితము—సి. బి. శంకరరావు.
శిశుగణితము—యస్. కృష్ణరావు.
సామాన్యగణితము— యస్. వి. రామదాసు.

## గేయములు

అలిమేలుమంగమ్మ అను లక్ష్మీ పద్మావతుల కొట్లాట—కె. చంగయ్యదాసు.
కాళీయమర్దనము—జంగముకథ—యు. నాగలింగము.
నూతన శృంగారకోలాటజానళీలు—యన్. వేదాభ్యాస భాగవతులు.
పాగల్ హరనాథ్ భజనకీర్తనలు-యమ్. వెంకటలక్ష్మమ్మ.
రామదాసు బందిఖాన—బి. కోటేశ్వరరావు.
రామాయణకీర్తనలు—యన్. ఎ. నరసింహచార్య.

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు. ప.—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

శ్రీవెంకటేశ్వర మేలుకొలుపులు—కె. చంగయ్యదాసు.
శ్రీహరిభజన రామాయణము—సి. కృష్ణదాసు.
సహకారవిజయము—వి. సుబ్బరాట్కవి.

## చ రి త్ర

కడపమండలచరిత్ర—జె. శేషాద్రిశర్మ.

## చ ట్ట ము

మదరాసు హిందూమతధర్మాదాయములఆక్టు—(అను.) కె. యస్. కాశ్యప.
లఘుదీపిక—(ప్ర.) పి. భీమశంకరుడు, అమలాపురము.
వ్యవహారచంద్రిక—జి. సేతుమాధవరావు.

## ఛందశ్శాస్త్రము

కావ్యచంద్రిక—యమ్. డేవిడ్.

## జీవితములు

ఆత్మకథ, భా. ౨—(అను.) వి. శివరామశాస్త్రి.
లూయీపాస్టరు—(ప్ర.) క్రిశ్చియన్‌లిటరేచర్ సొసైటి, మదరాసు.
శ్రీ గోపాలకృష్ణగోఖ్లేజీవితము— జె. సత్యనారాయణ మూర్తి.
శ్రీ దాసులింగమూర్తి జీవితము—పి. సూర్యనారాయణ.
శ్రీరామకృష్ణపరమహంస చరిత్రము, తదోపదేశములును—కె. నరసింహము.
శ్రీ లాలా లజపత్‌రాయి జీవితము—జె. సత్యనారాయణమూర్తి.
శ్రీ వివేకానందస్వామి జీవితము, భా. ౧. —బి. వెంకటేశ్వర్లు.

## జ్యోతిషశాస్త్రము

శ్రీ రెట్టమతశాస్త్రము— (ప్ర.) పి. త్యాగరాయశెట్టి, మదరాసు.

## దండకము

శ్రీమన్మహాకాళీదండకము—డి. సూర్యనారాయణశర్మ.

## ధ ర్మ శా స్త్ర ము

పులస్త్యస్మృతి—(ప్ర.) వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు.

## న వ ల లు

కళావతి—యమ్. వెంకటరాఘవాచార్యులు.
జపమాలిక, భా. ౧, ౨—యస్. రామానుజరావు.
ప్రణయచాంచల్యము—టి. రామచంద్రరావు.
భిక్షాగ్రేసరుడు—యన్. సూర్యనారాయణమూర్తి.
మోహన—బి. రామానుజులరెడ్డి.
రాణిభవాని, భా. ౧.—(అను.) జె. తులశమ్మ.
వక్రరేఖ—యమ్. నరసింహరావు.
సీమంతినీచరిత్రము—జె. శేషాద్రిశర్మ.

## నాటకములు

అంపశయ్య—ఏ. వెంకటాచలపతిరావు.
ఉత్తరరాఘవము—(అను.) బి. లక్ష్మీకాంతకవి.
ఉషాపరిణయము—ఏ. వెంకటనరసింహాచార్యులు.
ఔత్తానపాదీయ నాటకము—యమ్. లక్ష్మీనరసింహకవి.
కమల— పి. వెంకటరత్నశర్మ, యమ్. సత్యానందరావు.
దంపతులు— పి. వి. రంగారావ్.
ప్రద్యుమ్నవిజయము—వి. పిచ్చయ్యశాస్త్రి.
భక్తత్యాగరాజు— వి. వెంకటరత్నశర్మ.
మదనగోపాల నాటకము అను పారిజాతము—జి. వెంకటేశము.
రఘునాథ్—యు. సత్యనారాయణరావు(జమీందారు).
రుక్మాంగద నాటకము— వి. పిచ్చయ్యశాస్త్రి.

## నీ తి

తెనుగునీతిబోధ—వి. వెంకటేశ్వరశాస్త్రి.
నీతికథారత్నావళి—ఏ. జగన్నాథశాస్త్రి.
నీతికథావళి—జె. శేషాద్రిశర్మ.

## పరిశిష్టము

ఆంగ్లదేశాటనచరిత్ర—టి. శివశంకరం.
ఆంధ్రబాలవాచకము, భా. ౧, ౨ — నీలవేణియమ్మ.

ఆంధ్రోపాధ్యాయ గ్రంథమాల—(ప్ర.) గవర్నమెంట్ ట్రైనింగ్ పాఠశాలోపాధ్యాయ సంఘకార్యదర్శి, ఒంగోలు.

అతిథిపూజ—జె. స్వామినాయన.

ఆరోగ్యమాత—కె. సోమనాథశాస్త్రి.

ఇప్పటికవి—పి. శ్రీరాములురెడ్డి.

ఉత్తమస్నేహితులు—జె. వి. రాధాకృష్ణయ్య.

ఉపాధ్యాయబోధిని—(ప్ర.) ఆంధ్రఎవాంజిలికల్ లూథరన్‌సొసైటి, తర్లపాడు.

కలియుగప్రబంధ మండలి మూడవభాగము—ఏ. శ్రీనివాసాచారి.

కృష్ణామండల అర్చకసంఘము—(ప్ర.) అర్చకసంఘకార్యదర్శి, మచిలీపట్టణము.

ఖాదీతత్త్వము—ఐ. సరోజినీదేవి, కె. జ్ఞానప్రసూనాంబ.

గర్భిణీస్త్రీనియమము—సి. వెంకటరత్నము.

గురుశిష్యసంవాదము—షేక్ రాజహుస్సేన్‌యోగి.

గౌతమీవాచకము, తరగతులు ౧,౨,౩—పి. సోమన్న.

గ్రామమునసబులపరీక్షాప్రదర్శిని—బి. లక్ష్మీనరసింహం.

చెన్నరాజధాని భూగోళవాచకము, త. ౫—వి. పురుషోత్తం.

జంటలు—కె. వెంకటరావు.

జ్ఞానబోధిని—(ప్ర.) శ్రీరామమూర్తి బ్రదర్స్, వెగురుపాక.

తెలుగుపోటీ పరీక్షవ్యాసములు—య. వెంకటరత్నకవికుమార్.

దోపిడిదొంగలు—జె. యస్. బెని.

నానాదేశవాసులు—సి. డి. సౌజ.

నారాయణ వాచకములు, బుక్ ౧, ౨—ఆర్. నారాయణరావు.

పద్యగద్యరత్నావళి—(ప్ర.)పద్మావతిఅండ్‌కో.,ఏలూరు.

పన్నా—కె. జగ్గయ్యచౌదరి.

పానము—వి. శ్రీరాములు.

ప్రాథమికపాఠశాలాగరోగ్య బోధిని, తరగతి, ౩—యస్. గోపాలం.

బళ్లారిజిల్లా, భూగోళము—(ప్ర.) పి. బుచ్చయ్యశెట్టి అండ్‌సన్, బళ్లారి.

బెంగుళూరుసిటీ వివాహసహాయ సమాజ విషయములు, చందాదారులజాబితాయు అందు ప్రకటనలు—సి.వి. సుందరరాజరావు, బెంగుళూరు.

బ్రాందివలనిబెడద—(ప్ర.) క్రిశ్చియన్‌లిటరేచర్ సొసైటి, మదరాసు.

భారతసహకారము—(ప్ర.) యన్. సత్యనారాయణ, ఆలమూరు.

భావనాయిక—బి. రామజోగరావు.

మంథెన సంపూర్ణశతావధానము—జె. సుబ్రహ్మణ్యశర్మ.

మన్మథశాస్త్రము—సారథి.

మాతృపూజ—జి. వి. వి. సత్యనారాయణ.

మాధవవార్షికోత్సవసంచిక—(ప్ర.)పి. సత్యనారాయణ, మచిలీపట్టణము.

మానసదీపిక—వి. రామభద్రశర్మ.

ముక్తావళి—(ప్ర.) వెంకటరామ్ అండ్‌కో., ఏలూరు.

మోహనమురళి—పి. డి. మల్లికార్జున్.

రామచంద్రుని హంపియాత్ర—జి. జోగిసోమయాజి.

రామనామము—ఎ. వెంకట దాసు.

రామాశాస్త్రివాచకము, ఫారము ౧, ౨, 3—టి.వి. నరసింగరావు, బి. హెచ్. పట్టాభిరామయ్య, సి. భానుమూర్తి.

రుబాయత్—(అను.) సి. నారాయణరావు.

లంజాట, భా. ౧, ౨—యమ్. నారాయణదాసు.

వాచకబోధనము—యస్. భూషణం.

వావిళ్ల వాచకపుస్తకము, తరగతి ౧.—జె. గంగన్న.

వివేకవాచకము, బుక్ ౨—సి. లక్ష్మీనరసింహం.

శకుంతలా కరగ్రహణము—(ప్ర.) రాజా యమ్.భుజంగరావు, ఏలూరు.

శారదాబిల్లుహడావిడి—బి. కోటీశ్వరరావు.

శారదావాచకములు, బుక్ ౫.—(ప్ర.) టి. రాజగోపాలరావు, మదరాసు.

శుకవాక్యము—పి. వెంకటసుబ్బయ్య.

శృంగారకంఠాభరణము—(ప్ర.) జి. యస్. శాస్త్రి అండ్ కో., మదరాసు.

శ్రీకృష్ణావతారతత్త్వము,భా.౧౦,౧౨—జె. శేషాద్రిశర్మ.

శ్రీనివాసాన్వరీయము— వి. వెంకటాచార్యులు.
శ్రీరామకృష్ణలీల—బి. రామదాసు.
శ్రీలక్ష్మీనారాయణసంవాదము —జి. సీతారామయ్య.
శ్రీలక్ష్మీనారాయణీయము—జి. కూర్మనాథ కవి.
సకలసర్వగుణఅదృష్టదీపిక— సి. చిన్నయ్య.
సన్మార్గదర్శిని, భా. ౧, ౨, ౩—జి. శ్రీరామశాస్త్రి.
సప్తవ్యసనములు—భ. నారాయణమూర్తి.
సహకారోద్యమము—పి. రామాచార్యుడు.
సుగుణమణి— వి. నరసింహ.
సుభాషితములు—పి. సూర్యప్రకాశశర్మ.
సువర్ణపదగృహక్షేత్రదర్శనము—వి. కృష్ణమాచార్యులు.
స్థూలసూక్ష్మప్రపంచపక్షి అష్టదిక్కుల యారూఢశాస్త్రము —(ప్ర.) కె. చల్లప్ప మొదలి, మదరాసు.

## పారిశ్రామికము

ప్రాథమిక పాఠశాలలయందలి పరిశ్రమాదికములు — (మిసెస్) యస్. కె. విలియమ్స్.

## పురాణములు

తెలుగుబ్రహ్మపురాణము—(అను.) జె శేషాద్రిశర్మ.
తెలుగువామనపురాణము—(అను.) ఆర్. కొండయ్యశాస్త్రి.
శివరహస్యఖండము— (అను.) కె. వెంకటాచల కవి.

## ప్రబంధములు

ఆముక్తమాల్యద (సటీ)— (ప్ర.) వావిళ్ల రామస్వామి శాస్త్రి అండ్ సన్స్, మదరాసు.
శివలీలావిలాసము— కె. తిమ్మకవి.
హరిశ్చంద్రనలోపాఖ్యానము, (సటీ)—(ప్ర.) వావిళ్ల రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు.
క్రిష్టమస్ పూలదండ—కె.యస్. యస్.జ్ఞానచలమయ్య.
గృహనిర్వాహకత్వము— (ప్ర.) (రెవ్) ఆర్. జి. కోర్డ్ లింగ్, రెంటచింతల.
జేసుదేవుడు—కే. భోగలింగాచారి.
జ్ఞానోపదేశము యొక్క సంక్షేపము—(ప్ర.) (రెవ్) డి. గ్రాసి, బెజవాడ.

## భూగోళశాస్త్రము

కాకినాడతాలూకా భూగోళము—ఛ. అనంతరావు.
గుంటూరు తాలూకాభూగోళము, త. ౩—
పల్నాడుతాలూకా చరిత్రాత్మక భూగోళము— యమ్. సీతారామరావు.
ప్రపంచభూగోళశాస్త్రము—కె. జగన్నాథం.
మానవభూగోళశాస్త్రము— యమ్. సీతారామరావు.
రాజోలు అమలాపురం తాలూకాల భూగోళశాస్త్రము —ఎ. పార్వతీశం.

## భౌతికశాస్త్రము

బాలవిజ్ఞానశాస్త్రము—కె. వీరభద్రయ్య.
భౌతికశాస్త్రము, బుక్ ౨ — కె. యస్. సుందరరామ అయ్యంగారు.

## మతము—హిందు

ఆస్తిక్యము— వి. వెంకటశివయ్య, కె. సత్యనారాయణ మూర్తి.
ధర్మము—యమ్. సూర్యనారాయణ.
వర్ణాశ్రమధర్మపరిణామము—వి. సూర్యనారాణరావు.
బృందావనపురగణార్చనాభివర్ణనము—యం. అంజయ్య.
బ్రహ్మచర్యము — సి. శేషాచలార్య, ఏ వెంకటరామ చౌదరి.
శివరాత్రి చరిత్ర— కె. కోదండరామయ్య.
సంక్రాంతి—మనకర్తవ్యము—జి. లచ్చయ్యచౌదరి.
హిందువుల ఆధిక్యము—(అను.) డి. దామోదరరావు.

## —ఇతరములు

జ్ఞానోపదేశ సంక్షేపము, ప్రతిరోజు చెప్పదగినతిరుమంత్రములు—(ప్ర.) (రెవ్) డి. గ్రాసి, బెజవాడ.
తల్లీ వర్ధిల్లుము—యమ్. ఇగ్నాటిస్.
తెలుగుకీర్తనలు—(ప్ర.) క్రిస్టియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
దావీదుకీర్తనలు—యమ్. డేవిడ్.
పంచామృతములు—వి. డేనియల్.



"అశ్వత్థామ ప్రతిజ్ఞ"

చిత్రకారుడు: చంద్రుపట్ల రామారావు, మేడపా

పరమప్రసంగము—(ప్र.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

మార్టిన్ లూథరు—యన్. రామమూర్తి.

యేసుక్రీస్తు కథావళి—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

## మాహాత్మ్యములు

అహోబిలమాహాత్మ్యము—జి. శ్రీరామశాస్త్రి.

త్రినాథునివ్రతమాహాత్మ్యము—జి. లక్ష్మీనారాయణ.

పంపామాహాత్మ్యసంగ్రహము—కె. వెంకటరామశాస్త్రి.

శ్రీమదహోబిల చరిత్రము—పి. సూర్యనారాయణ.

శ్రీ మొగిలీశ్వరమాహాత్మ్యము—ఎ. వీరభద్రపిళ్లె.

## రాజకీయము

గ్రామపరిపాలన, గ్రామాధికారులు—వై. సీతారామయ్య.

బ్రిటిషుపరిపాలనా సౌఖ్యము—భ. లక్ష్మీపతిశాస్త్రి.

మహాత్మగాంధి సత్యాగ్రహము—బి. కోటీశ్వరరావు.

సత్యాగ్రహోద్యమము, నిమ్నజాతుల నిరసనము—వి. అమోసు.

## వేదాంతశాస్త్రము

తత్త్వరంజని—కె. వెంకటరెడ్డి.

ద్వైతాద్వైతప్రశ్నోత్తరమాల—బి. రంగస్వామిరెడ్డివర్మ

నిష్కామయోగము—(ప్ర.) మానవాదర్శగ్రంథమండలి, అంగలూరు.

ప్రవృత్తిమార్గదీపిక—యన్. వెంకయ్య.

మాధవసందేశము—పి. సీతారామశర్మ.

విచారసంగ్రహము—(అను.) ప్రణవానంద.

వివేకసింధువు—కొండనార్యుడు.

శ్రీశంకరానందగీతాభాష్యము—(అను.) యమ్. ఆంజనేయశాస్త్రి.

## వైద్యశాస్త్రము

అష్టాంగహృదయము, భా. ౧, ౨—(ప్ర.) వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు.

వ్రణచికిత్స—కె. సుందరరామయ్య.

స్త్రీజనకల్పవల్లి—యమ్. భైరవమూర్తి.

## వ్యాకరణ శాస్త్రము

తెలుగుప్రారంభ వ్యాకరణము—కె. నరసింహాచార్యులు.

త్రిలింగకుణము—డి. యగ్గన్న.

శారదావ్యాకరణము, భా. ౨—టి. రాజగోపాలరావు.

## శతకములు

కుమారీశతకము—(ప్ర.) ఎ. లక్ష్మణస్వామినాయుడు, రాజమహేంద్రవరము.

కృష్ణాభక్తకల్పద్రుమ శతకము—ఒ. లింగమూర్తి.

జానకీశతకము—కె. వెంకటరాజేశ్వరరావు.

నవకుమారశతకము—టి. సుబ్బరావు.

భక్తకల్పద్రుమ శతకము—ఖ. నరసింహసోదరులు.

శ్రీరామలింగశతకము—యన్. సూర్యనారాయణ.

వేమనశతకము—(ప్ర.) ఎ. లక్ష్మణస్వామినాయుడు, రాజమహేంద్రవరము.

శ్రీకాళహస్తీశ్వరశతకము—(ప్ర.) కె. వీరవెంకయ్య, రాజమహేంద్రవరము.

సుమతిశతకము—(ప్ర.) పి. నటేశమొదలి, మదరాసు.

## సంగీతశాస్త్రము

స్వరవర్ణసుధానిధి—యమ్. పానకాలరావు.

## సాముద్రికశాస్త్రము

హస్తసాముద్రికము—యం. నమశ్శివాయ.

## స్తోత్రములు

లక్ష్మీస్తవము—యం. వెంకటదాసు.

శివధ్యానామృతము—యమ్. శివలింగయ్య.

శివానందలహరి—(ప్ర.) బి. లక్ష్మీకాంతకవి, గుంటూరు.

శ్రీ చెన్నకేశవస్వామివారి భక్తచామరములు—పి. బుచ్చయ్య.

శ్రీభగవత్ప్రార్థనలు—జి. సీతారామస్వామి.

---

# ఒక విషాదశీలుని వేఁడికోలు

'సాహిత్యవర్ధనుఁడు'

తనివిఁ దల్వాదియేండ్లుగా శ్రుతిశిరస్తండోపదిష్టార్థముల్
 విని చింతించిన మేటిపుణ్యమునకున్ వేగంబ నీ వీయఁబూ
నిన శశ్వత్ఫల మిట్టిదే! వరద! నానెమ్మేను నీ వెంత గ్రాఁ
చిన, ధీభ్రంశముమాత్ర గూర్పకుము నన్ శిక్షింప; దీనావనా!

"అవిలంబంబగు మోక్షసిద్ధికయి న న్నర్థింపవే? సిద్ధ మె
ట్లవుఁ బ్రారబ్ధఫలావసానమునఁ గా" కంచుఁ మదుగ్రాఘు గౌ
రవ మెక్కుమ్మడిగా ఫలోన్ముఖ మొనర్పఁ జూచెదో యేమొ? నా
చివురుఁ గుండె తదార్తి కోర్వఁగలదే చింతింపు; దీనావనా!

పరిహాసించితినో ధీబలదర్పమునఁజేసి సత్త్వసంపన్నులౌ సాధుజనుల
గికురించితినో యమాయకులైన పెద్దల మతి వాదమునఁ దాఱుమాఱుచేసి
అపచరించితినో బ్రహ్మజ్ఞానదాతలై యమరిన సద్గురూత్తములపట్ల
కావించితినో జీవికాభంగ మెవనికేఁ నలువురిలోన వెంగలి నొనర్చి;
ప్రతిపదవలేపమునుమున్న పరఁగనిచ్చి-యవలమతిభంగభయము నాయ మెఘటింప
వృత్తమును దిద్దుకొన నీని వికటశిక్ష - శిక్షయే యది విద్వేషదీక్ష గాక?

తలఁ పెచ్చోట జనించునో యెఱుఁగఁ; దద్భావంబు పై కుబ్బఁగాఁ
దెలియఁ నేర్చెద నంతె గాక; మఱి యేదీ నాకుఁ గర్తృత్వ మ
త్తలఁపుంబోకల? కర్తనే యయిన నేతద్దార్మనస్యాగ్ని కీ
లల న న్నేల దహించుకొందు నిటు కల్లల్ నమ్మి, దీనావనా!

మతివిభ్రంశము కూర్చి తుట్టతుదకుఁ బ్రాక్కీర్తిఁ బోకార్చెదో
మతిలో నిశ్చితపూర్వమై వెలయు సమ్యగ్జ్ఞానమే నిల్పెదో
మతి యెట్లుండినఁ దద్విభిన్నమగు నాత్మఁ నేన యఁ జ్ఞప్తి వి
స్మృతిఁ బొందింప కిదే మదీప్సితము తండ్రీ, దీనచింతామణీ!

---

# సర్వేపల్లి రాధాకృష్ణ

కపిల కాశీపతిరావు గారు, బి. ఏ., బి. యల్.



సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు

స్వభావంవల్ల మానవులు రెండురకాలు. ఈ ప్రపంచం అంతా తమకోసమే ననుకునేవారు కొందరు. తమరే ఈ ప్రపంచపు సేవకోస మనుకునేవారు కొందరు. మొదటివారు స్వార్థపరులు. రెండోవారు స్వార్థత్యాగులు. ప్రథములు ఆలుబిడ్డలకోసమే జీవితం గడిపి అవతారం చాలించి నశిస్తారు. సౌరభం లేని పుష్పంలాగున వీరిజీవితం వ్యర్థం. రెండోరకం తమసేవాశక్తివల్ల చిరస్థాయిగా ప్రపంచహృదయంలో నిలిచిపోతారు. పుష్పం వాడిపోయినా సువాసన మిగిలిపోయినట్లు వారికీర్తి దిగంతముల వ్యాపించి నిలిచిపోతుంది. జనసామాన్యం అంతా మొదటిరకం. రెండో రకం పురుషు లరుదు. రాధాకృష్ణ ఈతరగతివాడు.

జాతకులుకూడా రెండురకాలు. భ్రష్టజాతకులు' అదృష్టజాతకులు. మహాప్రజ్ఞ కలిగిన పురుషు లుంటారు' దేశమంతా వారిమీద ఆశపెట్టుకుని ఘనకార్యముల కోసం ఎదురుచూస్తుంది. కాని విఫలమనోరథమే పర్యవసానం. వారు తలచిన ప్రతికార్యానికీ విఘ్నమే. గ్రహస్థితి వారి కనుకూలం కాదు. వారికి సంబంధించిన సంస్థలకు కూడా అంతే.

అదృష్టజాతకులు పట్టింది బంగారం. వారి నాశ్రయించిన సంస్థలకు సర్వదా జయమే. ఇందులోకూడా రాధాకృష్ణ రెండోతరగతివాడే.

అదేమిటో మూరాన్నుంచి రాధాకృష్ణగారు చాలా పొడుగ్గా కనుపిస్తారు. ఇన్నాళ్లుగా పుట్టినింటికి దూరాన్న వున్న వీరి కీర్తికూడా చాలాపొడుగ్గా వున్నది. నిడివే కాక వెడల్పుకూడా కలిగి చాలా వైశాల్యం ఆక్రమించు కున్నది. దేశీయుని కీర్తిచంద్రికలకాంతి దేశీయుల కండ్లకే మిరుమిట్లు గొలిపినది. సాలివారికి కళ్లు కామిర్లె పోయినవి. "దూరపుకొండలు నునుపోయి" అన్నారు. పరదేశంనుంచి స్వదేశం చేరినాడు రాధాకృష్ణ: ఇంకా పొడుగు తగ్గలేదు. గుమ్మాలు తలకు తగుల్తున్నవి. అవసరమైనచోట దర్వాజాలు తీయించి కొత్తవి నిర్మిస్తున్నారు గాని వంగిమాత్రం నడవడం లేదు.

ఇంట గెల్చి రచ్చ గెలువమని సామెత. కాని రాధాకృష్ణ రచ్చగెల్చి ఇంట గెలుస్తున్నాడు. వీధిలో గెలిస్తేనే కాని ఇంట్లో మర్యాద లేదు. అయినా తెనుగు వారికి పొరుగింటి పుల్లకూర రుచి. పైవారంతా 'భళీ' అంటేనే గాని పాటివాడి సరుకు గమనించడు; గమనించలేదు.

ఆసేతుహిమాచల పర్యంతమే 'జాగ్రఫీ' అయిన భారతీయులలో ఖండఖండాతరములలో ప్రసిద్ధిగాంచిన పురుషు లుండడం దుర్లభం. స్త్రీలు అస లుండరు. నానాజాతిసమితి, సర్వజాతి సామ్రాజ్యం, ఆదర్శము లైన ఆధునిక ప్రపంచంలో గుడుగుడుగుంచం గుండా

రాగం అన్నట్లు, మనదేశమే, మనభాషే అంటే చెల్లదు. అట్టివారి కీర్తి అటు అరేబియా సముద్రం, ఇటు బంగాళా ఖాతం దాటి పోజాలదు. అటువంటి మహానుభావులు మనదేశంలో పెక్కురున్నారు. కాని వారికి పరదేశములలో వూరూ పేరూ వుండదు. మొన్న మొన్న పండిత మాలవ్యాగారు ఐరోపాఖండంలో ప్రచారం చేసినప్పుడు కొన్నిచోట్ల వారికి స్వాగతం ఇవ్వడానికికూడా యెవరూ లేరట. కారణం ఏమిటంటే వీరి జ్యాగ్రఫీ పుస్తకం చాలా సన్నంగా వుంటుంది. ఆసేతుహిమాచల పర్యంత మే.

ఎవరికీర్తి హిమాలయముల యెత్తు దాటి పసిఫిక్ మహాసముద్రంలోతు ఈది, సహారాయెడారివేడి భరించి, నోవాజింబ్లాచలి సహించి, ప్రపంచపు పొలిమేర్లలో మారుమ్రోగుతుందో వారే సుప్రసిద్ధపురుషులు. ఈ రీతిగా సమస్తదేశములలోనూ పేరెన్నికగన్న భారతీయులు లెక్కకి అరడజను. మహాశక్తి సంపన్నుడు, అవతారమూర్తి మహాత్ముడొకడు. కవిసార్వభౌముడు రవీంద్రుడొకడు. కవయిత్రి సరోజినీదేవి. ప్రకృతిశాస్త్ర పరిశోధకులు సర్. సి. వి. రామన్, సర్. జే. సి. బోసుగార్లు. వేదాంతశాస్త్ర పండితుడు రాధాకృష్ణ.

ప్రిన్సిపలు ఎ. బి. జాన్‌స్టనుగారు ఒకమారు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారిని కొనియాడుతూ, వారు మహానుభావులు కావడానికి కారణం జన్మస్థానమైన చిత్తూరన్నారు. చిత్తూరుజిల్లా దేశనాయకుల కనేకులకు జన్మస్థానమట.

ఆజిల్లాలోనే తిరుత్తనిగ్రామంలో తిరునక్షత్రంలో సర్వేపల్లివారింట జన్మించినాడు రాధాకృష్ణ. చురుకైన విద్యార్థి. జ్ఞాపకశక్తి ఈయనసొమ్ము ఈయన ఎమ్.ఏ. పరీక్షలో ప్రథమతరగతిలో జయము పొందేవరకూ ఈయన విద్యార్థులలో ఘనాపాటి. ప్రెసిడెన్సీకాలేజీలో వేదాంతోపన్యాసకుడైనాడు. పాల్ఘాటుకాలేజీ ప్రిన్సిపాలైనాడు. కొన్నాళ్లు మైసూరు విశ్వవిద్యాలయంలో పండితుడుగా వున్నాడు.

అప్పటి కప్పుడే రవీంద్రకవిచంద్రుడు నోబెల్ బహుమాన మందినాడు. పాశ్చాత్య ప్రపంచములో భారతీయ కవిపుంగవుని నామాక్షరములు నాటుకొన్నవి. ఇంగ్లీషులోనూ, తదితరభాషలలోనూ టాగూరు కవిత్వానికి తర్జుమాలు చదివి అందులోనున్న ఆర్యహృదయం గ్రహించడం వారికంత సులువనిపించలేదు. 'రవీంద్రకవి తత్వము' అని రాధాకృష్ణ ఇంగ్లీషులో గ్రంథమొకటి తయారుజేసినాడు. అంకితము రవీంద్రునికే. గురుదేవు డది స్వీకరించినాడు. కవి టాగూరు చదువరులంతా రాధాకృష్ణ చదువరులైపోయినారు. టాగూరు పేరుతో రాధాకృష్ణపేరు కూడా దిగంతముల మారుమ్రోసినది.

భోజరాజునుబట్టి సంస్కృతకవులు రాణించినారు. కృష్ణదేవరాయనిబట్టి తెనుగుకవులు రాణించినారు. మనకాలంలో సర్ అశుతోష్‌ముఖర్జీనిబట్టి సర్వశాస్త్రపండితులూ రాణిస్తున్నారు. మహానుభావుడు చచ్చి స్వర్గాన వున్నాడు. ఆయన త్రవ్విన ఖనిలో సుప్రసిద్ధమణులు రెండు: రామన్‌మణి, రాధాకృష్ణమణి.

చిరకాలమునుంచి మనదేశములో గాని విదేశములలో గాని వేదాంత పత్రికలకు వ్యాసాలు వ్రాస్తూండడము మన కథానాయకుడికి రివాజు. తత్కారణముగా జనసామాన్యము ఈయనను గుర్తించక పూర్వమే సుప్రసిద్ధ వేదాంతశాస్త్రజ్ఞులకు రాధాకృష్ణ చిరపరిచితుడు. ఈవిధంగా పరిచితులైనవారిలో కలకత్తా విశ్వవిద్యాలయోపాధ్యక్షుడు ముఖర్జీ ఒకడు. ముఖర్జీగారు పెద్దవల వేయించి హిందూదేశంమీద పారవేసినాడు. అందులో చిక్కినవి రంగురంగుల చేపలన్నీ. తనబుట్టలో వేసుకున్నాడు. ఆనాటి ఈతెనుగుచేప పెరిగి పెద్దదై తిమింగిలమై పోయినది. దీనికీర్తి సముద్రాలు దాటిపోయినది.

భూగోళం రెండుభాగములలోనూ ఎవరి సంప్రదాయములు వారికి తరతరాలనుంచి వస్తున్నవి. రెంటిలో పూర్వార్ధగోళం పూర్వం. ప్రకృతిశాస్త్ర పరిశోధన పాశ్చాత్యుల సొమ్ము. మతసంస్థాపన మనసొమ్ము.

సుప్రసిద్ధ మతాచార్యు లందరూ జంబూద్వీపం పొత్తిళ్లలో పెరిగినవారే.

ప్రాచ్య పాశ్చాత్య నాగరికతావాహినులు వేరువేరు మార్గములలో పోవుచున్నవి. ఒక్కింట ఆధ్యాత్మికం ప్రధానము, మరొక్కింట ఐహికము. ఇర్వురి ఆశయమూ సత్యాన్వేషణమే, కాని సాధన వేరు. ప్రపంచ రహస్యము గ్రహించడానికి గాలివిమానంమీద పైకి లేస్తారు వారు. కుండలినీ ద్వారా హంసను లేవదీస్తారు మనవారు. నక్షత్రలోకం చూడడానికి భూతద్దాలతో చేసిన దూరదర్శిని ఉపయోగిస్తారు వారు. జ్ఞాననేత్రం తెరువమన్నారు మనవారు. వారు కుమారస్వామి మాదిరి, మనము గణేశ్వరుని మాదిరి. బొజ్జదేవుడి మార్గమే సులువని లోకవిదితము. మాదే సులభమార్గమని చెప్పడానికి ఇన్నాళ్లుగా భారతీయులికి తాహతు చాలలేదు.

పాశ్చాత్యులకు భారతహృదయం విపులంగా విప్పి చెప్పడాని కవతరించినాడు రాధాకృష్ణ. సూర్యచంద్రులు తూర్పున ఉదయిస్తారు. వెల్తురు తూర్పునుంచే రావాలి.

ఈ ఘనకార్యం చెయ్యడాని కిదివర కెవరూ లేరని కాదు. విద్యాభ్యాసం చెయ్యడానికి అయిదో సంవత్సరం వస్తేనే గాని వీలు లేదన్నారు. కారణం, తగినంత బుద్ధిబలం అంతవరకు చేకూరదని. అదే మోస్తరుగా పాశ్చాత్యులకు ప్రాచ్య విద్యాభ్యాస సమయం ఇప్పుడే వస్తున్నది. బాహ్యప్రపంచం వీధిగుమ్మములో నిలువబడి ఆశ్చర్యపోయే పడమటి దొరలకు ఆత్మశక్తి తత్వం బోధించడం కష్టసాధ్యం.

భూమి సాగైతేనే గాని విత్తనం నాటడానికి వీలు లేదు. అందులో కొత్తభూమిలో పైరు చేసేటప్పుడు ఒకరిద్దరు ఆసాము లైతేనే గాని మూడోవాడికి లాభం చిక్కదు.

తూర్పుఖండంలో మొక్క పశ్చిమ ఖండపు వాతావరణస్థితిలో పెరగడం బహుకష్టం. చాలామంది ప్రయత్నించారు. కొనసాగలేదు. ఆరువేల సంవత్సరాల క్రితం సృష్టి లేనేలేదని నమ్మి వాదించేవారికి మన్వంతరాల నాటి విజ్ఞానం బోధించాలి. రాధాకృష్ణకీర్తిలో వున్న కిటుకదే. తత్వం బోధించినాడు. వెర్రి కుదిరింది. రోకలి తలకి చుట్టుమన్నట్టుగా తయారైనది. శిష్యవర్గం వారి కిప్పుడు వేదాంతపు పిచ్చి పట్టినది. ఓమాదిరిగా వదల్దు.

ఇంతపని చెయ్యడానికి ఈయనలో ఉన్నవిశేషం ఏమిటి? అని ప్రశ్న తోస్తుంది.

భారతహృదయం విప్పి బోధించడానికి భారతీయుడే కావాలి. తీవ్రమైన మేధాశక్తితో, వేదవేదాంగములు కరతలామలకము గావించుకుని శ్రద్ధగా విమర్శించాలి. తేల్చిన సిద్ధాంతములు ప్రకటించాలి. ప్రకటనకు పరికరములు రెండు. భాషాపాండిత్యము, తదుపరి వాక్చాతుర్యం. ఇదే పాశ్చాత్యులకు చెప్పడానికి వారి వేషభాషలు గ్రహించి వారి నాగరికతావిశేషం అవగాహన చేసుకుని సర్వవిధములా సంసిద్ధుడైతేనే గాని వీలు లేదు. పరదేశీయులతో సంప్రతించి స్వదేశవిజ్ఞానం వారికి బోధించడానికి రెంటనూ పాండిత్యం అత్యవసరం. వీటిలో రాధాకృష్ణకు లోటులేదు. అదే ఆయనవిశేషం.

ఆనాడు మహారాజపూజితమైన బౌద్ధమత మూలకంగా నిరసింపబడిన వేదాంతతత్త్వము ఉద్ధరించడానికి శంకరు డవతరించినాడు. తనకు ముందు గాని తరువాత గాని కని విని యెరుగని తీవ్రమైన మేధాశక్తితో సర్వమతశాస్త్రము పరీక్ష చేసి, ఆర్యమతానికే అగ్రస్థానమని నిర్ణయించి, భాష్యాలు గావించి, తన ఉపన్యాసములతో భరతఖండం అంతా మోగించి దిగ్విజయం చేసినాడు. నలుదిక్కులా పీఠాలు స్థాపించి వేదమతానికి కొత్తపునాదులు నిర్మించినాడు.

ఇంత చేసినా తనకాలంలో శంకరుడుగాని,అతని పేరు గాని ఆర్యావర్తం దాటి అవతలికి పోలేదు.

పరదేశీయుల దండయాత్రలవల్ల ఇతరమతస్థులు మనదేశంలో నిలిచిపోయి కొన్నిపట్ల దౌర్జన్యంగా కూడా స్వమతప్రచారం చేయడంవల్ల, దేశం అన్యమతస్థులైన ప్రభువులకు లోనగుటవల్ల దేశాభ్యుదయముతో

పాటు వేదశాస్త్రాభ్యుదయముకూడా క్షీణిస్తున్నది. ఆర్యమత సంప్రదాయము లడుగంటి,ఆర్యపాండితి నశించి, తల్లిపాలు లేక పోతపాలతో పెరిగిన దిక్కుమాలిన బిడ్డ వలె, దేశము స్వాభిమానము లేక విజాతీయమై నీరసించి పోతున్నది. అట్టిసమయంలో భారతీయులు వట్టి జంతువులని భావించే పాశ్చాత్యులకు ఆర్యవిజ్ఞానం బోధించి వారిమెప్పు వడసి దేశీయులను మేలుకొలిపిన రాధాకృష్ణ అపరశంకరు డంటే అతిశయోక్తి కాదు. అసలు శంకరుని కున్న 'సాధన' ఈ అపరశంకరునికి లేకపోవచ్చు. చేసినది ఇద్దరూ వేదాంతశాస్త్రప్రచారమే, శిథిలావశిష్టమైన ఆర్యవిజ్ఞానోద్ధరణమే. ఒకరు స్వదేశంలో: ఇంకొకరు పరదేశంలో.

సంస్కృతభాషకు దూరమైన ఆధునిక విద్యార్థులకు వేదాంతతత్త్వం ఆంగ్లంలో కాని చేరదు. జ్ఞానార్జనకు ముఖ్యం భావార్జన గాని భాషార్జన గాదు గుడ్డిబావ కంటె మెల్లబావ మేలన్నట్లు అసలు లేకపోవడంకంటె ఆంగ్లభాషామూలకంగానైనా దేశీయ విజ్ఞానం గ్రహించడం మంచిది. దాని కడ్డుత్రోవ రాధాకృష్ణ గ్రంథములే.

వేదాంతతత్త్వం పాశ్చాత్యులకు బోధించడాని కిదివరకు జరిగిన ప్రయత్నా లేవీ కొనసాగలేదు. జనసామాన్యంలో అవి ప్రచారం కాలేదు. వారి కవి అవగాహన కాలేదు.

మహనీయుడు పండితుడు మాక్సుముల్లరుగారు శాయశక్తులా పనిచేసినాడు. భారతీయులు బహుదొడ్డవా రన్నాడు. వీడు ఛాందసుడ్రా, మతి పోయిందన్నారు తక్కినవారు. మన గులాములైన ఇండియనులు గొప్పవారేమిటి, రాళ్లని పూజించే రాకాసు లన్నారు.

బ్లెవెట్స్కీ, బిసెంటమ్మగార్లు దివ్యజ్ఞానమతం స్థాపించినారు. ఆర్యమతంలోనున్న రహస్యం గ్రహించారు. పండితసుబ్బారావుగారు ప్రచారంచేశారు. కాని దివ్యజ్ఞాన మతంకూడా ఒక క్రొత్తమతం. వీళ్లంతా దగాకోర్లు. మన విస్సన్న చెప్పిందే మనకు వేదం గాని ఇది మనకు అవుసరం లేదన్నారు. ఆసంఘంలో చేరిన వారికి తప్ప తదితరులకు ఆ సందేశం చేరలేదు.

అవతారపురుషుడు శ్రీవివేకానందస్వామి అమెరికాలో సంచారంచేసి ప్రచారం చేసినాడు. ఆయనశిష్యవర్గంలో సోదరి నివేదిత ఒక్కర్తె. కాని సన్యాసిని చూచి అమెరికా హడిలిపోయింది. ఇదో క్రొత్త ఎత్తను కున్నారు. నవజీవనం దాల్చిన క్రొత్తప్రపంచానికి పాత ఊహాలు పనికిరా వన్నారు. నక్షత్రాలు చూడడానికి దూరదర్శిని ఉపయోగించిన గెలీలియో అనే మహానుభావుడికి జన్మాంతరశిక్ష విధించిన జాతివారి మనుమలే ఈఅమెరికావారు. బహు అనుమానస్థులు.

ఇంతవరకు జరిగిన ప్రయత్నాలు పూర్తిగా ఫలించకపోయినా కొంతవరకు లాభించినవి. స్వల్పంగా గ్రహించినవారు బయలుదేరినారు. సుజ్ఞానులు కొందరక్కడకూడా అవతరించినారు. ఈవిషయమై కొంత కృషిచేయవలెననే ఆసక్తి పుట్టినది.

దీనికి కారకులు అమెరికాలో ఎమర్సను ఒకడు. అపరబుద్ధు డన్నారు ఈయన్ని. సర్వశాస్త్ర పరీక్షచేసి ఎమర్సను చివరకు హిందూమతంలో శాంతి చిక్కుం దన్నాడు. ఎమర్సనుగ్రంథములు చాలా పనిచేసినవి. యూరపులో టాల్‌స్టాయి జన్మించినాడు. వారి తప్పులు వారికే చూపి ఆధ్యాత్మికచింత చెయ్యవలసినదిగా ఉపన్యసించినాడు. జర్మనీలో మహాపండితులు వెలిసినారు. వేదవేదాంతములలో పరిశోధన చేసి సత్యం గ్రహిస్తున్నారు. మతం అనేపేరుతో గాక వాఙ్మయ రూపంగా పఠించినారు. ఈవిధంగా తూర్పుమేఘాలు సాగుచేసిన భూమిలో రవీంద్రుడు కవిత్వరూపంగా హిందూమతం నాటడానికి ప్రయత్నించాడు. కాని భావనాశక్తి తీవ్రమైపోయింది. టీక అవుసరమైంది. ప్రథమటీక రాధాకృష్ణకృతము. ఒకరి కవిత్వానికి టీకతో ప్రారంభించి స్వంతంగా ఉద్గ్రంథములు రచించి, ఉపన్యాసములతో నింపేస్తున్నాడు రాధాకృష్ణ. పాశ్చాత్యులంతా ముగ్ధులైపోయినారు. ఆహ్వానంవెంట ఆహ్వానం వచ్చింది. ఆనాడు మొదలు ఈనాటివరకు రాధాకృష్ణ ఎన్నిసార్లు నౌకాయానములు చేసినాడో లెక్కలేదు. రావిక్‌గారికి రాధాకృష్ణను సంవత్సరంలో కాపురం ఆరునెల్లు సముద్రాని కావల, మరి ఆరునెల్లు

ఈవల అన్నమాట నిజమే. ఆక్సుఫర్డునించి ఆహ్వానం వచ్చింది. కేంబ్రిడ్జికూడా రమ్మన్నారు. జాతీయవాదులు వెళ్లకూడ దన్నారు. అయినా వెళ్లినాడు. తిరిగి వచ్చిన తర్వాత మంచిపనే చేసినాడని గ్రహించినారు. ఆసమయంలో ఇంగ్లాండులో పడవపందెములు వచ్చినవట. హేమాహేమీ లెవ రుపన్యసించినా ఆపందెము లప్పుడు వట్టికుర్చీలకు చెప్పవలసిందేనని వాడుక. కాని రాధాకృష్ణ ఉపన్యాసాలకు కుర్చీలే చాలలేదట. కిటకిటలాడుతూ జనం మూగిపోయినారట.

ఈయనలో ఉన్న విశేష మేమిటి? బోధించే విషయం కొత్తది కాదు. పద్ధతి మాత్రం కొత్తది. ఉపన్యాసం చెప్పడం చిన్నప్పటినుండీ కొట్టినపిండి; ఆయన వాగ్ధాటి గంగాప్రవాహంవంటిది. ఆప్రవాహంలో పడిపోయినారు పాశ్చాత్యులు. త్యాగరాజకృతుల మాతృక వకటే. ఇదివరకువారు కూడా అవే పాడినారు. కాని అసమానంగా రాగాలాపన చేస్తున్నాడు రాధాకృష్ణ.

వెనకటి కీయన ఆంధ్రవిశ్వవిద్యాలయం కాన్వొకేషన్ అడ్రెసు ఇవ్వడానికి అప్పటికార్యస్థానం బెజవాడ విచ్చేసినారు. కొంచెం ఇంచుమించు ఉత్తరాది ఆంధ్రు లందరికీ ఈయన ప్రథమపరిచయం అదే. అప్పుడే వేసినాడు సమ్మోహనాస్త్రం. ప్రెసిడెన్సీ కాలేజీలో బూసాంకీమీద నోట్సు చెప్పిన పంతు లెంతవా డైనాడురా అని పాతవిద్యార్థులు ఆశ్చర్యపోయినారు. నాడే ప్రత్యేకించినారు మనస్సుల్లో రెడ్డిగారిస్థానే ఉపాధ్యక్షపదవి. మదిమి మిగిలిన పెద్దమనుష్యు లెందరు నిలువబడినా ధాటీకి తప్పుకోవలసివచ్చింది. రాధాకృష్ణ జాతకం ఉచ్చలో ఉన్నది. ఆసమయంలోనే గుంటూరులో ఆంధ్రవిద్యార్థి మహాసభ జరిగినది. ప్రారంభోపన్యాసం రాధాకృష్ణ. "గోపాల కిష్టాయి కొక్కిరాయి". (స్వంతగానే అనుకున్నాడు)—ఆగోపాలకృష్ణుడు జీవించి ఉన్నాడు. ఎంతగొప్పవారినైనా ఈసడించేవాడు ఆంధ్రరత్నం. కాని ఈరాధాగోపాలకృష్ణుల సమాగమముకోసం యెదురు చూసినారు పెద్దపెద్దలు. ఏమంటాడో కొంటెవాడని. బహు ఆనందంగా మాట్లాడినాడు. గొప్పవాడేనని తేల్చినాడు. ఆరోజులో చీరాల రామదాసు మాటే గండపెండేరం. ఆసభకు డాక్టరు స్టాన్లీకు దొరవారు అధ్యక్షత వహించారు. రాధాకృష్ణ ఉపన్యసించినాడు. జబ్బుగావుండి కూచుని లేవలేని గోపాలకృష్ణయ్యకూడా మాట్లాడ మన్నారు. ఆరంభములోనే "అమెరికా కూచుంది, ఇండియా మాట్లాడుతోంది" అన్నాడు. అదే మహానుభావుడి ఆఖరు ఉపన్యాసం. కొద్దిరోజులకే మరణించినాడు. కాని ఆమాటే రాధాకృష్ణుకు దీవన. అమెరికా కూచోడం ఈయన మాట్లాడడం అయిపోయినది. అదే పరిపాటి.

ఆసియాఖండంలో విద్యాసంస్థ లన్నీ కలిసి కాశీనగరంలో సభజేసినవి. ప్రారంభోపన్యాసం రాధాకృష్ణ వంతు లాహోరు విశ్వవిద్యాలయం కాన్వొకేషను అడ్రసు ఇచ్చి కలకత్తా వెడుతోంటే అడ్డంతగిలి ఉపన్యాస మిమ్మన్నారు. దేశదేశాలనించీ అభ్యర్థులు వచ్చారు. జ్ఞానయోగి భగవానుదాసుడు, యోగిని బెసంటుకూడా సభలో కూర్చున్నారు. అప్రమత్తులై ఉపన్యాసం విన్నారు. ఆశువుగా చెబుతున్నాను క్షమించమని మొదలుపెట్టి అబద్ధం చెప్పినాడా అనిపించినాడు చివరకు. ఉపన్యాసం విని భగవానుదాసుడు, బెసెంటుకూడా కళ్లు మూసి తలలూచినారు. బ్రహ్మానందభరితులైనారు. వారే తెల్లబోయినప్పుడు తక్కినవారి సంగతి చెప్పనక్కర్లేదు. అమెరికానించి కొందరు స్త్రీలు వచ్చినారు. ఉపన్యాసానంతరం రాధాకృష్ణచుట్టు మూగినారు, దగ్గిరనుంచి దర్శనంచెయ్యడానికి. శ్రీకృష్ణుని వేణుగానం, గోపికలూ జ్ఞాపకం వచ్చినారు. ఆంధ్ర దుందుభి పరాయిదేశాల్లో అల్లా మోగుతోంది.

వాక్కులో వాణి అవతరిస్తుంది. అదే వీరిమహిమ. దానికి తోడు అసామాన్యమైన ఆంగ్లభాషా పాండిత్యం. వాళ్లనే మించిపోయినాడు. (ఈనడుమ తెలుగుభాష కూడా అభ్యసిస్తున్నట్టు తోస్తుంది) వ్రాసినా అంతే, పలికినా అంతే. మనఆలోచనకు తావులేదు. విపరీతమైన శక్తితో ఆయన ఊహ లేమన్ని ఆవేశిస్తాయి. ఈ వశీకరణతంత్రమే రాధాకృష్ణకీర్తికి రక్షరేకు.

కాన్వొకేషను ఎడ్రసులు ఈయన కొలు. ఏవో ఒకటిరెండు విశ్వవిద్యాలయములు తప్ప తక్కినవన్నీ ఈయన్ను పిల్చి పండుగుచేసుకున్నాయి.

ఆంధ్రులు నోచిన నోములఫలం రాధాకృష్ణ ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షపదవి అంగీకరించడం. యజమాని జాతకాన్ని బట్టి సంసారం. అధ్యక్షుల జాతకాన్ని బట్టి సంస్థ. అడుగు పెట్టెనో లేదో కాని గాలికిపడ్డవి సంవత్సరానికి లక్షరూపాయిలు.

గవర్నరుగారిని సందర్శించడానికి మద్రాసు వెళ్లినాడు. రాధాకృష్ణకు సర్కారువారు ఏదో బిరుదు ఇస్తారని గాలికబురు తెలిసింది. ఇంట్లోకూర్చుని ఏ రావుసాహెబో వస్తుందనుకున్నాట్టఈయన. అధాత్తుగా 'సర్' అన్నారు. లోకానికి మాత్రం ఆశ్చర్యంవెయ్యలేదే.

ఒకరకం పక్షులన్నీ ఒకచోట గుంపు కూడుతాయి. తనమాదిరివార్ని చుట్టూ చేర్చుకోవడం మానవుడి రివాజు. రాధాకృష్ణగారితో తత్సమానులే జేరుతున్నారు. విశ్వవిద్యాలయంలో సర్ రామన్‌గారి సానుభూతీ సహాయసంపత్తీ మనకు వారసత్వం. సర్. కోయాజీగారి స్వదేశాభిమానం ఆంధ్రలోకానికి కూడా పాకిపోయింది. ఇది అంతా రాధాకృష్ణ విశేషమే. సర్ ఫ్రానిస్ యంగ్ హస్బెండనే మహాశయుడు హిందూదేశం సంగతి చెబుతూ, భారతదేశంలో జన్మించిన ఇద్దరు మహానుభావులలో రాధాకృష్ణ ఒకడన్నాడు. ఈవాక్యం ఆయనకు ఈయనపై నుండే వాత్సల్యము, ఆదరాభిప్రాయము చక్కగా వెల్లడిజేస్తుంది. అతిశయోక్తి కావచ్చును. ఎందుకంటే భారతభూమిని మహానుభావులు ఇంకా ఉన్నారు గనుక రాధాకృష్ణ వారిలోఒకడు.

నిరుటిసంవత్సరము ప్రపంచంలో ఉన్నప్రముఖులంతా కలిసి రవీంద్రకవిచంద్రుడికి డెబ్భైయేళ్లు నిండినందుకు పుట్టినరోజుపండుగ జేసినారు. వారిలో మహాత్మగాంధి, ఐన్‌స్టైన్, రొమె న్ రో లాం డు, సర్. జె. సి. బోసు, ముఖ్యులు. అటువంటి హేమాహేమీలుండగా అగ్రాసనాధిపతిగా ఈ ఆంధ్రప్రముఖుణ్ణి ఆహ్వానించినారు. రాధాకృష్ణ పొందిన గౌరవములలో ఇదియే మహాగౌరవము.

అటువంటి మా తెనుగుతేటలతేజోమూర్తి పదికాలాలపాటు వర్ధిల్లాలి. జన్మకారకులైన తలిదండ్రులు పోయిన మావిశ్వవిద్యాలయం పెంపుడుతండ్రి చేతుల్లో పెరిగి పెద్దకావాలి. శ్రీసంతాన బాహుళ్యానికి నోచుకున్న రాధాకృష్ణ, కూతుళ్లతో, అల్లుళ్లతో, మనమలతో, మునిమనమలతో చల్లగా వుండాలి.



వేలూరుకోట

ఛాయాచిత్రకారుడు : వి. యస్. గోపాలదేశికాచార్లుగారు.

క్రీ. శ. ౧౧-వ శతాబ్దిలో ప్రబలి, దిన దినాభివృద్ధి నంది సుమారు రెండున్నరశతాబ్దములకాల మాంధ్రదేశము నంతటిని దమ యేకచ్ఛత్రాధిపత్యమునం దిడుకొని, గోదావరీ పూర్వాబ్ధి, కాంచీ కల్యాణనగర మధ్యమగు దేశము నేలి, నిరుపమతేజోవంతులై వెలుగొందిన కాకతీయాంధ్రచక్రవర్తుల కేకశిలానగరము రాజధానియై యొప్పినది. తాత్కాలికాంధ్రవిద్యావైదుష్యములకును, కళాభినిగతికిని, రాజ్యాంగనైపుణ్యమునకును, ఆర్థిక సంపదకును, శాంతి సౌఖ్యములకును కేంద్రస్థానమైయుండిన యీమహానగరము దాక్షిణాత్యులకు, నౌత్తరాహులకునుగూడ భయవిస్మయములను గొల్పినది. కాకతీయులకు ప్రథమమున హనుమకొండనగరము రాజధానిగ నుండినది. అప్పటికే యేకశిలానగరము సుప్రసిద్ధముగ నుండెను. క్రీ. శ. ౧౨౪౮ ప్రాంతమున గణపతిదేవచక్రవర్తి కేంద్రస్థానము నానగరమునకు మార్చెను. నా డుదయించిన యేకశిలానగరీభాగ్యభానుడు దుర్నిరీక్ష్యుడై వెలిగి క్రీ. శ. ౧౩౨౬ లో యవనకాలమేఘముచే నావరింపబడి యజ్ఞేయమగు నంధకారమున లీనుడయ్యెను. కాకతీయసామ్రాజ్యమస్తమించి యాంధ్రనగరభాగ్యరేఖ యంతరించిపోయినను, పూర్వవైభవద్యోతకములగు శిథిలము లీనగరమునం దెన్నియో గలవు. అవి వర్ణనాతీతములు. వాని మహత్త్వ మనుభవైకవేద్యము. అయినను వానిని సంగ్రహముగ వర్ణించి చిత్రముల మూలమున వాని నాంధ్రలోకమున కెఱుకపఱచుచున్నాను.

ఏకశిలానగరము నైజాంరాష్ట్రములోని వరంగల్ రైలుస్టేషనున కొకమైలుదూరములో నున్నది. దీనిచుట్టును మొదట మట్టిగోడలవరుస యొకటి గలదు. ఇందు నాల్గుదిశలను నాలుగు ద్వారము లున్నవి. ఈయావరణను పశ్చిమద్వారముగుండా దాటి కొంత దూర మేగిన నొక కందకమును, దానినంటి యొక యెత్తైన రాతిగోడయు గన్పించును. గోడ యంతయు పెద్దపెద్దబండలతో నిర్మింపబడినది. దీనిపైన తుపాకుల నుంచుట కనువగునటుల పైభాగమున వలయాకారముగ నుండు రాళ్ళమర్పబడియున్నవి. ఈగోడపై నెన్నియో బురుజులు గలవు. శిలాప్రాకారమునకు లోభాగమున గోడపొడుగునను మెట్లమర్పబడియున్నవి. ఇవి భూమినుండి గోడపైభాగము వరకును గలవు. దుర్గము వెలుపలిభాగమును శత్రువులు ముట్టడించినప్పుడు లోపలినుండి సైనికు లతిసులభముగ నాయుధములను, పెద్ద బండలను కుడ్యోపరిభాగమునకు గొనిపోవుటకే మెట్లవరుస యుపయోగించుచుండెడిది. దానిని కాకతీయరాజ్ఞీమణియగు రుద్రాంబిక గట్టించెనని తెలియుచున్నది (చూ. ౧-వ చిత్రము).



౧. శిలాప్రాకారము-లోభాగము

శిలాప్రాకారమున కనతిదూరముననే కోటలోభాగమునం దొకవిశాలమగు భవనము గలదు. ఇయ్యది యుత్తరదక్షిణములకు వ్యాపించియున్నది. ఉత్తరదిశ నొకచిన్నవసారా గలదు. పిమ్మట నెత్తగు స్తంభములుగల యొక హాలు గలదు. దానికి దక్షిణమున మఱియొక చిన్నవసారా యున్నది. హాలులోని క్రింది భాగము పల్లముగా నున్నది. దీనినిగూర్చి స్థానికులు రెండుగాథలను జెప్పుదురు. అందులో నియ్యది కాకతీయ ప్రతాపరుద్రునిచే నిర్మింపబడె ననునది యొకటి. రెండవది దీనిని సితాబ్‌ఖాన్ అనునతడు గట్టించె ననునది. ఈ భవనమునకు "ఖుషీమహాల్" అని పేరు. నిర్మాణవైఖరినిబట్టి చూడ నియ్యది మహమ్మదీయ-కట్టడమని తోచుచున్నది (చూ. ౨-వ చిత్రము).

ఖుషీమహాలుకు దక్షిణమున స్వయంభూదేవాలయ మున్నది. ఏకశిలానగరదుర్గము నందలి యాలయములలో నెల్ల నిది ప్రాచీనతమము. కాకతీయరాజులకు "శ్రీ స్వయంభూదేవదివ్య శ్రీపాద పద్మారాధక" యను బిరుదము గలదు. ఈ యాలయశిఖరము జైనాలయములకువలె మెట్లుమెట్లుగా నున్నది. ఇందు నేటికిని పూజాదికము జరుగుచున్నది. ఇందలి దేవునిగూర్చి యొకగాథ గలదు. ఒకనాఁ డనుమకొండకు దినుబండములను దెచ్చుబండ్లలో నొకటి యిచ్చట నొకరాతికి దగిలి బోరగిల పడెనట. అప్పు డారాయి భిన్నమై యొకలింగ ముద్భవించెనట. ఆ బండియిరుసు లింగమునకు దగిలి బంగారముగా మారెనట. ఈవార్త నాలకించి కాకతిప్రోలరాజు సపరివారముగ నేతెంచి యా దేవునికి స్వయంభువనియు, స్పర్శవేది యనియు బేరిడి యొక చక్కని యాలయమును గట్టించెనట. నేడీ



౨. ఖుషీ మహాల్

యాలయము భద్రముగ గాపాడబడుచున్నది (చూ. 3-వ చిత్రము). ఇందలి ధ్వజస్తం



3. స్వయంభూ దేవాలయము

భమువద్ద నెన్నియో భిన్నశిల్పశకలములు చేర్చబడియున్నవి. వీనిలో రెండు పెద్దనందు లున్నవి. నీలశిలతో జెక్కబడి మనోహరము లగు నలంకారములతో నొప్పు నీవిగ్రహ ములు జీవకళ నీనుచున్నవి (చూ. ౪-వ



౪. స్వయంభూ దేవాలయము-భిన్నశిల్పములు

చిత్రము). ఇందలి శకలములలో నెల్ల ముఖ్యమైనది ఒకరాజుతల. ధ్వజస్తంభవేదికనంటి యొక లింగమును, దాని నానుకొని యాత లయు గలవు. ఇందలి శిరోవేష్టనము చక్కగను, ఉన్నతముగను నున్నది. పై లింగమునకు గూడ నాల్గుదిశలను నాల్గుముఖములు గలవు. ఇవి దేవతాముఖములు. వీనికిరీటములు పొట్టిగను, వలయాగ్రములు గను జెక్కబడినవి. అదియును గాక వీని కంఠముల క్రిందిభాగము చదునుగ నుండి యియ్యవి ముఖములుమాత్రమే యని జూపుచున్నవి. పై రాజశిరమున కధోభాగము భిన్నమై యింకను గొంత భాగమునుండి విడకొట్టబడినటు లున్నది. ఇందు చెవులకుగుండ్రనియుంగరములవలెనున్న యలంకారము లున్నవి. మెడలో గంఠమాల గలదు. సర్వవిధముల నియ్యది యొకరాజు విగ్రహమువలె నున్నది. ఇట్టిదే రెండవ దేవరాయలవిగ్రహ మొకటి హంపి శిథిలములలో నిటీవల గన్గొనబడియున్నది. ప్రకృత విగ్రహమునకు మీసములు లేవు. ఫాల భాగమున తిలకమునకు మారుగ నొక కన్ను చెక్కబడియున్నది. ప్రాచీనగాథలలో ప్రతాపరుద్రచక్రవర్తికి మూడవ కన్ను గలదనియు, ప్రజ లాతనిని శివుని కవతారముగ నెంచుచుండి రనియు జెప్పబడియుండుటచే, నీశిరము కాకతీయ ప్రతాపరుద్రదేవుని దని కొందరి యభిప్రాయము. ఇందలి వాస్తవ మెటు లున్నను, యీ విగ్రహముమాత్రము రాజవిగ్రహ మని స్పష్టముగ జెప్పవచ్చును (చూ. ౫-వ చిత్రము).



౫. రాజుతల

ఖుషీమహాలునకు దూర్పుగ నొక జీర్ణమంటప మున్నది. ఈమంటపమునకు నాల్గువైపులను నాల్గుద్వారములు గలవు. సుమారారుశతాబ్దములనుండియు నెండ కెండుచు, వానకు దడియుచునుండిన యీ ద్వారములు గొంచెమైనను జెదరక యిపుడే నిర్మింపబడినవా యను సందేహమును గల్గించుచున్నవి. భూమిపై నాల్గు ఎత్తగు స్తంభము లున్నవి. వానిపైనడ్డుగ నొకదూలమును దాని పైభాగమున వివిధాలంకారశిల్పములునుగలవు. స్తంభములపై నిలువునను సరములవలె శిల్పము లున్నవి. అడ్డుదూలముపై నిరుపార్శ్వములను లతాశిల్పములు గలవు. స్తంభాగ్రముల విమానము లున్నవి. వెలుపలి స్తంభముల నుండి దూలముచిగురునకు సింహాముఖము లున్నవి. వీనిపై ద్వారమున కిరుపార్శ్వములను జీవకళ నీనుహంస లున్నవి. స్తంభముల లోభాగమున, దూలమున కధోభాగమున నేడు బొగడలు గలవు. ఈద్వారములలో నుత్తరమునను్న దిమాత్రము సంపూర్ణముగ నున్నది (చూ. ౬-వ చిత్రము). ఈ ద్వారముల నడుమ చక్కని దేవాలయ ముండవలెననియు, నయ్యది భారతీయములగుకట్టడములలో నగ్రగణ్యమగు సిద్ధమాత్ర దేవాలయమును బోలియుండు ననియు కసిన్సు పండితుడు వ్రాసియున్నాడు. ప్రాచ్యశిల్ప కళాభిజ్ఞుడగు ఫెర్గుసన్ పండితుడీ యేకశిలానగరద్వారములు సుప్రసిద్ధబౌద్ధనిర్మా



౬. మనోహరమగు ద్వారము

ణమగు సాంచీస్తూపమునందలి ద్వారములతో సమానములని వ్రాసియున్నాడు.

దుర్గమునందనేకస్థలముల భిన్నశకలము లెన్నియో చెల్లాచెదరుగ బడియున్నవి. వీరభద్రాలయమువెనుక నొక పెంటకుప్పపై

చక్కనినంది యొకటి యున్నది. ఇయ్యది స్వయంభూదేవాలయమునందలి నందులను బోలియున్నది (చూ. ౭-వ చిత్రము). మఱి



౭. చెదరిన నంది

యొకచోట నొకసమాధి గలదు. అందలివేదికను జేరి రెండు శిల్పశకలములు గలవు. వానిలో నొకటి చతురస్రమగు నొక రాతిపై జెక్కబడిన చతుష్కోణపద్మము. మఱియొక పలకపై కోతనగిషీపని (Screen Work) గలదు. రాతిలోనికి గదులను కోసియున్నారు. అంచులలో రెండువైపుల స్తంభములును, మరి రెండువైపుల రేఖాశిల్పమును (Scroll Work) గలవు. కాకతీయుల నిర్మాణములలో నిట్టి కోతనగిషీపని విశేషముగ గన్పించుచున్నది. నాకు దెలిసినంతవరకును ఏకశిలా నగరశిథిలములలో బయల్వెడలిన యీతరగతి శిల్పశకల మిది యొకటియే (చూ. ౮-వ చిత్రము).

స్వయంభూదేవాలయమునకు బశ్చిమమున శిలాప్రాకారమునకు దగ్గరగ నొకపెద్ద బండ యున్నది. ఇది సుమారు రెండువందల యడుగులయెత్తుండును. రాయి యంతయు నున్నగ నున్నది. ఎక్కుటకు మెట్లు లేవు. దీనిపై భాగమునం దొక బురుజు, నొక మంటపమును గలవు. ఈ బురుజుపై ఫిరంగుల నుంచుట కుపయోగించు దిమ్మలు గలవు. మంటపము ప్రకృతమున శూన్యముగ నున్నది. ఈ శిల నుండియే యీ నగరమున కేకశిలానగరమని పేరు వచ్చియుండును.

ఈ యాంధ్రనగరవర్ణనము కేవల



౮. చెదరిన శిల్పఖండములు

మును నామమాత్రమే. విస్మయజనకము లగు శిల్పము లెన్నియో యిందున్నవి. అయ్యవి వర్ణనాతీతములు. ఈశిథిలము లన్నియు పటుత్వమునం దుండినపు డీనగర మెంత దర్శ



౯. ఏకశిల

నీయముగ నుండెడిదో ! ఇట్టిపురమున సుఖజీవితమును నెఱపుచుండి స్వేచ్ఛా వాతావరణము ననుభవించుచుండిన మధ్యయుగపు టాంధ్రుల ప్రమోదోత్సాహము లెట్టు లుండెడివో !

---

# అద్వైతము

తుమ్మలపల్లి వెంకటరత్నము పంతులుగారు

స్వచ్ఛందైై వెలుగొందు స్వప్నజగతిఁ సద్యస్సముద్యద్గరు
ద్గుచ్ఛప్రాప్తిని పక్షినై యెగసితిఁ; గొండొక్కచోఁ బంజర
ప్రచ్ఛన్నంబగు పక్షి నాకొఱకు సంప్రార్థింప నద్దానికిఁ
స్వచ్ఛందాంబరయానముల్ సలుపుశిక్షాయుక్తి కావించితిఁ.

ఇరువురము కూడి తిరిగెద మేకహేల-నేకకంఠమ్ముతోడ వే మిరువురమును
ప్రకృతిగానమ్మునకు ప్రక్కపాట పాడి-యలరుదుము మేఘమంటపాభ్యంతరముల.

నీకును గానమున్ వడిగ నేర్పెడి వేగిరపాటునన్ గదుఁ
వాకొన, జీరువాఱె గళవైఖరి నాకును; నింక నెన్నఁడో
యేకగతిన్ జరించుటయు, నేకగళంబున నుచ్చరించు, టం
దాఁకను ప్రేమఁ నూఁతగొని, తాఁకుదమా విధి యొడ్డు పోజులన్.

సంగీతంబున మేళవింత ముఱు ఝంఝామారుతోర్మిచ్ఛటన్
శృంగారంబుగఁ దాండవింత మెలమిన్ జీమూతగర్జార్భటిన్
బొంగులాడుచు నారగింతము, శరత్పూర్ణేందు బింబోజ్జ్వల
ద్భృంగారుచ్యుతచంద్రికామలపయోబ్బిందోరునిష్యందమున్.

ఱెక్కలఁ గూర్చి మల్లెలకిరీటము నీశిరమం దమర్తు; నీ
ఱెక్కలక్రింద కార్ముకపరిస్థిత వర్ణసమాజ మెల్ల, నే
రెక్క ఘటింతు; నింక విపరీతపుదైహికపంజరంబునన్
దిక్కులు చూడ నేల ప్రకృతిన్ బడి యైక్యము నొంద కెమ్మెయిన్.

# హిందూదేశ పరిపాలనవిధానము

## ద్వంద్వప్రభుత్వవిధాన స్వరూపము

చా. వెం. హనుమంతరావుగారు,
M. A., B. Ed., Fr. R. Econ. S. (Lond.)

౭

"డయార్కీ" విధానములో ముఖ్యమగునట్టియు జ్ఞాపకముంచుకోవలసినదియు నగువిషయ మేమన, ప్రభుత్వవర్గమందలి రెండుభాగములును వాటివాటి పరిపాలన విషయములలో వేరువేరుగ తమపనిని కొనసాగించుకొనినప్పటికిని, కొన్నివిషయములలో, ముఖ్యముగ ఆర్థిక విషయములలో, కలసి, ఆలోచించి పనిచేయవలసిన ఆవశ్యకత యుండుటయైయున్నది. గవర్నరునకు ఆపదవికి నియమింపబడునపుడీయబడుసూచనల నిబంధన (Instrument of Instructions) యందు ఈక్రిందివిషయములు పొందుపర్చబడును: — "గవర్నరుపదవియందున్న యాతడు తనకును తనసలహాదారులుగ నుండువారికిని మధ్య సంయోగము పెంపొందించుటకును, సమష్టిఆలోచన పెంపొందించుటకును ప్రయత్నించుచుండవలెను. అట్లు చేయుటవలన అధికారవర్గమువారి అభిప్రాయములు మంత్రులకు తెలియుటకును మంత్రులకుగల ప్రజాభిప్రాయము తెలిసికొను అనుభవము అధికారవర్గమువారికి తెలియుటకును అవకాశము లేర్పడును." దీనినుండి రాష్ట్ర ప్రభుత్వములు ఏవిధముగ నడచుచున్నవో గ్రహింపవచ్చును. మొట్టమొదటి విషయము మద్రాసు, బొంబాయి, బెంగాలు రాష్ట్రాధిపతులకు గవర్నరులు ఇంగ్లండులో బాగుగ పార్లమెంటరీ ప్రభుత్వ పద్ధతులలో ఆరితేరినవారై యుందురు. ఇతర రాష్ట్రముల గవర్నరులు సివిల్ సర్వీసునం దున్నత స్థానములకు వచ్చినవారినుండి ఏర్పాటు చేయబడుదురు. రాష్ట్ర కార్యనిర్వాహక వర్గమునందు సాధారణముగ ఒక సివిల్‌సర్వీసు ఉద్యోగియు, ఒక అనధికార సభ్యుడు నుందురు; కొన్ని రాష్ట్రములలో పరిపాలనావసరములను బట్టి ఇద్దరు సివిల్ సర్వీసు ఉద్యోగస్థులును, ఇద్దరు అనధికార సభ్యులును గూడ నుండవచ్చును.* ఈ ప్రభుత్వశాఖకు "కార్యనిర్వాహకవర్గముతో కూడిన గవర్నరు" (Governor - in - Council) అనియు, "గవర్నరును, కార్యనిర్వాహకవర్గము" అనియు పేరు కలదు. గవర్నరుకు తన కార్యనిర్వాహకవర్గ సభ్యులిచ్చు సలహాను త్రోసిపుచ్చుట కధికారము కలదు. రెండవ విషయము: ప్రజాయత్తశాఖల పరిపాలనను చూచు మంత్రివర్గము కార్యనిర్వాహక వర్గమునుండి వేరుగ నున్నది. కొన్నిరాష్ట్రములలో ఇద్దరును, మరికొన్నిటియందు ముగ్గురును రాజకీయ నాయకులలోనుండి ఏర్పాటు కాబడినవారు మంత్రులుగా నుందురు. తమ హోదాయందును, జీతము మొదలగు విషయములందును మంత్రులకును, కార్యనిర్వాహకవర్గసభ్యులకును చట్టనిర్ణీతమైన భేద మేమియు లేదు.† మంత్రులు కార్యనిర్వా

* సాధారణముగ మదరాసు, బొంబాయి, బెంగాలు మొదలగు పెద్ద రాష్ట్రములలో 4 గురు కార్యనిర్వాహక సభ్యు లుండుట ఆచారము కలదు. బొంబాయిలో ఈమధ్యనే కార్యనిర్వాహక సభ్యులసంఖ్య మూడింటికి తగ్గింపబడినది. అయినను ఎచ్చటకాని నలుగురికంటె హెచ్చుసభ్యు లుండుటకు వీలులేదు. వారిలో ఒక్కడైనను 12 సంవత్సరముల అధికారానుభవము కల్గినవాడుగ నుండవలెను.

† ఇండియా ప్రభుత్వచట్టముప్రకారము ఈరెండుశాఖలయందలి ప్రభుత్వసభ్యులకును సమానమగుజీతములుండవలెననియే ఏర్పాటు చేయబడినది. కాని ఆయారాష్ట్ర శాసనసభల ఇష్టప్రకారము మంత్రులకు తగ్గుజీతము లీయబడునట్లు నిర్ణయింపబడవచ్చును. సంస్కరణచట్ట మాచరణలోనికి వచ్చినతరువాత ప్రతి శాసనసభయందును ఈ విషయమై చర్చ వచ్చెను. ఒక్క మధ్యపరగణాల శాసనసభయందుమాత్రమే మంత్రులజీతము కార్యనిర్వాహక సభ్యుల జీతముకంటె తక్కువగాకుండ నుండవలెనని తీర్మానించబడెను.

హాక వర్గసభ్యులు ఏయే ప్రభుత్వశాఖలను పరిపాలించవలసినది, వివిధరాష్ట్రములలో వివిధములగు పద్ధతులపై ఏర్పాటు చేయబడినది. కాని అన్ని రాష్ట్రములకు ఒకే విధమగు నిర్ణయము లేదు.

ద్వంద్వప్రభుత్వ విధానమునందు శాశ్వతప్రభుత్వోద్యోగవిషయములో ఈ క్రింది నియమము లేర్పాటు చేయబడెను. మంత్రులకు ట్రాన్సఫరు చేయబడిన శాఖలలో పనిచేయు సివిల్ సర్వీసు ఉద్యోగస్థులు మంత్రులకును, కార్యనిర్వాహకవర్గ సభ్యుల చేతుల క్రింద నున్న శాఖలలో పనిచేయువారు ఆ సభ్యులకును బాధ్యులుగా నుండి వారి ఉత్తరువులప్రకారము నడచుకొనుచుండవలెను. ఏ సందర్భములోనైనను, ఒక ఉద్యోగి ప్రజాయత్త-రిజర్వుడు శాఖల రెండింటియందును పనిచేయుట తటస్థించిన, అతడు ఎవరిఅధికారమునకు లొంగియుండవలెనో గవర్నరు నిర్ణయించును. అదియు కాక సివిల్ సర్వీసు ఉద్యోగీయుల జీతములు మొదలగు విషయములలో రక్షణ నిచ్చుటకును, మంత్రులక్రింద నుండు శాఖలలో పనిచేయు ఉద్యోగస్థుల హక్కులను నిలువబెట్టుటకు గవర్నరున కధికారమిచ్చుచు నిబంధన లేర్పాటు చేయబడెను. గవర్నరు యొక్క అనుమతి లేనిదే ఇండియామంత్రిచే నియమింపబడిన అఖిల భారత ప్రభుత్వ శాఖలకు (All India Services) చెందిన ఏ ఉద్యోగిని కాని లేక రాష్ట్రీయ పరిపాలన శాఖకు చెందిన ఏ ఉద్యోగినికాని మంత్రులు శిక్షించుటకు గాని, తొలగించుటకు గాని వీలు లేదు. అట్టి ఉద్యోగి ఎవరైనను తన పైయధికారి తనకు నష్టము కలిగించునట్టి ఉత్తరు వేదైన జారీచేసిన, ఆ ఉత్తరువుపై గవర్నరునకు "అప్పీలు" చేసికొనవచ్చును; మరియు ఈ శాఖలకు చెందిన ఉద్యోగస్థులు గవర్నరు అనుమతి లేకుండ ఏ ఇతర ఉద్యోగములకుకూడ నియమింపబడకూడదు. వారిని ఏ అధికారి ఉద్యోగమునకు నియమించెనో (అనగా ఇండియా మంత్రి యనియర్థము) అతడే వారిని శిక్షించుటకును, తొలగించుటకునుకూడ అధికారము కలిగియుండును.

సంస్కరణ చట్టప్రకారము రాష్ట్రములం దేర్పరుపబడిన విషయ మొకటి కలదు. అది ఏదనిన' ఆ విధానము తాత్కాలికముగ మార్పుదలకాలమున కనుకూలముగ నుండునట్లు ఏర్పాటు చేయబడిన రాజకీయ విధానము కాని ఎల్లకాలము నుండుట కేర్పాటు చేయబడినది కాదు. హిందూదేశపు రాజకీయ పరిస్థితులు స్థిరపడినతరువాత, ఆ విధానమును తొలగించి దాని స్థానమున స్థిరమైనట్టియు, సంపూర్ణ బాధ్యతాయుత సూత్రములపై నాధారపడి యుండునట్టియు ప్రభుత్వ విధానము నేర్పాటు చేయుటయే పార్లమెంటుయొక్క నిశ్చితాభిప్రాయమని చట్టముయొక్క ఉపోద్ఘాతమునందు ప్రకటింపబడెను. ఇది కాక "డివల్యూషన్ రూల్సు"ను మార్చు అధికారము పార్లమెంటున కుండుటచే వారికి అవసరమని తోచినప్పుడు, "పరిస్థితులనుకూలముగ నున్నప్పుడు," క్రొత్తశాఖలను మంత్రుల యధికారమునకు మార్పు చేయవచ్చును. ఈ విధముగ రాష్ట్రములందు సంపూర్ణ స్వపరిపాలనను ప్రవేశపెట్టుటకు అనుకూలముగ నుండు ఏర్పాట్లు చట్టమునందే ఇమడ్చబడియుండెను. మరియు, చట్టము అమలులోనికి వచ్చిన పదిసంవత్సరముల యనంతరము, దానిక్రింద ఏర్పరుపబడిన ప్రభుత్వవిధాన మేవిధముగ పనిచేయుచున్నదియు పరీక్షించుటకు, క్రొత్త సంస్కరణము లెంతవరకు ప్రవేశపెట్టవచ్చునో నిర్ణయించుటకు, "ప్రజాపాలన బాధ్యతాయుత ప్రభుత్వసూత్రము లెంతవరకు ప్రవేశపెట్టవచ్చునో, అప్పటి కమలులో నున్న బాధ్యతాయుత ప్రభుత్వము హెచ్చు చేయవచ్చునా, మార్చవచునా యను విషయముల గూర్చి రిపోర్టు జేయుటకు" ఒక పార్లమెంటరీ కమీషన్ను ఏర్పాటు చేయవలెననికూడ చట్టమునందే నిర్ణయింపబడెను. *

* ఈ నిర్ణయము ప్రకారమే 1928-29 సంవత్సరములో పార్లమెంటువారు సైమను కమిషనును ఏర్పాటు చేసి పైవిషయములనుగురించి విచారించి రిపోర్టుచేయుటకు హిందూదేశమునకు పంపియుండిరి. వారిరిపోర్టు దేశమునందన్ని పక్షములవారును నిరసించియుండిరను విషయము ఎల్లరకు తెలిసినదే.

## శాసనసభలు; ఎన్నిక అధికారములు

సంస్కరణ చట్టముయొక్క 7 సెక్షను (రాష్ట్రీయశాసనసభకు ఎన్నిక నిబంధనము) ప్రకారమును, 23 సెక్షను (భారతశాసనసభకు ఎన్నిక నిబంధనలు) ప్రకారమును దేశమందలి వివిధ శాసనసభలు ఏవిధముగ ఏర్పాటు చేయబడవలసినదియు, నియోజకవర్గము లెట్లు ఏర్పాటుచేయబడవలసినదియు, అభ్యర్థులకును వోటరులకును ఉండవలసిన యోగ్యతలను (Qualifications) గురించియు నిర్ణయింపబడెను.

చట్టము ననుసరించి భారతశాసనసభ గవర్నరు జనరలు రెండు శాసనసభలు (లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిల్ ఆఫ్ స్టేట్–Council of State–అను పేర్లు కలవి) కలిగియుండవలెను. Council of state నందు అందరును కలసి మొత్తము సభ్యుల సంఖ్య 60 యుండవలెను. లెజిస్లేటివ్ అసెంబ్లీ (Legislative Assembly)లో 140 మందికంటె తక్కువసభ్యు లుండరాదు. 5/7 వంతులసభ్యులు ఎన్నిక సభ్యులుగాను, 2/7 వంతులు నియమిత సభ్యులు (అధికారసభ్యులును, అనధికారసభ్యులును గూడ) గా నుండవచ్చును. గవర్నరు జనరలు కార్యనిర్వాహక వర్గమందలి సభ్యు లందరును ఏదో ఒక శాసనసభయందు నియమితసభ్యులుగా నుండవచ్చును. అదియు గాక దక్షిణ ఆఫ్రికాయందలి ప్రభుత్వ మంత్రులవలె హిందూదేశమందు కూడ కార్యనిర్వాహక వర్గసభ్యులు అవసరమును బట్టి ఏ శాసనసభయందు కాని చర్చయందు పాల్గొనుటకు అధికారము కల్గియున్నారు.

ఇంక రాష్ట్రీయ శాసనసభల విషయమై చూచిన చట్టముప్రకారము ప్రతి గవర్నరు రాష్ట్రమునందును, ఏదో ఒక సంఖ్యకు తక్కువ కాకుండ సభ్యు లుండవలెనను నియమము ఏర్పాటు చేయబడెను. ఆ సంఖ్యయందు నూటికి 70 మంది చొప్పున ఎన్నికసభ్యులుగాను, 20 మంది చొప్పున నియమిత–అధికారసభ్యులుగాను ఉండవలెను. వీరు కాక కొంతమంది అధికారసభ్యులను కొన్ని బిల్లుల చర్చసందర్భములలో ఇద్దరికి ఎక్కువకాకుండ పండిత సభ్యులను (Expert Members) కూడ నియమింపవచ్చును.

ఆక్టు ప్రకారము మూడువిధములగు ఎన్నికవిధానములు కలవు: (1) రాష్ట్రీయ శాసనసభల ఎన్నికవిధానము; (2) భారతశాసనసభలో లెజిస్లేటివ్ ఎసెంబ్లీకి సంబంధించిన ఎన్నికవిధానము; (3) కౌన్సిల్ ఆఫ్ స్టేట్ సభకు సంబంధించిన ఎన్నికవిధానము. ప్రతిఎన్నికవిధానమునందును మింటో - మార్లే సంస్కరణములలో కన్న హెచ్చుగ ప్రత్యేక నియోజకవర్గములు (Special constituences) సంయోజ నియోజకవర్గములు ఏర్పాటు చేయబడెను. ఎన్నికదారులకు ఎన్నుకొను హక్కు అధికారములు వివిధరాష్ట్రములలో వివిధముగ నుండినప్పటికిని, ఒకేరాష్ట్రములో అవి అందరికి సమానముగానే యుండునట్లు ఏర్పాటు చేయబడెను. *

సంయోజ నియోజకవర్గములలోకూడ సాంఘిక భేదముల ననుసరించి కొన్ని మార్పు లేర్పాటు కాబడెను. అనగా కొన్ని స్థానములు కొన్ని సంఘముల ప్రతినిధులకై ప్రత్యేకింపబడెను. ప్రత్యేకస్థానములు పంజాబునందు సిక్కులకు, బెంగాలునందు ఐరోపియనులకు, మద్రాసునందు బ్రాహ్మణేతరులకు, అన్ని రాష్ట్రములందును మహమ్మదీయులకు నియమింపబడెను. వీరు కాక, దేశీయ క్రైస్తవులకు, జమీందారులకు, వర్తకసంఘములకు, బొంబాయిలో మిల్లుయజమాను

* మామూలుగ ఆస్తిపై నాధారపడియుండు ఎన్నిక హక్కులు గాక, కొన్నికొన్ని రాష్ట్రములలో, సైన్యములో పనిచేసిన ఉద్యోగస్థులు, గ్రామాధికారులు మొదలగువారుకూడ ఎన్నిక అధికారము కల్గియున్నారు. ఇది కాక కౌన్సిల్ ఆఫ్ స్టేటుసభకు ఎన్నికదారులలో ఈక్రిందివారుకూడ కలరు: (1) ప్రస్తుతముకాని, పూర్వముకాని శాసనసభలలో సభ్యులుగా నున్నవారు, (2) మ్యునిసిపాలిటీలకు అధ్యక్ష–ఉపాధ్యక్షులుగగాని, డిస్ట్రిక్టు బోర్డులకు అధ్యక్ష–ఉపాధ్యక్షులుగగాని, ఉన్నవారు ఇదివర కుండినవారు, (3) కో-ఆపరేటివ్ బ్యాంకిలకు అధ్యక్షులుగా నున్నవారు, (4)విశ్వవిద్యాలయ సెనేటుమెంబర్లుగా నున్నవారు కాని, పూర్వముండినవారుకాని.

10. - 4- 14 ౬౨౧

లకు, ఇంకను ఇతర ప్రత్యేకవర్తక పారిశ్రామిక సంఘములకు ప్రత్యేక నియోజకవర్గము లేర్పాటు చేయబడి వారికి కొన్నిస్థానములు అన్ని శాసనసభలందును ప్రత్యేకింపబడెను.*

ప్రత్యేకనియోజకవర్గము లీక్రిందివారికి ఏర్పాటు చేయబడెను :

(౧) పెద్దజమీందారులకు:—అస్సాములో తప్ప ఇతరరాష్ట్రములన్నిటియందును రాష్ట్రీయ శాసనసభలకును; బొంబాయి అస్సాములలో తప్ప, ఇతరరాష్ట్రములన్నింటియందును లెజిస్లేటివ్ అసెంబ్లీకిని;

(౨) విశ్వవిద్యాలయ స్థానములకు:—అస్సాములో తప్ప తదితరరాష్ట్రము లన్నింటియందును రాష్ట్రశాసనసభలకు ఒక స్థానము ప్రత్యేకింపబడెను :

(౩) వర్తక పారిశ్రామిక సంఘములకు:—ప్రతి రాష్ట్రసభకును, మద్రాసు, బొంబాయిరాష్ట్రములలో లెజిస్లేటివ్ అసెంబ్లీకిని, బొంబాయి, బెంగాలు రాష్ట్రములనుంచి కౌన్సిల్ ఆఫ్ స్టేటునకును.

వోటింగు హక్కులవిషయములో, ఎవరైనను ఏశాసనసభకైనను ఒక నియోజకవర్గమునుండి అభ్యర్థిగా నుండ దలచుకొనిన ఆ నియోజకవర్గములో మొట్టమొదట వోటరుగా చేర్చుకోబడవలెను. ఎవరైనను ఒక రాజధాని నియోజకవర్గమునుండి అభ్యర్థిగా నుండ దలచుకొనిన, ఆరాష్ట్రములో ఏ అట్టి వర్గమునందు గాని వోటరుగా నుండిన చాలును. మరియు, అస్సాము, సంయుక్తరాష్ట్రములందు తప్ప ఇతరచోట్ల ఏప్రత్యేక నియోజకవర్గమునకు అభ్యర్థిగా నుండునో ఆ సంఘమునకు మతమునకు చెందియుండవలె నను నిబంధనకూడ కలదు. మధ్యపరగణాలయందును, పంజాబునందును నియోజకవర్గ ప్రదేశమునందును, కొన్నాళ్లు అభ్యర్థి నివాసస్థాన మేర్పరచుకొనవలెను. అభ్యర్థులుగా నుండ దలచినవా రందరును ౨౫ సంవత్సరములకు తక్కువ లేకుండ వయస్సు కలిగియుండవలెను.

ఎన్నికవిషయములు, వాటికి సంబంధించిన నిబంధనలు మొదలగువానిని గురించి చర్చ ముగింపకముందు ఒక ముఖ్యవిషయము చెప్పవలసియున్నది. ప్రతి శాసనసభయందును గవర్నరుచేత గాని గవర్నరు జనరలుచేత గాని నియమింపబడుసభ్యుల సంఖ్య కొంత యుండున ట్లేర్పాటు కాబడినది. ఈవిధముగ రాష్ట్రీయసభలకు నియమింపబడవలసిన సభ్యులసంఖ్య అస్సాము మధ్యరాష్ట్రములలో తప్ప ఇతరచోట్ల ౨౨ నుండి ౨౯ వరకును, అస్సాములో ౧౪, మధ్యరాష్ట్రములలో ౧౬ ఉండవలెను. లెజిస్లేటివ్ అసెంబ్లీకి ౪౦ వరకును, కౌన్సిల్ ఆఫ్ స్టేటుసభకు ౨౬ వరకును సభ్యులను గవర్నరుజనరలు నియమింపవచ్చును. ఈ నియమిత సభ్యులలో సుమారు ౨/౩ వంతులు ప్రభుత్వోద్యోగీయులుగా నుండవలెను. మంత్రులకును, కార్యనిర్వాహకవర్గసభ్యులకును శాసనసభలందు చర్చలయందును, ప్రశ్నలకు జవాబులు చెప్పుటయందును తోడ్పడుట కనుకూలముగ నుండునట్లు వీరు నియమింపబడుదురు. మింటో-మార్లే సంస్కరణములక్రిందవలె కాకుండ, ఉద్యోగసభ్యులు శాసనసభలందు ఇష్టప్రకారము మాట్లాడుటకును, ఓటు చేయుటకునుకూడ సంపూర్ణమైనస్వేచ్ఛ కలదు. కాని సర్వసాధారణముగ ఈ హక్కును ఆచరణయందుంచిన ఉద్యోగసభ్యులు లేరనియే చెప్పవచ్చును. కార్యనిర్వాహకవర్గ సభ్యు లందరును, మంత్రు లందరును ఒకేఅభిప్రాయమును వెలిపుచ్చుచు, ఒకే మొత్తముగ ప్రభుత్వవిధానమునకు బాధ్యత వహింపవలె

* స్వదేశ సంస్థానపు ప్రజలుకూడ ఇతరవిధములగు హక్కులు కల్గియున్నట్లయిన, ప్రభుత్వమువారి ఇష్టముపైన రాష్ట్రీయ కేంద్ర శాసనసభలకు ఎన్నికదారులుగ చేర్చుకోబడవచ్చును.

పైవిధముగానే స్త్రీలుకూడ ఏ రాష్ట్రీయశాసనసభకాని, వారు శాసనసభలందు సభ్యురాండ్రుగ పనిచేయవచ్చు నని తీర్మానించిన ఆప్రకారము శాసనసభలకు సభ్యురాండ్రుగ నియమింపబడవచ్చును. ఈ మార్పున కనుకూలముగ మద్రాసు, బొంబాయి, సంయుక్త పరగణాలు మొదలగు శాసనసభలయందు తీర్మానము లామోదింపబడెను.

నను కాబినెట్ సిద్ధాంతముప్రకారము ప్రభుత్వము కొనసాగవలె నను అభిప్రాయము సంస్కరణచట్టమునం దిమిడియున్నదని చెప్పవచ్చును.

ప్రభుత్వోద్యోగీయుల నియమించుటచే పూర్తి కాగా మిగిలిన స్థానములకు అనధికారసభ్యులు నియమింపబడవచ్చును. సాధారణముగ ఎన్నికలందు శాసనసభలలోనికి తమ ప్రతినిధులను పంపుటకు తగినంత బలములేని సంఘములకీ అనధికార నియమితసభ్యులు చెందియుండవలె నను నిబంధన ననుసరించి ఈ సభ్యుల నియామక ముండును. గవర్నరు జనరలుకు అనధికార సభ్యుల నియమించుటకు పూర్తియగు స్వేచ్ఛ యున్నప్పటికిని, గవర్నరులుమాత్ర మీ సభ్యుల నియమించుటలో కొన్ని ముఖ్యమైనట్టి అల్పసంఖ్యాక సంఘములకు (అనగా ప్రస్తుతము హరిజను లని పిలువబడుచున్న నిమ్నజాతులు, ఫ్యాక్టొరిపనివారు మొదలగువారు) తగు ప్రాతినిధ్యము శాసనసభలలో ఏర్పాటు చేయవలె నను కట్టుబాటు ననుసరించి ఈ నియామకములు చేయవలసియుండును.

---

# మనుష్యుడు

విశ్వనాథ సత్యనారాయణగారు

## దయ

ఇదివరకు మూడునాళ్లుగ నాకసమ్ము
మసుగుమసుగుగనుండి యామఱుదినమున
తెఱపియిచ్చినయట్టులే తెఱపియిచ్చి
చూచుచునె యాకసంబు మూసుకొనివచ్చె.

నాలుగు జలధులు నేక
మ్మాలాగున కుండపోతమై పెనువట్టై
వ్రాలిన మబ్బుల దిక్కులు
నాలుగు నోగి మూటకట్టినట్లుగ బొలిచెన్.

అసలు నిజముగ గాలికి నగ్నిమిత్ర
మునను పేరు యాదాలాపముగను వచ్చె
గాని వానసేస్తన్న నెంతైన దగును
అదిగొ వాన యీదురుగాలి యా చికొట్టె.

నిలచిన ప్రాణము పాపము
నిలచినచో నిలువలేక నెఱత్రొక్కులై
కలగుండువడియె నటనట
నలనల బహుజంతువులు నిరాధారములై.

ఒకమేకపిల్ల యెచటిదొ
నకనకపడి దేహమెల్ల నలిగి వడంకై
చకితదృగంతము ప్రాణము
లకు నెలవై చూఱుకడ నిలంబడి యుండెన్.

ఆ గేస్తు చూచి తనచూ
రాగిన యామేకపిల్ల నదలిచి తరిమెన్
ఈ గేస్తు చూచి తనచూ
రాగిన యీమేకపిల్ల నదలిచి కొట్టెన్.

ఆచూరాచూరై పది
యేచూరున నిలువరాని యెడరై చిఱుగొం
తూచిన 'మే' యను సవ్వడి
ఆచలిగాలికిని బిగిసి యది పఱచె దెసల్.

ఒకవాన జల్లు, పెనుగా
లికి మ్రోతలు పెట్టుకొంచు లీలాప్రళయా
ర్భక ఝుంఝుహోని వైఖరి
కకావికలు జేసినది జగమ్ము నలుగడల్.

* * * *

పెడమలగి మృద్వికారమహా మేకపిల్ల
శవము గనుగొని ప్రతివారు జాలిపడిరి,
జనము లందఱు తమతమ పనులమీద
దరలిపోవుచు మఱునాడు తెలిసియిచ్చి.

*

నిర్దయ

అది పదేడులు కాచిన దాబజారు
అది వినా దొంగదోపిడి యూను వీథి
దాని పులిమోము కనుగొని దానిసింహ
రవము విని దొంగ లాలెక్క రారు జడిసి.

అది వయసు మీఱి ముసలిదై అన్ని యుడిగి
దాడ లొగి జాఱి యెడలెల్ల చీడపట్టి
ఖంగుఖంగున దగ్గుచు కదలలేక
నకనకంబడి యమయాతనపడుచుండె.

మును 'శేరిభైరి' యని జనము పిలచి
దృష్టి తీసి నన్నము సమర్పించువారు :
శునక మది దానిదగ్గును కనబడినను
వినబడిన గట్టితో గాని విసరబోరు.

చైత్రవైశాఖములు పరస్పరము కుట్ర
చేసి పెనుచంద్రనిప్పులు చెరిగిపోసె
ఆగి పులి త్రావుచునె మడియంగ బడిరి
ఆచివడకొట్టి చలివేంద్రలందె జనులు.

ఆకుక్క వచ్చి వేసగి
కాకకు దిరుగుల్లుపడి, యకాయకి చనియె
వాకిలొదుగు, లగుడ భయ
వ్యాకులమై పరచలేక పరచె నలుదెసల్.

అడచి నొకకర్రదెబ్బతో నడుము విరిగి
ఎండమండిన వీథి గా ల్లీడ్చుకొనుచు
పోనుజాలిన దూరమ్ము పోయి యచట
కదలజాలక యొకగోడ కొదిగి వ్రాలె.

తనజీతము బత్తెము ము
ట్టనిె కొలువు తలంచికొని కటకటంబడి, చా
వని తన స్థలాభిమానం
బును నూరును గనుల జూచు మొగినే చచ్చెన్.

* * * *

ఈవెధవకుక్క యిది గవులెత్తిపోవు
చున్నదనుచు ననహ్యించుకొన్నవారు
అల్లమఱునాటిమధ్యాహ్నమందు నూరి
వెలుపలికి వెట్టిచేత నీడ్పించినారు.

# చైనా జపాను యుద్ధము

మోచర్ల దత్తాత్రేయులు గారు, బీ. ఏ.

ఐరోపామహాసంగ్రామము ముగిసిన మరుక్షణము నుండియు రాబోవు మహాసంగ్రామము (పసిఫిక్) శాంతమహాసముద్రప్రాంతములయందు జరుగునని దూరదృష్టి గల రాజకీయవేత్త లనేకులు ప్రకటించుచుండిరి. ఆ సంగ్రామమునకు చైనాదేశము మూలకారణ మగునని గూడ వారు దెలుపుచుండిరి. "ఈమారు జరుగు మహాసంగ్రామమున, ప్రపంచమునందలి ప్రతిరాష్ట్రమును పాల్గొనక తప్ప" దనియు, "తటస్థరాష్ట్రమనునది యుండ" దనియు అమెరికా సంయుక్తరాష్ట్రముల విదేశాంగ కార్యదర్శి యగు స్టిమ్సనుగారు జోస్యముకూడ చెప్పుచుండిరి.

ఇట్టి దారుణ సంగ్రామమునకు తలయెత్తిన ప్రపంచరాష్ట్రము లన్నియు సన్నద్ధ మగుచున్నవి. ఇట్టి వాతావరణమునందు, రెండువత్సరములుగా, శాంతమహాసముద్రతీర రాష్ట్రములగు చైనా జపానులకు జరుగుచున్న సంఘర్షణలు, దేశాక్రమణములు రానున్న మహా సంగ్రామమునకు నాందియా యను అనుమానము గలుగజేయుట సహజము. జాతిసమితిముఖమున గూడిన రాష్ట్రము లన్నియు నేకగ్రీవముగ జపాను సైనికబలము నుపయోగించి దేశము నాక్రమించుటను ఖండించెను. బహిష్కరింపవచ్చు నని బెదరించెను. కాని జపా నావంతయు లక్ష్యపెట్టక, ఒకవైపున జాతిసమితి ఖండించుచున్నను, తానుమాత్రము యథేచ్ఛముగ మంచూరియా నాక్రమించుచు, ప్రపంచమంతయు నెత్తివచ్చినను మంచూరియాయందు దానిడినకాలును వెనుదీయ నని ధిక్కరించుచుండెను. జాతిసమితియందలి సభ్యత్వమును గూడ రద్దుజేసుకొనెను. జపా నెక్కడ, ప్రపంచము నంతను ధిక్కరించు టెక్కడ? చైనాదేశమం దొకమూల నున్న మంచూరియా యను మూడు రాష్ట్రములకొరకుగాను, కోట్లకొలది ధనప్రాణనష్టదాయకమగు నిట్టి మహాసంగ్రామమునకు దిగ నేల? చైనా యుద్ధమునకు దిగినను, ఇతర దేశములు గూడ నాయుద్ధమున పాల్గొన నేల? అను ప్రశ్నలు ప్రతివారికిని గల్గుట సహజము.

చైనాసామ్రాజ్యమంతయు, నైసర్గిక పరిస్థితులచే నేమి, చారిత్రక సంప్రదాయముల వలన నేమి, ప్రత్యేక విలక్షణములు గల్గిన చైనా, మంచూరియా, మంగోలియా యను మూడుప్రాంతముల కలయికచే నేర్పడెను. వీనిలో విశేషవిస్తీర్ణము గలిగినది అసలు చైనా. ఇది షుమారు, ౬౫,౦౭౦ చ. మైళ్ల విస్తీర్ణము గలిగి, పదునెనిమిది రాష్ట్రములుగ విభజింపబడి పరిపాలింపబడుచుండెను. షుమారు ౪౦ కోట్ల చైనీయు లచట నివసించుచున్నారు. ఇక మంగోలియా, మంచూరియాలు, అసలు చైనాకు ఉత్తరసరిహద్దుగ నిర్మింపబడిన మహాప్రాకారమునకు వెలుపల ఈశాన్య-ఉత్తర భాగముల నున్నవి. ఈశాన్యభాగమున గల ప్రాంతమును మంచూరియా యందురు. ఇది (౧) షేకింగ్, లేక, ఫెంగ్టిన్ (౨) కిరిన్ (3) హులంకియాంగ్ (క్వాంటంగుతో కలసి) అను మూడురాష్ట్రము లిందు గలవు. విస్తీర్ణము 3,౭౦,౮౦౦ చ. మైళ్లు. జనసంఖ్య ౧౯-౨౮ సం. న షుమారు ౨౫౦ లక్షలు. మంగోలియా యని పిలువబడు ప్రాంతము చైనా కుత్తర వాయవ్యభాగముల, మహా ప్రాకారమునకు వెలుపల నున్నది. మంగోలియాదేశము "వెలుపలి" మంగోలియా యనియు "లోపలి" మంగోలియా యనియు రెండు భాగములుగ చీలెను. అందు వెలుపలి మంగోలియా ఇటీవల ప్రజాస్వామ్యము నేర్పరుచుకొని రష్యాదేశపు ప్రజాస్వామ్య ప్రభుత్వమున చేరెను. లోపలి మంచూరియా మాత్రమే ప్రస్తుతము చైనా ప్రజాస్వామ్య ప్రభుత్వమున నున్నటుల భావింపబడుచున్నది. దీని వైశాల్యము ౧,3౬,౮౦౦ చ. మైళ్లు; (౧) జిహాలు (౨) కల్యా (3) క్వావాటంగు అను మూడు

రాష్ట్రము లిందు గలవు. చారిత్రకముగ, చైనా మంచూరియా మంగోలియాలకు మొదటనుండియు రాజ్యాంగ సంబంధ మున్నను ఐక్యము మాత్ర మిటీవలవరకు గన్పింపదు. ప్రత్యేకభాష, విజ్ఞానము, సంప్రదాయములు గల్గిన భిన్నమగు మూడుజాతులవా రాదేశములలో నివసించుచుండెడివారు. మంచూభాష నుపయోగించు మంచూజాతివారు మంచూరియాయందు వసించుచుందురు. మంగోలుభాష నుపయోగించు మంగోలియాజాతివారు మంగోలియాయందు వసించుచుందురు. ఆసియా, ఐరోపా ఖండముల తమ దండయాత్రలచే గడగడ వణకించిన ధైర్యసాహసోపేతులును, రణరంగమం దసమాన ప్రజ్ఞావంతులని పేర్గాంచినవారును అగు మంగోలు, మంచూజాతుల నామములు, పెక్కండ్రకు పరిచయముగనే యుండును. ఈరెండుజాతుల దండయాత్రలకు జడిసియే చైనీయులు ఆ రెండుదేశములకును తమదేశమునకును సరిహద్దులం దొకచివరనుండి మరియొక చివరవరకును నొక మహాప్రాకారమును నిర్మించిరి. ఈమూడు జాతులకును పరస్పరయుద్ధములు, ఒక దేశమును మరియొకరు జయించి ఆక్రమించు కొనుచుండుట సామాన్యము. తుదకు ౧౬౪౪ సం.న మంచూచక్రవర్తులు చైనాను, మంగోలియాను గూడ జయించి, తమ ఆధిపత్యముక్రిందికి గొనివచ్చి, చైనాయందలి పెకింగును రాజధానిగ నేర్పరుచుకొని, పరిపాలించుచుండిరి. మూడుదేశములవా రీవిధముగ తమపౌరులే యైనను మంచూ చక్రవర్తులు చైనీయులు మంచూరియా, మంగోలియాలలో స్థిర నివాస మేర్పరుచుకొన వలసబో నిచ్చెడివారు గారు. మంచూరియాను ఒక్క మంచూ జాతీయులకు మాత్రమే ప్రత్యేకించి యుంచుకొనవలెనని వారి యభిప్రాయముగ నుండెడిది. తమ పౌరులగు చైనీయులనే మంచూరియా, మంగోలియాల ప్రవేశింపనీయ నపుడిక నితరజాతుల గురించి చెప్పనే అక్కరలేదు. కాని, రష్యనులుమాత్రము తమ ప్రభుత్వము వారి ప్రోత్సాహముచే తమ సరిహద్దులకు సమీపమున గల మంచూరియా మంగోలియా ప్రాంతముల నాక్రమించి నివాసముల నేర్పరుచుకొనుచువచ్చిరి. ఈవిధముగ ఇదివరకు మంచూరియాయం దొక భాగముగ నున్న అమూరుప్రాంతముల నున్న దీనిని రష్యను లాక్రమించిరి. మంచూ చక్రవర్తు లాఒత్తిడిని నిరోధింపజాలక అసలు మంచూరియాలో ౹⅓ వంతులను రష్యాకు గోల్పోయిరి. మిగిలియున్నదే ప్రస్తుతపు మంచూరియా దేశము. రష్యనుఒత్తిడి నరికట్టజాలక మంచూ చక్రవర్తులు తుదకు తమ విధానమును మార్చుకొని ౧౮౮౬ నుండియు చైనీయులకు గూడ మంచూరియా, మంగోలియాలకు వలసపోవుట కధికార మొసగిరి. మొదట కొన్ని ప్రాంతాలకు మాత్రమే వలసబోవు హక్కొసగబడెను. కాని ౧౯౦౪ సం॥ నుండియు, మంచూరియాయం దన్ని ప్రాంతములను ప్రవేశించుటకు చైనీయుల కధికార మొసగబడెను. ౧౯౧౨ సం॥న బాలుడగు మంచూచక్రవర్తిని రాజ్యభ్రష్టు నొనర్చి చైనీయులు ప్రజాప్రభుత్వమును ప్రకటించినపుడు మంచూరియా మంగోలియాలు గూడ చైనా ప్రభుత్వముక్రిందనే చేర్పబడినటుల ప్రకటింపబడెను. అప్పటినుండియు చైనీయులు మంచూరియా మంగోలియాలలోనికి వలసబోవుటకు ఆటంకము పూర్తిగా తొలగెను. కాని జపాను మొదలగు దేశముల వారికి ప్రత్యేక ఒడంబడికలవలన, కొన్ని ప్రాంతములలోను దక్షిణ మంచూరియా రైల్వేప్రాంతములలోను దప్ప నివాస మేర్పరుచుకొనుటకు హక్కులు లేవు. దీనినిబట్టి చైనాకును, మంచూరియా మంగోలియాలకు గల సంబంధ మెట్టిదో యూహించు కొనవచ్చును.

## మూడు దేశముల కాయువుపట్టు

చారిత్రకవిషయము లెటు లున్నను, నైసర్గిక సామీప్యముచే మంచూరియా, తూర్పు మంగోలియా రాష్ట్రములు చైనా, జపాను, రష్యాదేశముల మూటికినిగూడ ఆయువుపట్టుగ నుండుట విచిత్రము. అందుచేతనే ఈప్రాంతము చిరకాలముగా సంగ్రామముల కిరవగుచుండెను. మంచూరియా మంగోలియా దేశముల నుండి చైనాదేశ మెన్నియో దండయాత్రలకు గురియయ్యెను. ఆప్రాంతము నాక్రమింపగలిగినవారు మహాప్రాకారమును దాటి ఉత్తరచైనా నతిసులభముగ జయింపగల్గుచుందురు. అందుచే నాప్రాంతముల ఆధిపత్యము చైనాకు ప్రాణపదము. రష్యాదేశమునకు నౌకాదళ

సౌకర్యములకు సంవత్సరముపొడుగున నేకాలమందును మంచు గడ్డకట్టని రేవులుగల సముద్రతీర మవసరము. ఇట్టి సముద్రతీరమును సంపాదించుటకుగాను రష్యాదేశ మితరప్రాంతములతో నెన్నియో సంగ్రామముల నొనర్చెను. కాని విఫల మయ్యెను. అప్పటినుండి రష్యా దేశము మంచూరియా తీరములపై దృష్టి సారించి, అచట గల అద్భుత మగు రేవు ప్రదేశముల సంపాదించుటకు ప్రయత్నించుచుండెను. రష్యావంటి బలవంత మగు ప్రభుత్వము మంచూరియాను, తత్తీరమున గల రేవు స్థలములను ఆక్రమించి తన నౌకాదళముల నచట నిలుపునెడల జపానునకు ముప్పు తప్పదు. ఆ భయము జపానునకు పూర్తిగ గలదు. అందుచే మంచూరియాను రష్యా చేతులలో బడకుండ జేయుటయు, వీలైనచో తానే ఆ దేశముల నాక్రమించుటయు అవసరమని జపాను భావించుచున్నది. జపాను మంచూరియా నాక్రమించుచో, తనకు ప్రక్కలోనిబల్లె మగునని రష్యాకు భయము. ఈవిధముగ చైనా జపాను రష్యాలు మూడును స్వదేశరక్షణకొరకు తమతమ వశమునం దుంచుకొనుట అవసరమని భావించుచుండెను.

## జన సమ్మర్దపు సమస్య

స్వదేశరక్షణదృష్టియందే గాక, తమ దేశములయందు విశేషముగ హెచ్చిపోవుచున్న జనసమ్మర్దమును తగ్గించుకొనుటకు, వారికి నూతన నివాసస్థానముల కల్పించుటకు గూడ పైమూడు దేశములును మంచూరియా మంగోలియాల వశపరుచుకొన గోరుచున్నవి. రష్యాయందు జనసమ్మర్ద మెటు లున్నను, ప్రజలు మాత్రము దిగువప్రాంతములకు విశేషముగ వలసపోవుచుండుట జూడ వారి కుత్తరమున తగిన వసతులు లేవని యూహింపవలసియున్నది. చైనాయందు జనసమ్మర్ద మధికమై సంవత్సరమునకు షుమారు పదిలక్షలమంది మంచూరియాలోనికి వలసపోవుచున్నారు. జపానునందు గల జనసమ్మర్దము ప్రపంచమున మరి యేదేశమునందును గనుపించదు. జపానులో జనసంఖ్య సం. కు ౯ లక్షల చొప్పున హెచ్చుచున్నది. ఇప్పటికే ప్రజలకు తగినంత స్థలము లేక చిక్కుపడుచున్న జపాను ప్రపంచమం దితర ప్రాంతముల వెదకుకొనవలసి వచ్చుచున్నది. కాని వా రెచ్చటకు వెళ్లినను, పాశ్చాత్యు లంతకు పూర్వము కన్పించిన ప్రదేశమెల్ల నాక్రమించి, "ఇచ్చటకు రారా" దని ఆసియావాసుల నిషేధించుచున్నారు. అమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియాఖండములం దెచ్చట జూచిన నీయాంక్షయే వారి కెదురగుచున్నది. ఇక మంచూరియా, మంగోలియా లన్ననో, మంచూ చక్రవర్తులు చిరకాలముగా అన్యజాతుల నిషేధించుటచే, కావలసినంత ఖాళీ స్థలములు గలవు. ౩౮౦ వేల చ. మైళ్లు విస్తీర్ణము గలిగి సగటున చ. మై. కు ౭౧ మంది మాత్రమే జనసంఖ్య గల మంచూరియాయును, ఇంచుమించు అటులనే యున్న మంగోలియాయును తమ దేశములందలి జనసమ్మర్దమును తగ్గించుకొనుట కుపకరించునని పై మూడు దేశములును భావించుచుండెను. ౧౯౨౬ సం॥ న మంచూరియాయందు గల ౨౯౦ లక్షల ప్రజలలో ౨౮౦ లక్షలు చైనీయులు, ౭౫ లక్షలు జపానీయులు, కొరియనులు మంచూజాతీయులు ౮ లక్షలు, రష్యనులు ౮౦ వేలు. ప్రతివత్సరమును షుమారు ౧౦ లక్షలమంది క్రొత్తగా మంచూరియాకు వలసవచ్చుచుండిరి. వీనియం దధికభాగము చైనీయులైనను, ఆస్తి సంపాదించుకొను హక్కు స్థిరప్రభుత్వము లున్నచో, జపాను, రష్యా జాతీయులు గూడ విరివిగ ప్రవేశించెదరు.

## మంచూరియా సంపద

పై యావశ్యకతలవలన మాత్రమే గాక, తన సహజసంపదలవలన గూడ మంచూరియా ఇతరరాష్ట్రముల కాకర్షకముగ నున్నది. ఖనిజసంపదయం దింతకంటె విలువగల ప్రాంత మింకొకటి లేదని ప్రసిద్ధి. సామాన్య లోహములగనులు విరివిగ గలవు. ఒక్క ఉత్తరమంచూరియాయందు ౧౨౩౯ లక్షల ఔన్సుల బంగారు నొసగు గనులు గలవని అంచనా వేయబడెను. ప్రస్తుత మీగనులు చాలభాగ మింకను ప్రారంభింపబడలేదు. వెండిగనులు అనేకచోట్ల గన్పించుచున్నవి. ౬,౬౨౦ లక్షల టన్నుల ఇనుము నొసగు గనులును,

౨౧,౮౮౦ లక్షల టన్నుల బొగ్గు నొసగు గనులును గల వని అంచనా వేయబడెను. అస్‌బెస్టాస్, మెగ్నసైటు, సీసము, డోలమైట్, కోకు, పైరైటు, రాగి మొదలగు గనులు చాలప్రాంతములందు గలవు. గనులపరిశ్రమ ప్రారంభదశయం దున్న ఈవత్సరములలోనే ౧౯౩౫ సం॥ పు అంచనా ప్రకారము సం. కు ౫౭౦ లక్షల డాలర్ల విలువగల లోహములు, రాతిసిబొగ్గు మొదలగు ఖనిజము లుత్పత్తి జేయబడుచున్నవి. ఇక అటవీసంపద యొక్క విలువ యింత యుండునని ఇంతవరకు సరిగ విలువగట్టబడలేదు. ఇంతవరకు, అడవుల వైశాల్యము సరిగ అంచనా వేయబడలేదు. మంచూరియా రాష్ట్రముల మూటియందును ౩౦౫ లక్షల ఎకరముల విస్తీర్ణము గలిగి,౮,౩౭,౧౭౭ లక్షల ఘన-అడుగుల కలప నొసగగల అడవులు గలవని ౧౯౨౮ లో అంచనావేయబడెను. ఇంతవరకు జపాను అధీనమున నున్న క్వాంటంగునందును, దక్షిణమంచూరియా రైలుమార్గ పరిసరములయందును ౧౯౨౮ సం. న ౫౫౦ కలప తయారుచేయు కర్మాగారములు, ౪౯,౨౦,౦౨,౩౦౨ "యెన్ను" ల పెట్టుబడితో పనిచేయుచున్నవి. జపాను అధికారమున నున్న పైప్రాంతములలో మాత్రము కర్మాగారములలో ౧౫౪౯ లక్షల "యెన్ను"ల విలువగల పదార్థ సంచయము తయారగుచున్నవి. గాజు, కాగితము, పంచదార, ఇనుము, బట్టల, కర్మాగారములు త్వరితముగ హెచ్చుచున్నవి. ప్రారంభ దశయందే ఇటు లుండ, ఖనిజ వ్యవసాయక ప్రాంతములు పూర్తిగ నుపయోగమునకు దేబడునపుడు మంచూరియాయొక్క సంపద యెటు లుండునో ఊహించుకొనవలెనే గాని చెప్ప వీలు లేదు. ౨౦-వ శతాబ్దారంభమునుండియు, మంచూరియా యొక్క విదేశవాణిజ్య మపరిమితముగ నభివృద్ధి చెందెను. ౧౯౦౮ సం.న ౪౯౭ లక్షల టీలు నాణెముల విలువగల దిగుమతులును, ౨౧౨ లక్షల విలువగల ఎగుమతులును గల మంచూరియా ౧౯౨౮ సం.న దిగుమతులు ౨,౮౨౧ లక్షలకును ఎగుమతులు ౩,౮౮౮ లక్షలకును హెచ్చెను. ౧౯౨౯ సం.న అసలు చైనా యొక్క విదేశీవాణిజ్యముయొక్క విలువ తల ౧ కి ౮.౭ టీలు నాణెము..., మంచూరియా సందర్భమున నిది తల ౧కి ౨౩.౭ టీలునాణెములు. మంచూరియాయం దినుపదారుల పొడుగు ౧౯౦౨ సం. నుండి ౧౯౪౯ సం.కు ౧,౦౮౮.౯ మైళ్లనుండి ౩,౫౩౭.౫ మైళ్లకు హెచ్చెను. సహజసంపద విషయమున మంచూరియా సందర్భమున దెలుపబడిన విషయము లన్నియును మంగోలియాకును వర్తించును. ఇంకను వికసింపని పుష్పమువలె నున్న ప్రారంభ దశయందే, ఇట్టి సంపదల తావుల వెదజల్లుచున్న మంచూరియా మంగోలియా దేశముల నాక్రమించుటకు బలవంతములగు జపాను, రష్యా మొదలగు దేశము లాకర్షింపబడుటయందు గాని, ప్రస్తుతము బలవిహీనమై యున్న చైనాదేశము వానిపై తన యాధిపత్యమును నిలుపుకొనుటకు భగీరథ ప్రయత్నము లొనర్చుటయందు గాని ఆశ్చర్య మేమి యుండును?

## అన్యదేశములకు సంబంధము

మంచూరియా, మంగోలియాల సరిహద్దులందు పై మూడు దేశములకును దేశాక్రమణాభిలాష యున్నను ఆ ప్రాంతములందు క్రమప్రవర్ధమానమగు పారిశ్రామిక, వాణిజ్య సంపదలయందు పాల్గొను తలంపుచే, ఆంగ్ల, ఫరాసు, జర్మను, ఇటాలియను మొదలగు ఐరోపీయ దేశములును, అమెరికా సంయుక్త రాష్ట్రములును గూడ మంచూరియా మంగోలియాదేశముల ప్రతిపత్తియందు స్వప్రయోజనపరములై యున్నవి. ఈ ప్రాంతములందు పరిశ్రమల స్థాపించియు, పెట్టుబడుల చేసియు, వాణిజ్యమున పాల్గొనియు లాభ మందుట ఈదేశముల కోరిక. అంతియగాక, జపాను గాని, రష్యా గాని మంచూరియా మంగోలియాల నాక్రమించుచో వానిబలము హెచ్చును. ప్రపంచమున తమ బలమును, ఆధిక్యమును నిలుపుకొనగోరు పై ఉదాహరింపబడిన శ్వేతజాతులకు, మంచూరియా, మంగోలియాలనే పెద్దరాష్ట్రముల దురాశకు గాని గురిగానీయకుండ జూచుటగూడ స్వార్థయుత మగు కర్తవ్యము. ఇతర రాష్ట్రములకంటెను అమెరికా సంయుక్తరాష్ట్రముల కిది యెక్కుడు అవసరము,

## చైనా దౌర్బల్యము

చైనాదేశము బలవంతమై మంచూరియా, మంగోలియాల రక్షించుకొనుశక్తిని గలిగియున్నచో, ప్రపంచ కలహకారణమగు నీమంచూరియా సమస్య సంభవించి యుండెడిది కాదు. కాని, చైనాజాతి గాఢసుషుప్తి యందు మునిగి అంతఃకలహముల కాటపట్టయి, దుర్బలయై, బలవంతమగు నెట్టి చిన్నదేశ మొనర్చు నపచారమును గూడ ఎదిర్చి శిక్షింపజాలక, జడత్వావస్థయం దున్నది. ఈవిషయమును గుర్తించి మొదట పాశ్చాత్యదేశములు చైనాను ఒత్తిడిచేసి, చైనాయందే స్వతంత్రజాతి కవమానకరములగు హక్కులను సంపాదించెను.

## మంచూరియా కొరకు సంగ్రామములు

చైనా దౌర్బల్యస్థితి బయటపడిన నాటినుండియు మంచూరియా మంగోలియాల నాక్రమించుటకు రష్యా జపాను దేశములు ప్రయత్నించుచుండెను. కాని ౧౮౯౪ సం. న జరిగిన చైనాజపాను సంగ్రామానంతరమువరకును మంచూరియాసమస్య ప్రస్తుతవ్యగ్రరూపమును దాల్చియుండలేదు. ఆ సంగ్రామమునందు జపానుచే నోడింపబడి చైనాదేశము షిమనో సెకీవద్ద గావించుకొనిన సంధి యొడంబడిక షరతుల ప్రకారము దక్షిణ మంచూరియాయందలి "వియొటాంగ" ద్వీపకల్పమును జపానున కొసగెను. అద్భుతమగు నౌకాసౌకర్యములు గల పోర్టు ఆర్థరు మొదలగు రేవుస్థలము లీద్వీపకల్ప తీరమునందే గలవు. ఈద్వీపకల్పము నాక్రమించినవారు, మంచూరియా యంతటిపైనను, ఉత్తరచైనాపైనను, సుప్రభముగ, నేక్షణముననైనను తమవాహినుల నడపి, వానిని తమ పాదాక్రాంత మొనర్చుకొన గల్గుదురని యుద్ధశాస్త్రపారంగతుల అభిప్రాయము. తాను గోరుచున్న రేవుప్రదేశములును, మంచూరియాయును ఈవిధముగ జపానుల హస్తగత మగుటను గాంచి రష్యాదేశము జర్మనీఫ్రాంసులతో మిత్రమండలి నేర్పరుచుకొని, చైనానుండి సంపాదించిన భూములను, హక్కులను వెంటనే తిరిగి చైనాకు వదలివేయవలెననియు, లేనిచో తమ తమ నౌకాదలముల నంపి జపానును చుట్టుముట్టెద మనియు, జపాను చైనాలమధ్య గల సముద్రములకు తమ నౌకాదళముల నంపి, మంచూరియాయందలి జపానుసైన్యములకు, స్వదేశముతో రాకపోకలు జరుగకుండ తెగగొట్టెద మనియు బెదరించెను. అప్పటికి జపాను తన నౌకాదళనిర్మాణ కార్యక్రమమును పూర్తి జేసికొని యుండకపోవుటచేతను, బలవంతములగు మూడురాష్ట్రముల నెదిర్చి జయింపజాలమని తెలిసియు, 30 లక్షల టేల్సును చైనానుండి పుచ్చుకొని, యుద్ధమున దాను సంపాదించిన దేశమును, హక్కులను జపాను చైనాకు వదలివేయవలసివచ్చెను. కాని, మంచూరియాను చైనా కుంచుట రష్యాయొక్క యుద్దేశ మెక్కడ? దానినెటులైనను తాను లాగుకొనవలెనని యెంచి, మొదట చైనాకు ఋణ మొసంగియు పిమ్మట వేర్వేరు సాకులు చెప్పియు, బెదగించియు, చైనా అధికారులకు లంచము లొసగియు, ౧౮౯౫ సం. నకు జపానునుండి తిరిగి ఇప్పించిన ప్రాంతములనే గాక, తుదకు మంచూరియా నంతను, రేవుస్థలములతో సహా, చైనాచక్రవర్తిచే వ్రాయించి పుచ్చుకొనెను. దీనిచే, తమ యింటిక్రిందకు వచ్చిన రష్యానుపద్రవమును గాంచి జపానులు మంచూరియానుండి రష్యనుల వెడలగొట్టుభారమును వహింపవలసివచ్చెను. ఆ ప్రాంతములను తిరిగి చైనా కొసగవలసినదని జపాను లిపుడు గోరిరి. రష్యా అందుకు నిరాకరించుటచే, రష్యాపై జపాను సంగ్రామమును ప్రకటించినది. మంచూరియాను చైనా కిప్పించుటకు జపాన్ యుద్ధమును ప్రారంభించినను, చైనామాత్రము జపానున కేమాత్రము తోడ్పడక, యుద్ధమునం దెవరు జయించినను దేశముపై ఆధిపత్యము మాది అని ప్రకటించి తటస్థముగ నూరకుండుట విచిత్రము. జపాను ఆసంగ్రామమున రష్యా నోడించిన పిదప ౧౯౦౫ సం.న పోర్ట్సుమతునందు గావించుకొనబడిన సంధి యొడంబడిక ప్రకారము పోర్టు ఆర్థరు మొదలగు రేవులతో సహా మంచూరియాయందు తాను సంపాదించిన హక్కులను చాలవరకు రష్యా జపానున కొసగెను. చైనాదేశము వానిని ధ్రువపరుచుచు, జపానుతో నొడంబడికను గావించుకొనెను. అప్పటి

నుండియు జపాను క్రమక్రమముగా మంచూరియా యందు తన ఆర్థిక, వాణిజ్య, పారిశ్రామికాధిపత్య మును వ్యాపింప చేసుకొనుచుండెను. కాని మంచూరి యాపై రాజకీయాధిపత్యము మాత్ర మింతవరకును చైనాకే యుంచబడెను.

## జపాను ఆధిపత్యము

అంతకు పూర్వము పదివత్సరముల నాడు, రష్యను లడ్డుదగిలి లాగుకొనిన యుద్ధలాభముల నన్నిటిని ౧౯౦౫ సం. న రష్యా నోడించి తిరిగి లాగుకొనినప్ప టినుండియు, జపాను ప్రతియవకాశము నుపయోగించుకొని మంచూరియా, లోపలి మంగోలియాలయందు తన ఆధి పత్యమును పెంపొందించు కొనుచుండెను. రష్యాతోడి సంగ్రామవిజయఫలితముగ కారాఫూటో (పాంగలిన్) యందు దక్షిణప్రాంతము జపానున కొసగబడెను. క్వాంటంగురాష్ట్రము, జపానునకు కవు లొసగబడెను. జపానువారు నిర్మించిన దక్షిణ మంచూరియా రైల్వే ప్రాంతములలో జపాను పరిపాలన నేర్పరచి వారి సైన్యముల నిలుపుకొనుటకు అధికార మొసగబడెను. ఐరోపామహాసంగ్రామమున దన్నుగ నుపయోగించు కొని, జపాను చైనాను బెదరించి మంచూరియా, లోపలి మంగోలియాలయందు రైల్వే నిర్మాణము, పారిశ్రామిక ఆర్థిక విషయములయందు ప్రత్యేకపు హక్కుల వ్రాయించి పుచ్చుకొనెను. ఆంటంగు, ముక్డెన్, యాంకోలయందు జపాను సెటిల్మెంటుల నేర్పరుచు కొనుటకును, ప్రత్యేక న్యాయస్థానముల స్థాపించు కొనుటకును, తంతి తపాలాఫీసుల నేర్పరచుకొని నిర్వహించుటకును భూముల కవులుకు దీసుకొని వాసముల నేర్పరుచుకొనుటకును గూడ పైయొడం బడికవలన జపానుల కధికార మొసగబడెను. క్రొత్తగా రైలుమార్గముల నిర్మించుట, పరిశ్రమల స్థాపించుట, గనులను, అడవులను ఉపయోగమునకు దెచ్చుట మొద లగు విషయములయందు ముందర జపానుతో సంప్ర తించి, మొదటి యవకాశమును వారికొసగుటకు చైనా పూనుకొనపడెను. జపానీయు లీహక్కుల పురస్కరించు కొని మంచూరియాయందు రైల్వేలను, పరిశ్రమలను స్థాపించుటకు ౧౯౨౬ సం. వరకు ౧,౪౦౨,౦౩౪,౬౭౫ "యెన్నుల" పెట్టుబడి చేసి పనిచేయుచుండిరి. ఇందు ౪౫౧౫౪౦౭౬౨ "యెన్నులు" జపాను ప్రభుత్వము వారి భాగమని చెప్పదగు దక్షిణమంచూరియా రైల్వే కంపెనీవారు చేసిన పెట్టుబడి. ౧౯౨౪ లెక్కల ప్రకా రము మంచూరియా యెగుమతులు ౪,౦౭౦ లక్షల (టేలు నాణెముల)లో ౧,౫౬౦ లక్షలు జపానునకు దిగుమతుల మొత్తము ౨౬౪౦ లక్షలలో ౧,౧౧౦ లక్షలు, జపాను నుండి ఏ ఒక్క దేశమునకును మంచూరియాతో నింత వ్యాపారము లేదు. మంచూరియాయందు గల చైనీయు లలో ౯౦ వంతులు వ్యవసాయవృత్తియం దున్నారు. పరిశ్రమ వాణిజ్యములయం దధికభాగము జపానీయుల చేతులలో నున్నది. జపాను తనకు గావలసిన ఆహార పదార్థములకు మంచూరియాలోని వ్యవసాయముపై నాధారపడుచున్నది. ఆధునిక ప్రభుత్వముల సైనికబల మునకును, యుద్ధసామగ్రులకును, పారిశ్రామికౌన్నత్య మునకు బొగ్గు, నూనె, బంగారు మొదలగునవి ప్రాణా ధారములు, జపానునకు ౨౦౦ సం॥ వరకు గావలసిన రాక్షసిబొగ్గు, ఇనుము, పెట్రోలియము మంచూరియా యందు గలవు. స్వదేశమునం దివి తగినంతగా లేకపోవు టచే, వీనికొరకు గూడ జపాను మంచూరియాపై నాధా రపడుచున్నది. ఈవిధముగ ప్రతివిషయమునను జపాను ఔన్నత్యమునకు మంచూరియా యవసరముగ నున్నది.

## జపానునకు తరుణము

పైవిధముగ, మంచూరియాయందు తన ఆధిపత్య మును స్థాపించుకొనుచు, తుద కాదేశమును పూర్తిగ నాక్రమించి, రాజకీయాధిపత్యమును గూడ వహిం చుటకు తగిన సమయముకొరకు జపాను వేచి యుండెను. ఆ తరుణము జపానున కిపుడు లభించెను. జపానునకు ప్రతికక్షి యగు రష్యాదేశ మిటీవలనే విప్లవమునుండి బయలుపడి, సాంఘిక సిద్ధాంతముల మీద తమ దేశమునార్థిక నిర్మాణమును సంస్కరించి స్వయంసమృద్ధ మొనర్చుకొనుటయందు నిమగ్నమై

యుండెను. ఆదేశ మిపుడు జపానువంటి బలవంతమగు దేశముతో మంచూరియాకొరకు సంగ్రామమునకు దిగగల స్థితియందు లేదు. ఇతర ఐరోపారాష్ట్రములు గత మహా సంగ్రామమునందు అనుభవించిన కష్టములనుండి ఇంకను బయలుపడలేదు. బలవంతమగు అమెరికా సంయుక్తరాష్ట్రము లున్నను, ఇతర సహాయము లేక ఒంటరిగా జపాను పై దండెత్తివచ్చి జయింపజాలదు. చైనాదేశ మిపుడే మేల్కొని, జాతీయ పునర్నిర్మాణమునకు పూనుకొనుచున్నది. ఇంకను తన్నెదుర్చుటకు తగిన బలమును సంపాదించికొని యుండలేదు. తానో, ౪౦ వత్సరముల నిరంతరదీక్షతో, ప్రపంచమందరికంటె గొప్పరాష్ట్రముతో సరిసమానమగు యుద్ధ పరికరములను, సైనిక నివహములను సిద్ధ మొనర్చుకొని యుండెను. ఇంతకంటె జపానునకు మంచి తరుణ మెపుడు లభించును? అందుచే దానిని పూర్తిగ నుపయోగించుకొనుటకు జపాను నిశ్చయించెను.

ప్రస్తుతము జపానునకును, చైనాకును సాగుచున్న యుద్ధమునకు, తాత్కాలిక కారణములయిన సంఘటనలగురించి ఇచట చర్చించుట అనవసరము. వార్తాపత్రికాపాఠకుల కవి సుపరిచితములుగనే యుండును. కాని అవియే యుద్ధమున కసలు కారణములని భ్రమపడరాదు. అవి, అన్నియుద్ధములకు వలెనే యుద్ధమును ప్రారంభించుటకు సాకుగ మాత్రమే యుపకరించెను. ౧౯౧౫ సంవత్సరమున బలవంతముగా తమచే వ్రాయించుకొనిన ఆషరతులు చెల్లజాలవని చైనా జాతీయనాయకులు మొదటినుండియు ఆక్షేపించుచునే యుండిరి. ౧౯౨౩ సంవత్సరమునుండియు చైనా జాతీయోద్యమము బలవత్తరమై దేశమునంతను ఒక్క పరిపాలనక్రిందకు దెచ్చి, బలమగు కేంద్ర ప్రభుత్వమును స్థాపించుటకు చైనా జాతీయ ప్రభుత్వము ప్రయత్నించుచుండెను. అవి చాలవరకు సఫలమయ్యెను. ఆవిజయముచే ప్రోత్సహింపబడి, చైనాప్రభుత్వము వారు అంతవరకును విదేశీయు లాదేశము ననుభవించుచున్న, జాతీయ ప్రభుత్వమున కవమానకరములగు ప్రత్యేకహక్కుల వదలుకొనునట్లు చేయుచుండిరి. చాల దేశము లందు కంగీకరించెను గాని, జపానుమాత్రము అంగీకరింపక తన సంధిషరతుల నవులు జరుపవలెనని పట్టు పట్టుచుండెను. జపాను వహించిన ఈప్రతికూల భావముచే, చైనీయులు కినిసి, జపానువస్తు బహిష్కారోద్యమమును ప్రారంభించిరి. చైనా ప్రభుత్వమువారు గూడ దానిని ప్రోత్సహించుటకు ప్రారంభించిరి. ఈ యదను నుపయోగించుకొని తమ యొడంబడిక షరతులను ధ్రువపరచి చైనాచే అమలు జరిపించుకొన నుద్దేశించితిమను నెపమున జపానుప్రభుత్వమువారు ౧౯౩౧ సం. న మంచూరియాకు సైన్యముల నంపి, పూర్తిగ నాక్రమించిరి. పిదప తూర్పు మంగోలియాయందలి జిహోలు మొదలగు రాష్ట్రముల నాక్రమింప ప్రారంభించిరి. కాని ౧౯౨౨ సం. నుండియు, జపాను ఇతరరాష్ట్రములతో గలసి వాషింగ్టన్ పారిస్ నగరములయందు గావించుకొనిన ఒడంబడికలప్రకారము, యుద్ధమువలన అన్యదేశాక్రమణ మొనర్చి, కలుపుకొన వీలులేదు. ఆషరతు బాధకముగ నుండకుండ జేయుటకుగాను, మంచూరియా తూర్పుమంగోలియాలను "మంచుకొ" అను పేరుతో స్వతంత్రరాష్ట్రముగ నొనర్చుచుంటిమని తెల్పి ౧౯౩౨ సం. న తొలగింపబడిన చైనాచక్రవర్తియగు "పూ" గారిని తీసుకొనివచ్చి తమ రక్షణక్రింద నూతనప్రభుత్వమున కధ్యక్షునిగ ప్రకటించిరి. ఆతని ప్రభుత్వమును కాపాడుటకు, అతడు జపానున కిదివరకుగల హక్కుల నిలుపుటకును ఒడంబడిక లొనర్చుకొని ప్రకటించిరి. ఇట్టి చర్యను జాతిసమితి నిరసించినను, జపాను జాతిసమితిని వీడిపోవుటకు నిశ్చయించెనే గాని, మంచూరియాయందు తన వైఖరి నేమాత్రమును మార్చుకొనక పోవుట జూడగా, సంగ్రామమునం దోటమి తప్ప మరెద్దియు జపానును మంచూరియానుండి కదల్పజాలదనుట నిశ్చయము.

అట్టి సంగ్రామము జరుగునా, మంచూరియా సమస్య యెటుల పరిణమించునను విషయము చెప్పుట కష్టము. బలవంతునిదే రాజ్యమను వాక్యము ప్రసంగములయం దెంతయైన పరిహసింపవచ్చును. కాని మానవ జాతి తన వ్యవహారములయం దింకను ఆవాక్యమునే

అనుసరించుచున్నదని యంగీకరింపక తప్పదు. ధర్మ సంరక్షణకు కంకణము బూనియుంటి మని జాతిసమితులు ప్రకటింపవచ్చును. కాని, వ్యవహారములయం దది రుజువగుటలేదు. జాతిసమితి కట్టి యుద్దేశ మున్నను దాని నిర్వహించుటకు తగినశక్తి లేదు. చైనీయులు ౪౦ కోట్ల మంది యున్నను, భారతీయులవలె ఐక్యము లేక పరస్పర కలహములతో దుర్బలులై యున్నారు. జపాను ఆంగ్ల దేశమువలె బలవంతమై తన సరకుల విక్రయించుకొనుటకును, తన ప్రజల కాహారపదార్థముల సమకూర్చుకొనుటకును, జపానున క్రిక్కిరిసియున్న ప్రజలకు నివాసములు కల్పించుటకును అవకాశము లేక చిక్కుపడుచున్నది. ఈపరిస్థితులలో తగినంత జనసంఖ్య లేక, అరక్షితమై కండ్లయెదుట గాన్పించుచున్న మంచూరియా మంగోలియాలను జపాను వదలు ననుకొనుట కేవలము ఛాందసము. జపానిపుడు మంచూరియా మంగోలియాలపై చైనాయొక్క రాజకీయాధిపత్యమును నామమాత్రముగనైన అంగీకరించెద ననుచున్నది. కాని కొలదిరోజులలోనే ఆమాటను గూడ మార్చుకొననిచో ఆశ్చర్యకరమే యగును. జపాను మంచూరియా మంగోలియాలను తన ప్రజల వలసరాష్ట్రములుగ నొనర్చిన గాని వీలు లేదు. అది సాధ్యము గానపుడు భారతదేశము నాంగ్లదేశమువలెనే తన యాధిపత్యమున తన ఉపయోగముకొరకుంచుకొనును. తుట్టతుద కవసరముచో, (కొన్నివందల వత్సరములకు గాని ఇది జరుగదు,) వీనిని చైనా ఆధిపత్యమునుండి తప్పించి స్వతంత్ర రాష్ట్రములుగ నొనర్చును. ఈవిషయమున, పాశ్చాత్య దేశములతో గాని, అమెరికాతో గాని, వివాదములు తటస్థించుచో, రాజ్యతంత్రము నుపయోగించి వానిని తొలగించును. వానికి గావలసినది వాణిజ్య సరిసమాన హక్కులు. వాని నిచ్చియైనను యుద్ధము పోసగుచో, రష్యాతో సంభవింపవచ్చును. అది యైనచో రాజ్యతంత్రసాహాయ్యముతో పరిష్కరించుకొనెదరు. కొన్నివత్సరములవరకు రష్యాయైనను జపానుతో యుద్ధమునకు దిగగల స్థితియం దున్నటుల కన్పింపదు. ఈలోపున చైనా అంతఃకలహము వదలి, బలవంతమగు కేంద్రప్రభుత్వము నేర్పరుచుకొని, ఏకముఖమున నడచుచో, కొన్నివత్సరములకు గాని ఆత్మరక్షణ మొనర్చుకొనుస్థితి యందజాలదు. చైనా స్వయముగ బలవంతమై శత్రుల నెదుర్పగలిగినపుడు గాని వారికి మిత్రులును లభింపరు. ఇపు డెవరైన సాహాయ్య మొనర్చినను, మాట సాహాయ్యముకంటె హెచ్చదు. అంతకంటె నెక్కువ సాహాయ్యము నొనర్చుచో ౧౯౦౫ సం. న రష్యావలె చేసిన దానికి పదియంతలు ప్రతిఫలముగా లాగుకొని, చైనాకు సున్నము బెట్టెదరు.

ఈలోపుగ, చైనాను తనతో స్వయముగ రాయబారములు జరపి, తన యొడంబడికహక్కులను ఖాయపరచి, మంచుకో ప్రభుత్వము నంగీకరించునటుల బలవంత మొనర్చుటకు జపాను ప్రయత్నించునటుల గన్పట్టుచున్నది. ఇందు అవసరముచో, అసలు చైనాపై గూడ జపాను దండెత్తవచ్చును. ఈ పద్ధతి వీలుగానపుడు మంచూరియా తూర్పుమంగోలియాలపై మంచుకో ప్రభుత్వమును బలపరచి, తమ రక్షణక్రింద ప్రత్యేక స్వతంత్రరాష్ట్రముగ జేయవచ్చును. ఎటులైనను, మంగోలియా, మంచూరియాలపై చైనా ప్రభుత్వమునకు నిజమగు నధికార ముండకుండచేయుట జపానుయొక్క నిశ్చయముగ గన్పట్టుచున్నది. అందువలన, ఏకముఖమునకు వచ్చిన చైనా ఎప్పటికైన బలవంతమై తన నెదుర్చుభయముగూడ జపానునకు తగ్గును.

---

# నక్షత్రమండలము

(చైత్ర మాసము)

గోబ్బూరు వెంకటానంద రాఘవరావుగారు, బి. ఏ.




ఈ నెల పున్నమనాడు చంద్రుడు చిత్తానక్షత్రము చెంత కనబడును కనుక ఈమాసము చైత్రమాసమని వ్యవహరింపబడుచున్నది. ఈ మాసమునందు రాత్రి తొలిజామున నగపడు నక్షత్రములను క్రమముగా పరిశీలింతము:

పడమట అశ్విని, భరణి అస్తమించినవి. సూర్యుడు మేషములో ప్రవేశించినాడు. అనగా అశ్విని, భరణి నక్షత్రము లిపుడు సూర్యునితో ఉదయించి సూర్యునితో అస్తమించుచున్నవి కావున నాకాశము నందు రాత్రి కానరావు. అందుచేత నీమాసము మేష మాస మగును.

వాయవ్యదిశను అప్సరసలు, ఐంద్రమద, చ్యవన, పులోమాదులు త్వరలో నస్తమింపబోవుచున్నారు. నైరృతిదిశను యమున కొంత అస్తమించినది, కొంత కనబడుచున్నది.

కృత్తికాది నక్షత్రములలో, పడమట కృత్తిక త్వరలో నస్తమింపనున్నది. కృత్తికకు తూర్పుగా నెద్దు కన్నువలె రోహిణి ఎఱ్ఱగా మెఱయుచున్నది. రోహిణికి తూర్పున మృగశిరచుక్కలు మూడు మిణుకుమను చున్నవి. ఆవల పగడమువలె ఆర్ద్ర ఎఱ్ఱగా ప్రకాశించుచున్నది. ఆర్ద్రకు తూర్పున ముత్యాలహారమువలె మెఱయుచున్న పునర్వసు చుక్కలలో పూర్వశ్వానము సొగసుగా కనబడుచున్నది. ఈచుక్కలకు తూర్పుగా నించుమించుగా శిరోనక్షత్రమై పుష్యమి పొట్లపువ్వువలె ధవళధవళముగా నున్నది. పుష్యమికి తూర్పున పల్లకి యాకారముతో మఘ రమ్యముగా వెలుగొందుచున్నది. మఘ కావల తూర్పుగా పూర్వఫల్గునీ ఉత్తరఫల్గునీనక్షత్రములు రెండు రెండు నేత్రములవలె మెఱయు చున్నవి.

కుజు డిపుడు మఘచెంత నెఱ్ఱగా మెఱయుచున్నాడు. గురుడు ఫల్గునీనక్షత్రములమధ్య నే యున్నాడు. గురుకుజుల కావల మిణుకుమిణుకుమను చిన్న నక్షత్రములతో హస్త కనబడుచున్నది.

హస్తకు తూర్పుగా నర్ధచంద్రునియాకారమును స్ఫురింపజేయు నక్షత్రము లైదు కనబడుచున్నవి. ఈ యైదునక్షత్రములలోను, హస్త సమీపమున నున్నది కన్యానక్షత్రమని కేతక్కరుపండితుడు జ్యోతిర్గణము నందలి నక్షత్రములపటములో సూచించెను. ఈ కన్యా నక్షత్రము పాశ్చాత్యులచే బీటావర్గో (Beta Virgo)అని చెప్పబడుచున్నది. కణ్యాని కావల నున్న ఈటావర్గుగల చుక్క పాణినియనియు, దీని కావల నున్న గామావర్గుగల చుక్క నళినక్షత్రమనియు, నళినక్షత్రమునకు ఈశాన్యదిశ నున్న చుక్క — డెల్టావర్గుగలది — ఆపనక్షత్రమనియు, పైపటమునందు కేతక్కరుపండితుడు చూపెను. నళ, ఆప నక్షత్రములకు తూర్పున నున్న తీటావర్గుగలచుక్క ఆప్యవసువనియు, జీటావర్గు గలది అపాంవత్స యనియు కూడ వారు తెలిపిరి. కాబట్టి కన్యారాశి (వర్గో Virgo) లో చుక్కలు ప్రకాశసంపదనుబట్టి వరుసగా నిట్లు చూడనచ్చును.

| | | |
|---|---|---|
| d Virgo ఆల్ఫావర్గో | Spica స్పైకా | = చిత్ర |
| బీటావర్గో | | = కన్యా |
| గామావర్గో | | = నళి |
| డెల్టావర్గో | | = ఆప |
| ఎప్సిలాన్‌వర్గో | | = ? |
| జీటావర్గో | | = అపామ్వత్స |
| ఈటావర్గో | | = పాణిని |
| తీటావర్గో | | = ఆప్యవసు |

ఈచుక్కల కన్నిటికి తూర్పున విశాఖానక్షత్రము ఇప్పుడే ఉదయించినది. విశాఖలో పాశ్చాత్యులు మూడేచుక్కలను చూపి త్రిభుజాకృతి సూచించిరి. కాని జాగ్రతగా పరిశీలించినచో కుమ్మరిసారెవంటి గుండ్రని యాకారముగల చుక్కలే కానరాగలవు. ఇది తులారాశి (అనగా వస్తువులను తూచుటకు వాడుకొను త్రాసు లేక తక్కెడ) లో చేరినది. తక్కెడలో దక్షిణపు తట్టున నున్న గుండ్రనిసిబ్బి విశాఖ యని చెప్ప వచ్చును. విశాఖకు అధి దే వ త లు ఇంద్రాగ్నులు. గుండ్రని యాకారమును బట్టియు, ఇంద్రాగ్నులను దేవత లధిదేవత లగుటనుబట్టియు, విశాఖ అగ్ని గుండమని చెప్పవచ్చును. ఇట్టి యగ్నిగుండము అడుగునను, కన్య మీదను. కానవచ్చుటచేత కన్య అగ్నికుండ సముద్భవయని నిస్సంశయముగా చెప్పవచ్చును, కన్యారాశి 'అయోనిజ'. భూమిమీద నే తల్లికడుపునను బడి జన్మించినది కాదు కావున నయోనిజ యనియు, అగ్నిగుండ

మువంటి విశాఖకు పైన కనబడుచున్నది కావున నగ్ని కుండ సముద్భవయనియు చక్కగా చెప్ప నొప్పియున్నది. మహాభారతమునందలి ద్రౌపదికూడ నయోనిజ యనియు, నగ్నికుండసముద్భవ యనియు వర్ణింపబడినది. మఱియు నామె మత్స్యయంత్రమును కొట్టిన యోధునే వరింప బైటకువచ్చినది. ఋగ్వేదమునందు ఉత్తరఫల్గున నక్షత్రము అర్జుననక్షత్రమనియే వ్యవహరింపబడెనని తెలిపియుంటిమి. (అర్జున్యోః పర్యుహ్యాతే. x. 85. 13). అర్జును డుదయించుసరికి మీనరాశి అస్తమించినది. కనుకనే అర్జునుడే మీనమును—మత్స్యయంత్రమును—ఆకాశముమీద గిరగిరతిరుగు మత్స్యమును కొట్టకలిగినాడు. మరెవ్వాను కొట్టలేకపోయినారు. అర్జునుడు మీనమును పడగొట్టగానే కన్య (ద్రౌపది) రంగముమీద నుదయించినది. కాని ఆమె ఒక్క అర్జునుని వివాహమాడుటతో సరిపోలేదు. ఏలయనగా కన్యారాశికి చుట్టును గొప్పనక్షత్రము లైదున్నవి. చూ:

1. మఘ — అధిదేవతలు పితరులు. వీరి రాజు యముడు. ఇతనియంశమున ధర్మజుడు

2. స్వాతి— అధిదేవత వాయువు. భీముడు.

3. ఉత్తరఫల్గుని—అర్జునుడు.

4, 5. అశ్వతర మండలములోని ఆల్ఫా బీటా చుక్కలు.

వీరు అశ్వినీదేవతలు — సూర్యపుత్రులు. వీరి నూఁడుపట్టణములలో రెండింటికు చూచితిమి. మూడవది త్వరలో చూచెదము. ఈయైదు తేజోవంతములగు నక్షత్రముల మధ్య నుండి శాసింపబడుచున్న కన్య యీ యేవురకు భార్య యని భారతమున వర్ణింపబడినదనియు, భారతకథ యిట్లాకాశమున చిత్రితమై నక్షత్రరూపమున మెఱయుచున్నదనియు నావిన్నపము. ఈద్రౌపది(కన్య) యొక్క వేణీమండలముచెంతనే స్వాతి (భీముడు) ఉండుటయు ప్రత్యక్షగోచరమే. ఇది వేణీసంహారమునకు ద్యోతకము ఇందలివివరములు. ఋగ్వేదమూలమునందలి సూక్తములు, మహాభారతకథలో నెట్లు పెంపు గనినవో చూపుటకు ఇచట అవకాశము చాలదు. వేరొకప్పు డీయంశముల సావకాశముగా చూతము. ఇక నిపుడు ఆకాశమునందలి దక్షిణార్ధమునందున్న మిగిలిననక్షత్రములను పరికింతము.

గొల్లకావడిచుక్కలను పటకాలో వ్రేలుఖడ్గముతో, వీరోల్లాసియై ఒరయన్‌యోధుడు విస్తరితదేహముతో నేనుసులాసన మెఱయుచు నస్తమింపబోవుచున్నాడు. ఆదిగువనే శశకకపోతములు పోవనున్నవి.

గొల్లకావడిచుక్కలను త్రిపురములను ఒక్కయమ్మున పడగూల్పనున్నట్లు మృగవ్యాధరుద్రుడు (Sirius) వానివెంట నరుగుచున్నాడు. ఆర్ద్ర ననుసరించి దక్షిణాకాశమున నగస్త్యు డద్భుతతేజముతో మెఱయుచున్నాడు. అగస్త్యునిపైన శ్వానమండలమునకు తూర్పున దివ్యనావ జలస్పర్శ చేయుచున్నట్లున్న పృష్ఠభాగముతో, నటుపైని తెరచాపలతో, నామీద నిలిచిన స్తంభవిశేషముతో సొగసుగా నగపడుచున్నది. శ్వానమండలమునకు పైన మృగవ్యాధుని సమీపమున వాసుకియను కవ్వపుత్రాటిచే చుట్టబడి పాలసముద్రమున (Milky way) కవ్వమువలె తిరుగుచున్నట్లు కనబడుచు మందరగిరి మిణుకుమిణుకుమనుచున్నది.

వీటికి తూర్పుగా ఆశ్లేష మెఱయుచున్నది. ఆశ్లేషకు మీదుగా సోమపాత్ర—చమస మున్నది. ఆ ప్రక్కనే అహిమండలము కానవచ్చుచున్నది. చమసమునకు ఆశ్లేషకు మధ్య గ్రావమండల మున్నది. ఇంనుగూర్చి ఐతరేయబ్రాహ్మణమునందలి చిన్నకథ యొకటి యిచట వ్రాయుట ఆవశ్యకము.

ఐతరేయబ్రాహ్మణము: సప్తపంచిక, ప్రథమాధ్యాయము. "దేవా హ వై సర్వచరౌ సత్రం......... తాన్ హ రాజా మదయాంచకార తే హోచు రాశీవిషో వై నో రాజాన మవేక్షతే. హంతా స్యాక్షీషే ణాక్ష్యా వాపి నహ్యామేతి తథేతి తస్యహాక్ష్ణీషేణాక్ష్యావపి నహ్యుస్తస్మా దుష్ణీష మేవ పర్యస్య గ్రావ్ణో ఒభిష్టువంతి తదనుకృతి. తాన్హ రాజా మదయామేవ చకార తే హోచుః స్వేనవై నో మంత్రేణ గ్రావ్ణో

ఒభిప్రాతీతి హంతాస్యా న్యాభి ర్వాఘ్భి ర్మంత్ర మాప్పుణ చామేతి తథేతి తస్య హన్యాభి ర్వాఘ్భి ర్మంత్ర మాపప్పుచు స్తతో హైనాం నమదయాంచకార తద్యత స్యాన్యాభి ర్వాఘ్భి ర్మంత్ర మాప్పుచంతి శాంత్యా ఏవ తేహ పాప్మాన మపజఘ్నిరే. తేషా మన్వపహాతిం సర్పాః పాప్మాన మపజఘ్ని రేత ఏతే౽పహతపాప్మానో హిత్వా పూర్వాం జీర్ణాం త్వచం నవయైవ ప్రయం త్యపపాప్మానం హాతే య ఏవం వేద.—"

దేవత లొకప్పుడు సర్వచరుసత్రయాగము చేయ నెంచిరి. కాని పాపమువలన చేయలేకపోయిరి. అపుడు కద్రుపుత్రుడగు అర్బుదుడను సర్పఋషి, మంత్రకర్త, వారితో నిట్లనెను: "హోత చేయవలసినక్రియ యొకటి మీరు చేయ మఱచినారు. అది మీనిమిత్తము నేను చేసి పెట్టెదను. అందువలన పాపపరిహార మగును." దేవత లది విని, "సరే కానిమ్మ" అనిరి. ప్రతిదినము మధ్యాహ్నము అతడు (తానుండిన రంధ్రమునుండి) పైకి వచ్చి సోమరసము తీయుటకు సాధనములైన గ్రావములను, రాళ్లను స్తుతించు మంత్రములు పఠించుచుండెను.

సర్పఋషి చేసినదాని ననుకరించుచు దేవతలు కూడ మధ్యందినసవనవేళ గ్రావస్తుతిమంత్రములు చదువ జొచ్చిరి. తనరంధ్రమునుండి సర్పఋషి వచ్చి పోయిన విధానమును సూచించుమార్గమునకు యజ్ఞశాలలో 'అర్బుదోదాసర్పాణీ' అని పేరు.

ఒకప్పుడు సోము డనురాజు దేవతలచేత పానము చేయించెను. మనరాజు నొకవిషసర్పము చూచుచున్నది. కన్నుల కొకగుడ్డ కట్టుదమని కట్టిరి. దీని ననుకరించుచు గ్రావస్తుతి కావించునపుడు యజ్ఞములో కనులకు గుడ్డ కట్టుచుండుట ఆచారమైనది. సోముడు దేవతలచేత మరల పానము చేయించెను. "సర్పఋషి గ్రావస్తుతి చేయునపుడు తన మంత్రములనే చదువుచున్నాడు. మనము మరికొన్నిమంత్రము లామంత్రములకు కలిపి చదువుదము" అని తమ మంత్రములు కొన్ని సర్పఋషి మంత్రములతో కలిపి పఠించిరి. అపుడు మద మెక్కలేదు. పాపపరిహార మయినది. దేవతలు సాధించిన యీకార్యము ననుకరించుటవలన సర్పజాతి తమ సొంత పాపములను పరిహరించుకొనకలిగెను. ఈస్థితిలో పాపము పోయినది కనుక పాములు పాతపొర విడిచి క్రొత్తచర్మమును పొందినవి. ఇది తెలిసికొనువారు తమపాపముల నుండి విముక్తి పొందుదురు.

ఐతరేయబ్రాహ్మణమునందలి యీకథయంతయు పైనక్షత్రపటమున చిత్రిత మగుచున్నది. చమసమే సోమపాత్రము. అదియే "సోమో రాజా"—సోము డను రాజు. సోమరసము తీయుటకు సాధనములైన రాళ్లు గ్రావములు. అదియే గ్రావమండలమని పటమందు చూపబడినది. దీనినే పాశ్చాత్యులు Sextans అందురు. ఇది (Sextant, $\frac{1}{6}$ of the circle) వలయములో షడంశ సూచకమైన యంత్రముగా నగపడినందున 1690 A. D. ఇప్పటికి రెండువందల నలుబదిసంవత్సరములక్రిందట, హెల్వెలియస్ (Helvellius) అనునతడు ఈనక్షత్రములకు ఈ పేరు పెట్టెను. కాని ఇది వేదకాలమునుండియు ప్రసిద్ధమైన గ్రావమండలమని నేను మనవిచేయుచున్నాను. ఆశ్రేష నక్షత్రమునకు అధిదేవత సర్పము అని యజుర్వేదము తెలుపుచున్నది. కాద్రవేయుడైన అర్బుదు డనుసర్పమే యీనక్షత్రమున కధిదేవతయని చెప్పనొప్పును. అహిమండలమునకును, అగస్త్యనౌకామండలమునకును మధ్య వమ్రీమండలము ఉన్నది. 'వమ్రీ' అనగా "ద్రుమవాసి కాపిపీలికావిశేషః"—చెట్లున తెట్టెబెట్టెడు నల్లచీమ'. వమ్రీకూట మనగా వల్మీకము, లేక పుట్ట. దీనినిగూర్చి ఋగ్వేదములో చిన్నకథ కలదు.

IV. 19. 9. "వమ్రీభిః పుత్ర మగ్రువో౽అదానం నివేశనా ద్ధరివ౽ఆజభర్థ వ్యంనిధో౽అఖ్యదహిమాం దదానో నిర్భూదుఖచ్ఛిత్సమరంతపర్వ."

అగ్రూ అనునామె అవివాహిత. ఆమెపుత్రుడు చీమలపుట్టలో పడియుండగా చీమలు తినివేయుచుండెను. "ఇంద్రుడా! చీమలు తినివేయుచున్న ఆబిడ్డను పైకి తెచ్చితివి. నీవు వానికి దృష్టి మరల కలుగజేసితివి. వాడు సర్పమును పట్టుకొని లేచి పాత్రను భిన్నము చేసెను. వాని అంగసంధులు యథాప్రకారము బాగుగానుండెను."

అగ్రూపుత్రు డుండిన చీమలపుట్ట వమ్రీమండల మని చెప్పబడినదని నామనవి. ఈసూక్తమునందు పేర్కొనబడిన అహి (మండలమును), పాత్ర లోనగునవి ఈసమీపమునందు కనబడుచున్నవి.

1752 A. D. సంవత్సరములో లా కెయిల్ (La Caille) అను ఫ్రెంచినావికుడు దక్షిణసముద్రములలో నౌకాయానము చేయుచు నీచుక్కలగుంపునకు 'Antlia' అని పేరుపెట్టినాడు. Antlia అనగా గాలిని తీసివేయుయంత్రము (Air Pump)అని యర్థము. ఈయంత్రముయొక్క యాకారము మనవారు ఋగ్వేదములో వర్ణించిన చీమలపుట్టవలెనే ఉండును. ఎవరైన నేదైన వస్తువు ఎట్లుండునో వర్ణించునపుడు వారి కేవస్తువుతో యందు ఎక్కువ పరిచయముండునోదానితో నుపమించుచుందురు. లా కెయిల్ గాలిపంపుయంత్రము వలె నున్నదన్నాడు. అంతకు పూర్వమే మనవారాపరిసరములనుగూడ వర్ణించుచు దీనిని చీమలపుట్ట యని యర్థమిచ్చు 'వమ్రీ' యనినారు. దాని కొకకథ గూడ చెప్పినారు.

చమసమునకు తూర్పున వార్తికమండలము గలదు. ఋగ్వేదములో దీనికి సంబంధించిన కొన్ని సూక్తము లున్నవి. దిగువనున్న అశ్వతరమండలము, ఇంకను ఉదయింపనున్న వృకమండలమును వర్ణించిన గాని యీమంత్రములు సరిగా అర్థము కావు. కావున వానిని ముందునుండి వివరింతము.

ఇక నుత్తరభాగమున గల చుక్కలను గురించి ప్రస్తావింపవలసియున్నది.

కన్యారాశి ననుసరించియున్న వేణీమండలమునకు సమీపమున స్వాతి మెఱసిపోవుచున్నది. స్వాతి పగడము వలె నెఱ్ఱగ వెలుగు గొప్పనక్షత్రము. దీనిని పాశ్చాత్యులు ఆర్క్ట్యూరస్ (Arcturus) అందురు. ఇది భూతేశమండలము (Bootes) లోనిది.

స్వాతి క్షణమునకు మూడువందలయేబదిమైళ్లు చొప్పున పరువులెత్తుచున్నది బ్రహ్మాండగోళము. దీని నుండి వెలువడు దారుణమైన వేడికి మన భూమిమీది ఉష్ణోగ్రత సూచించు థెర్మామిటరులు (clinical thermometers) చలించుచున్నవి. ప్రచండవేగముతో నిది పోవుచుండుటచేత క్రాంతిచక్రములో తక్కిన నక్షత్రములలాగున నుండక యిది త్వరగా మార్పుచెందిపోవుచున్నది. దీనికి 'నిష్ట్యాత' మనికూడ పేరు గలదు.

దీనికి పశ్చిమముగా మరీచి, వసిష్ఠ-అరుంధతి, అంగీరస, అత్రి, పులస్త్య, పులహ, క్రతు, అను సప్తఋషులు నున్నారు. క్రతు పులహులకు పశ్చిమముగా, వక్రతుండ లంబోదరములతో విఘ్నేశ్వరుడును, ఆదిసువ నతని మూషకమును వెలయుచున్నవి. పులహక్రతువులు ధ్రువుని సూచించుచున్నారు. ధ్రువునిపైన కశ్యప మహేంద్రులును, అగ్నిమిత్రులును ఉన్నారు. అగ్నికి తూర్పుగా ధాతయు, మిత్రునికి తూర్పుగా విధాతయు గలరు. ఈలఘుఋక్షమును చుట్టి వచ్చినట్లు నరకుడు 8 చుక్కలతో మెరయుచున్నాడు.

ధ్రువునికి పశ్చిమదిశను ఊర్వశి యున్నది. ఊర్వశి దిగువను, విఘ్నేశ్వరునకును సారథిమండలమునకును మధ్యను స్వల్పతేజస్సుతో కల్పవృక్ష మున్నది. పాశ్చాత్యు లీమండలమును 'కేమెలోపార్డలిస్' (Camelo pardalis) అందురు. ఈపదమునకు చిత్రమైన లొట్టెపిట ('చిత్రక్రమేలకము') అని యర్థము. పొడవై గుబురుగా నున్న యీ చుక్కలగుంపును పాశ్చాత్యులు లొట్టెపిటయనిచెప్పిరి. కాని యిది పాలసముద్ర మథనకాలమున దేవతల కోర్కెలు తీర పుట్టిన కల్పవృక్షమని చెప్పిరి. 'Milky way'నుగూర్చి వివరించునపుడీవిషయములనుగూర్చి మరల ప్రసంగింతము. కల్పవృక్షము దిగువ సారథిమండలమునందు బ్రహ్మహృదయము తెల్లగ తేజరిల్లుచున్నది. ఆప్రక్కనే ప్రజాపతినక్షత్రము గలదు. రథశిఖరమున బడబాగ్ని వెలుగొందుచున్నది. దీనికి పడమట భృగుమండలము గాననగుచున్నది.

వృషభరాశియొక్క యాకారమును, అందలి కన్నువలె మెఱయు రోహిణియు నిపుడు పరికించినచో చక్కగా స్ఫురింపగలవు.

# ప్రతివిమర్శనము

## కుమారస్వామి విగ్రహము

### ౧

గత ఆంగీరసనామ సంవత్సర ఫాల్గునమాసపు భారతి సంచికలో మ. భావరాజు వేంకటకృష్ణరావు బి. ఏ., బి. ఎల్. గారు రాజమహేంద్రవరములో 'జడ్జి బంగాళా' ఆవరణయందు కుళాయీలకు చెఱువు త్రవ్వుచుండగా చక్కని కుమారస్వామి విగ్రహమును, ఒక శాసనమును క్రొత్తగా దొరకినవని ప్రకటించినారు. ఇది శాకాబ్దములు యుగనందరంధ్ర గణితలబ్ధము లనగా ౯౯౪ శా. శ. సంవత్సరము = (౯౯౪ + ౭౮) ౧౦౭౨ ఎ. డి. అగును. (౧౦౨౭ అని అచ్చుపొరపాటుగా బడినది.) "చైత్రంగతే భాస్కరే—విషుసంక్రాంతి నిమిత్తము" అని మూలమున గలదు. చిత్తానక్షత్రమున సూర్యుడు ప్రవేశించిన తరువాత విషుసంక్రాంతినాడు— అని యర్థము. అంతవఱకు బాగుగనే యున్నది. కాని తరువాత, "వైశాఖమాసమున క్రీ. శ. ౧౦౭౨ ఏప్రిలు, మెయి" అని కృష్ణరావుగారు వివరించినారు. సూర్యుడు చిత్తానక్షత్రమందున్నకాలము వైశాఖ మాసము కాజాలదని నావిన్నపము. చాంద్రమానముచేత చంద్రుడేనక్షత్రముచెంత అమాసమున పున్నమనాడు అగపడునో ఆమాసమునకు ఆనక్షత్రమువలన పేరు గలుగుచున్నది. ఉదా. చిత్ర + పున్నమ: చైత్రమాసము. విశాఖ + పున్నమ: వైశాఖమాసము. ఇట్లే తక్కినవి. సూర్యుడే నక్షత్రమున నుండునని చెప్పబడునో ఆకాలము ఆనక్షత్రముయొక్క కార్తి యని వాడుదురు. ఈ శాసనములో సూర్యుడు చిత్తానక్షత్రమున నున్నపుడు వచ్చినట్లు చెప్పబడిన విషు సంక్రాంతి ఆ సంవత్సరపు చిత్తకార్తి, అనగా సెప్టెంబరునెలలో వచ్చునే కాని వైశాఖమాసములో రాదు. చైత్రమాసములో వచ్చు విషు సంక్రాంతి మార్చి ౨౧–౨౨ తేదులలో నుండును. దీనినే Spring or Vernal Equinox అందురు. మరి ఆరు నెలలకు వచ్చునది (సెప్టెంబరు ౨౧ తేదీ) Autumnal Equinox అందురు. ఇది భాద్రపదమాసములో వచ్చును. అపుడు సాధారణముగా మహాలయపక్షదినము లగును. చిత్తానక్షత్రము కన్యారాశిలోనిది. అపుడు సంకల్పములోకూడ 'కన్యాగతే సవితుః' అని చెప్పుదురు. కాబట్టి శాసనకాలము ౧౦౭౨–సెప్టెంబరు అని సవరించుట యవసర మని మనవి చేయుచున్నాను.

### ౨

మఱియొక విషయము — ఈశాసనమునందు పేర్కొనబడిన విష్ణువర్ధనుడు రాజనరేంద్రుని సవతి తమ్ముడైన విజయాదిత్యుడని కృష్ణారావుగారు వ్రాయుచున్నారు. రాజనరేంద్రుని సవతి తమ్మునికి విష్ణువర్ధనుడని నామ మున్నట్లు నిదర్శనములు గలవా? ఇతని రాజ్యారంభకాలము ౧౦౭౧ అని వారు వ్రాసినారు. ౧౦౬౩ వరకు రాజరాజే రాజ్యము చేయుచున్నట్లు చరిత్రకారులు వ్రాసియున్నారు. ఈ విజయాదిత్యుడు ౧౦౬౧ లో రాజ్యము చేయ నారంభించుట యెట్లు సాధ్యమయినది? రాజరాజు పరిపాలనము ౧౦౬౧ సంవత్సరమున అంతమయినట్టును, విష్ణువర్ధనుడను నామాంతరము గల విజయాదిత్యుడను నాతని సవతి తమ్ముడాసంవత్సరమునుండి రాజమహేంద్రవరము నేలినట్లును చరిత్రనిదర్శనము లున్నవా? ఉన్నచో దయచేసి తెలుపుడని మ–శ్రీ కృష్ణారావుగారిని ప్రార్థించుచున్నాను.

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు.

---

## గుంటూరు మండల గ్రంథాలయములు

ఈ మార్చి భారతియందు తెలుగుజిల్లాలలోని పుస్తకభాండాగారముల ప్రశంస ప్రసక్తమై మొట్ట మొదటిది గుంటూరుమండలమున నుదయించినట్లు వ్రాయబడి యున్నది. గుంటూరయిన నేమి, ఇంకొక గ్రామ మయిన నేమి? ఆంధ్రజిల్లాలలోని పుస్తకాగారముల యభివృద్ధి ముఖ్యోద్దేశ మగునెడల షేక్స్పియరు చెప్పినటుల "What is there in a name" (పేరున నేమి మహత్త్వ మున్నది?)

పుస్తక భాండాగారము తొలుదొల్త నే గ్రామమున యంకురించినదను విషయమె పరమార్థమగునెడల గుంటూరివారు కొంచెము దయచేసి కొండవీటిసీమ నతిక్రమించి

* "చక్రవాక స్తని శైవాలకమ్మిల్ల
సందీప్త డిండీర మందహాస
"యావర్తనతనాభి అభినవ బిసహస్త
రాజిత రాజ మరాళయాన
"సికతాతలనితంబ వికచ బంధుర కోష్ఠ
వరతరంగావళీ వళివిలాస
"కంబుకంధర దళితాంబుజాతానన
నానావిహగవిలోల మీన నయన
" యమృతసాగర విభుని యర్ధాంగలక్ష్మి
" యిందుధరునిల్లుపుట్టిన యిల్లు గాగ
" నెగడెడుపినాకినీతటి నీవధూటి"
పరిసరమున నిరుల
" నొప్పారు విక్రమసింహపురము"

క్రేవ దృష్టి సాగింప నిచ్చగింతురేని ఆధునిక యుగమున గుంటూరునకన్న పూర్వమే సార్వజనీన పుస్తకాగారము నెల్లూర నవతరించిన దని కనుగొనగల రని కించిద్విస్రంభముతో బలుకనగును.

౧౮౬౩ ప్రాంతముల నిచటి ఐరోపియనులును ఈస్టు ఇండియనులును (యూరేషియనులు) కలసి యిచ్చట నొక రీడింగురూమును (పఠనమందిరము) స్థాపింప దలపెట్టుకొనిరి. దానికైన సొంత భవనము లేక సర్కారువారిఫాదిరి గుడి (చర్చి) యావరణములో నుండిన యొక ఆంగ్లేయుల బడిలో సమావేశమగుచు, ఇంగ్లాండు వార్తాపత్రికలు కొన్ని తెప్పించుకొనుచును, ఆకాలమున వ్యాపకముగ నుండిన 'మూడి సర్క్యులేటింగు లైబ్రరీ (Mudies Circulating Library) నుండి పుస్తకములు తెప్పించుకొనుచు కాలము గడుపుచుండిరి. ఇదియె యిచటి పబ్లికు లైబ్రరీకి బీజావాపము.

ఆవల కొలదికాలము ఈ రీడింగురూము అప్పటి నెల్లూరు సదర్ అమీను కోర్టు భవనమునందు (ఇప్పటి నెల్లూరు రిజిస్ట్రారు ఆఫీసు) జరుగుచుండినది.

ఎరవునీడల కాపుర మీ రీడింగురూ మొల్లక ఆకాలపు నెల్లూరు కలెక్టరు డైక్సుగారి యభిమానపురస్సరముగ సర్కారువారి సహాయము నపేక్షించుచు సొంత భవన నిర్మాణమున కుద్యమించినది. ఈ రీడింగు రూమున కా కాలమున లైబ్రెరి (Library) యని వ్యవహారసిద్ధమగు పే రేర్పడియుండినది. ఈ లైబ్రెరీకి యూరోపియనులే గాక నేటివులను (దేశస్థులు), ఈస్టు ఇండియనులను, తదితరులనుగూడ రానిచ్చునెడల రు ౧,౦౦౦ ల సహాయము చేయునటుల గవర్నమెంటువారు దెలిపిరి. అట్లు చేయుటకు ఈ రీడింగురూము అధికారు లంగీకరించిరి. ఆవల కొలదికాలములోపల ఇపుడు నెల్లూరు రీడింగురూము నెలకొనియుండు ప్రదేశమును కొని అందు సొంతభవనమును గట్టించిరి. ఇది ౧౮౬౫ జూన్‌లో పూర్తి అయి ఆనుందలనే గృహప్రవేశమును జరిగినది.

ఈవిధమున రీడింగురూమును, లైబ్రెరీయు, ౧౮౬౩ నుండియు నెల్లూర వర్ధిల్లుచున్నవి. తరువాత కొంతకాలమునకు లైబ్రరీ యనుపేరు లుప్తమయి నెల్లూరు రీడింగు రూము పేరు మాత్రము నిలిచియుండినది. లైబ్రరీ యను పేరు వదలిపోయినను ఈ రీడింగు రూములో లైబ్రరీ యొకటి సాగుచునేయుండినది. ఇట్లు కొంతకాలము గడవగ ౧౮౭౮ ప్రాంతముల నిచట

* జక్కన విక్రమార్క చరిత్రము., vii-139.

కలెక్టరుగ నుండిన జనప్రియులు డాక్టరు మెక్లీను గారు ఇండియానుండి వెడలిపోవు సందర్భమున జనానురాగ సూచకముగ ప్రముఖులు చందాల జేర్చి యుత్తమగ్రంథముల గొన్నిటి విలిచి మెక్లీను లైబ్రరీ అనుపేర వానినీ రీడింగురూమున కప్పగించిరి. నాటనుండియు ఈ సంస్థానమునకు నెల్లూరు రీడింగురూము అందు మెక్లీను లైబ్రరీ అను పేరు కలిగినది.

పై సంగతు లన్నియు ౧౯౧౩ డిసంబరులో జరిగిన నెల్లూరు రీడింగురూము షష్టిపూర్తిమహోత్సవమున రిపోర్టునందు ప్రకటింపబడినవి. రీడింగురూము లైబ్రరీ స్థాపనాప్రయుక్తమగు ప్రథమతీర్థము గుంటూరున కీయ వీలు లేదని మనవి.

ఇక వంగోలు విషయమున నచట ౧౮౯౮ లో మొదట లైబ్రరీ స్థాపింపబడినదని పూర్వోదాహృత భారతి వ్యాసమున జెప్పబడియున్నది. అటులున్న నదియు నెల్లూరు లైబ్రరీ స్థాపనమున కొకతరము వెనుక బుట్టినది. మరియు నాకాలమున వంగోలు నెల్లూరునకు సామంతస్థానముగ నుండినది. లైబ్రరీ యుపజ్ఞ రాజధాని యగు నెల్లూరినుండి వంగోలు సంగ్రహించియుండగలదు.

ఒ. ప.

---



పైకారానదిపై వ్రేలు వంతెన

ఛాయాచిత్రకారుడు: సూర్యగారు.




## కొక్కెర *

ఒక గుంపు కొక్కెరలు వచ్చి మావూళ్లో పంట చేను చుట్టూతా మూగినై. వాట్లల్లో కంటికి నదరుగా ఉండేదాన్ని సర్తించి దాంతో మాట్లాట్టం మొదలెట్టా. నాదురదృష్టంకొద్దీ ఆకొక్కెర పెద్దన్యాయవాది; తార్కికుడుగూడానూ. కాబట్టి మాధోరణి అదో మాదిరిగా ఉంది.

మేమిట్లా మాట్లాడేము.

నేను—మీరు చిరాయువులని విన్నా. శాస్త్రజ్ఞులుగూడా మీచిరాయువునిగూర్చి చెప్తారు. ఐతే నీ కెన్నేళ్లు?

కొక్కెర—నాకు మూడువందల డెబ్భైఆరేళ్లు ఉంటాయి.

నేను—నాకుమటుకు చస్తే చేతకాదు. మీకాల పరిమితి అమోఘం. నీబదులు నేనే అంతకాలం బ్రతికి వుంటేనా, చెప్తావ్, నేనెన్నెన్ని వ్యాసాలు రాసి, పత్రికలకి పంపించేవాణ్ణో దేవుడికెరుక. నేనే అంత కాలం బ్రతికితేనా, ఎన్నినవలలు, నాటకాలు, కథలు, విమర్శలు వ్రాసేవాణ్ణి! నీ వేం చేసేవు యిన్నేళ్లు బ్రతికి?

కొక్కెర—ఏం లేదు; తిని తిరగడం.

నేను—సిగ్గయినా లేదు. పైగా నిన్ను చూస్తే నాకు సిగ్గేస్తోంది. ఈలోకంలో ఇన్నేళ్లు బ్రతికి, పుట్టినప్పుడెంతో, యిప్పుడూ అంతే జ్ఞానం. దమ్మిడీ విలువపనిగూడా చేసేవు కాదు.

కొక్కెర—తెలివితేటలు ఏళ్ళతో వస్తయ్యా, చదువుతో గాని? నాకన్న పెద్దేగా, చైనా వెయ్యేళ్లక్రింద ఎట్లా వుందో మొన్న మొన్నటిదాకా అంతే.

నేను—(ఆశ్చర్యంగా) మూడువందల డెబ్భై ఆరేళ్లు! అమ్మో! మూడుశతాబ్దాలపైచిలుకు; దాదాపు నాలుగ్గూడానూ. నేనైతే ప్రతిశాస్త్రం చదివి, ఇరవై తడవలు పెళ్లిచేసుకొని, ప్రతీఉద్యోగంచేసి, తాహతు సంపాదించి 'దొరచావు' చచ్చేవాణ్ణి. ఏదీ, కాస్త ఆలోచించు: నూటికైదురూపాయిలగడ్డీ కాంపౌండుతో, యీనాడో రూపాయి బ్యాంకులో వేస్తే, రెండువందల ఎనభై మూడేళ్లకు మిలియన్ రూపాయిలు వస్తై. అంటే నీవు చాలాకాలంనుంచీ ఉంటున్నావు కాబట్టి, అంతకాలంకింద రూపాయి బ్యాంకిలో వేస్తే యీరోజున నీకు మిలియన్ రూపాయిలు వచ్చేవి. ఛి, ఛీ, వ్యర్థురాలా, సిగ్గైనా లేదు.

కొక్కెర—ఎందుకూ, రేజాఅంతైనా లేదు. మాకు బుద్ధి లేకపోనీ, కాని మా కొక సంతోషం. ఏమిటో తెల్సా? మేము నాలుగొందలేళ్లు బ్రతికినా మనిషి నలభై ఏళ్లలో చేసినన్ని పనా మేము చెయ్యాం. నేనిన్నాళ్లు బ్రతికినా, ఒక్కనాడైనా మాలో మేము పోట్లాట్టం గాని, చంపుకోటం గాని ఉందీ? మీలోనో, యుద్ధం లేంది సంవత్సరం గడవనే గడవదు. మేమెవర్ని దోయడం గాని, బ్యాంకులూ, స్కూళ్లూ పెట్టడం గాని, తప్పుడుసాక్ష్యాలు, లంచాలు పుచ్చుగోడం గానీ, చెత్తనవలలు రాయడం గానీ, పుండాకోరు పత్రికలు ప్రక

* Chekov నుండి అనుకరణ.

టించడం గానీ లేదు. నే నెన్నడూ పెళ్లాలు మొగుళ్ల మీద తిరగబట్టం, కొట్టటం గాని చూసి యెరుగను. మీలోనో! ఏమిటీ? మాలోలాగానా? అందరూ మోసగాళ్లు, నోరు మాట్లాడుతుంటే నొసలు వెక్కిరించే వారు, స్తోత్రపాఠాలు పాడేవాళ్లు, లోప లో మాట పెట్టుకొని పై కొకటి చెప్పేవాళ్లు.

ఇట్లా అంటూవుండగా కడంపక్షులు ఎగిరిపోతూ దీన్ని పిల్చినై. వాక్యం పూర్తి చెయ్యకుండాఐనా ఎగిరి పోయింది.

చతుర్వేదుల లక్ష్మీనరసింహం.

---

## భావికాలపు నవల

[ జాన్ గాల్స్వర్దీ కీర్తిశేషుడు. సుప్రసిద్ధ ఆంగ్ల నవలానాటకకారుడు. 'నోబెల్' బహుమాన మందినాడు. మరణమునకు కొంచెం పూర్వమే 'నలుగురు నవలాకారులు' అను శీర్షికతో Modern Thinker అను ఆంగ్ల పత్రికలో ఈమహానుభావుడు తన ఆఖరు వ్యాసమును ప్రకటించినాడు. పేరుగాంచిన ఐరోపీయ నవలాకారుల విషయమై వ్రాసిన దీవ్యాసము. దాని చివరభాగమున ముందు రాబోవు నవల విషయమై తన అభిప్రాయమును ఇట్లు వెలిపుచ్చినాడు.]

ముందు రాబోవునవల గతి యేమి? ఉత్తరము ఎవరూ చెప్పలేరు. భావినవల ప్రపంచపు ఆర్థిక పరిస్థితుల మీద గాని, పరిణామము మీద గాని ఆధారపడియుండదు. ఒకానొక నిర్ణాయకుని రచనావిధానము అనుసరించియుండదు. నవలాకర్తలకు కావలసిన సుగుణములు రెండు. ఈగుణములు ఇట్టివి అని పేర్కొనుటకు వీలుగాదు. ఆగుణములయొక్క గుణములు మాత్రము వర్ణింపనగును. అట్టి గుణసమన్వితులైన గ్రంథకర్తలు అవతరించిన గాని నవలారచన రాణించదు. చెప్పబోవు రెండు గుణములలో ఏదో యొకటి, వీలున్న రెండు కూడిన రచయిత లుద్భవించిన గాని నవలబాగుపడదు.

కథాభావములో ఔన్నత్యము, కథవస్తువు ప్రదర్శించుటలో రమ్యత అనునవే ఈరెండు గుణములు. ప్రతితరములో ఈగుణములు కలిగిన రచయితలు సగటున లెక్కకు సమానముగానే ఉందురని బహుజనాభిప్రాయము. కాని వెనుదిరిగి సాహిత్యచరిత్ర పరిశీలించినచో మధ్యమధ్య లోట్లు కన్పించుచున్నవి.

ప్రస్తుత పరిస్థితులు చూడగా ముమ్ముందు నవలల విషయమై భయముగా నున్నది. ఈనాటి నవలలో పోకడలు ఉన్నత భావములకు కేవలము విరుద్ధముగా నున్నవి. బహిరంగము, ప్రకటన, ఆయాకాలపు రచనానియమములు, ప్రత్యేకపాండితీపరిశ్రమ అను బరువులతో వ్యక్తిగతమైన సహజస్వతంత్ర భావనాశక్తికూడ క్రుంగిపోవుచున్నది. చమత్కారముగు తెలివి తేటలతో నిండిపోయిన నేటి జనసామాన్యము భావౌన్నత్యము లెక్కచేయుటలేదు. బుద్ధినైపుణ్యమును, ఉన్నతభావములును వ్యతిరిక్తములు. బుద్ధినిపుణత ఈనాటి జనులకు ముఖ్యగుణము. ఈనైపుణ్య మింకను పెంపొందుచున్నది.

రచనలో రమ్యతకూడ నెమ్మదిగ క్షీణించుచున్నది. రమ్యముగురచన ఏమూలనో కాని దొరకదు. ఆమూలలే ఇప్పు డరుదు.

స్వచ్ఛమై, సహజమై, జాతీయమైన గృహాంతర్గత వాతావరణములో పుట్టి పెరిగిన స్త్రీపురుషుల మానసగుణములగుచియే ఆరోజు కారోజు చప్పబడిపోవుచున్నది. ప్రపంచమున కతీతమై ప్రకాశించు కళాసంపత్తి నిర్మలము, నిశ్చలము అయిన స్వాతంత్ర్యభావము, స్పష్టమగు వ్యక్తిత్వము ఉండినగాని జనింపనేరదు. నాఆత్మ నాది అనిధైర్యముగా చెప్పగలిగిన కాలములో నేడు మనము జీవించు చుంటిమా అనుప్రశ్న బుధులకు విడుచుచున్నాను. ఉన్నతభావపూరితముగుటచేగాని, రమ్యముగ నుండి వినోదకారణ మగుటచేగాని ఒకగ్రంథము పదేపదే చదువ కుతూహల పడుచున్నాము. చదివినచో మరల చదువవలెనని కోరిక లభించుగ్రంథములే కొంతకాలమైనను జీవించగలుగును. గ్రంథరచన కంతు లేదు. గ్రంథవిమర్శన కంతకు పూర్వమే లేదు. విమర్శనా బాహుళ్యమువలనగాని, పదిమంది పెద్దలు దాని

విషయమై ప్రసంగించి కొనియాడిన కారణమువలనగాని గ్రంథమైనను, గ్రంథకర్తయైనను శాశ్వతముగా నిలిచి పోజాలరు. నేను గ్రంథరచనకు పూనుకొనిన ముప్పది సంవత్సరములుగా అనేక గ్రంథములచే సారస్వతము నలంకరింపజేసితిని. చిరస్థాయిగా నిలిచిపోవునది ఈపుస్తకములే అని వేనోళ్ళ కొనియాడబడిన వన్నియు నేడు మచ్చునకైన లేక చచ్చినవి. అసలు పుట్టిన చిహ్నాలే లేవు. అదృశ్యమగు కాలదేవత తుపానులలో జీవితశక్తి లేని తుక్కుదూగరలన్నియు చెత్తగా కొట్టుకొనిపోయినవి. నేటివాఙ్మయ విమర్శన విశేషము లన్నిటిని చిత్రగుప్తు డెవరైన జాగ్రత చేసినచో మననాటి కళారుచి లోనున్న చప్పదనము గ్రహించును. బుద్బుదప్రాయమైన తాత్కాలిక కీర్తిచాపల్యములో పడినవారందరికి నానుడివి ఒక్కమాట. మీకళాభిరుచిలో పూర్వావస్థ ననుసరించి వెనుకంజ వేయుమని కాని చరిత్రరూపమైన ప్రపంచానుభవము వెనుకంజ తప్పని మాత్రము నిరాఘాటముగా చెప్పుచున్నది

క. కాశీపతి

---

## దేశాభ్యుదయము-కృషీవలుడు

'New Outlook' అను అమెరికాదేశపు పత్రికలో ఆల్ఫ్రెడ్. ఇ. స్మిత్ గారిట్లు వ్రాయుచున్నారు—

"నేటి రైతాంగము బహుదుస్థితిలో నున్నది. వారి బాగోగులు విచారించుటకు ప్రపంచమందంతటను జరుగుచున్న మహాప్రయత్నములే దానికిసాక్షి. రాజకీయ, సాంఘిక, విషయములలో రవ్వంతమార్పుకూడ పనికిరాదని నిన్న మొన్నటివాక తీవ్రముగ వాదించిన మహానుభావులే రైతుకష్టములు తొలగించుటకు శాసనరూపకముగా ఏర్పాట్లు చేయవలెనని ప్రబోధములు చేయుచున్నారు. విపరీతమగు పద్ధతులు సూచించుచున్నారు. ఏడాదిక్రితము ఇట్టిసంగతులు చర్చించిన వ్యక్తులను పిచ్చివారని హేళనచేసి నవ్వెడువారు.

కానికాలపుకష్టములకు ముమ్మందుగా రైతులే పాలగుచుండుట లోకవిదితము. వ్యవసాయ దుస్థితి వచ్చిన సంవత్సరమునకు వ్యాపార దుస్థితి వచ్చినది. ఈరెంటి మూలముగా దేశములో కరువువచ్చినది. చెడిపోయిన వ్యవసాయపు పరిస్థితులే వ్యాపారము క్షీణించుటకు కారణమని నిరూపించుట కష్టము. కాని ఆర్థిక ప్రపంచ మిన్నికష్టములకు పాలగుట కృషీవలుల దౌర్భాగ్యమేయని ఊహించవచ్చును.

రైతుల సామాన్యచింతలు రెండు: అప్పులు, తత్కారణముగా భూమితణఖాలు. తదుపరి తాము పండించిన ధాన్యములో ఖర్చులుపోగా, పన్నులుపోగా రైతులకు మిగిలేది సున్న. అందువల్ల వారి నిత్యావసరములు కొనుటకే వారికిశక్తి చాలకున్నది. కొనువారులేమి దేశీయపరిశ్రమలు క్షీణించుచున్నవి. ముప్పాతిక మూడుపాళ్లు ప్రజ వ్యవసాయముమీద జీవించు దేశములలో రైతుదారిద్ర్యము దేశమును పీడించును. రైతులు పచ్చగానున్న దేశము భోగభాగ్యములతో తులతూగుచుండును. ఋణబాధ, మోయలేని పన్నులబాధ అను జాడ్యములనుండి రైతు విముక్తిచెందినమరునాడు దేశము బాగుపడును. రైతు తనకు కావలసిన వస్తుసముదాయమును శ్రమలేకుండ కొనుటకు ఏదినమున శక్తుడగునో ఆదినమున దేశీయపరిశ్రమలు, తద్ద్వారా వ్యాపారములు వృద్ధిపొందును. వ్యవసాయసమస్యా పరిష్కారము ప్రతిమానవునకు కర్తవ్యమే. కాని సామాన్యముగా నగరవాసు లీసంగతి పట్టించుకొనరు. ఈసమస్య ఒకప్రదేశమునకు గాని, ఒకజాతికి గాని ప్రత్యేకముగా సంబంధించినది కాదు. ఇది కేవలము జాతీయసమస్య. తిండిలేక జీవనము దుర్లభము. పూర్వకాలమున ఎవరికుటుంబమునకు కావలసిన వస్తువులు, తినుబండారములు వారే తయారు చేసికొనువారు. ఇప్పుడాకాలము గతించినది, తయారు చేయలేరు సరిగదా చాలమందికి ఆవిధమే అగమ్యగోచరము. పట్నవాసులకు వరిమొక్క పెరుగుట ఏవిధముగానో తెలియదు. కూరగాయలు, ధాన్యములు బజారులో దొరుకునన్న సంగతి, అవి పొందుటకు డబ్బుకావలెనన్న విషయములేగాని పైరుపంటల

గోష్ఠి ఈనాటి నాగరికులు చర్చించుటలేదు. గనుక వ్యాపారస్థులు, సర్కారు ఉద్యోగస్థులు, ఇంకను తదితరులు మన ఆహారవ్యవహారములు సరిగా జరుగుటకు రైతు ఎంతముఖ్యమో గ్రహించవలెను. ఈ గ్రహణశక్తి ఎప్పుడంకురించునో ఆనాడే దేశము బాగుపడెంగును.

నిరుటి సంవత్సరము దేశములో రైతుల యావత్తు ఆదాయము ౨౦ కోట్లరూపాయి లనుకొనుడు. ఈసంవత్సరము కరువువల్ల అనగా, పన్నులు ఎక్కువచేయుటవల్ల, అప్పులవాండ్రు పీడించుటవల్ల రైతుల ఆదాయము పడిపోవుట అందరికి తెలిసిన విషయమే. కనుక ఈసాలుకు ఆదాయము ౧౫ కోట్లను కొనుము. పర్యవసానము ఏమనగా, దేశములో మూడుపవంతు ప్రజలు రైతులు గనుక, ఆప్రజలందరికి కలసి మొత్తముమీద ౫ కోట్లరూపాయిలు రాబడితగ్గినది తణకాలు, అప్పులు. ఎక్కువైనవి. వడ్డీ పెరిగిపోవుచున్నది. తాకట్లు వాకట్లగుచున్నవి. సహకారసంఘముల శక్తిక్షీణించి డబ్బు పుట్టుటలేదు. రైతుచేతులో ధనమున్న యెడల దానితో తనకు కావలసిన వస్తువులను కొని అనుభవించును. తన్మూలముగా ఇతరపరిశ్రమలు వృద్ధిపొందును. రైతు దరిద్రుడైన తక్కిన పరిశ్రమలు క్షీణించును. క్షామము సంభవించును. ఇచ్చి పుచ్చుకొనుట లేమి 'బ్యాంకి' లు దివాలా తీయును.

కనుక వ్యవసాయదారుని సంరక్షణచేసినగో దేశసంరక్షణ దానియంతట అదియే జరుగును. దీనస్థితిలో ఉన్న రైతులను ఆదరించి వారి కష్టములను బాపుట ప్రతిమానవునికి కర్తవ్యము."

---

## పూర్వకాలమున క్షామబాధా నివారణములు

### (రెండు పురాతన శాసనములు)

### టి. శివశంకరం గారు

'మహాస్థాన్ గౌరా' యనునది యిప్పటిబంగాళా రాజధానియొక్క బోగ్రా జిల్లాలోని గ్రామము. దీనికనతిదూరమున ఒక పెద్దమట్టిదిబ్బ యున్నది. దీనిని పురాతనశిల్పవస్తుశోధనశాఖ(Archaeological Dept.) వారు ఈనడుమ త్రవ్విచూచుట తటస్థించినది. ఈ ఖననసరణియందు శిలాశాసన మొకటి కానవచ్చెను. మౌర్యబ్రాహ్మీ దీనిలిపి. ఈయది మౌర్యసామ్రాజ్యమునాటి ప్రభుత్వభాష. చంద్రగుప్తుడు మగధరాజ్యమున చక్రవర్తియై పరిపాలన సల్పుచున్నసమయము రమారమి దీనికాలమై యూహింపతగియున్నది. ఇప్పటికి సుమారు రెండువేల నన్నూరు సంవత్సరముల పాతదన్నమాట. 'మహాస్థాన్ గౌరా' పరిసరముల నివసించుచుండిన 'అంబగీయు'లను తెగ జనులకు క్షామబాధ సోకుటయు, దాని నాపుటకై యాప్రాంతముల సామంతరాజ్యపుప్రధానామాత్యుడు ప్రతీకారముల పన్నుటయు నిందలి విషయము. బాధితులకు పైక మిచ్చిరి. అప్పటి రొక్కము 'గండక' నాణ్యమట. మండలమునకే ప్రత్యేకముగ వడ్లకణజ ముండినట్టును, రొక్కముతోపాటు ఆకణజపువడ్లను పేదలకు పంచిపెట్టినట్టును వ్యక్తమగుచున్నది. సుభిక్షము ప్రాప్తించినపుడు పుచ్చుకొన్న రొక్కమును, తీసికొన్నధాన్యమును వడ్డిలేక రాజ్యపు బొక్కసమునకు మరల చెల్లించవలెనమట యిందలి సమయము. ఆ ప్రాంతముల నీటివరదలు కరవునకు కారణ మనుటయు నీరాతివ్రాత తెల్పును. రొక్కపు సహాయము కూలిన యిండ్లను మరల కట్టించుటకై యీయబడినదనియు వ్యక్తమయ్యెడిని.

### మరియొకశాసనము

పైచెప్పిన బోగ్రాజిల్లాకు పశ్చిమోత్తర దిశను కొంతదూరమున ఇప్పటి గోరక్‌పూర్ పట్టణమునకు పదునాల్గుమైళ్లదూరమున 'సోహా గౌరా' యను మరియొకయూ రున్నది. దీనికి ఆగ్నేయభాగములు త్రవ్వినపుడు ఇట్టిదే మరియొకశాసనము బయల్పడెను. దీనిని శోధించి చూడగా, పూర్వకాలమున ఇప్పటి వలెనే క్షామములు సంభవించుచున్నట్టును, ఆబాధను నివారించుటకై యాకాలపు ప్రభుత్వపద్ధతియందు ముఖ్యమగు పట్టుల ధాన్యపుకణజముల నమర్చి పేదసాదలకు గింజల

పంచిపెట్టుట భరతఖండమందే చిరకాలముగ ఆచరణయందున్నట్టు నూహ కెడమిచ్చుచున్నది.

## మౌర్య బ్రాహ్మి

ఈశాసనములు రెండును వంగదేశమున కానవచ్చినను ఆకాలమున నక్కడి వ్యవహారమందున్న వంగభాష కాక, లిపి బ్రాహ్మియై యుండుట మరియొక చారిత్రాంశమును స్ఫురింపజేయును. మగధసామ్రాజ్యమాకాలమున వంగదేశమున వ్యాపించిన కారణముచే (ఇపుడు బ్రిటిష్‌సామ్రాజ్యమున నింగ్లీషుభాషకు నెట్లు వ్యాప్తియో అట్లే) మౌర్యసామ్రాజ్యపు బ్రాహ్మిభాష ప్రభుత్వభాషగా నుండెననుట చూపును.

### డాక్టర్ డి. ఆర్. బంధేర్‌కర్

ఈరెండు శాసనములలిపిని విమర్శించి విషయమును బోధించిన కీర్తి డా. డి. ఆర్. బంధేర్‌కర్ అను పండితాగ్రగణ్యునికి చెందినది. కలకత్తాలోని ఏషియాటిక్ సొసైటి (Asiatic Society) వారికి డాక్టరుగారు సమర్పించిన లేఖనుండి ఈ చరిత్రాంశము సమకూర్చుట.

—Indian Social Reformer, 18-2-33.

---

## ఇండియాలో ఇంగ్లీషు మాటాడువారు

౧౯౩౧-వ సంవత్సరపు జనాభాలెక్కలలో ఇండియాలో విదేశభాషలను (మాతృభాషగా) మాటాడువారు ౬,౮౬,౫౩౫ అనియు, అందులో ఇంగ్లీషు మాటాడువారు ౩,౧౯,౩౧౧ అనియు గలరు. మఱియు యూరోపియనులు ౧,౬౮,౧౩౪ (మగవారు ౧,౧౪,౩౩౬, ఆడువారు ౫౦,౭౯౮), ఆంగ్లో-ఇండియనులు ౧,౩౮,౩౯౫ (మగవారు ౭౧,౨౪౮, ఆడువారు ౬౭,౧౪౭) అనియు గలరు. ఇండియాలో నున్న యూరపియను లందరికిని ఇంగ్లీషు మాతృభాష కాదు. ఇండియాలో నున్న యూరోపియను లందరియొక్కయు, ఆంగ్లో-ఇండియనులయొక్కయు మాతృభాష ఇంగ్లీషే యని యనుకొనినచో ఇంగ్లీషు మాటాడువారు (౧,౬౮,౧౩౪, + ౧,౩౮,౩౯౫) ౩,౦౬,౫౨౯ అగుచున్నారు. కాని మాతృభాషగా ఇంగ్లీషుమాటాడువారు ౩,౧౯,౩౧౧ అని ఇంకొక్కచో చేర్చబడినది. ఈ సంఖ్యకు (౩,౧౯,౩౧౧)ను, ౩,౦౬,౫౨౯ సంఖ్యకును ౧౨,౭౮౨ భేదము కలదు. ఈయంతరమునకు కారణ మేమనవలెను? ఇంగ్లీషు మాతృభాషగా మాట్లాడునట్టివారు, యూరపియనులు ఆంగ్లో-ఇండియనులు కానట్టివారు, ఇండియాలో ఎవరున్నారు. ఈ జనాభాలెక్క సరియగునా?

—మాడరన్ రివ్యూ.

---

## పొడుపు కథలు

పొడుపు కథలు పిన్నలకైనా, పెద్దలకైనా, తాత్కాలికంగా ఒకవిధమైన ఆనందం కలిగించి సరదాగా వుంటవి. కథ విప్పలేనప్పుడు ఉడుకుపోతుతనంగా వున్నా, మొత్తంమీద కులాసాగానే వుంటుంది. ఏడ్చేపిల్లలకు పొడుపుకథలవంటి మందు లేదు. ఆసమయంలో చిన్నచిన్న చింత లన్నీ మరచిపోయి కథలు విప్పడంలో లీనం కావడంచేత, మెదడుకు పని కలిగి విజ్ఞానం వృద్ధి కావడమే కాక సంతోషం కలిగించే ఒక ఆటగా వుంటుంది.

పిల్లలంతా వెన్నెల రాత్రులలో ఆరుబైట మంచాలమీద పడుకుని దొర్లుతూ పొడుపుకథలు వేసి విప్పుకొంటూ వుంటే దృశ్యం సుఖంగా వుంటుంది.

కాని ఆపొడుపుడుకథలు ఈనాటిపట్నవాసపు పిల్లలు మర్చిపోతున్నారు. ఇంగ్లీషు చదువు లబ్బిన తరువాత జాతీయమైన సంప్రదాయము లన్నిటితోనూ ఈచక్కని ఆచారంకూడా నశించిపోతున్నది.

పొడుపుడుకథలు, కట్టుకథలు కేవలము వినోదార్థమే కాక, చరిత్రకారులకుకూడ ముఖ్యావసరము. పూర్వచరిత్ర విమర్శనములకు ఈకథలు అనేకవిధముల తోడుపడును. ప్రాచీనకాలపు రాజులనుగురించినవియు, వారివారి ఘనకార్యములను గురించినవియు కథలనేకము

లున్నవి. తత్కారణముగా చరిత్రకారులకు ఈ కథలు సాయపడును. ఆధునిక కుటుంబములో జన్మించిన బాలబాలికలు మరిచిపోయినప్పటికిని, పల్లెటూళ్ల పడుచుల వద్దను, వయసుమీరిన పెద్దమ్మలవద్దను ఈ సంపత్తి ఇంకను నశింపలేదు. ఆరోజు కారోజు క్షీణించుచున్న ఈవాఙ్మయము కృషిచేసినచో ఈనాటికైనను జాగ్రత్తచేసి కాపాడవచ్చును. భాషాసేవకులు ఈపనికి పాల్గొందురుగాక!

['Indian Antiquary' నుండి గ్రహింపబడినది.]

---

## అట్టావాసమావేశము — దాని పర్యవసానము

"ఎంపైర్ రివ్యూ" పత్రికా సంపాదకునకు ధర్మసందేహము తోచినది! "అట్టావా సమావేశములో జరిగిన విశేష మేమి?" అని. కష్టముమీద పరిశోధన చేయగా ఈక్రిందివిషయము తేలినది.

"అట్టావాసమావేశములో కూడిన వ్యక్తులు, మొత్తం ౪౫౦,౦౦౦,౦౦౦ జనులకు ప్రతినిధులు. ఈ జనులు సగటున ౧౩,౯౦౯,౭౪౨ చదరపుమైళ్ల ప్రదేశములో నివసించుచున్నారు. ఇందులో ౬౦,౦౦౦,౦౦౦ తెల్లవారు. మిగిలినవారిలో ౩౧౫,౦౦౦,౦౦౦ మంది భారతీయులు. ౪౦,౦౦౦,౦౦౦ ఇతర నల్లవారు. ౬,౦౦౦,౦౦౦, అరబ్బులు ౬,౦౦౦,౦౦౦ మలేద్వీపకల్ప వాసులు. ౧౦౦౦,౦౦౦ చీనావారు ౧,౦౦౦,౦౦౦ పోలనీశీయులు. ఇంకను మరికొందరు. ఈసమావేశమున కూడిన మతములు: ౨౧౦,౦౦౦,౦౦౦, హిందువులు. ౧౦౦,౦౦౦,౦౦౦ మహమ్మదీయులు. ౮౦,౦౦౦,౦౦౦ క్రైస్తవులు (ఇందులో ౬౭,౦౦౦,౦౦౦, ప్రాటెస్టెంట్లు, ౧౩,౦౦౦,౦౦౦ కేతలిక్కులు). ౧౨,౦౦౦,౦౦౦ బౌద్ధులు. ౧౨,౦౦౦,౦౦౦ అనిమిష్టులు. ౪,౦౦౦,౦౦౦ శిక్కులు, జైనులు, పారశీకులు. ౬౫౦,౦౦౦ జ్యూలు. తక్కినవారు నానాగోత్రైభ్యః"

---

## సమృద్ధియందును దారిద్ర్యమా?

[స్టువర్టు ఛేసు గారు "ది న్యూ రిపబ్లిక్"నందు వ్రాసిన 'సమృద్ధియందును దారిద్ర్యమా' అను వ్యాసమునుండి.]

పాడిపంటలకును భాగ్యమునకును కొదువలేని దేశమందును లక్షలకొలది జనులు కూటికి లేనివారుగ నుండుట హాస్యాస్పదముగనున్నది. నోరెరుగని పసిపాపలు కూటికిలేక ఏడ్చుచుండ గోధుమల తగులబెట్టుటకన్న నేరమేమి యున్నది?

మన సమాలోచనమునకు గురికాగల ఆర్థికస్థితి యొక్క నైజమునుగుర్తెరింగిన మనమటులతలంపము. కొంతమందికి మాత్రమే యిందలి సత్యాసత్యములు తెలిసియున్నవి. కాని యిందు కొంత అసందర్భమున్నది. ఈఅర్థరాహిత్యమును విశదీకరించుటయే ఈవ్యాసముయొక్క ఉద్దేశ్యము. రష్యాయందు గాని, డెన్మార్కునందు గాని యిపుడాచరణలో నున్న మితవ్యయపద్ధతి ప్రకారము ఆలోచించిన ఈఅభావము హాస్యముగనే యున్నది. జనసామాన్యముయొక్క ఉపయోగము కొరకేర్పడిన మితవ్యయపద్ధతియందు లోపము లుండగూడదు. కాని యింగ్లాండు అమెరికాలలోవలె యీపద్ధతి వ్యాపారవృద్ధికొరకేర్పడియున్నయెడల ఇందు తప్పేమియు లేదు. ఇట్టిపరిస్థితులలో మనకు తప్పక ఆశాభంగము కలుగును.

పెట్టుబడులపద్ధతియందు గల గొప్పలోపమువలన అతిదారిద్ర్యము కలుగుచున్నది. ప్రకృతము అమలునందున్న పెట్టుబడుల పద్ధతి కొనసాగునంతవరకు ఈదుర్భరదారిద్ర్య మిట్లే నిలిచియుండును. వ్యాపారమందు సంభవించు హెచ్చుతగ్గుల ననుసరించి ఒక్కొకప్పుడు దారిద్ర్యబాధ చాల మిక్కుట మగుచున్నది. నేతపరిశ్రమలు, బొగ్గుగనులు, వ్యవసాయము విరివిగా జరుగుచున్న ప్రదేశములయందు ఆర్థికదుస్థితివలన గలిగిన కష్టముల కారణమున ఇటీవల 2,000,000 కు తక్కువ లేక నిరుద్యోగు లేర్పడిరి. ఎవరికి వారే స్వార్థపరు లయినందున ఇట్టిశోచనీయపరిస్థితు లేర్పడుచున్నవి వ్యాపారసందర్భములలో హెచ్చుతగ్గులవలన గలుగబోవు కష్టముల ముందుగనే గుర్తించి అట్టిపరిస్థితులకు అలవాటయియున్నయెడల

ఈదురవస్థ యింత తీవ్రమై యుండదు. వాషింగ్టనుపట్ట ణమం దొకసారి ఆకలిగొన్న నీగ్రోజాతివారిని గంటిని. గంటకు తర్వాత లెక్కకు మించిన పుచ్చకాయలు మురుగునీటియందు కొట్టుకొని పోవుచుండినవి. బజారుధరలలో వ్యత్యాసము గలుగునని వెరచి వర్తకులు ఈరీతిగ చేయుచుందురు.

ధనార్జన ప్రేరితమగు మితవ్యయపద్ధతి ప్రకారము జనసామాన్యముయొక్క మంచిచెడ్డల సరకుకొనుట యనగా భోగములపాలగుట యని లెక్కింపబడుచున్నది. నేర్పరియు, వృద్ధికి వచ్చునట్టియు వర్తకుడు ఇట్టితలంపుల కవకాశమీయడు. ఉదారహృదయులు దివాలాలెత్తుచున్నారు. మనుష్యులు చేతిపనులయందు సమర్థులు. యంత్రములు చాలపనిజేసినను మనుష్యులు చేయగలిగినదంతయు చేయజాలవు. ఏదయిన పనిచేయగల మనుష్యుడు అపాయములవాతబడక యుండిన యంత్రములకన్న చవుకగనే సరకు లభించును. వాని కిచ్చుధనము పారితోషికము గాదు. ప్రసక్తినిబట్టి పద్ధతుల విచారణయందు శిల్పుల ప్రయోజకత చర్చింపబడినది. మన అదృష్టవశమున పెట్టుబడిదారులనేకులు పనివాండ్ర మీద దయగలిగియే యున్నారు.

---

## కోతి వేషాలు

మనయెదురుగా వున్న పెద్దమనిషితలమీద నలకలు గాని, నూలుపోగు గాని వున్నప్పుడు అది తీసివేయవలెనని బుద్ధిపుట్టును. చనవు ఉన్నవారిదగ్గిర ఫరవా లేకపోయినా, కొత్తవారిముస్తాబులో మనము కలుగజేసుకొనుట మర్యాద కాదని బహుజనాభిప్రాయము. కాని అట్లు తీయుటకు ఆభిజాత్య పడవలసిన అవసరము లేదట. దీనికి కారణము ఏమనగా, ఎదుటివారి ముస్తాబు విషయమై కలుగజేసుకునే అలవాటు మన పూర్వీకులైన వానరులనుండి మనకు వచ్చినదట.

ఇది ప్రతిజంతువునకు వున్న అలవాటేనని జంతుశాస్త్ర పరిశోధకులు చెప్పుచున్నారు. రెండుమూడు కోతులు చేరినప్పుడు పేలు చూచుకొనుట రివాజు. లేకపోతే శరీరము దువ్వుట మొదలగుపనులు చేయును. ఏజంతువుకైనను పక్కనున్న సాటిజంతువును షోకు చేయవలెనని యుత్సాహము. ఈ అలవాటును ఇంగ్లీషులో 'Grooming' అని వాడుచున్నారు.

ఇది అనాదినుండి వచ్చినదో లేక చూసి నేర్చుకొన్న అలవాటో యని పరిశోధకులు కొందరు, పుట్టిన వెంటనే ఒక 'చింపాంజీ' అను కోతిని దానిజాతినుండి వేరు జేసి విడిగా పెంచిరట. కాని తరువాత ఇంకొక 'చింపాంజి' ని చూడగానే వీరు పెంచినకోతి పేలు చూచుటకు ప్రారంభించినదట. అందువల్ల జంతు సముదాయమునకు ఇది సహజగుణముగా అనాదినుండి వచ్చుచున్నదని గ్రహించిరి.

మనుష్యప్రపంచములో ఈగుణము అనేకరూపములలో వ్యక్తమగుచున్నది. మంగలివాడు, శస్త్రవైద్యుడు మొదలగువారు చేయున వన్నియు ఈ కోతి వేషములే అని శాస్త్రజ్ఞుల అభిప్రాయము.

['జంగిల్ వాలా' నుండి గ్రహింపబడినది.]

---

## సప్తప్రమాదములు

లండను మిషనరీ సొసైటీ సభలో కేనను, యఫ్. యల్. డొనాల్డ్సన్ (?) గా రుపన్యసించుచు ఈక్రింద తెలిపినవి ప్రాపంచిక సప్త ప్రమాదము లనిరి:

౧ ప్రాతిపదిక సూత్ర సహితములు గాని రాజకీయములు.

౨. పనిలేకుండ బహుళ ధనసంపద కలిగియుండుట.

౩. అంతరాత్మకు వెలియైన సుఖానుభవము.

౪. సత్ప్రవర్తన కొరవడిన విజ్ఞానము.

౫. నీతివిరహితమయిన పరిశ్రమ.

౬. జీవకారుణ్య రహితమగు శాస్త్రజ్ఞానము.

౭. త్యాగసహితము కాని ఆరాధన.

(సమదర్శిని.) ౧౫-3-33.

---

## చికాగో దీపస్తంభము.

వైమానికుల సహాయార్థము అమెరికాలో ఒకదీప స్తంభము నిర్మింపబడినది. సూర్యభగవానుని అనుకరించి ఈ స్తంభమును కట్టిరి. చికాగోయందు 39 అంతస్థులుగల మేడపై ఈదీపమున్నది.

ప్రపంచమున గొప్పవైమానికుడగు లిండ్‌బర్గ గారిపేర ఈదీపము వెలసినది. 1933–వ సంవత్సరమున చికాగోయందు జరుగగల ప్రపంచ ప్రదర్శనమునకు వచ్చు వారికీదీపము మార్గదర్శకముగా నుండగలదు.



చికాగో దీపస్తంభము

ఈదీపము 200 కోట్ల కొవ్వువత్తులకాంతి గలిగి యున్నది. ఇంత వెలుగు నిచ్చు దీప మిదివర కెన్నడును నిర్మింపబడియుండలేదు. ప్రపంచమందుగల గొప్పపట్టణములలో చికాగో నాల్గవది. ఆపట్టణమందు రస్తామట్టమునకు 602 అడుగుల ఎత్తున ఈదీప మున్నది. సాధారణముగ వాతావరణ స్థితినిబట్టి 100 మొదలు 250 మైళ్లవరకును ఈదీపకాంతి ప్రసరించి వైమానికులకు దారి చూపుచున్నది. ఈదీపము 1930 ఆగస్టునుండి చికాగోకు పోవు వైమానికుల కెంతయో సహాయముగ నున్నది.

ఈ స్తంభనిర్మాణమునకు 47 టన్నుల ఉక్కు పట్టినది. ఈఉక్కును పలకలవలె చేసి 'పామ్ఆలివు' భవనముపైన స్తంభమును కట్టిరి. ఇప్పటివరకు ఈదీపమునకు 1,70,000 కార్బనులు ఖర్చయినవి.

ఈదీపము నిమిషమున కొక చుట్టు తిరుగుచుండును. ఇది గాక ఈభవనముపైన వేరొకదీప మున్నది. ఈదీపమునకు 1,15,00,000 కొవ్వొత్తులకాంతి గలదు. ఇది నిశ్చలమైనది. ఇది చికాగోయందలి విమానముల విశ్రాంతిస్థానమునకు వెలుగు నిచ్చుచున్నది. వైమానికుల కెంతయు ఈదీపము ఉపకరించుచున్నది.

---

## మేకపాలు

['మయూరభంజిగెజెట్టు' లో మేకపాలప్రశస్తి ఇట్లు పేర్కొనబడినది.]

గ్రేటుబ్రిటనుప్రజలు మేకపాలను అత్యధికముగా త్రాగుచున్నారు. రెండుకోట్ల గాలనులు అక్కడ వ్యయమగుచున్నది.

ఆవుపాలకంటె మేకపాలు తేలికగా జీర్ణమగును. దానినుండి వెన్న ఎక్కువగా వచ్చును. క్షయరోగ క్రిము లంటుండవు. శరీరచర్మము సుందరతరముగ మెరయుచుండునని ఆడువారు, తెలిసికొనిరి. వారు ముఖమును కంఠమును, బాహువులను దినమున రెండుమూడుమారులు కడుగుకొనుచుందురు. అందుచేత అందమయిన పాటల వర్ణము గలుగునట.

చాలమంది చిన్నరైతు లందరు కూడ ఆవులను భరించుటకంటె మేకలను పెంచుట చాలచౌకయని తెలిసికొన్నారు. మేకపాలు పోసి, ఆవుదూడలను, మేకపిల్లలను, గుఱ్ఱపుపిల్లలను, పందులను పెంచవచ్చును.

మేకలే బీదవాని ఆవులు. ఇండియా మిక్కిలిబీదదేశము. కాబట్టి యిచట మేకపాలను ఇప్పటికంటె ఎక్కువగా ఉపయోగించుకొన ప్రయత్నించవలెను.

'మేకపాలు అసలు క్షయరోగమును చేరనీయదు. క్షయరోగబాధను నివారణచేయగలదు' అని ఆయుర్వేదము ప్రశంసించుచున్నది. కొవ్వు, విటమినులు, క్షారములు ఉండుట, క్షయక్రిములు లేకపోవుట ఆసిద్ధాంతమునే బలపరుచుచున్నవి.

ప్రకృతము ఇండియాలో క్షయరోగము విరివిగా వ్యాపించుచున్నది. కావున ప్రతిబీదవానియింటను తన కుటుంబమునకు దండిగా పాల నిచ్చుటకు కావలసినన్ని మేకలను పెంచుకొనుట మేలు. మేకలను ప్రతిదినము చక్కగా కడిగి శుభ్రముగా ఉంచినయెడల పాలదుర్వాసన కూడ చాల తగ్గిపోవును.

---

## విదేశభాషలద్వారా విద్యాబోధనమువలని చెరుపు

[రమణీమోహనరాయిగారు పాఠశాలలలో విదేశభాషలద్వారా చదువు చెప్పుటవలని చెరుపును గురించి "Teachers' Journal" నందు వ్రాసినవ్యాస భాగము.]

ప్రస్తుతము విద్య గరపుటకు విదేశభాష లుపయోగింపబడుచున్నవి. ఏవిధముగ చూచినను ఇట్టిపద్ధతి అస్వాభావికమైనదిగ నున్నది. దీనివలన విశ్వవిద్యాలయముల విద్యార్థుల జ్ఞానాభివృద్ధి స్తంభించిపోవుచున్నది. మాటలాడగలశక్తి రాగనే పసిపిల్లలు మాతృభాషను అతిత్వరితముగ నేర్చుకొనుచున్నారు. అక్షరాభ్యాసకాలమునకు వారు మాతృభాషను బాగుగ నేర్చియుందురు. పాఠశాలలందుకూడ వారికి ఇతరవిషయములకంటె మాతృభాషయందే సామర్థ్య మెక్కువగ నుండును. 15 సం॥లకంటె

ఎక్కువ కాలముగ ఉపాధ్యాయుడుగ నున్నాను. ఆరవ తరగతివరకు పాఠములన్నియు మాతృభాషయందే చెప్పుటవలన పిల్లలందరు అన్నిపాఠములను శ్రద్ధతో చదువుకొనుచు విశేషశ్రమము లేకయే పరీక్షలయం దుత్తీర్ణులగుచుండిరి. కాని ఏడవతరగతికి రాగనే వీరికి అన్నిపాఠములలోను మార్కులు తగ్గిపోవుచున్నవి. ఈతరగతిలో విదేశభాషయందు పాఠముల నేర్పుటవల్ల ఇట్లగుచున్నది. పాఠముల చెప్పుటయందు గాని పరీక్షలయందు వ్రాయుటయందు గాని విదేశభాషయగు నింగ్లీషే వాడబడుచున్నది. మాతృభాషయే ప్రధానముగ నుండిన పాఠశాలనుండి వచ్చిన మిక్కిలి తెలివైన విద్యార్థులుకూడ నిర్బంధముగ ఇంగ్లీషుననే చదువుట, వ్రాయుట యవసర మగుటచే, అన్నిపాఠములలోను తప్పిపోవుట అనివార్య మగుచున్నది. ఇందువలన వారికి చదువునందే అభిరుచి తగ్గిపోయి మిక్కిలి తెలివి గలిగినవారు సయితము సామాన్యులగుచున్నారు. ఇంతవరకు ఇంగ్లీషులో మంచిప్రవేశము గలిగియుండినవారు సయితము ఏడవతరగతికి రాగానే చాల కష్టపడుచున్నారు. పాఠముల చెప్పుభాష విదేశభాష యగుటవలన అసలు పాఠములు బాగుగ బోధపడక సరియైన భావములు వారియం దేర్పడకయున్నవి. అందువలన వారు ఎక్కువకాలము భాషాభ్యాసముకొరకే వినియోగింపవలసి వచ్చుచున్నది. పరీక్షలకొరకు వారు పాఠముల నట్లే గుడ్డిపాఠము చేయుదురు. అందువలన వారికి సమాలోచనాదృష్టి నశించును. వారు నేర్చుకొనునది వారి మనస్సులయందు నాటకపోవును.

ప్రస్తుతపు విద్యావిధానమువలన విద్యార్థులకు పదజాలము ఎక్కువగ లభ్యమగుచున్నది. కేవల పదజాల జ్ఞానము విద్య గానేరదు. ప్రస్తుతవిద్యావిధానమును బాగుగ పరిశీలించిన డాక్టరు వెస్టుగారు ఈకాలమున విద్యార్థులకు ఇంగ్లీషు గాని దేశభాష గాని సరిగ రాదని చెప్పిరి. దీనికి కారణము బోధనాపద్ధతియే. పాఠముల నన్నిటిని ఇంగ్లీషుననే చదువుకొను నవసరమున విద్యార్థులు మాతృభాషను త్యజించుచున్నారు. వివిధవిషయములను ఇంగ్లీషుద్వారా తెలిసికొనవలసియుండుటచే ఇంగ్లీషుభాషను చదువుటకు వారికవకాశము చాల తక్కువ. ఇట్టి నేటి విద్యార్థులు రెంటను చెడిన రేవడ లగుచున్నారు. ఇట్టిముఖ్యకరమయిన విషయమున నౌదాసీన్య మిక నింతయేని చనదు.

---



పక్షితీర్థము
(కొండపైనుండి)

ఛాయాచిత్రకారుడు: కె. వి. ఎ. పద్మనాభరావుగారు.



# విమర్శనము



## శ్రీముఖ పంచాంగములు

### i ఆర్యవైశ్య సిద్ధాంత పంచాంగము

జవ్వాజి సుబ్బారాయగుప్తగారిచే గుణింపబడినది. పంచాంగము గాక జనసామాన్యము తప్పనిసరిగ తెలియవలసిన విషయములు ౧౦౮ వరకు ఇందు గలవు. అందు ముఖ్యముగ పేర్కొనతగినవి జ్యోతిశ్శాస్త్ర ప్రశంస, స్వరశాస్త్రము. తక్కినవిగూడ మామూలు గణకులవలె కేవలము సంస్కృతశ్లోకములతోనే సామాన్య ద్రష్టలను చీకాకుపరచక ప్రమాణ శ్లోకములకు తాత్పర్యమును గూర్చినారు. ఇట్టిది జనసామాన్యమునకు విషయ పరిజ్ఞానమునకు మిక్కిలిగ తోడ్పడగలదు. ఆంధ్రానువాదపద్యములుగూడ చేర్చినారు కాని యవి యనవసరమే. తక్కిన పంచాంగములకన్న దీన నొక విశేషమునుగూర్చి సిద్ధాంతి తమ వ్యక్తిత్వమును చూపినారు—తక్కినవానితోగూడ గాంధీశకమని మరియొకశక మీపంచాంగమున ప్రవేశపెట్టబడినది. ముద్రణాదులయందును వీరి వ్యక్తిత్వము స్ఫుటము. వెల మూడణాల తపాలాబిళ్లలు.

### ii శ్రీ శ్రీనివాసశిరోమణి, శ్రీ పాతూరి సుబ్బారాయశాస్త్రిగార్ల పంచాంగము

డా॥ కే. యస్. కేసరిగారిచే ఇది ప్రకటింపబడినది. పంచాంగమును గుణించుటలోను, విషయములను కూర్చుటలోను ఈ సిద్ధాంతులుగూడ ఒక నూతన మార్గమునే త్రొక్కిరి. ఇది స్థూలదృష్టికే కొంతవరకు గోచరింపగలదు. ఒక్కొక్కమాసమునకును రెండు రెండు పుటలు. తిథివార నక్షత్రాద్యంగముల కొక్కొక్కదానికొక్కొక్క కలము. ప్రతిమాసపుటుదను ఆ మాసమున జరగు వ్రతాదులు నిర్దేశింపబడినవి. పంచాంగము తుదను గ్రహచారములు వివరింపబడినవి. కాని, పీఠికలో చాలభాగము కేవలము సంస్కృతమయమగుటచే జనసామాన్యమున కెక్కువ ఉపయోగకరము కాదేమో! సామాన్య విషయములకైనను తెలుగు వివరణము, బహుజనోపయోగకరముగ నుండగలదు.

### iii దోగుపర్తి స్వామిగుప్త సిద్ధాంతిగారి పంచాంగము

ఇది మామూలురకమైన పంచాంగమైనను ౭౮ పుటల పరిమితిగల పీఠికతో చాలవిషయములను గూడియున్నది. విషయములన్నియు గ్రంథరూపమున నిలుపుకొనవలసినవి. పంచాంగకర్తను గుంటూరుజిల్లా నేటిపాలెమునకు వ్రాసి యీపంచాంగమును ఉచితముగ పొందవచ్చును.

"జ్యోతిశ్శాస్త్రము వేదములకు చక్షుస్స్వరూపము వంటిదని పెద్దలన్నారు. కర్మానుష్ఠానమునకును పంచాంగమత్యవసరమే. వేయేల. నిత్యకర్మయగు సంధ్యావందనమునకుగూడ పంచాంగము జూచుట ముఖ్యము. ఇట్టి పంచాంగముయొక్క స్థితి నేడెట్లున్నదో నేఁజెప్పబనిలేదు. పంచాంగ మియ్యబోవ 'పైసా పంచాంగ' మని పరిహసింతువారు కొందరు. "పంచాంగము నేటి రోజులలో మాచేవారెవ్వరయ్యా" యనువారు కొందరు; 'మాకు పంచాంగముతో పనియుండదు' అనువారు కొందరు.

"మాటలేగాని మంచిచెడ్డలకై దానిని జూడనివారు లేరు. పంచాంగ మెప్పుడోగాని చూడబోనని ప్రగల్భములు గొట్టిన నామిత్రుడొకడు తనకూతురు ప్రథమ రజస్వల కాగా నక్షత్రశుద్ధికై పంచాంగమును పారబట్టినాడు. సంధ్యావందనము మానిన సరసుడుకూడా చావుకో, జన్మానికో, పెండ్లికో పంచాంగమును జూడకతప్పదు.

"పురాణభాషా విజృంభణమువనో మరే కారణమువనో కేలండరు (Calendar) కున్న గౌరవము పంచాంగమునకు లేదు. తేదులు వారములు మాత్రము పంచరంగులలో ముద్రించి, ప్యారీస్ సుందరి పటముగాని, జర్మను లేడీ బొమ్మనుగాని అతికించిన కేలండరు అరణాలన్నను అమ్ముడుపోవునుగాని తిథివార నక్షత్రయోగ కరణములేగాక నవగ్రహగతి మొదలుగా నెన్నివిషయములనో తెలియజేయు పంచాంగము అర్ధణా వెలయన్నను కొనువారులేరు. కలికాల మహాత్మ్యమనవలెనో? కాక మనదేశపు శాస్త్రములకు బట్టిన దుర్గతి యనవలెనో? మరేమనవలెనో? తెలియదు. అయినను కాలవిదులు కోటికొక్కరున్నను; శాస్త్రము నశింపకుండ ఇన్నాళ్లు చెక్కుచెదరక నిలిచినది మన యదృష్టమే కొంతవరకు కారణమని చెప్పవలెను. మనసులన్నియు మాతృదేశాభ్యుదయముకంకి మరలిన యీ రోజులలోనైన గణితస్కంధము మరల మానవకల్యాణమునకు తోడ్పడగలదను కారణముతో నీవిపుల ప్రయత్నమునకు సాహసించితిమి." (ఆర్యవైశ్య సిద్ధాంతపంచాంగము)

ఇప్పటికయినను మనవారీసత్యమును గుర్తింపగలిగిన సంతోషమే. జ్యోతిషికులైనను నేటికాలపు వారి యనభిమానమును లెక్కకుగొనక యీశాస్త్రప్రక్రియను శక్తికొలది ప్రచారమునకు దెచ్చుచున్న నేడుగాకపోయిన మరియొకనాడైన తగిన యాదరాభిమాన ప్రోత్సాహములు లభింపకపోవు.

---

## పిరదౌసి

గ్రంథకర్త: జి. జాషువకవి. క్రౌను సైజు 58 పుటలు. వెల రు. 0-8-0 లు

పిరదౌసియను నొకపారసీకకవి గజనీమహమ్మదు పరాక్రమములను పొగడి కీర్తిమంతునిచేయుటయు, గజనీమహమ్మదు అతనికి యిత్తునన్న కట్నమునీయక తలతఱిగించ యత్నించుటయు, పిరదౌసి భార్యాపుత్రికలతో కొండలవెంట పరుగెత్తి యన్యదేశములకు చేరుకొని చనిపోవుటయు గజనీమహమ్మదు పశ్చాత్తప్తుడై 16 వేల బంగారు దీనారములనంపుటయు అతనికూతురు నిరాకరించుటయు గజనీమహమ్మదు దయ్యమై పురవీధులలో తిరుగుచుండుటయును కథావిశేషములు. ఆఫ్గను దేశపు పర్వతముల నదుల అరణ్యముల జంతువుల పక్షుల వర్ణనలను ఆదేశపుటుపమాద్యలంకారములలో నిముడ్చి బహుసరసముగ వ్రాసినారు. తెలుగుభాషలో పారసీకకవిత్వము చదువుచున్నట్లుండును. గ్రంథమును వలయువారు వినుకొండలో తెలుగుపండితులుగానున్న కవిగారికి వ్రాసిన బడయగలరు. గ. స.

---

## నా ఎలెక్షను అనుభవములు

గ్రంథకర్త: యద్దనపూడి వెంకటరత్నం. క్రౌను సైజు 144 పుటలు.

శ్రీయుత వెంకటరత్నముగారికి మంచి లోకానుభవము, వ్యవహారభాషాస్వాధీనము, అనర్గళలేఖినీ ప్రవాహమును గలవని యాతనివ్యాసములను తరచు పత్రికలలో పఠించువారలందఱికిని తెలియును. స్థానికసంస్థల యెన్నికకుతంత్రములు దుర్మార్గులగెలుపులు సన్మార్గుల పరాభవములు కండ్లకు కట్టునట్లు పెక్కువ్యాసములుగా వర్ణింపబడినవి. మానవస్వభావము పరిపక్వముకానిదే యెన్నికలవలన సన్మార్గులే పైకి వత్తురని చెప్పవీలులేదు. యెన్నికల విధానము ప్రజల యిష్టము కనుక్కొనుటకే యేర్పడినది కాని వారితత్వమును సంస్కరించుట కుద్దేశింపఁబడినదికాదు. ఇట్టిగ్రంథములను పఠించి వోటర్లును

అభ్యర్థులను మూటివర్తనము సేర్వలేనిచో ప్రజాప్రభుత్వ మనునది వట్టిబూటకము. దురహంకారములను దుర్మార్గములను కుతంత్రములను చేటపెట్టిచెరిగి చీపురుకట్ట పెట్టి కొట్టినట్లు బహు నిర్దాక్షిణ్యముగను లలితముగను ఈ గ్రంథము వ్రాయబడినది.

గ. స.

---

## ఆర్యకవి కుతంత్రములు

గ్రంథకర్త: సూర్యదేవర రాఘవయ్యా చౌదరి గారు. క్రౌను సైజు 188 పుటలు. వెల 1-0-0.

హిందువుల మతగ్రంథములన్నిటిలో బ్రాహ్మణులు తమ స్వార్థపరాయణతను కొనసాగించుటకు అనేకము అబద్ధములు వ్రాసి చొప్పించిరని గ్రంథకర్తగారు తెలుపుచున్నారు. పురాణములయొక్క సత్యాసత్యములనుగూర్చి చర్చకుదిగి పరిశోధించ గడంగినారు. పురాణములు చరిత్రములు కావు. సమస్తవిషయములను అవి స్పష్టముగ చెప్పక నిగూఢముగ చెప్పును. కనుక అవి అద్దమువలె నుండి ధర్మపరులకు ధర్మము తెలుపును. కామలంపటులకు తద్విషయకమగు ప్రోద్బలములను హెచ్చించును. అసూయాపరులకు ద్వేషము క్రోధము మొదలగువానిని హెచ్చించును. సత్యాన్వేషణము కొరకు వీనిని పరిశోధింప కూడదనము. అయినను మిక్కిలి విద్యయు, నిర్ద్వేషత్వము, నిష్పక్షపాతము, నిరభిమానము గలవారికే అది గోచరమగును. సత్యాన్వేషణదృష్టితో వానిని పఠించువారికి ఆత్మపరిపక్వమును సర్వమానవసుహృద్భావమును కూర్చకమానవు.

గ. స.

---

## హనుమానుడు

గ్రంథకర్త: కొడాలి సత్యనారాయణరావుగారు. క్రౌను సైజు 102 పుటలు. వెల రు 0-8-0 లు.

శ్రీరామభక్తుడగు హనుమంతుని శౌర్యపరాక్రమములు, స్వామికార్య పరాయణత్వము, రాజకీయజ్ఞానము మొదలగు సుగుణములతో కూడిన హనుమంతుని చరిత్ర యిందు పరిశుద్ధమగు గ్రాంథిక భాషలో విద్యార్థులపఠనముకొరకు రచియింపబడనది. విద్యాశాఖవారి యాదరమునకు పాత్రముకాదగినది. ఏలూరు పాండురంగ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

గ. స.

---

## వీరగాథలు

గ్రంథకర్త: ఆకుండి వేంకటశాస్త్రిగారు. క్రౌను సైజు 64 పుటలు. వెల రు ०-४-०.

ఘటోత్కచ భీమసేనులు, భీమసేనహనుమంతులు, అభిమన్యుడు, పరశురాముడు—వీరల చరిత్రలు సంగ్రహముగ గ్రాంథికశైలిలో బాలబాలికల కథావర్ణన కౌతూహలమును తీర్చు నిమిత్తమును పోషించునిమిత్తమును వ్రాయబడినవి. బాలురలో సాహసము, సౌశీల్యము, పరాక్రమము, సత్కార్యాచరణము మొదలగు గుణములను పురికొల్పునట్లు వ్రాయబడినవి. మదరాసు, చటపటు, సేవాసదన హైస్కూలులో తెలుగు పండితులుగానున్న గ్రంథకర్తగారివద్ద ప్రతులు మూల్యమునకు లభించగలవు.

గ. స.

---

## రామప్రియ

గ్రంథకర్త: తాత క్రిష్ణమూర్తి (భద్రాచలం). క్రౌను సైజు 146 పుటలు. వెల రు 0-12-0 లు.

ఇందు 8 కథలును రెండువ్యాసములు నున్నవి. గ్రంథకర్తగారి చిన్నకథలు ఆంధ్రమాసపత్రికాపాఠకులకు సుపరిచితములు. సులభ ధారాళ వ్యావహారికశైలి, మనోహరశీలచిత్రణము, సంగ్రహలేఖనము, హాస్యరసవిలాసము, హృదయంగమ పటుత్వము, ఉత్సాహప్రేరేపణము, మొదలగు హ్రస్వకథాలక్షణముల కితని రచనలు స్థానములు. యౌవనదంపతీ విలాసవైచిత్ర్యములు మోహములు చిత్రించుటయందు అతనికి ఆప్యాయనము హెచ్చు. గ్రంథమునందలి నాయకులందఱును పాశ్చాత్య ఆదర్శమోహితులై నాగరిక భార్యలతో విజ్ఞానజలధి లోను విలాసములలోను నువ్విళులూరగోరు వెఱ్ఱివాగుల

వారు. నాయికలు పెండ్లినాటికికాని కాపురమునకు వచ్చిననాటికి కాని మిక్కిలిగడుసువాళ్లవలె కనిపించరున్నను తమ తమ పతుల సాంగత్యము వలన అల్పకాలములోనే ఇట్టివిలాసములలోను ఒయ్యారములలోను ఆరితేరిన ఆరిందాలై ప్రేమరసభరితలై భర్తలను చెవులుపట్టి యాడించు ధీరోదాత్తలు. కథలు మిక్కిలి ముచ్చటలూరుచున్నవి. ప్రతులను వలయువారు భద్రాచలములో ఉపాధ్యాయులుగానున్న గ్రంథకర్తగారిపేర వ్రాసిన బడయగలరు. గ. స.

---

## భారత విదుషీరత్నములు

క్రౌనుసైజు పుటలు 64. వెల 0-5-0. కర్త: కొండాలి లక్ష్మీనారాయణగారు, అసిస్టెంటు, జి. సి. హైస్కూలు, తురుమెళ్ల.

భారతదేశపు సుప్రసిద్ధ విదుషీమణుల కథలు పదునైదు ఇందు కూర్చబడినవి. మరి పదునైదు, వెలువడనున్న రెండవభాగమున కూర్చబడునట. ఈకథలను చదివినవారికి స్త్రీవిద్య క్రొత్తగ నేర్పడినది గాదనియు, ఆదికాలముననే గలదనియు తెలియగలదు. శైలి సులభము. మోపఱ్ఱు విదుషీసాహితీ సమితివారిచే నిది ప్రచురింపబడినది. అఖిలాంధ్ర సమాదరణము సమితికి ఉత్తేజము గల్గింపగలదు. ఆచార్య.

---

i శ్రీరామమూర్తి,

ii ధర్మమూర్తి,

iii కృష్ణమూర్తి.

రచయిత: మైలాపూరు పి. యస్. హైస్కూలులో సీనియరు తెలుగు పండితులు, గరిమెళ్ళ సత్యగోదావరి శర్మగారు. మొదటి రెంటికిని వెల నాలుగణాలు, మూడవదానికి అయిదణాలు. మైలాపూరు అంబికా బ్రదర్సు వారిచే ప్రకటితములు.

భారత భాగవత రామాయణములనుండి కథల నేర్చి శర్మగారీపుస్తకములను వ్రాసినారు. నాలుగైదవ తరగతుల బాలురకై యివి యుద్దేశింపబడినట్లు రచయిత తొలిపలుకున గలదు. కాని యా తరగతులకు వీనిశైలి కఠినమనిపించుచున్నది. అంతకు పైతరగతులకు ఉపయోగింపవచ్చును. ఆయాతరగతుల బాలుర బుద్ధిబలమునకు, మనోవికాసమునకు సరిపడినట్లు పాఠ్యగ్రంథములను రచించుట బాగు. ప్రకాశకులును ఈవిషయము నాలోచించుట తగిన భాషాసేవ యగును.

ఆచార్య.

---

## నారదోపన్యాసములు

గ్రంథకర్త: పిశిపాటి సత్యనారాయణ. ప్రకాశకులు తెలియదు. వెల ౦-౬-౦.

రంగూన్‌లో 'ఐరావతి' పత్రికాముఖమున ప్రకటింపబడిన లోకవ్యవహారములను గురించిన కొన్ని 'విమర్శల' సంపుటి. సాంఘిక, మత, నీతి శాస్త్రములకు సంబంధించిన వ్యాసములు. గ్రంథకర్త లోకజ్ఞానము కలవాడు. ఉదాహరింపబడిన ఉపమానోపమేయములు, సామెతలు, నీతులు మొదలగునవి రచయిత పాండిత్యమును వెలిపుచ్చుచున్నవి.

శైలి ఉపన్యాసములకు తగినంత ఉత్సాహపూరితముగా లేదు. అంత సుభంగా లేదు. కాని చదివితే కష్టం లేదు. క. కా.

---

## నాటకమర్మము

గ్రంథకర్త: పి. వి. సుబ్బారావు, రాజమండ్రి. సంపాదకుడు: యేలూరిపాటి వెంకటసత్యనారాయణ, తాళ్లపూడి (ప. గోదావరి). వెల ౦-౮-౦.

నీచస్థితిలో ఉన్న ఆంధ్రదేశపు నటకులమీద వ్రాసిన కథకరూపమైన విమర్శ. ఇదివరకు నాటకవిమర్శలన్నీ నాటకప్రదర్శనముల విషయమై వున్నవి. గాని, నటకుల ప్రవర్తనవిషయమై ఎక్కువగా లేవు. ఆలోటు వీరి పుస్తకం తీరుస్తుంది. ఇందులో వీరు

చెప్పేది అంతా నిజము. చెప్పవలసిన సంగతులన్నీ విసుగు పుట్టకుండా కులాసగా కథగా చెప్పేసారు. పుస్తకం, అచ్చులోపాలు, బైండులోపాలు వున్నా చదవ బుద్ధివేస్తూంది. చెప్పేవిధంలో లోపములు ఉన్నా చూసీ చూడకుండా పోవచ్చును. చదువవలసిన పుస్తకం.

క. కా.

---

## ప్రాచీనభారత విద్యావిధానము

గ్రంథకర్త: యద్దనపూడి వెంకటరత్నంగారు. సరస్వతీ గ్రంథమాల: 30 వ పుష్పము. సంపాదకుడు: కె. యస్. యన్. మూర్తి, కాకరపర్రు, తణుకు తాలూకా. వెల 0–12–0

ప్రస్తుత విద్యావిధాన మందలి లోట్లు, ప్రాచీన విద్యావిధానపు ఆధిక్యత, అను విషయములను గురించిన కథారూపమైన దీర్ఘోపన్యాసము.

గ్రంథకర్త ఈవిషయమై చాలపుస్తకములు చదివి, స్వంతముగ ఆలోచించి పరిశ్రమ చేసినవాడు. ఉద్దేశ్యములలో సనాతనుడు. జాతీయత కావలెనన్న ఈయనను అడ్డువారుండరు కాని వీరి జాతీయత చాల తీవ్రమైనది. తావలచినది రంభ అన్నట్టుగా ప్రాచీన భారతవిద్యావిధానమే దానికున్న మంచి చెడుగులతో నక్షత్రమైనదని వీరి అభిప్రాయము. వీధిబడులలో బాలురను పింపజేయుటకూడా ఉత్తమవిద్యా విధానము లలో నొకటియని వీరి వాదన. ఎందుకనగా పూర్వము 'స్పార్టా'లో అట్లుచేయువారట. ఈ రీతి కొన్నివింత ఊహలుమినహా గ్రంథోద్దేశ్యము కొనియాడతగినది. విజాతీయమై క్షీణించుచున్న దేశమును జాతీయవిద్యామూలమున సంరక్షింపుమని వీరిప్రోద్బలము. కొంచెం మించు మించు గురుకులవాసము ఉత్తమమని ఈగ్రంథోద్దేశ్యము.

క. కా.

---

## రాలినపూలు

గద్యకావ్యముల సంపుటము. గ్రంథకర్త: తుమ్మల పల్లి సీతారామారావుగారు. సాహిత్యమండలి, గుంటూరు: బెజవాడ. రాయలు ౧౬ సైజు: ౫౫ పుటలు. వెల తెలియదు.

క్రొత్త పోకడలతో సున్నితమైన భావాలు వాడుకభాషలో సహజశైలిని కవి వెలువరిచినాడు ఈకావ్యావళిలో. ఇందు లేతలోనే రాలినపూలు కొన్ని. ఇవి లేతసాఫల్యాలలోనిదని చెప్తూ, ముందుకు ప్రోత్సాహముమాత్రము కవికి నిలుపుతూనే ఉండవచ్చు.

---

## శ్రీ సూర్యస్తవ నక్షత్రమాల

క్రౌను సైజు. వెల తెలియదు.

సూర్యస్తోత్ర రూపములగు ౨౭ పద్యములు. తూర్పు గోదావరిజిల్లా మమ్మిడివరము వాస్తవ్యులు పండితారాధ్యుల సూర్యనారాయణకవిగారిచే రచితము.

---

## గాంధీమహాత్ముని లండను ఉపన్యాసములు

### (మొదటి సంపుటము)

అనువాదకులు: శ్రీ తిమ్మరాజు సత్యనారాయణరావుగారు బి. ఏ. (ఆనర్సు).

క్రౌను సైజు ౨౨౧ పుటలు. వెల రు. ౧-౦-౦.

జాతీయగ్రంథమాల: ౨. భారతీనికేతనము, కాకినాడ.

భారత రాజ్యాంగ సంస్కరణల నిమిత్తమై ప్రభుత్వమువారు లండనులో మూడుమార్లు సమావేశముల జరిపిరి. ఇందులకు భారతీయ ప్రతినిధు లనేకులు వెళ్లిరి. కాంగ్రెసుతరఫున మహాత్మగాంధిగారు రెండవసమావేశమునకు వెళ్లిరి. సమావేశసందర్భమున మహాత్ముడొసగిన ఉపన్యాసములకు ఆంధ్రానువాదమే ఈ గ్రంథము. ఇది చాల ధారాళమగు శైలితో నొప్పుచు, పారిభాషిక పదముల వివరణముతో అర్థావబోధము గూర్చుచు, చాల పఠనీయముగ నున్నది.

---

## శ బ రి

ఐదంకములనాటకము. గ్రంథకర్త: శ్రీ చింతా దీక్షితులుగారు. భారతశక్తినిలయము, రాజమండ్రి. ఇది పూర్వము 'భారతి' లో ప్రకటితము. క్రౌనుసైజు: ౧౬౬ పుటలు. వెల రు ౧.

---

## వీ ర మ తి

చరిత్రాత్మక నాటకము. కర్త: మంగిపూడి వేంకటశర్మగారు, అనందమండలి, తణుకు, పశ్చిమ గోదావరి. డెమ్మీసైజు: ౯౨ పుటలు. ౦-౧౨-౦.

---

## పి చ్చి పి ల్ల

నిరూపకనవల. గ్రంథకర్త: ధరణీప్రగడ వేంకట శ్రీరామమూర్తిగారు. సరస్వతీ గ్రంథమాల, కాకరపఱ్ఱు. డెమ్మీసైజు: ౧౩౧ పుటలు. వెల రు. ౧

---

## భక్తమందారము

నాలుగాశ్వాసముల పద్యకావ్యము. కవి: త్రిపురాన సత్యానందరావు గారు. ప్రకాశకులు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, తండియార్పేట, మద్రాసు.

క్రౌనుసైజు: ౯౦ పుటలు. వెల ౧౨ అ.

---

## శ్రీ ఆధ్యాత్మికవిజ్ఞాన మహాసభానివేదక

పద్యకావ్యము. కర్త: ఉమర్ అలీషా కవి. క్రౌనుసైజు: ౨౭ పుటలు. ౨ అ.

---

## రసేంద్రసారసంగ్రహము

పూర్వఖండము. సాంధ్ర తాత్పర్యము. మహామహోపాధ్యాయ గోపాలకృష్ణ భట్టసూరి విరచితము. వైద్యగ్రంథము. ఆంధ్ర ఆయుర్వేద గ్రంథమాల-౧. ప్రకాశకులు: శ్రీపాద దేవీశంకర ప్రసాదశర్మ గారు, రాజమండ్రి.

డెమ్మీసైజు: ౧౧౨ పుటలు. వెల రు ౧.

---

## వాయునందనశతకము

కర్త: కొవ్వలి వేంకట రాజేశ్వరరావుగారు, కల్లికోట కళాశాల, బరంపురము, గంజాం. వెల ౨ అ. మిక్కిలి సరసమగు శైలి.

---

## కామదేవశతకము

కర్త: నందివాడ వేంకటరత్నముగారు, తాళ్లపూడి, కొవ్వూరు తాలూకా, పశ్చిమగోదావరిజిల్లా. వెల ౨ అ. ధారాళమగు శైలి.

---

## భక్తరామోపాఖ్యానము

బాలుర ఉపయోగమునకై రచించిన కోలాటపు పాటలు. కర్త: బాలకవి పొన్నూరు బాపయ్యగారు. నిడుబ్రోలు, తాతా ముద్రశాలను ముద్రితము. డెమ్మీ చిన్న (౧౬) సైజు ౧౪ పుటలు. వెల ౧ అ.

---

## మన వాక్స్వాతంత్ర్యము — విజ్ఞప్తి

నిజాంరాష్ట్ర ఆంధ్రజన కేంద్రసంఘము ప్రచురణము-౧౬. గష్తినిషాన్ ౫౩ ను రద్దు చేయుటకై ప్రభుత్వము వారితో మనవిచేసికొనుటకై (ప్రభుత్వము వా రాహ్వానింపగా) వీగిన రాయబారమున అధ్యక్షులగు శ్రీరామచంద్రనాయకు గారు (ఎమ్. ఏ., బారిష్టరు) గష్తివలన కలుగుచున్న బాధలన్నియు కడు నిపుణముగను, నిర్భయముగను, సందర్భోచితముగను నివేదించిరి. ఆ సమయమున చదివి అర్పింపబడినదే ఈ విజ్ఞప్తి. క్రౌనుసైజు: ౮ పుటలు. వెల ౧ అ. ఆంధ్రజనకేంద్ర

సంఘము, 'ఆంధ్రకుటీరము', రెసిడెన్సీబజారు, హైదరాబాదు (దక్కను).

---

## 'అన్యోక్తిన్యాయసన్యాసము'

శ్రీమతి చుంచూరి రత్నమ్మగారు వ్రాసినది: యువతీజనప్రార్థనసమాజము, బెజవాడ ౧౨-౩-౧౯౩౩. క్రౌను సైజు: ౧౪ పుటలు.

---

## The Sunrise

'ది సన్‌రైజ్'—ఆంగ్ల కావ్యసంపుటము. కవి: సూర్యనారాయణ సాహుగారు, బి. ఏ., ప్లీడరు, నరసారావుపేట. డెమ్మీ సైజు: ౩౩ పుటలు. ౧౫ కావ్యము లున్నవి. ప్రకాశకులు: ది పీపిల్స్ ప్రింటింగ్ అండ్ పబ్లిషింగ్ హౌస్ లిమిటెడ్, ట్రిప్లికేన్, మద్రాసు వెల తెలియదు.

---

# పత్రికలు

## హోరా జర్నల్

మాసపత్రిక. మొట్టమొదటి సంచిక. శ్రీముఖ చైత్రమాసము. జ్యోతిషపత్రిక. సంపాదకులు: ప్రొఫెసర్ కంచిభొట్ల అంజనేయసిద్ధాంతిగారు, హోరాప్రచారిణీసభ, ఒంగోలు. క్రౌను సైజు: ౩౨ పుటలు. చందా సాలుకు రు. ౨-౮ అ.

---

## సేద్యపువిద్య

(తెలుగుమాసపత్రిక)

సంపాదకులు, ప్రకాశకులు: యస్. నాగేంద్రప్పగారు, నంద్యాల.

సంవత్సర చందా రు ౩-౦-౦.

---



పాండురంగ మందిరము, పంఢరిపురము



వేలూరుకోటలోని దేవాలయము

ఛాయాచిత్రకారుడు: వి. యస్. గోపాలదేశికాచార్లుగారు.

# మనవిమాటలు

## తెల్లకాగితము

**White Paper**

బ్రిటిషు ప్రభుత్వము
భారత దేశమునకు ప్రసాదించిన
సంస్కరణముల స్వరూపము

---

## తిక్కన త్రివర్ణచిత్రము

ఆంధ్రవిశ్వకళాపరిషత్కళాశాలాంధ్ర సంఘమువారు చక్కని తిక్కన త్రివర్ణచిత్రమును రచియించి యిచ్చిన చిత్రకారునకు నూటపదునారు లొసగి సత్కరింతుమని ప్రకటించినారు. ఆచిత్రము కేతనరచితమగు దశకుమారచరిత్రమునను, తిక్కనరచనము లన్నిటను గల వర్ణనములవలన ఉపలబ్ధములగు తిక్కనరూపరేఖావిలాసాదులకు స్థానమయియుండవలయునను నియమము నేరుపరిచిరి. సాహిత్యసంస్కారము లేకున్నచో చిత్రకారు లుపర్యుక్తలక్షణలక్షితమగు చిత్రమును చిత్రింపజాలరు. సామాన్యముగ చిత్రకారుల దృష్టి సాహిత్యార్జనమువయిపునకు మరలకుండును. ప్రకృతము తిక్కనస్వరూపము సాహిత్యము ద్వారమున నిర్ణయింపవలసియుండుటచే, తచ్చిత్రచిత్రణాభిలాషులగు చిత్రకారులకు తత్సంబంధిసాహిత్యపఠన మావశ్యకమయినది.

అందరు చిత్రకారు లీచిత్రమును చిత్రింపవచ్చునను నియమము సంఘమువారి విశాలహృదయతను చాటుచున్నది. కాని, రచియింపవలసిన చిత్ర మాంధ్రకవిశేఖరునిది; ఆతని రూపరేఖావిలాసాదు లాంధ్రవాఙ్మయమున నుండి కయికొనవలసినవి; ప్రోత్సాహకులు ఆంధ్రవిశ్వవిద్యాలయపు టాంధ్రసంఘము

వారు. కావున చిత్రకారులుకూడ ఆంధ్రులే అయియుండుట సముచితముగ నుండగలదు.

సన్మానార్హచిత్రము భారతియందు ప్రకటింపనొసంగబడు నని నియమావళియందు పేర్కొనబడెను. తదలంకరణమునకయి భారతి ముదమున నెదురుచూచుచుండగలదు.

'ఏకక్రియా ద్వ్యర్థకరీ' అను నార్యోక్తి ననుసరించి సాహిత్యసంపదను, చిత్రకళాకౌశలమును ఒక్కట పెంపొందింపగల యవకాశమును సమకూర్చిన యాంధ్రసంఘము సాహిత్య, చిత్రకళాభిజ్ఞలోకమునభినందములకు పాత్రమయినది. ఈ యమూల్యావకాశము నాంధ్రచిత్రకారు లెట్లుపయోగించుకొందురో పరికింపవలసియున్నది.

---

## తెలుగును దగిలిన తెగుళ్లు

### ౧. పుస్తకములకు

'రైలులో పుస్తకముల విక్రయము' అనిపేరిడి 'గురుముఖమున నాంధ్రగీర్వాణముల పఠించిన' శ్రీ. కా. రామనాథము ౨౫-3-౧౯33 నాటి సమదర్శిని పత్రికయందు తమ యనుభవమును వ్యాసరూపమున ప్రకటించిరి. అందు రైలులో అమ్మబడుచున్న తెలుగు పుస్తకములకు బట్టిన దుర్దశ చక్కగా వివరింపబడినది. రైలులో పుస్తకముల నమ్మవచ్చిన వ్యక్తి తొలుత ఒకరూపాయ విలువచెప్పి(పుస్తకమున అచ్చొత్తబడినది) చివరకు పావలాకు ఇచ్చిన 'శ్రీరామకర్ణామృతము'ను చెత్తకాగితములపయి సర్వవిధశబ్దార్థాది దోషముల పాతరగా, తప్పులు కుప్పలుగా అచ్చొత్తబడిన దానిని కయికొని తత్సమగ్రతను

"మొదటి యాశ్వాసమును పూర్తిగ ముద్రించిరి. రెండవదానిలో ౧౧ శ్లోకముల ముద్రించలేదు. మూడవదానిలో ౪౦ శ్లోకముల నెత్తివేసిరి. కడపటి యనగా నాలుగవ యాశ్వాసములో ౫౭ శ్లోకముల దిగమ్రింగిరి. రెండవయాశ్వాసములో కొన్నిటిని, మూడవదానిలో యిక కొన్నిటిని, నాలుగవదానిలో మరికొన్నిటిని యతి లాఘవముగ వదలివేసిరి. ప్రతియాశ్వాసములో, తొలుత చివరని, చెక్కుచెదరకనుంచి, ఆశ్వాసమధ్యమున మ్రింగుట ప్రారంభించిరి"

అని తెలియపరచిరి. ఏవం లక్షణసుసంపన్నమగు పుస్తకమును ప్రకటించుటకు గల మహదాశయమును తెలుపుచు ప్రకాశకులు పీఠికయందు వ్రాసిన

"ఇట్టి చిత్తశుద్ధిగల మహాత్ములు రచియించిన కావ్యములు యాంధ్రదేశమున యడుగున బడి యేమ్రదాసు చెత్తపుస్తకాలయములలోనో తప్పులు కుప్పలుగా యచ్చొత్తింపబడి యూరును పేరును లేని పద్ధతులతో స్వల్పవిక్రయమునకు విక్రయింపబడుచున్నవి. వెల సులభమైన దనుతోడనే మనవారల కమితసంతోషము. అంతియేకాని యందులగల తప్పులు గమనించువారరుదు. ఈపొత్త మట్లుగాక తప్పులు సరిచూడబడి గంగాఝర్ఝరీప్రవాహవేగముగల ఆదిశంకరుని శ్లోకములతో, సిద్ధకవి తెలుగు పద్యములతో తాత్పర్య సహితముగా యచ్చొత్తించి పాఠక మహాశయుల కరకమలంబులందుంచితిమి."

అనుభాగము నుద్ధరించిరి. ఈమహదాశయము మహత్త దీనివలన విస్పష్టముగ గోచరమగుచున్నది.

"సంపూర్ణ స్వీయచరిత్రను అద్భుతముగ, క్లుప్తముగ, ముచ్చటగ మూడువాక్యములలో తెలిపిరి! వారు ప్రతిదినమును జేయుదోషములను, త్రికరణశుద్ధిగ జేయు వంచనను, ఇతరులపై నారోపించుచున్నారు. భాషాద్రోహమున కింతకంటెను మేలైన యుదాహరణ మేమున్నది."

అను వ్యాసకర్త వాక్యములు ప్రకాశకుల హృదయమును తెలుపుచున్నవి. ఇట్టి పుస్తకములన్నియు 'కొండపల్లి వీరవెంకయ్యగారు' ప్రచురించినవి. 'కాపీరైటు' గలవి

కూడ. రైలుబండ్లలో అమ్మబడు వందలకొలది అమూల్య ప్రాచీన గ్రంథముల కీగతియే పట్టినది. శ్రీరామనాథము చివరకు

" ఈకొండపల్లి వీరవెంకయ్య ప్రభృతులు, మఘ రగోదావరీ సలిలంబుల గ్రోలు రాజమహేంద్ర వాస్తవ్యు"

లని పాఠకులను గమనింపగోరుచు వ్యాసమును ముగించిరి.

ఇక పుట్టగొడుగులవలె నీనాడు పుట్టుచున్న నాటకములు, నవలలు, కథలు మున్నగు నవీనరచనముల స్థితి యూహాతీతము. ఈపుస్తకములు ప్రకాశకుల ధనాశాపరత చే వికృతాకృతుల దాల్చి పాఠకులకు విపరీత ప్రయోజనమును ప్రసాదించుచున్నవి. ఇట్టి దురవస్థ తొలగుట కాంధ్రులు పూనకున్న నాంధ్రగ్రంథములు క్రమముగా నెట్టిస్థితిని గాంచనున్నవో ఎవ్వరికెరుక ? సుప్రకాశకులు కొందరు వ్యయమును పరిగణింపక ఎంత జాగరూకతతో నేని ప్రకటించుచున్న బహుళాంధ్రగ్రంథజాలముసయితము పరిష్కర్తల యిచ్ఛానుసారము సంస్కారమును గాంచి లోపములకు పాలగుచున్నవని పరితపించుచున్న యాంధ్ర లోకము, దుష్ప్రకాశకుల చేతులలో గ్రంథము లిట్లు కృశించి, నీరసించి, క్రుంగిపోవుటను సహించుట దుశ్శకము.

ఈ కొండపల్లి వీరవెంకయ్య ప్రభృతులు ఇకనైనను ఆంధ్రగ్రంథములను యథామాతృకములనుగ ప్రచురించియుండ నిత్తురుగాక !

## ౨. భాషకు, భావములకు

'క్రొత్తపోకడలు' అనుపేరున ౨౬-౩-౧౯౩౩ నాటి కృష్ణాపత్రికయందు శ్రీమల్లాది రామకృష్ణశాస్త్రి కర్తృకమగు వ్యాసము ప్రకటితమయినది. నవీనకవుల రచనములలోని భాషాభావముల యౌచిత్యమునుగూర్చిన చర్చ దాని వస్తువు. అందు శాస్త్రిగారు " కవిత్వానికీ పాండిత్యానికీ ఎంతవరకూ సంబంధం ఉన్నదీ అనే విషయం ఈనాటివరకూ ఇంకా తేలనేలేదు." అనుచు, అపశబ్దప్రయోగవిషయమున ప్రాచీనులకు, నవీనులకు గల యంతరమును " ( ప్రాచీనులు ) సొగసుకోసం, మాధుర్యంకోసం మామూలుదోవలు మార్చి శాస్త్రసమ్మతములుకాని కొత్తప్రయోగములు చేశేవారు. పాణినికూడా... తన మతానికే ఎదురు నడిచాడు. ఈనాటికవుల్లో చాలామంది బోహటంగానే అపశబ్దాలన్నీ వాడేస్తూన్నారు. పొరపాటున ఎన్నడైనా వారికి తెలియకుండా సక్రమమయిన పదం శాస్త్రానుగుణ్యంగా పడవలసినదేకాని తెలిసినంతవరకూ తమంతతాము సరియైన త్రోవను పోలేరు. పోనీ పోవడానికి ప్రయత్నమైనా చేయరు." అను వాక్యములతో తెలిపినారు. శబ్దప్రయోగౌచిత్యజ్ఞానమునకయి " పూర్వాచార్యు లేర్పరచిన అనుశాసనాలూ, నిబంధనలూ అన్నీ నవకవుల, భావకవుల విషయంలో వృథాఅయిపోతున్నవి " అన్నారు.

" వ్యావహారికభాష సారస్వత ప్రపంచంలో విహరించడం మొదలుపెట్టిన తరువాత పాండిత్యంతో ప్రమేయంలేక పోతూంది." అని భావించు వ్యాసకర్త దేశవ్యవహారసిద్ధమగు భాష శాస్త్రసమ్మతమగు నెరుగనివారు కారు. తమ వ్యాసమునుసయితము వ్యావహారిక భాషనే వ్రాసినారు. " పాండిత్యానికి కవిత్వానికీ ఉండే గౌరవసంబంధం నవకవులందరి ధాకకూ నిలువలేక మాయమయి " పోగా ఇక మిగిలిన కవిత్వానికి కూడ " నవీనపద్ధతులమీద " "కొత్త నిర్వచనం చేయవలసి ఉంటుం"దని తేల్చినారు.

ఉదాహరణపూర్వకంగా "దదువురాణి ... కవి వ్రాసిన జానపదగీతంలో ఉట్టిపడే మాధుర్యం ఎంత ప్రయత్నించినా రససిద్ధి నందినామనుకునే నవీనుల కవితావిహారాల్లో కానరాకుండా ఉంది. భావానికీ భాషకీ సామరస్యము సామంజస్యము ఈయుగంలో పూర్వ్యాపశం చేత స్వయంగా ఒనగూడవలసినదే" అన్నారు. "ప్రయత్నించి" అయినా "కృతార్థత నందటానికి తగిన సహనం, సహృదయత్వం " నవకవులయందు "లేకపోవడం చేతనే" ఈలోపము తీరునవకాశము లేకపోవును.

" పూర్వులు " కూడ " క్రొత్తపోకడలు పోయే" వారని అంగీకరించుచు ఆపోకడలతో "మూలవిరాట్టు మీద గౌరవం చెడకుండా దానికి మెరుగుపెట్టాలనే

ప్రయత్నం చేస్తా"రన్నారు. నవీనులు "కొందరు" "ఎందుకూ పనికిరాని, ఏవిధానా రాణించని విశ్వామిత్ర సృష్టి చేసి అన్నివిధాలా ఎందుకూ కాకుండా పోవడమేకాక లోకాన్ని లోకుల్ని పాడు చేయాలనే పరమోద్దేశంతోనే గ్రంథరచన చేస్తూన్నా"రని గుడిపాటి వెంకటాచలంగారి సావిత్రిని, హరిశ్చంద్రను, శశిరేఖను అట్టి గ్రంథములకు నిదర్శనముగా పేర్కొని ఇట్టి రచనముల "గాలి మనకు సోకకుండా ఒక్క నమస్కారంచేసి మనచాయలకు రావద్దని వేడుకొంటే బాగుంటుం"దని సలహా ఇచ్చినారు.

శాస్త్రిగారు వ్రాసినట్లు "కథల్లోంచీ, ఖండకావ్యాల్లోంచీ తొంగిచూసే పరతత్వం చాలవరకు" "ప్రేమ". అది 'ఉన్మాదం". "దేశాంతరాలనుంచీ రవాణాఅయి భారతభూమిని ఆక్రమించాలని ప్రయత్నం చేస్తూంది." ఈప్రేమ నేటి సారస్వతమును బట్టి పీడించుచున్నది. అది ఎక్కువపాలు కామమూలకమయినది.

వీరు "సమీక్ష" చేసి "నవీనాంధ్రవాఙ్మయం ఉచ్చైస్థితి నందడానికి వీల్లున్నాయని అనుకోవడానికి ఏమీ వీలులేకుండా ఉంది" అని సిద్ధాంతముచేసినారు. స్వతంత్రవీక్షుల్లో "ఇలా విజృంభిస్తూన్న నవీనాంధ్రవాఙ్మయ" తత్వాన్ని నిరసించినా నవీనులలోను "ఎవరో ఒకరిద్దరు మహానుభావులు, మంచికవులు, కథకులు కల"రని యంగీకరించినారు.

శాస్త్రిగారి విమర్శనము కొంత కటువుగా కాన్పించినను దాని సందేశము పవిత్ర మయినది. నియమరహిత మయినచో దేనికయిన నిలుకడలేదు. తలకొక్కతీరున తిరుగుచు వివిధరూపములను దాల్చుచున్న పదములు, అనుచితభావములు ఎన్నటికిని స్థిరరూపమున వాఙ్మయమును పెంపొందింప జాలవు.

---

## అభినవాంధ్రకవిపండితసభ

'అభినవాంధ్రసారస్వతంలో అగ్రస్థానం వహించే కవులకుగాని, పండితులకుగాని జన్మస్థలం అయ్యే నోము నోచుకోని' బరంపురమున అభినవాంధ్రకవి పండిత మహాసభ మూడురోజు లతివైభవముతో జరుగుటకు సకలాంధ్ర దేశము నపరిమితమగు సంతసమును జెందగలదు. బరంపురమువారు 'తల్లిబాస యెడల గౌరవాదరాల్లోకాని', 'రసికుల సాంగత్యాభిలాషలో కాని' యితర ప్రాంతాల (తెలుగు)వారి కెంతమాత్రం తీసిపోనివారు' కాబట్టియే ఆంధ్ర దేశమున అన్ని మూలలనుండి అనేకుల నభినవాంధ్ర కవులను, పండితులను



అభినవాంధ్రకవి పండితసభ, బరంపురం

ఆహ్వానించి, వచ్చినవారిని సాదరసత్కారముల సమర్పించి యానందింపజేసి ధన్యులు కాగలిగిరి.

అతిథులకు చెప్పిన స్వాగతము క్లప్తముగను, చాల అభినవముగను ఉన్నది. అది కేవలము ఔపచారికముకాక సభయొక్క ఉద్దేశములను స్ఫుటముగ తేటపరుచుచు కవులకు, పండితులకు నుత్సాహమును పెంచి ఆంధ్ర సారస్వత సేవకు వారిని పురికొలుపగలదు. గ్రంథప్రదర్శన పఠనములు, ఉపన్యాసరూప వాఙ్మయ చర్చలు సభ నలంకరించిన మహాజనుల యుత్సాహాతిశయమును వెల్లివిరియ జేయుచు, సభకు నవ్యతను, గొప్పదనమును సంపాదించినవి.

దీర్ఘమగు అధ్యక్షోపన్యాసమున మత వైవిధ్యముచే నిరంతర వివాదగ్రస్తములయి యిదమిత్థమని నిర్ణయింపరాకయున్న రసాలంకారాదుల చర్చ మెందుకొనినది. "రసమునకు భావము ప్రధానము. భావము అనుభవమును బట్టి, హృదయావేగమును బట్టి కలుగుతుంది. ...నిజముగా అనుభవించి చెప్పగలిగినవానికి ఆ భావాలు సరిఅయిన మాటలతో, సరియైన లయతో, సరియైన నడకలతో బయటికి వచ్చి శ్రోతల హృదయాలను కరిగిస్తవి. అట్టి కవులకు పాండిత్యముతో పనిలేదు." అని ఆ చర్చవలన తేలిన సారాంశము. ఇది మతాంతరముమాట. ఇట్లు పాండిత్యార్జన ప్రయాసను తగ్గించుట నేటి కవులకు మహోపకారము. "కేవల కవిసమయ్యాలను, శాస్త్రమర్యాదలను అనుసరించి వ్రాసిన పూర్వకవులలో చాలమంది కీపేరెట్లు తగదో పెండ్లి అయినా కాక, స్త్రీ హృదయ మెట్టిదో అయినా తెలియక, ప్రేమగీతాలు ప్రణయగీతాలు పాడేవారున్నా, ఏమీ కారణము లేకుండా కళ్లకు నీళ్లయినా తెచ్చుకోకుండా అరవవారి కూలిఏడుపు ఏడ్చేవారున్నా, ఇటువంటి అనుభవములేని నేటి కవులలో కొందరికి కూడా కవి అనేపేరు తగదు." అనుటచే భావములు పుట్టుటకు అనుభవమే మూలకారణమని యేర్పడినది. ఇదియు మతాంతరముగ పరిగణింపదగినది. మనస్సునకు సైతము గోచరములుకాని విషయములను భావింపగలవాడే నిజమయిన కవి యనదగినవాడు.

"అనేకులు సారస్వతప్రియులు, నూతన భావావేశముగలవారు తగిన ఆశ్రయములేక గాలిలో ఎగురుచున్నారు. కొన్నాళ్లక్రిందట కొన్ని సమితులు,సంఘాలు ఏర్పాటుచేసుకొని మనవాళ్లు పనిచేసినారు. అవి ఇపు డంతరించుచున్నట్లు కనబడుతుంది. కాని ఉత్సాహము మాత్రము తగ్గలేదు. * * అట్టి ఉత్సాహప్రేరితులే ఇపు డీసభలో చేరినవారు. * * వీరంతా ఒకసంఘముక్రింద చేరి పనిచేయడానికి అవకాశము కల్పింపవలసి యున్నది." ఈవాక్యముల నాంధ్ర సారస్వతప్రియు లెల్లరు క్రియారూపమునకు దేదగుదురు.

"అభినవాంధ్రకవిపండితు లనేకులు నేడు మంచిపని చేస్తున్నారు. వీరు వ్రాసిన

గ్రంథాల నన్నిటినీ ఒక కేంద్రపుస్తకవిక్రయాలయముద్వారా ప్రచారములోనికి తెస్తే బాగుంటుంది......పుస్తకాలు వ్రాయడము తప్ప తక్కినపనులన్నీ చేయడానికి ఒక కమిటీ ఏర్పాటుచేస్తే బాగుంటుంది" అన్నది సలహా. దీనికంటె ముందుగా ప్రకటనార్హ గ్రంథ నిర్ణయమున కొకకమిటీ ఏరుపడు టావశ్యకము.

'ఆంధ్ర వాఙ్మయాభివృద్ధికోసము ఆంధ్ర దేశమున 'మంచిసంస్థ ఒక్కటి' అయినను లేదు.' 'ఆంధ్రసాహిత్యపరిషత్తు'ఉండియు పరిమిత ప్రయోజనకారి యైపోయినది. అట్లగుట యనుచితము. మునుముందయినను సంస్కరణముపేరున పలుపోకలు పోవుచున్న యాంధ్రభాషా సారస్వతములను సంస్కృతములను, అభినవరూప రమణీయములను గావించి తనపేరును సార్థకపరుచుకొనదగును. ఈపరిషత్తు, అభినవాంధ్రకవిపండితసభ, తన్నిబంధనలనూ తత్ప్రచార క్రమమునూ నిర్ణయించడానికి ఏరుపడిన ప్రత్యేకసంఘమును కలిసి యీకార్యమును సాగించుట మేలునకుమేలు. నేడన్నింటను క్రొత్తప్రాతల సమన్వయసమ్మేళనములకయి లోకము ముఱ్ఱిళ్లూరుచున్నది. తత్సిద్ధి సర్వతోముఖ దేశాభివృద్ధికరము.

ఇట్లు సలక్షణముగ సభను నిర్వహించి యాంధ్రలోకము మెప్పును బడసిన కార్య నిర్వాహకులు ప్రశంసార్హులు. ఈసభవారి యుద్దేశములు నిరంతరాయముగ ఫలవంతము లగుగాక.

ఈసభవారు చేసిన తీరుమానములలో ప్రధానములు:—

౧. సభా నిబంధనలనూ తత్ప్రచారక్రమమునూ నిర్ణయించడానికి శ్రీ గురుభాగవతుల ధర్మారావు, చింతా దీక్షితులు, చిలుకూరి నారాయణరావు, శివశంకరశాస్త్రి, ఆదినారాయణ శాస్త్రిగార్లను ఒక కమిటీగా ఈసభవారు ఏర్పాటు చేస్తున్నారు.

౩. అభినవాంధ్రకవి పండిత సభోద్దేశములను ఆయాజిల్లాలలో ప్రచారము చేయడానికి ఈసభవారు ......వారిని నియమిస్తున్నారు. *

౪. గ్రాంథికాంధ్రము ఒకానొకప్పుడు పరిమిత ప్రయోజనము కలిగినదైనా నేడది సర్వజనోపయోగకారి కాదు......వ్యావహారికాంధ్రము అపరిమిత ప్రయోజనము కలది. ప్రజలలో జ్ఞానాభివృద్ధి కలగడానికి ఇదే పరమసాధనము.

౫. ప్రారంభవిద్య ఉన్నతవిద్యలను తెలుగుపిల్లలకు చెప్పేటందులకు సాధనముగా గవర్నమెంటువారేర్పాటుచేసిన గ్రాంథికభాష అందుకు తగినదికాదు. భాషకున్నూ బాలురకున్నూ, అందువల్ల తీరని నష్టము కలుగుచున్నది. కావున జీవద్భాషలోనే విద్యా కార్యమంతా జరుపవలెనని గవర్నమెంటువారిని ఈసభవారు కోరుచున్నారు.

౬. ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు, మద్రాసు విశ్వ విద్యాలయములవారి నిబంధనలలో ఇంటర్మీడియేటు, బి.ఏ. పరీక్షలకు రెండో భాగములోని దేశభాషలను బోధించే ఉద్దేశము నవీన భావప్రకటనకు అనుకూలమైన భాషను ఉపయోగించేటట్టు చేయడమే అని స్పష్టముగా ఉన్నప్పటికిన్నీ తెలుగు బోర్డు ఆఫ్ స్టడీస్ వారు ఆ నిబంధ

* వీరి పేరులను జిల్లాలవారీగా ఇచ్చియున్నారు. చూ. ఆం. ప. 25-3-33.

నను ఇన్నిసంవత్సరములనుంచినీ్న ఉల్లంఘిస్తూ ఉండడము చాలా విచారకరము. కాబట్టి ఇకముందు నవీన భాషతో ఉన్న గ్రంథాలకు ఎక్కువ ప్రాముఖ్యము ఇచ్చేటట్లు తెలుగు బోర్డు ఆఫ్ స్టడీస్ వారిని కోరవలెనని ఆయా సిండికేట్లవారిని ఈసభవారు కోరుచున్నారు.

ఈసభ రాబోవు నవంబరులో రాజమహేంద్రవరములో జరుపుటకు వచ్చిన ఆహ్వానమును అంగీకరించిరి.

అభినవాంధ్ర కవిపండిత మండలి సంకల్పోత్సాహము లే యీసభ చిరస్థాయిత్వమునకు ప్రధానాధారములు. ఆంధ్రలోక మీ యుత్కృష్ట ప్రయత్నమునకు చేయూత యొసగదగును.

---

## భగవాన్
## శ్రీరామకృష్ణ పరమహంస:
## నూరవ వర్ధంతి

శ్రీభగవాను డవతరించి యీయేటితో నూరేండ్లు. వీరి భక్తియోగప్రచారము కార్యరూపమున చూడవలసినదేకాని యక్షరరూపమున దానిని చిత్రింప నేరికి నలవికానిపని. శ్రీభగవానుని యీ వర్ధంతి జ్ఞాపకార్థమై యొక గ్రంథమును ప్రకటింప శ్రీరామకృష్ణ సిద్ధాంతప్రచార సమితివారు పూనియున్నారు. సమితివారు ప్రచురించిన సూచికను బట్టి, ఈ గ్రంథము దాదాపు ౧౦౦౦ పుటల పరిమితినిగలిగి భక్తియోగమునకు సంబంధించిన వివిధ విషయములయు, శ్రీరామకృష్ణ వివేకానందుల జీవిత విశేషములయు వ్యాసములతో వెలయగలదు. ఆంగ్లమున తొలుదొలుత ప్రకటితమగు నీగ్రంథమే తరువాత దేశభాషలందును వెలయింప దలం



శ్రీరామకృష్ణ పరమహంస

చుచున్నారు. సమితివారి కోరికను గమనించి విఘ్నేశ్వరుడీయుద్యమమునకు, వ్యాసములను ప్రసాదించి చేయూత నొసగుట భగవానునికి సేవాంజలి కాగలదు.

---

## కీ. శే. శ్రీ కేశవపిళ్లె

కేశవపిళ్లె పుట్టినది తమిళ దేశమున, మెట్టినది రాయలసీమ. ఇట్లు భ్రమరకీటన్యాయాన ఆంధ్రుడు, రాయలసీమవాడు, అయిన కేశవపిళ్లె సంస్కృతహృదయుడు, దయాళువు,



కీ. శే. శ్రీ కేశవపిళ్లెగారు.

బీదలపాలిటి పరమబాంధవుడును. బీదల కష్టములన్న తనకష్టములనుకొనువాడు. అనంతపుర మండలమునకు వీరిమూలమున గలిగిన యభివృద్ధి చెప్పతరముకాదు. కేశవపిళ్లె నెరుగనివాడే లేడామండలమున, ఏమూలను. అనంతపురమే కాదు, ఆంధ్రదేశమంతట నీధన్యజీవుని పేరు చోటు గూర్చుకొన్నది. అనంతపురము జిల్లా బోర్డు అధ్యక్షులుగ నున్న కాలమున నామండలము నభివృద్ధికై వీరు గావించిన కార్యములు పెక్కులు.

కేశవపిళ్లె పేరునకెక్కినన్యాయవాది. దేశస్వాతంత్ర్యముపట్ల వీరి కభిమానము మెండు. వీరన్న ప్రభుత్వమునకు నయితము గుండెబరువే. వీరు చేబూనినకార్యము పట్టువిప్పిన దేనాడును లేదు. మింటో మార్లేసంస్కరణములలోను, మాంటుఫర్డుసంస్కరణములలోనుగూడవీరు శాసనసభ్యులయి దేశహితకార్యములకు కైదండ యొసగి ప్రజల మెప్పు వడసిరి. మదరాసు ప్రెసిడెన్సీసంఘమున కధ్యక్షత వహించి జస్టిసుపక్షమువైఖరిని ప్రతిఘటించిరి. తుదివరకును వీరిహృదయ మొక్కదారినేపోయినది.

నేడీ ప్రజానాయకుని భౌతికశరీరము కానరాకపోయినది కాని వీరియాత్మమాత్రము నేడు గాదు, మరి యేనాడును గూడ నీనాటిప్రజలనుండి విడిపోవదు.

---




కాలచక్ర మతివేగమున నడచిపోవుచున్నది. ౧౯౩౨ సంవత్సర మంతయును నిర్బంధపరంపరలతో గడచిపోయినది. ౧౯౩౩ వ సంవత్సరమునందు మూడుమాసములును నిర్బంధములతో గడిచినవి. మూడవరౌండు టేబిలు సమావేశము ముగిసినది. శ్వేత పత్రము ప్రకటింపబడినది. ఏప్రిలుమాసాంతమునుండియును సంయుక్తపార్లమెంటు ఉపసంఘము గూడనున్నది. లేబరుపక్షప్రతినిధులు కమిటీసమావేశమునందు పాల్గొనుటకు నిశ్చయించిరి. కమిటీసభ్యులిరువదినలుగురయందును అధిక సంఖ్యాకులు జాతీయప్రభుత్వమునం దధికసంఖ్యాకులైన కన్సర్వేటివుపక్షసభ్యులుగ నుండుట సహజము. వీరిసహాయార్థము ౨౦ మంది హిందూస్థాన ప్రతినిధులు వెడలగలరు. శ్వేతపత్రమువిషయమై పార్లమెంటునందు జరిగిన చర్చలును, శ్వేతపత్రములోని విషయములును రాజ్యాంగసంస్కరణముల స్వరూపస్వభావముల నూహించుటకన్నిపక్షములవారికిని నవకాశములను గలుగజేసినవి. జాతీయపక్షమునకు ఓటులసంఖ్యను బట్టి విజయము గలిగినను భావసమర్థనమునందు చర్చిలుపక్షము విజయమును బొందినది సర్ సామ్యుయలుహోరుగారి మౌనవ్యాఖ్యానము భావిరాజ్యాంగవిధానమునకు మహావ్యాఖ్యానముగ నున్నది. బాల్డువినుగారి ప్రసంగము చర్చిలుపక్షప్రలాపములను నిరాదరించినను హిందూస్థాన ప్రయోజనములకు సమాదరణమును జూపుటలేదని పార్లమెంటునందు జరిగినచర్చ విస్పష్టము చేసినది. శ్వేతపత్రమునందుగల మంచిచెడుమాటల విషయముల సందర్భములందైనను సభ్యులభిప్రాయములను దెలుపుట కవకాశములు గల్పింపబడినవి కాని సమ్మతులను తెలుపుట కవకాశములు కల్పింపబడలేదు.

ఆరేండ్లనుండియును నడుచుచున్న రాజ్యాంగసంస్కరణ నాటకమునందలి తుదియంక మచిరకాలములోనే ముగియనున్నది. నాటకమునందలి నాందీప్రస్తావనలో మొదటియంకమునందు సూచితములైన విశేషములనే నాటకాంతమునందును పరిస్ఫుటముచేయుట నాటకమునకు పరమార్థము. రాజ్యాంగనాటకప్రదర్శనమునందు నేపథ్యము లెన్నియో సంభవించినను నైనను

కమిషనురిపోర్టు, రౌండుటేబిలుసమావేశములు, శ్వేతపత్రము, రాజకీయాభిప్రాయములు నాటకప్రయోజనమును సులభముగ వ్యక్తము చేయుచున్నవి. బ్రిటిషుపార్లమెంటునందు గల యన్నిపక్షములవారును భారతరాజ్యాంగముల పట్ల నేకాభిప్రాయమును గలిగియున్నను హిందూస్థానమునందు గల భిన్నపక్షములవారికిని సంయోగము లేదని దేశవ్యవహారములు సువ్యక్తము చేయుచున్నవి. సర్ తేజబహదురు సప్రూ, శ్రీనివాసశాస్త్రిగారులు మొదలగు ప్రముఖులును, రాష్ట్రీయశాసనసభలును, సామ్రాజ్యశాసన సభయును శ్వేతపత్రమునందలి సూచనలను నిరసించినను పార్లమెంటు నిర్ణయించిన రాజ్యాంగవిధానమును మితవాదులును నితరులును నిరాకరింతురను సూచనలు గనుపడవు. ఎప్పటివలెనె రాజ్యాంగనాటకమును నడుపుటకు బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞులు చేయుచున్న ప్రయత్నములు ధర్మజ్ఞులకు పరమవిషాదమును గలుగజేయును.

* * * *

బాధ్యతాయుత స్వపరిపాలనము

హిందూస్థానమునందు బాధ్యతాయుత స్వపరిపాలనమును స్థాపించుట బ్రిటిషుప్రభుత్వమునకు లక్ష్యమని రాజ్యతంత్రజ్ఞులు విసుకు విరామము లేక అనవరతము హిందూస్థానప్రజలకును ప్రపంచమునకును చాటుట పరిపాటియైనది. బ్రిటీషురాజ్యతంత్రజ్ఞుల ప్రకటనలు భోజరాజసింహాసన కథలను మరపించుచున్నవి. శ్వేతపత్రమునందుగల రక్షణములు, నిరంకుశాధికారము, సైన్యసంరక్షణము, అధికారరక్షణము మొదలగు విషయములు బాధ్యత నెచ్చటను గోచరింపజేయుట లేదని సామాన్యులును అంగీకరించుచున్నారు. ఒకవేళ నెచటనైనను బాధ్యతవాసన యంతర్గర్భితమైయున్నను ఆబాధ్యత వజ్రపాశములనుండి తప్పించుకొని బహిర్గతమగుటకు మాత్ర మవకాశములు గనుపడవు. రక్షణవజ్రకవచము దిగ్బంధమును జేయగలవిధమునకు, గతించిన రెండు వర్షములందును నిర్బంధశాసనరాజ్యము గలుగజేసిన బీభత్సము భావికాలమునందు హిందూరాజ్యాంగవిధానము ప్రసాదింపగల బాధ్యతాయుత పరిపాలనమునకు ప్రమాణముగ నున్నది. సంస్కరణములు హిందూస్థానప్రజాక్షేమమునకై నిర్మింపబడునని ఇర్విన్‌ప్రభు వభయము నొసంగెను. దేశక్షేమమునకు ప్రధానాంగములు రక్షణాంగము, కోశాంగము, శాసనాంగము. రక్షణాంగమిపుడువలె, నిరంకుశముగను, విదేశీయహస్తగతముగను, దుర్భరవ్యయోపేతముగను ఉండును. కోశాంగమునందు సైన్యమునకు, పౌరసేవోద్యోగాంకమునకు, రైల్వే పరిపాలనమునకు, విదేశీయవ్యాపారమునకు, ౯౦౦ కోట్ల రూప్యముల అప్పులకు ప్రత్యేకరక్షణములు గల్పింపబడుచున్నవి. కోశాంగమునందీ మినహాయింపులు పోను శేషించిన విషయములందు గలుగగల స్వాతంత్ర్యమును నామమాత్రము. శాసనాగారమునందు నిర్బంధా

త్రము లన్నియు సమర్ఛబడియున్నను గవర్నరుజనరలు గవర్నరులు నిర్బంధశాసనములను నిర్మించుటకు సంపూర్ణాధికారమును గలిగియున్నారు. శాసనాంగమునందువలెను సైన్యకోశాంగములందును గవర్నరుజనరలు సంపూర్ణమైన నిరంకుశాధికారమును గలిగియున్నాడు. శ్వేతభవన సింహాసనమునందు హిందూస్థానమంత్రి మొగలు చక్రవర్తివలెను సింహాసనారూఢుడై నిరంకుశాధికారావరణముల కాధిపత్యమును వహించుచున్నాడు. అత్యంతపరిమితమైన నూతనరాజ్యాంగవిధానమైనను మాటలయందువలె వ్యవహారములం దారాధనయోగ్యము గాదు. చిరకాలము వరకును ఫెడరేషను సాధ్యముగాదు. సాధ్యమైననిర్మాణము జీర్ణమందిరమువలెను అతుకులమందిరమువలెను ఉండును.

* * * *

## ఫెడరేషను రాజ్యాంగము

బహుభాషలకును, బహుమతములకును, కులసంఘములకును, సంప్రదాయాచారములకును, ప్రయోజనములకును, బ్రిటీషుసంస్థాన విభాగములకును ఆశ్రయమై విశాలమైన హిందూస్థానమున కమెరికాసంయుక్తరాష్ట్రములకు వలెను, సంయుక్తస్వపరిపాలనము ప్రత్యేకప్రయోజనములకును, సమష్టిప్రయోజనములకును సాధనమని హిందూస్థానపూర్వచరిత్రమును, ప్రపంచచరిత్రమును బోధించుచున్నవి. భారతీయులు నిత్యసంకల్పమునందు మేరువునకు దక్షిణమునందుగల మహాఖండమునంతయును నాదికాలమునుండియును నేకదేశముగను పరిగణించుచుండిరి. ప్రకృతియందు, నామరూపములందు భిన్నములైన దేశకాలపాత్రములు సంభావనప్రయోజనములం దేకార్థమును సాధింపగలవిధమును వేదాంత మత సాంఘికార్థిక విద్యా రాజ్యాంగ తత్త్వార్థములు సుగమము చేయుచున్నవి. పిపీలికాదిబ్రహ్మపర్యంతము వ్యాప్తములైన జీవజాలములు సృష్టిపరిణామమునం దేకత్వము ననంతముఖములను బోధించుచున్నను పశుప్రయోజనపరాయణమైన ప్రవృత్తియందు భిన్నత్వమునకు గల గౌరవప్రతిష్ఠ లేకత్వమునకు గలుగకున్నవి. వేదాంతము "సర్వం ఖల్విదం బ్రహ్మ" యని నిర్దేశించుచున్నను విషయోపభోగార్థమై వ్యక్తులు, కుటుంబములు, కులములు, వర్ణములు, సంఘములు, జాతులు స్వీయావకాశముల నన్యోన్యసంరక్షణమునకు గాక నన్యోన్యసంహారమునకై వినియోగించుచున్నారు. వివిధమతములును మానవ సోదరత్వమును, ఏకదేవత్వమును, అహింసాధర్మమును నిర్దేశించుచున్నను, వర్ణభేదము, మతభేదము, సంగ్రామజ్వరము మతప్రయోజనములను నిరర్థకము చేయుచున్నవి. సాంఘికజీవన మన్యోన్యసహాయమునకు గాక అన్యోన్యసంహారమునకు వినియోగపడుచున్నది. ఆర్థికవిద్యాసంపదలు భోగాభిమానములకు వినియోగపడునటులు త్యాగారాధనములకు వినియోగపడజాలకున్నవి. రాజ్యాంగములు పరపీడనసంహారములకు వినియోగపడు

నటులు శిక్షణరక్షణములకు వినియోగపడజాలకున్నవి. వివిధములైన విభేదములకు నాశ్రయమైన హిందూస్థానమునందు ఫెడరేషను రాజ్యాంగమును స్థాపించుటకు గల యాటంకములు విదేశప్రభుత్వరక్షణములందు భయంకరరూపమును దాల్చుట కత్యంతావకాశములు గలవు. స్వదేశీయులు జపాను తుర్కీ-చీనాదేశములందువలెను స్వప్రయోజనములను విసర్జించి దేశప్రయోజనముల నారాధించుటకు దీక్షను బూనిన ఫెడరేషను రాజ్యాంగవిధానము సఫలము గాగలదు. కాని వివిధ సంఘములును, ప్రయోజనములును, మతములును, సంస్థానములును, రాష్ట్రములును వేయుచున్న యెత్తు పైయెత్తులందు స్వీయ ప్రయోజనముల పటాటోపమునకుగల యవకాశాదరణములు దేశప్రయోజనములకు దుర్లభముగ నున్నవి. దుర్భేద్యమైన రక్షణకవచసంరక్షితములైన 'రాజ్యాంగముల విమర్శనము వర్తమానాంకస్థితియందు విమర్శనముల కనంతావకాశములను సమకూర్చుచున్నను నిరర్థకము. రాజ్యాంగసంస్కరణశాసనమును, దాని ప్రయోగమును అచిరకాలమునన నామరూపములను దాల్చునపుడు బ్రిటీషుజాతీయ ప్రభుత్వపు సద్భావములు, భారతప్రభుత్వపు సదుద్దేశ్యములు, చర్చిలు వర్గమువారి యానందము, సహకారుల ప్రయోజనాశయములు, కాంగ్రెసుపక్షపు ధర్మలక్ష్యములు ప్రపంచమునకు వ్యక్తము గాగలవు. మహాంధకారబంధుర స్థితియందును ధర్మస్వరూపకాంతులు గోచరంబగుచు ధర్మవిజయము కాలక్రమమునను గలుగుచుండును. ప్రపంచ స్థితియందు దురహంకారము వలె నిరాశయును నాశనసాధనము. ప్రభుత్వనిర్బంధములు ప్రజాహృదయమునందుత్సాహకార్యపరత్వములను ప్రవర్ధమానము చేయుచున్నవిధమును శాసనోల్లంఘన ప్రస్థానఫలమును, నిర్బంధవిధానఫలమును పక్షపాతులకు గోచరము గాకపోయినను నిరవధికమైన కాలము వ్యక్తము చేయగలదు.

* * * *

కాంగ్రెసు

హిందూస్థానమునందు గతించిన ౪౮ ఏండ్లయందును దేశాభ్యుదయమున కేకముఖమునను పనిజేయుచు ప్రజాదరణమును బడసిన సంస్థలందు కాంగ్రెసు ప్రధానసంస్థయని ప్రభుత్వ మంగీకరించిన విషయము. ఐర్విను ప్రభువు కాంగ్రెసుపక్షమునను గాంధిమహాత్మునితో సంధిని జేసికొనిన విషయము జగద్విఖ్యాతము. వర్తమానకాలమునందు ప్రజలయందు గాంధిమహాత్మునకు గల పలుకుబడి ఏయితరనాయకులకును ప్రభుత్వాధికారులకును లేదనుట నిర్వివాదాంశము. ఏబదేండ్లనుండియును దేశస్వరాజ్యమునకై పాటుపడుచున్న కాంగ్రెసు సంస్థను కాంగ్రెసునాయకులను నిర్బంధించుట సాధ్యమైనను 3½ కోట్ల ప్రజలసంకల్పమును నిర్బంధించుట దుర్లభము. హోయిగుగారు సామ్రాజ్యశాసనసభయందు కాంగ్రెసు విషయమై తెలిపినభావములు సామ్రాజ్యదుర

హంకార దురభిమానములకు నిదర్శనము లైనను వివేకమునకు నిదర్శనములు గావు. కాంగ్రెసు నిర్మూలమైన, కలకత్తాకాంగ్రెసు నాపుటకు ప్రభుత్వ మవలంబించిన దండన ప్రస్థాన మనవసరము. ఆసేతుహిమాచలప్రాంతమును ప్రభుత్వ మవలంబించిన నిర్బంధ ప్రస్థానము నిరర్థకమైన విధమును బెంగాలు ప్రభుత్వప్రకటనమే రుజువు చేయుచున్నది. లకత్తాకాంగ్రెసునకు రమారమి ౨,౨౦౦ ప్రతినిధులు భిన్నరాష్ట్రములనుండియును బయలుదేరిరి. మార్గమధ్యమునను ౧,౮౦౦ మంది నిర్బంధింపబడిరి. కలకత్తాయందు ౪౦౦ మంది ప్రతినిధులు ప్రచండమైన లాఠీవర్షము కురియుచున్నను తీర్మానములను జేసి సభను విరమించిరి. పోలీసు అధికారులును సభాసమావేశము నాపుటకు విశ్వప్రయత్నములను జేసిరి. కాంగ్రెసుసమావేశము ఢిల్లీ కరాచి కాంగ్రెసుల తీర్మానములను పునఃప్రతిపాదనము చేసినది. శ్వేతపత్రమును, నిర్బంధప్రస్థానమును నిరసించుచు తీర్మానములను చేసినది. హేయిగుగారి కోరికలకు కలకత్తా కాంగ్రెసు జవాబును నిర్భయముగను దెలిపినది. దేశమునందు శాంతిస్థాపనము నిర్బంధవిధానమువలన సాధ్యము గాదు. ప్రజాహృదయమునందు ప్రవర్ధమానమగుచున్న స్వాతంత్ర్యాగ్నిని నిర్బంధములు ప్రజ్వలింపజేయుచున్నవి కాని చల్లార్చుట లేదు. కాలము జరిగినకొలదిని పరిస్థితు లయిర్లాండు మొదలగు దేశములందు వలె విషమించును గాని చక్కబడవు. ఇపుడైనను భారతబ్రిటీషుప్రభుత్వములు గాంధిమహాత్ముని, రాజకీయనిర్బంధితులను రాజమార్గమున విడుదలచేయుటయును, రాజ్యాంగవిధానమును కాంగ్రెసుపక్ష సాహాయ్యముతోను సిద్ధము చేయుటకు పూనుకొనుటయును వివేకము, ధర్మము. దేశమునం దశాంతి పెరిగిన కొలదిని శాంతిస్థాపనోపాయములు దుర్లభము లగుచుండును. ప్రభుత్వము నిర్బంధితులను తమ దయాదాక్షిణ్యానుసారముగను విడుదలచేయుట న్యాయమును, నీతియును, ధర్మమును గాదు. ధర్మాధారము లేని తాత్కాలికోపశమనములు ధర్మసంస్థాపనమునకు నిరుపయోగములు.

---

Printed and Published by C. Seshagiri Rao, B. A., at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras
Editor: G. Subbaramayya.